సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 31 జనవరి-1975 సంచిక 1

ఫిబ్రవరి నెల

## భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



జనవరి నెల

# భావపరిచయ పోటీ

## బహుమతి పొందిన వ్యాఖ్య



గుడ్డచినిగినట్టి గొడుగుఁదాల్చి యొకండు
వాననీరు గిన్నెఁబట్టి మోసె
చినిగినట్టి గొడుగు చినుకుల కేలనో!
తెలివి లేమి తీరు తెన్ను లివియె!

శ్రీమతి కోట ఆదిలక్ష్మమ్మ
కనిగిరి.



# మరో దీపం వెలిగింది

పోల్కంపల్లి శాంతాదేవి

గర్భగుడిలో ఆంజనేయస్వామి సంజీవినీ పర్వతం ఎత్తిపట్టుకొని ఎగసిపోతున్నాడు. అఖండజ్యోతి గుడిలో అపూర్వమైన కాంతులు విరజిమ్ముతూన్నది. ఉదయం స్వామిని అలంకరించిన పూలు వాడిపోయి అదోరకమైన వాసన అలుముకొంది.

ఎవరిదో కొబ్బరికాయకొట్టి గంట గణగణవాయిస్తూ హారతి బరబరా త్రిప్పి గడపదగ్గరికి తీసుకువచ్చాడు పూజారి.

హారతిమీద చేతులుంచి కళ్ళకద్దుకోబోతున్న ప్రమీల హారతి పళ్ళెంలో అయిదుపైసలబిళ్ళ పడేసి హారతి కళ్ళకద్దుకుంటున్న యువకుడిని ఒక్క క్షణం చూసి కళ్ళు దించుకొంది. అతడు ఏదో విడ్డూరం తిలకిస్తున్నట్టుగా ప్రమీలనే చూస్తున్నాడు.

పూజారి చేతులనుండి తీర్థం, కొబ్బరిముక్కా అందుకొని కదులుతూ మరోసారి అతడివైపు అప్రయత్నంగా చూచింది ప్రమీల. అతడూ చూశాడు, పూజారి అందించిన కొబ్బరిచిప్ప కర్చీఫ్‌లో చుట్టుకొంటూ.

తొట్రుపాటుగా కళ్ళు త్రిప్పుకొంది ప్రమీల. చరచరా నడిచివెళ్ళి మండపంలో ఓ స్తంభం ప్రక్కగా కూర్చొంది.

అతడూ అటువైపుగానే వచ్చాడు. కొంచెం దూరంలో క్రింద మెట్టుమీద కూర్చొన్నాడు.

నిశిరాక్షసి తన కాటుక రూపంతో క్రమంగా సాక్షాత్కరిస్తున్నది జగతిమీద. పైన నక్షత్రఖచిత నీలాకాశం. క్రింద అద్దం పడుతున్నట్టుగా సిటీలైట్ల కాంతులు. కొద్దిసేపు గడిచిపోయాక ప్రమీల నెమ్మదిగా లేచింది. గుడికి వెనుకగా వడివడిగా నడిచి గుట్టచివరికి చేరుకొంది. అక్కడినుండి క్రిందకి చూసింది. మృత్యుముఖంలా క్రింద లోయ నల్లగా, చీకటిగా కనిపించింది. పమిటచెంగు తీసి కళ్ళకు గట్టిగా బిగించుకొంది. ఒక్కొక్క అడుగేవేసి చిట్టచివరికి వచ్చేసింది.

ఒక్క అడుగు...ఇంకొక్క అడుగు చాలు ప్రమీల కోమల శరీరం నామ రూపాల్లేకుండా పోవడానికి! ప్రమీల అనే నిర్భాగ్య యువతి విగతజీవి కావ డానికి ఒక్క అడుగు చాలు ముందుకు! కనీసం తను కేక పెట్టడానికి కూడా అవకాశం లేకుండా మృత్యువు తన చేతులు చాచి అందుకొని గుండెల్లో చేర్చు కొంటుంది! తనకి బాధ అనేదే తెలియకుండా వెచ్చగా గుండెలో అదుము కొంటుంది!

రెండురోజులనుండి తన కంటిరెప్పలు వాలలేదు. ప్రజ్వరిల్లే తన కళ్ళలో గుండెల్ని మండించే బాధ. కోరినది పొందలేని అసహాయస్థితి.

ఒక్క అడుగు ముందుకువేస్తే చాలు తనకిక చిరశాంతి. దీర్ఘనిద్రలో తన కళ్ళు వాలిపోతాయి. మృత్యువెచ్చలి కౌగిటిలో ఒదిగిపోతుంది.

ప్రమీల పాదం జారీజారకుండానే ఎవరిదో చెయ్యివచ్చి ఆమె రెక్కను బంధించి బలంగా వెనక్కి లాగింది. బరబరా నాలుగైదు అడుగులు అవతలికి లాక్కెళ్ళింది.

"భగవంతుడిపట్ల ఎంత అపచారం చెయ్యబోయావ్! అదీ ఆయన సన్నిధి లోనే! ఎంత ధైర్యం!" అతడి కంఠం కఠినంగా గద్దించింది.

కళ్ళమీదినుండి గుడ్డ తొలగించి కళ్లుతెరిచింది ప్రమీల, విభ్రమంగా. కళ్ళకి ఇందాకా గట్టిగా గుడ్డబిగించినందుకేమో కళ్లు మసకలు క్రమ్మినట్టుగా అయి వెంటనే ఏ ఆకృతీ స్పష్టపడలేదు. తరువాత నెమ్మదిగా గోచరించింది తెల్లటి లాల్చీ పైజామాలో ఉన్న పురుషాకృతి! ఇంకా అతడి చేతిలో ఉన్నది ఆమె రెక్క.

"ఎవరు మీరు?" తీవ్రంగా ప్రశ్నించింది ప్రమీల.

"భగవంతుడు పంపించిన దూతని 'పోరా, ఆ పిల్ల నా సన్నిధానంలోనే

ఎంత అత్యాచారానికి ఒడిగట్టిందో చూశావా? వెళ్ళి వెనక్కి తీసుకురా!' అని ఆదేశించాడు. వచ్చాను." అతడి మాటల్లో కటుదనం మాయమై హాస్యరసం చిలికింది. "చేరవచ్చిన మనిషిని రక్షించడమేగాని భక్షించడం తెలియదే ఆ పరమాత్ముడికి? చావడానికి ఇక్కడికా రావడం? అతడు మీ ప్రయత్నం ఎలా సాగనిస్తా డనుకొన్నారు?"

''ఓ! మీరు భగవంతుడు పంపిన దూతకాదు! ఈ ప్రత్యక్ష నరకంలో త్రోయడానికి వచ్చిన యమకింకరులు! ఇది నిజం." వణుకుతూన్న ప్రమీల కంఠం క్రమంగా రోదనంలోకి మారింది." మీకు తెలియదు, నేను బ్రతుకులో ఎంత చిత్రహింస పడ్డానో. తెలిస్తే మీకు హృదయమనేది ఉంటే...మీరు సంతోషంగా నన్నాలోయలోకి త్రోసేసి ఊరుకొనేవారు!''

'సరే. మీ కథ చెప్పండి వింటాను! మీరు చనిపోవడమే సబబనిపిస్తే నేనే మిమ్మల్ని త్రోసేసి చేతులు దులుపుకొని నా దారిన నేను చక్కాపోతాను!"

"ముందు నా కిది చెప్పండి. మీకు భగవంతుడంటే భక్తి విశ్వాసం ఉన్నాయా?"

"ఉన్నాయి.''

''హుఁ! ఎక్కడున్నాడు భగవంతుడు? ఉంటే తను సృష్టించిన బిడ్డలకే ఇంత ఆవేదన కలిగిస్తాడా? ప్రతిక్షణం తీరని కోరికలతో అలమటింపజేస్తాడా!"

''ప్రతి తండ్రీ తన సంతానానికి దండన భూషణాలు సమానంగానే విధిస్తాడు, అమ్మాయ్! ఆయన ముందు తులాభారంతో తూచిన తరువాతే మనిషికి జన్మనిచ్చి జీవితాన్ని ప్రసాదిస్తాడు. ఆ సత్యం ఎవరూ కాదనలేనిది. ఆయన తులాభారాన్ని వేలెత్తి నిందించలేనిది!'

విలక్షణంగా ఉన్న అతడి కంఠస్వరానికి విభ్రమంగా చూసింది ప్రమీల.

సుదూర నక్షత్రకాంతి తప్ప మరో వెలుగు లేదక్కడ. అతడి ముఖాకృతి స్పష్టంగా చూడలేకపోయినా పొడుగ్గా బలిష్ఠంగా అగుపిస్తున్నాడు. తనను ఇందాకా గుళ్లో ఆశ్చర్యంగా పరికించింది అతడేనని గుర్తించింది

"అయితే నేను చేసినవన్నీ పాపాలు అయి ఉండాలి! భగవంతుడి తులాభారంలో నాకు కాళీ విస్తరి వేయబడింది!" దీర్ఘంగా నిట్టూర్చింది ప్రమీల.

"అప్పుడే అంత నిరాశ ఎందుకు? బాగా ఆకలి రేగాక విస్తర్లో కావలసినవి వడ్డన ప్రారంభమైతే అప్పుడెంత ఆనందంగా ఉంటుందో తెలుసా?"

"నాకా నమ్మకం లేదు. నాకా అదృష్టం లేదు కూడా."

"అలా ఎందుకనుకోవాలి? భవిష్యత్తు నీ చేతిలోదీ, నా చేతిలోదీ కాదు. దయామయుడైన ఆ భగవంతుడు ఎవరికి ఏ క్షణాన ఏది ప్రసాదిస్తాడో చెప్పలేం!"

"ఇంకేం ప్రసాదిస్తాడు బూడిద? నేను ప్రేమించినవాడు నన్ను ప్రేమించినా జీవితంలో స్వీకరించలేకపోయాడు. ఇంతలో మరొకతెతో అతని వివాహం కూడా అయిపోతున్నది. నాకు మిగిలింది ఈ గాయం! ఈ చిత్రవధ!"

"అయితే పెద్దకథే ఉందన్నమాట? రాత్రి ఎంతయిందో తెలుసా? ఎనిమిది! మీ ఇంట్లో ఈసరికి కంగారుపడుతుంటారు, గుడికి వెళ్ళిన పిల్ల ఇంకా రాలేదేమిటాని! రేపొకసారి మనం కలుసుకుందాం? మీ కథ వింటాను!"

"మా ఇంట్లో నా కోసం చూస్తుంటారని మీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగింది.

"చెప్పానుగా, భగవంతుడు పంపిన దూతనని! నాకా మాత్రం జ్ఞానదృష్టి ఉండదనుకొంటున్నారా?"

ప్రమీల చెయ్యిపట్టుకొనే గుడిదగ్గరికి నడపించుకు వచ్చాడతడు.

పూర్తిగా గుడిసమీపాని కొచ్చేశాక అతడి చేతినుండి చెయి విడిపించుకొన్నది ప్రమీల.

భక్తులరాకడ తగ్గిపోయింది. చివరగా వచ్చిన ఓ భక్తురాలికి తీర్థప్రసాదాలిచ్చేసి ఇవతలికి వచ్చి గర్భగుడి తలుపులు పెట్టి తాళం వేస్తున్నాడు పూజారి. గుడి వెనగభాగంనుండి వస్తూన్న ఆ ఇద్దరినీ అనుమానంగా చూశాడు. తరువాత మరిచిపోయిన అత్యవసరమైన పని ఏదో గుర్తువచ్చినట్టుగా, అలాంటి అల్పమైన విషయాలు పట్టించుకొనే తీరికలేని మనిషిలా వడివడిగా గుట్టదిగిపోయాడు.

స్తంభం ప్రక్కగా తను పెట్టివచ్చిన కొబ్బరిచిప్ప ఖర్చీఫ్‌మూట అందుకొని వెళ్ళడానికి ఉద్యుక్తుడవుతూ, "ఏమిటి? మీరలా కూర్చుండిపోయారు? మీ ఇంటివాళ్ళు కంగారుగా వెదుకుతూ బయల్దేరి వచ్చేదాకా ఇంటికి వెళ్ళరా ఏం?" అన్నాడు.

"ఒక్క నిమిషం ఆగండి. వచ్చేస్తాను! నాకేమిటో అలసటగా ఉంది!" నిశ్శబ్దంగా మోకాళ్ళమీద ముఖముంచి కూర్చొంది.

"మీ పేరు తెలుసుకోవచ్చా?"

"ప్రమీల!" కాస్సేపటికి అంది: "మనసింకా శాంతి పొందలేదు. నేను ఇంకాసేపు కూర్చొని ఇంటికి వెళ్ళిపోతాను! మీరు వెళ్లండి!"

సరిగ్గా సమయానికి - అణుప్రయోగం చేసి మన సైంటిస్టులు మనల్ని రక్షించారు!! లేకపోతే - ప్రజలు మన దుమ్ము దులిపేసుండేరూ?!!



"మళ్ళీ మొదటికి వచ్చేస్తున్నది కథ! దీనికి మీరు ముగింపు ఇవ్వడానికే నిశ్చయించుకున్నారా?"

"ఈ కథ పొడిగించడమనేది ఎంత హృదయవిదారకమైన సంగతో మీకు తెలీదండీ! ఒక పరిష్కారమైపోయాక వెనక్కి వెళ్ళడం చాలా అసాధ్యమైన సంగతి!"

అతడు హతాశుడైపోయినట్టుగా ప్రమీలకు రెండు మెట్లు క్రిందుగా కూర్చుండిపోయాడు. పైమెట్టుమీద మోచెయ్యి ఆన్చి తలెత్తి ప్రమీలవైపు ఆర్ద్రంగా చూస్తూ, "మీ మనసు పంచుకోడానికి మీకు స్నేహితులెవరూ లేరనుకొంటాను! బహుశః మిమ్మల్ని ప్రేమించిన వాడుకూడా మీ మనసు పంచుకొన్నతడు కాకపోయి ఉండాలి! ఎవరో ఒకరు మీకు స్నేహితులే ఉంటే మీరిలా ఏకాకిగా పారిపోయివచ్చి ఇలాంటి ఘోరమరణం పొలపడేవారుకాదు! తప్పకుండా ఆమె, అతనో అడ్డుపడేవారు. సానుభూతి వ్యక్తంచేసేవారు. జీవితంలో ఆశాజ్యోతి వెలిగించేవారు. సానుభూతి కరువైన మనసునుండే ఇలాంటి విపరీతపు ఆలోచనలు బయల్దేరేది! వయసులో తల్లి లేకపోయినా సరే, తండ్రి లేకపోయినా సరే. మనసు విప్పి మాట్లాడుకొనేందుకు, కష్టంలో సానుభూతి పొందేందుకు ఒక్క... ఒక్క స్నేహితుడు కూడా లేకపోవడంమాత్రం చాలా శోచనీయమైన సంగతి. అందుకే నన్ను మీ స్నేహితుడిగా స్వీకరించమని కోరుతున్నాను. నా పేరు సుజ్ఞానేశ్వర్. సుజ్ఞాన్ అంటారంతా. ఎమ్. ఎ. ఎల్. ఎల్. బి. పూర్తిచేసి

ప్రస్తుతం జూనియర్‌గా పనిచేస్తున్నాను. మంచివాడినే. నా వల్ల ఉపకారమేగాని అపకారం జరగదు మీకు! ఇకనుండి మీ వేదన, మీ మంచిచెడ్డలు అన్నీ నాకు చెప్పుకోండి. నా సానుభూతి, సహాయం మీకు తప్పక లభిస్తాయి."

తన విశాల నేత్రాలను మరింత విశాలం చేసుకొని చూడసాగింది ప్రమీల. ప్రపంచంలో ఇలాంటి మనుషులుకూడా ఉంటారా? అడగకుండానే ఆత్మీయతను పంచుతానంటున్నాడు. మంచివాణ్ణిని చెప్పుకోవడంలో అతిశయోక్తి కనిపించడం లేదు! ఎంత నిష్కపటంగా ఉందతడి ముఖం?

"నిజంగా నేను దేవుడు పంపిన దూతనే. ఆ సంగతి కాదనలేనిది. గుట్ట మొదటి మెట్టుమీద మీ అడుగు పడినప్పుడే నా అడుగూ పడింది. ఒకేసారి దేవుణ్ణి దర్శించుకొన్నాం. ఒకేసారి హారతి, తీర్థప్రసాదాలు తీసుకొన్నాం. మీ దుఃఖంలో మీరున్నారు. నన్ను గుర్తించలేదు. మీ కళ్ళు ఏడ్చినట్లుగా ఎర్రబడి పోయి ఉన్నాయి. ఏదో కఠోరమైన నిశ్చయంతో మీ ముఖం బిగుసుకు పోయి ఉంది. అందుకే కాబోలు, మీ ముఖంమీదినుండి చూపులు త్రిప్పుకోలేక పోయాను! మీరంటే ఏదో ఆసక్తి కలిగింది! మిమ్మల్ని అదేపనిగా చూస్తుంటే నన్ను ఎవరైనా అనాగరికుడిలా భావిస్తారేమో నన్నభయం కూడా నన్నడ్డు పెట్టలేకపోయింది. మీరు గుడివెనక భాగంలోకి వచ్చి చీకట్లోకి అంతర్హితం కావడం నా అనుమానం దృఢపరిచింది!

"ఇప్పుడు మీరు ఒప్పుకొంటారా లేదా చెప్పండి! భగవంతుడి ఆదేశం అంత లీనంగా లేకపోతే ఇందరు భక్తుల్లో నాకే మీయందు ఈ శ్రద్ధ, ఈ ఆసక్తి ఎందుకు కలగాలి!"

"అదే నిజమైతే భగవంతుడు చాలా కఠినుడూ, నిర్దయుడూ అనుకోవాలి! నేను చచ్చి సుఖపడడం ఆయనకు ఇష్టంలేదన్నమాట! బ్రతికి ఉండి ఈ నరకం అనుభవించాలనే అతడి ఆదేశం కాబోలు!" విరక్తిగా నిట్టూర్పు విడిచింది ప్రమీల. "ఈ రోజు ఒక ఆడపిల్లను ఆత్మహత్యనుండి తప్పించి ఒక మహత్కార్యం చేశానని మీ హృదయం ఉప్పొంగిపోతున్నట్టుంది, సుజ్ఞాన్ బాబూ! అందుకు మీరొకనాడు తప్పక పశ్చాత్తాపడవలసి వస్తుందని చెబుతున్నాను!" అంటూ ప్రమీల లేచి గబగబా మెట్లు లేగసాగింది.

సుజ్ఞాన్ లేచి ఆమెతో కదిలాడు. "నన్ను మీతో రానివ్వరా?"

"అంత కృతఘ్నురాలిని కాదు. రండి. మా ఇల్లు చూపుతాను."

మధ్యదారిలో అన్నాడు సుజ్ఞాన్: "మీరు మళ్ళీ అలాంటి పిచ్చిపని తలపెట్ట నని నాకు మాటివ్వండి."

"మీరు భగవంతుడినే నమ్మదలుచుకుంటే కర్మసిద్ధాంతాన్ని కూడా నమ్మక తప్పదు. నా నొసట అదే రాసిఉంటే మీరు తప్పించగలరా?"

సుజ్ఞాన్ మాట్లాడలేకపోయాడు.

పావుగంట తరువాత ఒక ఇరుకుసందులో ఒక చిన్న పెంకుటింటి ముందుకు వచ్చి నిలబడ్డారు.

ముందుగదిలో ఇద్దరు యువకులు ఏదో పిచ్చాపాటీలో ఉన్నారు. లోపలివైపు ఎవరో మంత్రాలు చదువుతున్నారు. గదిలో లైటు ఎర్రగా వెలుగుతున్నది. గోడల పెళ్ళలు అక్కడక్కడా విరిగిపడి అందులో కాపురమున్నవాళ్ళ స్థితి గతులను వెల్లడిచేస్తున్నాయి.

"మీరు బ్రాహ్మణ్నా?"

"అవును!"

గదిలో ఉన్న యువకులిద్దరూ ప్రమీలనూ, అతడితో వచ్చిన యువకుడినీ ఆసక్తిగా చూడసాగారు.

ఒక నిమిషం మాత్రమే బయట నిలబడింది ప్రమీల. అతడిని లోపలికి పిలిచే సాహసం లేక గబగబా లోపలికి వెళ్ళిపోయింది.

క్షణం తరువాత సుజ్ఞాన్ తలవంచుకొని వాకిట్లోంచి కదిలాడు. ఇలాంటి అవమానపూరితమైన సంఘటన ఎదుర్కోవలసి వస్తుందనుకొంటే ఇంటిముందు వరకూ వచ్చేవాడుకాదు. దూరంనుండే ఇల్లు గుర్తుపెట్టుకొని సెలవుతీసుకొని వచ్చివేసేవాడు!

ఆ రాత్రి ఆ గదిలో కూర్చున్న ఇద్దరు యువకుల్లో ఒకరు ప్రమీల అన్న యోగానంద్. మరొకరు అతని స్నేహితుడు హరికృష్ణ. ఇతడే ప్రమీల విఫల ప్రేమకథానాయకుడు.

## 2

యోగానంద్‌కు హరికృష్ణ స్నేహితుడేకాక బంధువరుస కూడా ఉంది అతడు తరుచూ ఈ ఇంటికి వస్తూంటాడు. అతను ఎనమండుగురు సంతానంలో తండ్రికి జ్యేష్ఠుడు. తండ్రి సంపాదన చెప్పుకోతగింది కాకపోయినా పరువుగానే సాగిపోతున్నది సంసారం. శక్తికి మించిన చదువే కొడుక్కు చెప్పించాడు. హరికృష్ణ హౌస్‌సర్జన్ పూర్తిచేసుకొని ప్రాక్టీస్ పెట్టబోతున్నాడు.

యోగానంద్ వాళ్ళది ఈ ఊరు కాదు. అతడి తండ్రికి పౌరోహిత్యం తప్ప మరో సంపాదనలేదు. ఆ పల్లెటూరిజీవితం గడిచేది కష్టమైపోయి ఓ పెద్ద మనిషి ఇక్కడ శివాలయంలో అర్చకపదవి ఇవ్వడంతో కుటుంబంతో వచ్చేశాడు. ఇప్పటికి పదహారేళ్ళనాటి సంగతి. వచ్చినప్పుడు భార్య ఉన్నది. ఇప్పుడామె లేదు. చనిపోయింది. యోగానంద్, ప్రమీలకాక ఓ విధవసోదరికూడా ఉంది. ఆవిడే ఇప్పుడీ ఇంటికి పెద్దదిక్కు.

యోగానంద్ బి. ఎ. కష్టపడి చదువుకొన్నాడు. ట్యూషన్లు చెప్పుకొని, షాపుల్లో లెక్కలు రాసి ఆ డబ్బుతో చదువుకొన్నాడు చదువుకుంటూకూడా పదో పాతికో ఇంట్లో ఇచ్చేవాడు. అతడికి ఉద్యోగందొరికినా పదీ పాతిక తప్ప ఎక్కువేమీ ఆశాలేదు. అతడికీ ఇల్లు మెస్సుతోసమానం. తండ్రీ కొడుకుల మధ్య గాని, అన్నా చెల్లెళ్ళ మధ్యగాని పెద్ద అనుబంధమేదీ లేదు!

ఎదిగి వచ్చిన చెల్లెలిగురించిగాని, జరుగని సంసారం గురించిగాని, అసమర్థుడైన తండ్రిని గురించిగాని అతడికెప్పుడూ ఆలోచనలేదు. బాధ్యత అంతకంటే లేదు.

ఈ పరిస్థితిలోనే ఎదిగి కూర్చున్నది ప్రమీల. చదువు స్కూల్ఫైనల్తో గట్టెక్కింది. అది పరీక్షకూడా ఇవ్వలేదు. ఇంట్లో పని మడిదడి పేరుతో చాలా వరకు మేనత్తే చేసుకుపోతూంటుంది. ఇరుగు పొరుగు ఇళ్ళలో తెచ్చుకొన్న పత్రికలు, నవలలతో కాలక్షేపం తప్ప మరో వ్యాపకమేదీ లేదు. ప్రతి మనిషీ జీవితంలో క్రొత్తమార్పులు ఆశిస్తుంటాడు. ప్రమీలకు కనుచూపుమేరలో ఆ మార్పు ఎక్కడా కనిపించలేదు. తండ్రి తనకు పెళ్ళిచేస్తాడన్న ఆశలేదు. తన ఈడువారంతా చదువుకొని ఉద్యోగాలు చేస్తూనో. పెళ్ళిచేసుకొని కాపురాలు చేస్తూకో జీవితాల్ని సార్థకపరుచుకొంటూంటే తను కన్నెగా, మొండిచెట్టులా బ్రతకడం ఎన్నాళ్ళిలా?

ప్రమీల నిరాశాజీవితంలో చంద్రోదయంలా ప్రవేశించాడు హరికృష్ణ

* * *

"రెండు కప్పుల టీకి పెట్టు!" యోగానంద్ లోపలికివచ్చి చెప్పి వెళ్ళాడు. ప్రమీల టీ తయారుచేసి గుమ్మంవరకు తీసికెళ్ళి తలుపు చప్పుడు చేసింది.

యోగానంద్ వచ్చి తీసుకెళ్ళాడు.

ఓరగా మూసిన తలుపుసందుల్లోంచి చూడసాగింది ప్రమీల.

ఎర్రగా, బక్కపలుచగా, పొడుగ్గా ఉన్నాడు, అన్నయ్యతో కలిసి టీ తీసుకొంటున్న యువకుడు. "అబ్బ! ఎంత బాగున్నాడు!" అనుకొంది చూడగానే. మరికాస్సేపు చూసేదేమోగాని, "పిన్ని లోపలుందా? ఒకసారి పలుకరించి వెడతాను" అంటూ తను గుమ్మంవైపు రాసాగాడు.

చప్పున వెనక్కి తగ్గింది ప్రమీల.

"అత్తా! గుర్తుపట్టావా వీడిని?" యోగానంద్ అడిగాడు

మేనత్త బుర్రమీదికి చెంగులాక్కొని, "గుర్తురావడం లేదు!" అంది

"రాధాపతి వాళ్ళ యశోదత్త కొడుకు హరికృష్ణ!"

"అలాగా? ఎప్పుడో చిన్నప్పుడు చూశాను. అయితే అమ్మా వాళ్ళు ఇక్కడే ఉన్నారా?"

"అవును, పిన్నీ! అమ్మ నిన్నోసారి రమ్మంది."

"మంచిది, నాయనా!"

అదేగదిలో తనున్నప్పటికి తనకేసి చూడకుండానే గబగబా వెళ్ళిపోయాడు హరికృష్ణ. ఆ తరువాత ఒకటి రెండుసార్లు మేనత్తతో కలిసి యశోదత్త వాళ్లింటికి వెళ్ళింది ప్రమీల. "నువ్వో ఓసారి మా ఇంటికి రావే, యశోదా?" అని మేనత్త చెప్పిందికాని ఆవిడ రాలేదు. దాంతో మేనత్తకు కోపంవచ్చి, "డాక్టరీ చదువుకొన్న కొడుకును చూచుకొని, సంపాదిస్తున్న మొగుణ్ణి చూచుకొని యశోదకు కళ్లు నెత్తికి వచ్చాయి. కిషన్ నగర్‌లో వీళ్ళు ఎలా బ్రతికే వాళ్లో నాకు తెలీదనుకొందేమో! బ్రాహ్మలకి తిరిపమెత్తుకోవడం తప్పేమిటని తిరిపమెత్తుకు బ్రతికినవాళ్ళే. నా ముందరా దీనిగర్వం!" అంది.

ప్రమీలకూడా యశోదమ్మా, వాళ్ళపిల్లలూ గర్విష్టిమనుషులుగానే కనిపించారు.

వీళ్ళు వెళ్ళకపోయినా హరికృష్ణ తరుచుగానే వచ్చేవాడు ఈ ఇంటికి. యోగానంద్ ఉన్నా, లేకపోయినా ముందుగదిలో కూర్చొని పుస్తకాలు చదువుకుంటూ ఉండేవాడు. వాళ్ళింట్లో సందడి ఎక్కువ. చదువుకోడానికి వీలుగా ఉండదని యోగానంద్ పర్మిషన్ తీసుకొన్నాడు, అతడు లేని సమయంలోకూడా చదువుకోడానికి.

హరికృష్ణకూ, ప్రమీలకూ మధ్య సంభాషణ ఎప్పుడు, ఏ సందర్భంలో ప్రారంభమైందో వాళ్ళిద్దరికీ గుర్తులేదు. అన్నగారు లేనప్పుడు ప్రమీల అతడు

కూర్చున్నచోటికి వచ్చి కబుర్లలో దింపేది. సినిమాలగురించి, పత్రికల్లో వచ్చే సీరియల్స్‌గురించీ...

"ఓ! నీకీ కథలూ, నవలలూ చదవడానికి తీరికకూడా ఉంటుందా!"

"ఎంత డాక్టర్ని అయినా లోకంనుండి వేరుకావడం ఇష్టంలేదు!"

"కథలూ, సినిమాలూ ఒక లోకమా!"

"సాహిత్యమంటే మన చుట్టూ ప్రపంచమే కదా?"

ఒక్కోసారి విసుక్కునేవాడు. "నువ్విలా వచ్చి నన్ను డిస్టర్బ్ చేస్తే నా చదువు బాగానే గట్టెక్కుతుంది."

"అయితే రానులే, బాబూ!"

కాని, ప్రమీల తన దగ్గరికి రాని రోజు ఏమిటో అశాంతిగా, అస్థిమితంగా తోచేది హరికృష్ణకు. ఏదో సాకుచేసుకొని లోపలికి వచ్చి పలుకరించేదాకా మనసు కుదటపడేదికాదు.

ప్రమీల ఆత్మహత్యా ప్రయత్నానికి రెండురోజుల ముందు

"సాయంత్రం తిరుమలదేవ్ గట్టుకు వస్తావా?" అంది ప్రమీల.

"ఎందుకు?" అనుమానంగా అడిగాడు.

"అదే చెబుతానక్కడ!" రావలసిన టైం కూడా చెప్పి లోపలికి తుర్రుమంది.

ఆడుతూ పాడుతూ ఉన్న మనిషికి హఠాత్తుగా ప్రాణగండం గుర్తువచ్చినట్టుగా దిగులుపడ్డాడు హరికృష్ణ. ప్రమీలను చూస్తూ, ఆమెతో మాట్లాడుతూ తను పొందే ఆనంధానికి సరితూగే దుఃఖాన్ని భరించవలసిందే ఈనాడు! తప్పదు. ఆమెను కూడా దుఃఖపెట్టక తప్పదు అనుకొన్నాడు.

సాయంత్రం అయిదున్నరకు తలొంచుకొని వెనక్కి చేతులు కట్టుకొని గుట్ట ఎక్కుతున్నాడు హరికృష్ణ.

"కొంచెం ఆగుదూ!" రెండేసిమెట్లు ఒకేసారి దాటుతూ ఎక్కిరావడం మూలంగా ఆయాసంగా ఊపిరిపీలుస్తూ వచ్చి హరికృష్ణ చేతిని అందుకొంది ప్రమీల. ఆమె చేతినుండి చేయి విడిపించుకోవాలనుకొన్నాడు గాని ఆనందంతో మెరుస్తూన్న ప్రమీల మొహం చూస్తూ అంతపని చేయలేకపోయాడు. స్వేదంతో తడిసిపోయిన ముఖం, ఎగసిపడుతున్న గుండెలు, ఆ కళ్ళలో వింత మెరుపులూ —ప్రమీలనే చూస్తూ అడుగులు వేస్తున్నాడు హరికృష్ణ.

గుడికి భక్తుల రాకడ ఇంకా ప్రారంభం కాలేదు. గర్భగుడి తలుపులు కూడా



తీయబడలేదు. మెట్లమీద ఇద్దరు కళ్ళుపోయిన ముష్టివాళ్ళు తప్ప మనుషు లెవరూలేరు.

హరికృష్ణ చేతిని అందుకొనే గుడివెనక్కి తీసుకుపోయి, ఓ నల్లటిరాయి చూపెట్టి "కూర్చో హరీ" అంది. మంత్ర ముగ్ధుడిలా కూర్చొన్నాడు.

"రెండు సంవత్సరాలనుండి నా కళ్ళలో కళ్లుంచి ఇలాగే చూస్తున్నావు. ఇంకా తనివి తీరలేదా?"

"ఈ జీవితకాలం చూసినా తనివి తీరేలా కనిపించడంలేదు. ఆ కళ్ళ లోతల్లో ఎన్నో అందాలూ, మరెన్నో భావాలూ, ఇంకెన్నో అనుభూతులూ ఎడతెగకుండా కనిపిస్తూంటే నేనెలా చూపు త్రిప్పుకొనేది?" చిలిపితనం చిందులు వేయబోతుంటే కర్తవ్యం నోరునొక్కేసి ముఖంలో గాంభీర్యాన్నీ, వేదననూ నింపేసింది. చూపులు త్రిప్పుకొని ఎక్కడో అస్థిరంగా చూడసాగాడు.

"చెప్పు, హరీ! ఇలా ఒకరికళ్ళలోకి ఒకరం చూచుకుంటూ ఎన్నాళ్లు గడుపుతాం? ఇక ఇలా గడిపే అవకాశంకూడా లేదు. నువ్వు ఉద్యోగం దొరుకుతూనే ఎక్కడికో వెళ్లిపోతావ్! నన్ను మా నాన్న ఏ పూజారయ్యకో కట్టబెట్టి తరిమివేసేట్టున్నాడు. ఆడదాన్నై నేనే ముందుగా ఈ విషయం గుర్తుచేయడం నా దురదృష్టంకదూ? గుండెలో వేయి మధువులు నింపే ఆ రెండక్షరాల పదం నీ నోటిమీదుగా ముందుగా వస్తే నేనెంత అదృష్టవంతురాలిని అయ్యేదాన్ని?"

"నువ్వు అదృష్టవంతురాలివి కాదు, ప్రమీలా!" హరి కంఠం బరువుగా

పలికింది. ''తలిదండ్రులకు చాటుగా ఈడేరిన ఆడపిల్ల స్వతంత్రించి ఏ వ్యవహారం సాగించినా శుభాంతం, సుఖాంతం కాదనే నా అభిప్రాయం. ఒక పరాయి మగవాడికి ఇలాంటి చనువూ, ఇలాంటి అవకాశం ఇవ్వడంకూడా ఆడపిల్లకు మంచిదికాదు!''

"నువ్వు అనేది ఏమిటి, హరీ? నన్ను... నన్ను పెళ్లిచేసుకోలేవా?" ఆకాశంలో హాయిగా పల్టీలుకొడుతూ తిరుగుతూన్న పక్షికి ఎక్కడినుండో దూసుకువచ్చి గుండు తగిలినట్టుగా చూసింది ప్రమీల.

''నన్ను క్షమించు ప్రమీలా! నేను చిన్నప్పటినుండి ఒకవిధమైన స్వార్థపరుణ్ణి. ఆ చిన్నారిహృదయంలో నేను డాక్టర్ని కావాలన్న కోరిక నాటకపోయినా, అందుకోసం పట్టుబట్టి నాన్నగారిని అప్పులపాలుచేసి నేను డాక్టరు చదువు చదవకపోయినా, నాన్న చెప్పినట్టుగా స్కూల్‌ఫైనల్‌తో గుమాస్తా ఉద్యోగం వెతుక్కున్నా నువ్వు అదృష్టవంతురాలివే అయ్యేదానివి! నా డాక్టరు చదువు నీ కా అదృష్టం లేకుండా చేసింది! అదే నా జీవితంలోనూ తీరని వేదన సృష్టించింది."

"హరీ! నువ్వెంత మోసగాడివి! నన్నింతదూరం లాక్కువచ్చి ఈ రోజు నీతివాక్యాలు బోధిస్తున్నావా?" ప్రమీల కంఠం దుఃఖంతో, కోపంతో వణికింది.

"ఊహుఁ నువ్వు కొంచెం శాంతంగా ఆలోచించగలిగితే ఎవర్నీ ఎవరం లాక్కురాలేదన్న నిజం నువ్వు తెలుసుకొంటావు! వయసు లాక్కువచ్చింది మనల్ని. ఆకర్షణ చుట్టేసింది మనల్ని. ఈ రోజు ఈ ప్రేమపాశాన్ని మాంగల్యధారణగా మార్చుకోవాలని నీ మనసు తహతహ లాడుతూంటే త్రెంచుకు పారిపొమ్మని ఆదేశిస్తున్నది నన్ను నా కర్తవ్యపాలన! త్రెంచుకోవాల్సిందే! త్రెంచుకోలేకపోతే పితృద్రోహి నౌతాను. కుటుంబద్రోహి నౌతాను. చివరికి ఆత్మద్రోహిని కూడా అవుతాను... నువ్వలా ఏడవకు ప్రమీలా! నన్ను పిరికివాణ్ణిగా చేయకు! నన్ను ఈ ప్రేమపాశంతో మరింతగా బిగించకు. పితృద్రోహి, కుటుంబద్రోహి, ఆత్మద్రోహి అయినవాడు తన భార్యను మాత్రం సంతోషపెట్టగలడా? ఊహుఁ. నన్ను మార్గం తప్పించ ప్రయత్నించకు. నాకు ధైర్యమివ్వు. శక్తినివ్వు. ఈ ప్రేమ తుచ్ఛమనీ, కర్తవ్యమే గొప్పదనీ నాకు చెప్పు!"

అతడి దుఃఖం, అతడి భయం అంతా తెలిసిపోయి నిట్టూర్చింది. కళ్ళలో

కానఊపిరి పోసుకొంది ఆశ. "ఇప్పుడు నువ్వు కర్తవ్యభ్రష్టుడి వయ్యేది ఏముంది, హరీ? నువ్వు ఉద్యోగం చేస్తావు. అప్పు తీర్చగలవు క్రమంగా."

"ఉహుఁ. కాస్త అప్పుకాదు, చాలా అప్పుంది నా జీవితకాలం న్యాయంగా కష్టపడినా అప్పు తీర్చలేను. ఆ అప్పు ఒక్కటేనా? ఇవతల సుఖపెట్టాలసిన వాళ్ళు చాలామంది ఉన్నారు. నేను ఓ ఇంటివాణ్ణి కావడంతోటే అప్పు చెల్లిపోయే మార్గం చూస్తున్నాడు నాన్న. అమ్మా, చెల్లెళ్ళూ, తమ్ముళ్ళూ నేను రెండుచేతులా సంపాదించి వాళ్లు కోరినవన్నీ ఇవ్వగలనని - నా మీద ఎంతో ఆశపెట్టుకున్నారు! నన్ను ప్రేమించి, నా జీవితంలో అడుగుపెట్టబోయే వధువుకూడా ఎన్నో ఆశలు నింపుకొని వస్తుంది. ఎవరికని న్యాయం చేయగలను?"

"పిచ్చివాడివి, హరీ! నీకంటే నాకు కావలసింది ఏముంది? నువ్వు కష్టపెట్టుకొనే కోరిక లేవీ నేను కోరను. నీ కర్తవ్యాన్ని నేనుకూడా మనస్ఫూర్తిగా పంచుకోగలను. నాకామాత్రం జ్ఞానం లేదనుకొన్నావా?"

"నిజంగా నిన్ను ప్రేమిస్తున్నవాడినే అయితే నిన్ను నాతో కర్తవ్యం అనే అసుడిగుండంలోకి ఆ కారడవిలోకి తీసికెళ్ళను! తీసుకువెళ్ళలేను. ఈ పోరాటం నేనొక్కడినే సాగిస్తాను! ఈ నిర్ణయానికి ఇక తిరుగులేదు. నువ్వు ఇదంతా మరిచిపోవాలని కోరుతున్నా. నువ్వు సుఖపడాలని ఆశీర్వదిస్తున్నా."

"ఇంకేం మాట్లాడకు, హరీ! నీ నోటినుండి ఏదొచ్చినా నాకింక ఆశీర్వాదం మాత్రం కాదు. పెట్టావుకదా శాపం ఇంకేం ఆశీర్వదిస్తావ్?" ప్రమీల లేచింది. దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. ఏ దేవతో ఆశీర్వదించి మనసు మార్చుకోకపోతాడా అన్నట్టు రెండునిమిషాలు ఆగిపోయింది.

కాని, హరికృష్ణలో చలనం కనిపించలేదు. అతడు ప్రమీలకేసికూడా చూడ్డంలేదు. శూన్యంలోకి పిచ్చిచూపులు చూస్తున్నాడు.

గుట్ట ఎలా దిగిందో, ఇంటికి ఎలా రాగలిగిందో ఆ పిల్లకు స్పృహలేదు. వస్తూనే పక్కమీద పడిపోయింది. ఆ గుట్ట మెట్లు ఎక్కేప్పుడు ఎన్ని కలలు కంది? హరినుండి తను ఎన్ని తీయని సంగతులు దింటా ననుకొంది? జరిగింది పూర్తిగా దానికి విరుద్ధం. హరి కళ్ళలో తొణికే ప్రేమ ఎంతో బలమైందని తను నమ్మి మోసపోయింది. కర్తవ్యమట. కర్తవ్యం! అదొక సాకుమాత్రమే. ఈ పేదదాన్ని కట్టుకోవడం తన అంతస్తుకు తగదనుకొన్నాడు. కాకపోతే

తనను పెళ్ళిచేసుకొని ఏ కష్టానికైనా నడుం కట్టేవాడు! తనను నిజంగానే ప్రేమిస్తే ఎంతమాత్రం ఇలా నీ దారి నీది, నా దారి నాది అని చెప్పేవాడుకాదు.

ఎన్ని వలపోసినా మనసుకు తృప్తి కలగడంలేదు. అది మండిపోతూనే ఉంది. ఆ రోజు రాత్రి ప్రమీల మేనత్త మంగమ్మ ఎంత పిలిచినా భోజనానికి లేవలేదు. "ఆకలి లేదత్తా!" అని ఒకటే మాట. పిలిచినకొద్దీ మరింత బిగ దీసుకు పడుకొంది.

మేనకోడలి వాలకం ఆమాత్రం పసికట్టలేని అమాయకురాలుకాదు మంగమ్మ. హరికృష్ణతో ప్రమీల కబుర్లు, అతడి సమక్షంలో ఆ పిల్ల కళ్ళలో మెరిసే మెరుపులు ఆమె దృష్టినుండి తప్పుకుపోలేదు. సాయంత్రం ఆ పిల్ల గుడికని హుషారుగా వెళ్ళడం, ఇప్పుడిలా తిరిగొచ్చి పడుకోవడం – ఆవిడకు విషయం అర్థమయ్యీ కానట్టుగా ఉంది.

"ఏం జరిగిందే?"

"......"

"గుడికి హరి వచ్చాడా?"

"అతడెందుకు వస్తాడు?" మేనకోడలు ముఖం త్రిప్పుకొంది.

ఇక మాట్లాడకుండా లేచిపోయింది మంగమ్మ.

మరునాడు ప్రమీల లేచేసరికి ఎనిమిది అయింది. కళ్ళు ఎర్రగా మంటగా తయారు అయ్యాయి. ఒళ్ళు తూలసాగింది. అలాగే పెరట్లోకి బయల్దేరింది.

వంటింట్లో మేనత్తకూ, అన్నగారికీ జరుగుతూన్న సంభాషణ అక్కడికి వినబడుతూంది.

''ఆడపిల్ల ఏనాటికైనా మెళ్ళో ఆ కాస్త పసుపుతాడు పడి ఓ ఇంటి ఇల్లాలై వెళ్ళిపోవాల్సిందే నాయనా! మీ తండ్రిడుకొకులకు ఆపిల్ల పెళ్ళిసంగతే పట్టలేదు కదా? కన్నె చెర వదిలించకుండా ఇలా ఉంచుకోవడం పాపంరా! దాని ఉసురు కొడుతుంది మీకు!''

"నన్నేం చేయమంటావత్తా?''

"అన్నగా నీకేం బాధ్యతలేదా?"

"నాన్న అందరు తండ్రుల్లా నన్ను పెంచి పెద్దజేసి ఉంటే, ఆయన నా ఉన్నతికోసం కష్టపడి ఉంటే ఇవాళ నా చెల్లెలికి పెళ్ళిచేసే బాధ్యత నాకుండేది! చిన్నప్పటినుండి ఆయన చూపిన అలక్ష్యం, అశ్రద్ధ చెప్పరానివి! ఈ నాలుగు ముక్కల చదువు నా కొచ్చిందంటే ఆశ్చర్యమనుకోవాలి! అలా పెరిగిన

పిల్లలు ఏమౌతారో తెలుసా? దేశదిమ్మరులో, రౌడీలో, ఖూనీకోర్లోగా తయారు అవుతారు. నేవలా కానందుకు మీరు, నేను సంతోషించాలి!''

"సంతోషించాల్సిన సంగతే, బాబూ! మరొకందుకు కూడా సంతోషించాలి. ఆ పేదబాహ్మడు సంసారం వదిలేసి పారిపోనందుకు! ఈ సంసారం విచ్ఛిన్నం కాకుండా ఈమాత్రంగానైనా నిలబడినందుకు!"

''అయితే సన్యసించకుండా నీ తమ్ముడు ఘనకార్యం చేశాడంటావు! కాని, ఇంతకంటె చెడిపోయేదేమీ నాక్కనిపించడంలేదు!"

"సర్వనాశనమే అయ్యేదిరా! చెట్టుకొకరూ, పుట్టకొకరూ అన్నట్టు అయ్యేది. పిల్లలకోసం ఏదీ చేయలేని అసమర్థుడే అయినా పిల్లల్ని అంటిపెట్టుకొని ఉన్నాడురా మీ నాన్న! ఈ గూటి విలువ నీకు తెలీడంలేదేమోగాని నాకు తెలుసు!"

"అయితే ఇప్పుడు నా చెల్లెలి పెళ్ళికి నేను చేయగలిగింది ఏముందత్తా?"

''ఎక్కడో ఓ సంబంధం చూడాలి. పెళ్లి చేయాలి."

"మాటలా? వేలు కావాలి. నా దగ్గరా చిల్లిగవ్వలేదు. అప్పుపుట్టే పరపతీలేదు. పెళ్ళిసంబంధం ఎలా చూస్తా చెప్పు."

"హరి నీకు అంత దోస్తీకదా? మన ప్రమీలను చేసుకొంటాడేమో అడగలేక పోయావా?"

"నువ్వు ఏ కాలందానివి, అత్తా? అహ్హహ్హ అహ్హహ్హ." యోగానంద్ పగలబడి నవ్వాడు. "అతడి చదువుకైన అప్పు పాతిక ముప్ఫయివేలదాకా ఉంది. అంత డబ్బు నువ్వు పట్టుకుపోయి తీరుస్తావా? లేక నీ తమ్ముడు తీరుస్తాడా? మీ వెనుకటివాళ్ళకి బంగారు కడ్డీలు పాతరవేసే అలవాటుంటుందట. అదేమైనా ఉందేమో పైకి తియ్యి!''

''పరిహాసం కాదురా! హరికి మన ప్రమీలంటే ఇష్టమేనని నేను గుర్తుపట్టాను. మన పిల్లకుకూడా..."

"కేవలం ఇష్టాలతో పెళ్ళిళ్ళుకావు. డబ్బుతో అవుతాయి!"

"అయినా నువ్వోసారి అతడిని..."

"ఏమడుగుతాను? అతడికి ముప్పైవేల కట్నం కాక డిస్పెన్సరీ పెట్టుకోడానికి ఓ బంగళా, ఓ స్కూటరూ ఇచ్చే సంబంధం ఖాయమైంది. రేపో ఎల్లుండో పిల్లవాళ్ళు వరనిశ్చయం, పిల్లవాడివాళ్లు వధునిశ్చయం చేయబోతున్నారు!"

ఇంక వినాలనిపించలేదు ప్రమీలకు. బుర్ర తిరిగిపోయింది. ఇదన్నమాట

సంగతి? ఎంత నాటకమాడాడు, హరీ! ఒకనాడు తనంటే అతడికి ఆకర్షణ కలిగిఉంటే కలిగిఉండొచ్చు! కాని, ఈ రోజు శ్రీమంతుల సంబంధం వెతుక్కుంటూ రావడంతో ఈ పేదదాన్ని కట్టుకోవడం హాస్యాస్పదంగా తోచి ఉంటుంది నక్కెక్కడా, నాగలోక మెక్కడా అనుకొని ఉంటాడు. డబ్బున్న వధువును చూశాక తన మనసులోనుండి ఈ బీదముఖాన్ని నెట్టివేసి ఉంటాడు బలవంతంగా. రెండురోజుల్లో అంతా సర్దుకుపోతుందని ఆశించి ఉంటాడు. రెండురోజులు ఈ దుఃఖాన్ని తట్టుకొంటే ఆ తరువాత అంతా మరిచిపోయి హాయిగా ఉండొచ్చునని ఆశపడి ఉంటాడు. అతడు మగవాడు! అలా అనుకోవడంలో తప్పులేదు!

కాని, తనసంగతి? తనతడిని మరిచిపోగలదా? తలుచుకొంటేనే దుఃఖం పొంగివస్తూంది! శరీరంనుండి ఏదో భాగం వేరైపోతున్నట్టుగా బాధ కలుగుతూంది. తన సంపద ఏదో దాచుకొన్నట్టు అమితంగా ప్రేమించే ఆ కళ్ళు... ఆ కళ్లలోకి చూసే అవకాశం ఇకలేదు. ఆ కళ్ళు ఇంకెవరినో ప్రేమిస్తాయి ఇంకెవరినో ఆరాధిస్తాయి! డబ్బున్న అమ్మాయి కనిపించగానే ఆ కళ్ళముందు అల్పమైపోయింది తను. ఈ భావమే ఎక్కువగా దహించివేయసాగింది తను ప్రేమించినవాడి ముందు అల్పం కావడంకంటే అవమాన మేముంటుంది ఆడదానికి?... బుర్ర వేడెక్కిపోయింది. ఆలోచనలతో ఒళ్ళుకూడా వేడెక్కిపోయింది. మనసూ శరీరం ఏకమై ఏదో ప్రతీకారం కోరుతూంది! కాని, ప్రతీకారం ఎవరికి చేస్తుంది? ఎవరినీ ఏమీ చేయలేనని తెలుసుకొన్న తరువాత ఆ జ్వాల ఆమెనే చుట్టివేయసాగింది. సర్వనాశనం జరిగేదాకా ఆ జ్వాల శాంతించేలా లేదు!

సాయంత్రం జరిగి సంధ్య అడుగిడబోతుంటే, "గుడిదాకా వెళ్లొస్తానత్తా!" అని బయల్దేరింది ప్రమీల.

ఆ తరువాత జరిగిన కథ మళ్ళీ చెప్పక్కరలేదు.

మరునాడు ప్రొద్దుటే అడిగాడు యోగానంద్, సామరస్యంతో: "నిన్న నీతో వచ్చినతడు ఎవరు ప్రమీలా?"

ఇలాటి ప్రశ్నకు రాత్రే ఆలోచించి పెట్టుకొన్నది జవాబు, ప్రమీల. "రాత్రి గుడిదగ్గర ఇద్దరు రౌడీలు తగిలారు, అన్నయ్యా! వాళ్ల బారినుండి తప్పించుకొని ఇల్లు సురక్షితంగా చేరడంకోసం ఆ పెద్దమనిషి సాయం కోరవలసి వచ్చింది."




"ఇంట్లోకి పిలిచి కాస్త టీ అయినా ఇచ్చి పంపలేకపోయావా?"

"అంతదాకా ఆలోచించలేకపోయాను!"

## 3

"యోగానంద్ ఉన్నాడా?"

"ఇప్పుడే బయటికి వెళ్లాడు."

హరికృష్ణ వెళ్ళిపోవడం చూచి, "కాస్సేపు కూర్చోరాదా? నిన్ను నేనేం మోహినీగ్రహంలా పట్టుకోనులే. పెళ్లి ఎప్పుడు?" అంది ప్రమీల ఆదోరకమైన వెటకారంతో.

హరికృష్ణ కూర్చొని మామూలుస్వరంతో, "ఇంకా నిశ్చయం కాలేదు" అన్నాడు.

"పెళ్లిపిల్ల పేరేమిటి?"

"వైజయంతి అనుకొంటాను!"

"ఓ! పేరులాగే మనిషికూడా అందంగా ఉంటుందనుకొంటాను!"

"ఉంటుంది!"

"పెళ్ళికొడుకు అవతారమా ఇది? మాసిన గడ్డం, పీక్కుపోయిన కళ్ళు... ఏమిటి కథ?"

"ఏంలేదు."

"లేదన్నంతమాత్రాన ఉన్నది లేకుండా పోతుందా? నాతో చెప్పకూడదా? ఎందుకు చెబుతావులే! ఇకముందు అన్నికబుర్లూ వైజయంతిదగ్గరే కాబోలు!

ఈ సంగతి కూడా ఒకనాడు ఆవిడతో చెప్పి నవ్వుతావు కాబోలు! ప్రమీల అనే ఓ పిల్ల ఉండేది, ఆ పిల్ల ఆకాశానికి నిచ్చెన వేయబోయిందని! ఇద్దరూ కలిసి నవ్వుకొంటారు కాబోలు నన్ను తలుచుకొని ! ఈ ప్రేమ ఒకనాడు మీకు ప్రహసనం అవుతుందికదూ?" కఠినంగా ఉన్న కంఠం కాస్త దైన్యంలోకి జారిపోయింది. కళ్లు గబగబా వత్తుకొంది. "చెప్పు, హరీ! ఈ సంగతి ఎప్పుడూ నీ భార్యదగ్గర ఎత్తనని మాటివ్వు! నీకు పుణ్యముంటుంది! నన్ను అలా అవమానించకు!"

"......" విగ్రహంలా కూర్చొన్నాడు హరికృష్ణ.

"మా పెద్దల చాటుగా నేను నడిపిన వ్యవహారానికి నేను పొందిన పరాభవం చాలు. ఈ కథ ఇంతటితో సమసిపోవాలని నా ప్రార్థన! దయచేసి ఎక్కడా ఆ సం..."

"ప్రమీలా!" లోపలినుండి మేనత్త కేకపెట్టింది. ప్రమీల లోపలికి వచ్చింది. "హరితోనా అవతల మాట్లాడేది? పరాయి మగపిల్లలతో ఏమిటా కబుర్లు? చాలు గాని ఇకనుండి నీ వయసెంతో గుర్తుపెట్టుకొంటే మంచిది!" బాగా కసిరింది మంగమ్మ.

హరితో మాట్లాడడం ఈ రోజు క్రొత్త కాదు. చూసీ చూడనట్టుండే మేనత్త ఈ రోజు కల్పించుకొన్నదంటే ఆశ్చర్యపడలేదు ప్రమీల. హరిమీద ఆవిడ ఏవేవో ఆశలు పెంచుకొని ఉండాలి. ఈ రోజు యదార్థం బయటపడింది. అవి కూలిపోయి మేనకోడల్ని ఇక హద్దులో పెట్టాలనుకొని ఉంటుంది!

కిమ్మనకుండా గదిలో కూర్చుండిపోయింది ప్రమీల.

అయిదు నిమిషాల తరువాత హరి గుమ్మం దగ్గరికి వచ్చి, "యోగానంద్ వస్తే చెప్పు, పిన్నీ! హరి వచ్చి వెళ్లాడని!" అని చెప్పడం వినిపించింది.

"అలాగే, బాబూ? అవతలికి వద్దామంటే పనిమీద ఉన్నాను!"

"ఫర్వాలేదు, పిన్నీ! అతడొస్తే చెప్పు, వచ్చి ఇంటిదగ్గర నన్ను కలుసుకోమని!"

హరి వెళ్ళిపోయిఉండాలి. నిశ్శబ్దం తప్ప అతడున్న అలికిడేమీ వినరాలేదు. కాస్సేపటికి ఇవతలికి వచ్చింది ప్రమీల. హరికృష్ణ వెళ్లిపోయా డప్పటికే. వచ్చి వీధిగుమ్మంలో నిలబడింది. నిస్తేజంగా చూస్తూన్న ఆ కళ్ళముందు హరి పెళ్లిదృశ్యం, వధువు ప్రక్కన అతడున్న దృశ్యం – ఇంకా ఇలాగే సన్నివేశాలు కదలిపోతున్నాయి. తన శక్తినంతా క్రోడీకరించి వధువురూపం

ఊహించుకొంటున్నది ప్రమీల. ఒంటినిండా నగలతో, తెల్లని మేనితో, శ్రీమంతుల పిల్లలకుండే సహజమైన దర్పంతో దివ్యసుందరిలా వెలిగిపోతున్నది వైజయంతి... ఉండి ఉండి ప్రమీల గుండెలనుండి పెద్ద నిట్టూర్పొకటి వెలువడింది.

## 4

శనివారంనాటి సాయంత్రం భక్తుల సందడి ఎక్కువగానే ఉంది. గంట కొడుతూన్నా, తీర్థప్రసాదాలు తీసుకొంటూన్నా ప్రమీల కళ్లు ఆసక్తిగా ఒక మనిషికోసం వెదుకుతున్నాయి. "చిత్రమైన మనిషి ఉన్నట్టున్నాడు! ఎంత స్నేహపూర్వకంగా మాట్లాడాడు? ఇకముందు నీకు నేను సహాయ ముంటా నన్నాడు. ఇదేనన్నమాట సాయం? కనీసం ఓసారి తొంగికూడా చూడలేదు!

ఎడమవైపు నడిచి మెట్లమీద కూర్చొన్నది ప్రమీల.

కుంటివాడొకడు ధర్మంచెయ్ దొరసానీ అంటూ వేధించసాగాడు.

"నా దగ్గరలేవు. వెళ్లు!"

ముష్టివాడు జిడ్డులా పట్టుకొన్నాడు. అరచి అరచి అలసిపోయింది ప్రమీల.

"ఇందు! తీసుకొని వెళ్లిపో." వాడి చేతిలో ఓ రెండుపైసలబిళ్ల వేసి, "గుర్తున్నానా అండీ'' అన్నాడు, సుజ్ఞాన్, పెదవులకు సహజ అలంకారమైన నవ్వుతో.

''ఈ వారంరోజుల్లో ఆ ప్రశ్న లక్షసార్లు కనిపించని మిమ్మల్ని వేస్తూనే ఉంది నా మనసు!"

"అందుకేనా, ఆ రోజురాత్రి నన్ను వాకిట్లోవదిలేసి ఇంట్లోకి పారిపోయారు?"

''అదేనా మీకు కోపం? ఏంచెయ్యమంటారు చెప్పండి? వాళ్లు ముందుగదిలో అలా ప్రత్యక్షమౌతారని అనుకోలేదు. వాళ్లకు మిమ్మల్ని పరిచయంచేసే సాహసం లేకపోయింది. భయంవేసింది. నేనున్న పరిస్థితి మీ రామాత్రం అర్థంచేసుకోలేరా?"

"ఫర్వాలేదు. మీరు నన్ను అవమానించారని నాకేం కోపంలేదు." సుజ్ఞాన్ కొంచెం ఎడంగా కూర్చొని కొబ్బరిచిప్ప పగులకొట్టి ప్రమీలకు కాస్త యిచ్చి, తనింత తీసుకున్నాడు.

''మీరు ప్రతిశనివారం దేవుడికి కొబ్బరికాయ కొడతారా?"

"తప్పకుండా."

''ఎన్నాళ్ళనుండి మీ రీ నియమం ఏర్పరుచుకొన్నారు? ఏ సందర్భంలో?"

"ప్రత్యేకంగా సందర్భమంటూ ఏంలేదు. కొన్ని సంవత్సరాలుగా దైవ

దర్శనాని కంటూ వస్తున్నాను. ప్రతిశనివారం కొబ్బరికాయ కొట్టాలని ఎందుకు సంకల్పం కలిగిందో తెలియదు!"

సంభాషణ కొనసాగడంకోసం ఇప్పటికే అనవసర ప్రశ్నలు వేసింది అత డైనా తన సంగతు లేవీ అడగలేదు.

"మీ ఇల్లు..."

"ఇక్కడికి సమీపమే. పెద్దగా ఇల్లంటూ ఏంలేదు. అన్ని వసతులతో ఉన్న గది."

మళ్ళీ సంభాషణ స్తంభించిపోయింది.

సుజ్ఞాన్ లేచి వెళ్ళాడు, గర్భగుడి ముందు ఏదో తగవు వినరావడంతో. పది నిమిషాల తరువాత తిరిగివచ్చి కూర్చొంటూ, "త్రొక్కుకుంటూ త్రోసుకొంటూ దైవ దర్శనం చేసుకొంటే ఏంశాంతి మిగులుతుంది ఈ భక్తులకు? ఏమైనా మన వాళ్ళకు ఎందులోనూ నిలకడ, ఓర్పు లేవు!" అన్నాడు.

"ఏమిటి తగవు?"

"సందట్లో ఓ ముత్తయిదు కాలు ఓ పడుచు త్రొక్కింది. త్రొక్కించు కొన్నా విడ త్రొక్కినావిడ్ని కొట్టబోయింది."

"మీరు తగవులు ప్రైవేట్‌గా కూడా తీర్చేస్తున్నారు!"

"అడ్వకేటుని కదా?" నవ్వాడు.

"ఫీజేం ముట్టలేదు!"

"ఈ లోకంలో ముట్టని ఫీజు పైలోకంలో భగవంతుడు ముట్టిస్తాడు! ఈ ఫీజుకంటే అతడి ఫీజుకే ఎక్కువ ప్రాముఖ్యత నిస్తూంటాను!"

"అయితే నా కేసుకూడా మీరు పట్టుకొని, నాకేదైనా మార్గం చూపవలసిందిగా కోరుతున్నాను మిమ్మల్ని. ఫీజు మీ భగవంతుడు ఇవ్వాల్సిందే. నేనేం ఇవ్వలేను."

"మంచిమాటే!" సుజ్ఞాన్ మళ్ళీ నవ్వాడు గలగలా. "చెప్పండి వివరాలు!"

"నాకో మార్గం చూపవలసిన బాధ్యత మీకున్నది కూడా. ఆ రోజు నన్ను ఆత్మహత్య చేసుకోకుండా ఈడ్చుకువచ్చారు కాబట్టి!"

సుజ్ఞాన్ శాంతగంభీరస్వరంతో, "చెప్పండి, ప్రమీలా, మీ కథ!" అన్నాడు.

"మా నాన్న పండితుడు. అయినా ఆయన పాండిత్యం ఆయనకు కూడు పెట్టలేకపోయింది. కొన్నేళ్ళక్రితం మా గ్రామంలో మేమంతా కూడా నీళ్ల లేక మాడిపోయే పరిస్థితిలో ఇక్కడ ఓ ధర్మాత్ముడు శివాలయంలో అర్చనకు




నియమించి ఇక్కడ ఉండడానికి ఈ కాస్త ఆశ్రయం, కాస్త తిండికి బట్టకు ఆధారం చూపాడు. ఇక్కడికి వచ్చాకే మా అమ్మ పోయింది. మా అన్నయ్య బి.ఏ. పాసయ్యాడు. కాని, అతడికి కుటుంబ బాధ్యతేమీ పట్టలేదు. నేను స్కూల్ ఫైనల్ వరకు చదివానుగాని పరీక్ష యివ్వలేదు. పరీక్ష ఫీజు కట్టడానికి లేక! ఇప్పటికి నేను చదువు మానేసి అయిదేళ్ళవుతూంది! మా అన్నయ్యకో ఫ్రెండు ఉన్నాడు–హరికృష్ణ. ఆ రోజు మీరు వచ్చినప్పుడు గదిలో కూర్చున్న ఇద్దరిలో అతడున్నాడు. మరొకాయన మా అన్నయ్య. హరికృష్ణను నేను ప్రేమించాను. అతడూ నన్ను ప్రేమించాడు. కాని మొన్న పెళ్ళిచేసుకొమ్మని అడిగితే...''

సుజ్ఞాన్ ప్రమీల కథంతా విని అన్నాడు: ''మన దేశంలో మధ్యతరగతి ఆడపిల్లల పరిస్థితి అందరిదీ ఇంచుమించు మీలాగే ఉంటుంది, ప్రమీలా! యుక్త వయసులో వివాహం చేయలేరు తలిదండ్రులు. తమకాళ్ళమీద తాము నిలబడే పాటి చదువూ చదివించలేరు. అసలు పిల్లల భవిష్యత్తు ఏమాత్రం ఆలోచించకుండా కనడంవల్ల ఎన్నో అనర్థాలు జరుగుతున్నాయి. ఇప్పుడు ఇద్దరు లేక ముగ్గురు చాలు అంటూంది. ప్రభుత్వం కొన్నాళ్ళు పోయాక ఈ ఇద్దరు ముగ్గురిని కనడం పాపమే అవుతుందేమోనని నా భయం. రెండుతరాల ముందు డజనుమందిని కన్నా ఏదో మాదిరి ఆ మానవుడు పోషించాడు సంతానాన్ని. ఇప్పుడు ఇద్దరు ముగ్గురితో చాలించుకొన్న గృహస్థూ అంతకంటే గొప్పగా ఏం పోషించలేకపోతున్నాడు!

"మీ నాన్నలాంటి అసమర్థుడు మీ ఇద్దరికి జన్మ నివ్వడం కూడా నేరమే అంటాను!"

"నిజమే. ఆయన నేరానికి మా అన్నయ్య బలికాలేదు. అదృష్టవశాత్తు అతడు బయటపడి తనభవిష్యత్తు క్రిందినుండి పైదాకా తనే నిర్మించుకొన్నాడు. కాని, నేను ఆడపిల్లను. ఇట్లో పడిఉండడం తప్పితే ఏంచేయలేకపోయాను! ఇంట్లో వుండికూడా నాకు దొరికిన అవకాశాన్ని వృథాపుచ్చక సాహసం చేశాను! కాని, అదృష్టం నన్ను వెక్కిరించి ఎడారిలాంటి భగ్నజీవితంలోకి విసిరివేసింది!"

ఈ యువతి కేసు కొంచెం క్లిష్టంగానే తోచినట్లుంది ఆ కుర్ర లాయరుగారికి. దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టుగా కూర్చుండిపోయాడు. 'సంప్రదాయంలో పెరిగిన బ్రాహ్మణయువతి. పెద్దగా చదువుకోలేదు. తగిన సంబంధం చూచి వివాహం చేయలేడు తండ్రి. ఏదైనా మార్గం చూపమని అడుగుతూంది! ఎలాంటి మార్గం చూపితే క్షేమకరం?'

చాలా సేపటికి హఠాత్తుగా సుజ్ఞాన్: "ప్రమీలా! మీరు వివాహానికి తయారుగా ఉన్నారా?"

"ఏమిటి సుజ్ఞాన్‌బాబూ మీరనేది? నిన్న అతడిని ప్రేమించి, ఈ రోజు మరిచిపోయి రేపు మరొకరిని పెళ్లిచేసుకొనే తుచ్ఛురాలిగా భావిస్తున్నారా? ఆడదాని ప్రేమ అల్పమైనదీ క్షణికమైనదీ అనుకొన్నారా? చూడబోతే మీకు దీనితో పరిచయం ఎప్పుడూ కానట్టుంది!"

"కాలేదు, ప్రమీలా!" స్నిగ్ధమందహాసం చిలికించాడు. "ప్రేమ గౌరవింప దగిన వస్తువే? కాదనను! కాని, జీవితధర్మానికి ఉపకరించని ప్రేమను విస్మరించడంలో నేరం, నీచం లేవు. హరికృష్ణను మీరు ప్రేమించారు! కాని, అతడు మిమ్మల్ని స్వీకరించలేనప్పుడు, అతడు పరాయివాడై పోతున్నప్పుడు అతణ్ణే మీరు మనసులో పూజించడమనేది-అది పవిత్రప్రేమ అంటారా? అది మరో స్త్రీపట్ల అపచారం కాదా?"

"అపచారమా? నేనేం అతణ్ణి నా వశం చేసుకోవాలనుకోవడం లేదు! నా మనసులో అతణ్ణి నిలుపుకోవడం అతడి భార్యకు అపచారం చేసినట్టు ఎంతమాత్రం కాదు!"

"అపచారం ఎందుకు కాదు? మనుషులకూ, మనసులకూ మధ్య ఉండే తెరలూ, గోడలూ మీకూ భగవంతుడికీ మధ్య లేవు. మీ వీపువెనక నిలబడి

మీ ప్రతి చేష్టా భగవంతుడు గమనిస్తూనే ఉంటాడు. మీరు పొందలేని వ్యక్తిని జీవితాంతం ప్రేమిస్తూ కూర్చోవడ మనేది శుద్ధ తెలివితక్కువ. మనం చేసే పిచ్చిపనులకు మనం పీపు మలిపినప్పుడైనా ఆ భగవంతుడికి సంజాయిషీ ఇచ్చుకోవలసిందే."

"మీకు భగవంతుడిపట్ల చాలా గుడ్డివిశ్వాసమే ఉన్నట్టుంది!" నిరసన వ్యక్తంచేసింది ప్రమీల.

"ఉండనీయండి. అది ఎవరినీ నష్టపరచదు! ప్రతి క్షణం మనం భగవంతుణ్ణి స్మరణలో ఉంచుకోవడంవల్ల మనం చేయబోయే చాలా తప్పుపనులు ఒప్పులుగా మారిపోతాయి. ఆయనయందు విశ్వాసమే మనల్ని రాచబాటలో నడుపుతుంది."

"పోనివ్వండి. ఆ భగవంతుడిమీద నాకంత విశ్వాసంలేదు. తర్కించ డానికి మీలా నేను చదువుకోలేదు. ఆ భగవంతుడే నన్ను శిక్షించడానికి వస్తే ముందు 'తమరు చేసిన పనేమిటి మహానుభావా?' అని అడుగుతాను. కాని, ఇప్పుడు నాకు ఉపాయం చెప్పండి. ఇంట్లో ఇలాగ గోళ్ళు గిల్లుకొంటూ ఎన్నాళ్ళు కూర్చోవాలి? ఇంట్లో అత్తయ్య పోరు ఎక్కువైతే మా నాన్న తన లాంటి ఏ పూజారయ్యకో నన్నిచ్చి పెళ్లికూడా చేస్తాడు. - అప్పుడైనా నేను చావక తప్పదు. ఎందుకంటే అలాంటి వ్యక్తితో నేనెప్పుడూ జీవితం ఊహించు కోనుకూడా ఇష్టపడను కాబట్టి!"

"వీలయితే మీ రిప్పుడు చదువుకోవాలని ఆశిస్తున్నారా?"

"చదవాల్సిన వయసులోనే చదవలేదు. ఇప్పుడేం చదువుతాను?"

"చదువుకూ, వయసుకూ సంబంధంలేదు. మీకు చదువుకోవాలని, మీకో వ్యక్తిత్వం ఏర్పరచుకోవాలనీ కోరికేఉంటే చెప్పండి. ఆ వీలు నేను కల్పిస్తాను!"

"ఎలా కల్పిస్తారు? ఇంట్లో మా అన్నయ్య, మా నాన్న ఏమంటారో?"

"వాళ్ళను ఒప్పించే పాట్లన్నీ నావి!"

"ఏమాత్రం పరిచయంలేని మీరు వాళ్ళను ఎలా కలుసుకొంటారు? ఎలా ఒప్పిస్తారు?" ఆశ్చర్యంగా అడిగింది ప్రమీల.

"మనసుంటే మార్గమే ఉండదా? వాళ్లని నేనే కలుసుకొంటానో, ఇంకెవరి చేతైనా చెప్పిస్తానో, ఆ భారం నా కొదిలేయండి. కాని, రేపొకసారి మా 'వరకట్న పిశాచవధ' సంఘానికి రాగలిగితే అక్కడ మావాళ్లతో మీకు పరి చయం కలిగిస్తాను. అక్కడ 'సుమతి' అనే మంచి స్నేహితురాలు దొరుకు

తుంది మీకు. ఆమెద్వారా మీ జీవితంలో ఉజ్వలమైన మార్పు రాగలదని ఆశిస్తున్నాను!"

"బాబోయ్! ఇదేం పేరు? వరకట్న పిశాచవధ సంఘమా'' పడి పడి నవ్వింది ప్రమీల.

''మరో పేరుకూడా ఉంది? అనాథ సేవాసంఘం!" సుజ్ఞాన్ నవ్వలేదు. మనదేశంలో ఈ వరకట్నం పేరుతో ఎంతమంది ఆడపిల్లలు, ఆడపిల్లల్ని కన్న తలిదండ్రులు బలి అయిపోతున్నారో చెప్పలేం. ఇక దీనులకూ, దుఃఖితులకూ ఈ ప్రపంచంలోనే కరువులేదు. వీళ్ళందరికి న్యాయం చేస్తామని కాదు. వాళ్లందరికీ న్యాయం చేయడం ఒక్క భగవంతుడికే సాధ్యం. కాని, ఉడుతా భక్తిగా చేతనైంది చేయడంకోసం మేం నలుగురం మిత్రులం ఒక సంఘంగా ఏర్పడి వరకట్నరహిత వివాహాలూ, అనాథసేవా చేయడానికి నడుంకట్టాము. ఒక పార్టీకిగాని, మతానికిగాని సంబంధంలేని స్వచ్ఛంద సంఘం మాది!"

''నన్ను చేరమంటారా మీ సంఘంలో?" కుతూహలంగా అడిగింది ప్రమీల.

''మీరు పెరిగిన సంప్రదాయం, ఇంట్లో మీకున్న స్వాతంత్ర్యం అన్నీ నేను అర్థంచేసుకోగలను! అలాంటప్పుడు మిమ్మల్ని మా సంఘంలో చేరమని మాతోపాటు శ్రమించమని ఎలా కోరతాను? మా సంఘంద్వారా మీకేదయినా చేయగలిగితే చాలు!'' వాచీ చూచుకొన్నాడు సుజ్ఞాన్. "మాట్లాడుతూ ప్రొద్దు ఎంతయిందో గమనించలేదు. నాకేం ఫర్వాలేదనుకోండి. మీరు..."

ఆ విషయం అతడు గుర్తుచేసేదాకా తనకు గుర్తురానందుకు సిగ్గుపడుతూ లేచింది ప్రమీల. "వచ్చే శనివారం కొంచెం ముందుగానే వస్తాను. ఎనిమిది గంటలకల్లా ఇంటికి వెళ్ళిపోగలిగితే మా అత్తయ్యతో తిట్లు రావు!''

"మంచిది!''

ఇద్దరూ కలిసి గుట్టదిగారు. చెరోదారిన నడిచిపోయారు.

ఆ రాత్రి ప్రక్కమీద పడుకొన్న ప్రమీలను సుజ్ఞాన్‌కు సంబంధించిన ఆలోచనలే చుట్టివేశాయి. చీకటిగుహలాంటి, మార్పులేని తనజీవితంలోకి ఏదో వెలుగు ప్రసరిస్తున్నట్టు అనుభూతి కలిగింది ప్రమీలకు. తండ్రికీ, అన్నకూ ఏనాడూ తన జీవితం గురించి తాపత్రయమనేది లేదు. అసలు తన జీవితంలో ఏర్పడిన లోటు, జరిగిన అన్యాయం వాళ్ల దృష్టికి రావు. తన యీడు పిల్లలు చక్కగా చదువుకొంటున్నారు. లేకపోతే పెళ్లిళ్ళు చేసుకొని చక్కగా కాపురాలు చేసుకొంటున్నారు. తన పెళ్ళి తనే చేసుకోబోయి భంగపడింది. ఈ సంగతీ

వాళ్ళకు తెలియదు! హఠాత్తుగా ఒక పురుషుడు తారసపడి నువ్వు కోరిన విధంగా నీ జీవితం మలుపు త్రిప్పగలనని అభయమిస్తున్నాడు! చావబోయిన తనను వెనక్కి లాక్కువచ్చి అమితమైన శ్రద్ధ కనబరుస్తున్నాడు?

## 5

మధ్యాహ్నం భోజనానికి యోగానంద్ రాలేదు. అతడికోసం చూచి చూచి మంగమ్మ తను తినేసి మైలపడింది. తరువాత గంటకు వచ్చాడు యోగానంద్.

"నీకోసం చూచి చూచి ఇప్పుడే తిని మైలపడ్డాను."

"నేను తినేసి వచ్చానత్తా."

"ఎక్కడ?"

"హరివాళ్ళింట్లో. ఇవాళ పిల్లవాళ్ళు వరసనిశ్చయం చేసిపోడానికి వచ్చారు. హరి భోజనానికి పిలిచాడు!"

"అదృష్టవంతుడు! మంచిసంబంధమే వడుతూంది! పిల్ల బి. ఏ. పాసయిందట కదా."

"ఆc అయింది. కాని, హరి అదృష్టవంతుడుమాత్రం కాదత్తా? ఆ పిల్లకు ఫిట్స్, గుండెజబ్బూ ఉన్నాయి. గౌతమివాళ్ల సీతారాములు లేడూ? ఇక్కడికి నాకోసం వచ్చాడు చూడు! వాడికి సంవత్సరం క్రితం ఆ పిల్ల మాట్లైతప్పి పోయిందట, ఎవరో ఆ పిల్ల జబ్బుసంగతి ఊదేప్పటికి!"

"అయితే హరివాళ్లకు తెలీదన్నమాట?"

"తెలియదనుకొంటాను! తెలిస్తే చూసి చూసి జబ్బుమనిషిని ఎలా చేసుకొంటారు?"

"అయ్యో పాపం! హరికి చెప్పలేకపోయావా?"

"మనకెందుకత్తా, కుదిరినపెళ్ళి చెడగొట్టిన పాపం?"

"అయ్యో! నూరేళ్లపంట..."

"అది ఆ పిల్లకు కూడా కదా?"

* * *

ఒక మధ్యాహ్నం హరికృష్ణ వచ్చాడు.

ప్రమీల ఒక్కతే ఉంది ఇంట్లో. తండ్రి ఎవరింట్లోనో తద్దినం పెట్టివ్వడానికి వెళ్ళాడు. మేనత్త దక్షిణకోసం వెళ్ళింది అక్కడికే. యోగానంద్ కూడా ఎక్కడికో వెళ్ళాడు.

హరికృష్ణ వచ్చి కుర్చీ జరుపుకు కూర్చొని, ఇల్లు నిశ్శబ్దంగా ఉండడం గమనించి, ఇంట్లో ఎవరూ లేనట్టుందే ?" అన్నాడు.

"ఉన్నా కదా ?"

"పిన్ని లేదా ?"

"లేదు. పెళ్ళెప్పుడు ?"

మరచిపోయిందేదో గుర్తువచ్చినట్టుగా ముఖం విషాద మేఘాచ్ఛాదితమై పోయింది. "ఇంకా లగ్నం పెట్టుకోలేదు."

"నువ్వీ పెళ్ళి చేసుకోడానికి వీల్లేదు, హరీ !"

ప్రమీల ఉద్విగ్న స్వరానికి విస్మయంగా చూశాడు. "ఎందుకు ?" అన్నాడు పేలవమైన నవ్వుతో.

"ఎందుకైతే ఎందుకు ? నువ్వుమాత్రం ఈ పెళ్ళి చేసుకోడానికి వీల్లేదు. నీ జీవితం నాశనమౌతుంది ఈ పెళ్ళి జరిగితే."

"నాకు తెలుసా సంగతి !"

నీళ్ళు చల్లిన పాలపొంగులా చప్పబడిపోయింది అతడి శాంతస్వరానికి. "తెలుసా ? ఏం తెలుసు ? ఆ పిల్ల గురించి తెలుసా ?" అంది విభ్రాంతిగా.

"తెలుసు. ఆ పిల్ల తెల్లగా, అందంగా ఉంటుంది. బి. ఎ. చదివింది. చాలా వినయస్తురాలు. ఆ అమ్మాయికి అందం, చదువేకాదు. భగవంతుడు మూర్ఛరోగమూ, గుండెజబ్బు కూడా తోడుగా ప్రసాదించాడు."

"అబ్బ ! నువ్వెంత పాషాణం మనిషివి ! తెలిసే చేసుకోగలుగుతున్నావా ఆ రోగిష్టిదాన్ని !"

"ఆఁ. తెలిసికూడా చేసుకొంటున్నాను !"

ప్రమీల ముఖం కఠినంగా మారిపోయింది. "విశాలహృదయమనుకోవాలా ? డబ్బు పిపాస అనుకోవాలా ?"

"ఓ ఆడపిల్ల మెళ్ళో మూడుముళ్ళు వేయడానికి ముప్పైవేల కట్నం, డిస్పెన్సరీ పెట్టుకోడానికి బంగళా, ఓ స్కూటరూ వరకట్నంగా తీసుకొంటూ విశాలహృదయుణ్ణని ఏ ముఖంపెట్టుకొని చెప్పుకోగలను ! రెండవదే నిజమనుకో !"

"ఛీ ఛీ !" అసహ్యాన్ని వ్యక్తంచేసింది. "ఆ పిల్లను కాదన్నమాట నువ్వు పెళ్ళిచేసుకొనేది ? డబ్బునే అన్నమాట ? ఎంత దురదృష్టవంతురాలో మనసు లేని మనిషిపాల పడుతున్నది !"

"వరకట్నం తీసుకొనేవాళ్ళంతా భార్యల్ని ప్రేమించలేరనా నీ ఉద్దేశ్యం ?"

"డబ్బే ముఖ్యమైనవాళ్ళు ఎవరినీ ప్రేమించలేరు !" ప్రమీల తీవ్రంగా అంది. "నీ చదువుకూ నీ తెలివికీ ఇంతకంటే ఎక్కువ కట్నమే ఇచ్చి యిస్తారు పిల్లను. జబ్బు పిల్లను కట్టుకొనే ఖర్మేమిటి నీకు ? వద్దు, హరీ ! ఈ పెళ్ళి చేసుకో వద్దు ! చూస్తూ చూస్తూ నరకంలోకి ఎందుకు అడుగుపెడతావు ?" నేనేదో స్వార్థం మనసులో పెట్టుకొని ఇలా చెబుతున్నానని నువ్వు నన్ను అపార్థం చేసుకోకు. ఆ రోజు రాత్రే నీదనుకొన్న ఈ ప్రమీల మనసు చచ్చిపోయింది. ఇప్పుడు నీ మీద నాకేం కోరికలేదు. కాని, నువ్వు సుఖంగా ఉండాలని కోరు కొంటున్నా ! ఇలాంటి పిచ్చిపనిమాత్రం నువ్వు చెయ్యడానికి మాత్రం వీల్లేదు" అంది గాద్గదికంగా.

నీటితెర మెరుస్తూన్న ఆ కళ్ళలోని అనురాగానికి, అర్ద్రితకు విచలితంగా చూశాడు హరికృష్ణ. "నీలాంటి అనురాగమూర్తిని తిరస్కరించినరోజే ఈ ప్రపంచంలోని దురదృష్టవంతులలో మొదటివాడి నయ్యాను, ప్రమీలా ! ఇక నాకు సుందరి అయినా, కురూపి అయినా, రోగిష్టిదైనా లెక్కలేదు. కర్తవ్యానికి అంకితమైన ఈ జీవితానికి సుఖం కావాలన్న కోరికలేదు !" అన్నాడు విషాద స్వరంతో.

"ఒక్క నీ తరుపునుండే ఆలోచించి నువ్వు స్వార్థపరుడి వౌతున్నావు, హరీ ! వైజయంతిగురించి ఎందుకు ఆలోచించడంలేదు ? ఏ స్త్రీ అయినా సంసార సుఖాన్ని సంపూర్ణంగా కోరుకొంటుందిగాని తను రోగిష్టిదని, తనకు సుఖం అక్కరలేదని అనుకోదు. మామూలు స్త్రీకంటేకూడా రోగిష్టి అయిన వైజయంతి నీ ప్రేమను ఎక్కువగా కోరుతుంది ! నీ ఆదరణను ఎక్కువగా వాంఛిస్తుంది ! నిజంగా నీ మానవత్వానికే ఈ పెళ్ళి ఒక పరీక్ష !"

బదులు చెప్పలేదు హరికృష్ణ. ఆలోచిస్తున్నట్టుగా మౌనం వహించాడు.

"నువ్వీ పరీక్షలో నెగ్గగలిగితే సంతోషమే. నీలాంటి ఉదాత్తహృదయుడు ఉండబోడని గర్విస్తాను !"

హరికృష్ణ బలవంతంగా నవ్వుతూ, "ఈ పరీక్షలో నెగ్గాలని మంచి మనసుతో ఆశీర్వదించు, ప్రమీలా !" అన్నాడు.

## 6

శనివారం సాయంత్రం కొంచెం ముందుగానే గుడికి వచ్చింది ప్రమీల.

భక్తుల రాక అప్పుడప్పుడే ప్రారంభమైంది. కాని, సుజ్ఞాన్ రావడానికి

మాత్రం చాలా ఆలస్యమే అయింది. వస్తూ, తనకోసం నిరీక్షిస్తున్న ప్రమీలను చూచి చిరునవ్వు నవ్వాడు పలకరింపుగా.

మరో పావుగంట తరువాత గుట్ట దిగారు ఇద్దరూ.

మెయిన్‌రోడ్ దిగి రెండు సందులు తిరిగాక ఓ గదిముందు ఆగి తలుపు తాళం తీశాడు సుజ్ఞాన్. "రండి."

నిస్సంకోచంగా గదిలో ప్రవేశించి అతడు చూపిన ఆసనంమీద కూర్చొన్నది ప్రమీల. సుశిక్షితుడూ, విద్యాధికుడూ అయిన ఒక బ్రహ్మచారి గది ఎలా ఉండాలో అలాగే ఉంది గది. గది విశాలంగా ఉంది. ఓ పక్క టేబిల్, రాక్‌లో లావాటి పుస్తకాలు, ఓ ప్రక్క పెద్ద ట్రంకుపెట్టె, ఓ సూట్‌కేస్, హేంగర్‌కి బట్టలు - అన్నీ పొందిగ్గా, నీటుగా సర్ది ఉన్నాయి. గోడకి ఆంజనేయస్వామి పటానికి ఎప్పుడో వేసిన మల్లెపువ్వుల దండ ఎండిపోయి వుంది.

సుజ్ఞాన్ అగరుబత్తి వెలిగించి పటానికి గ్రుచ్చి, ప్రమీలవైపు తిరిగాడు. "మీకు కొద్దిగా టీ ఇచ్చి అతిథి మర్యాదలు సలపాలని ఉంది. కాని, ఆలస్యమౌతుందేమో మీకు!" అన్నాడు.

"వద్దులెండి. ఆడవాళ్ళు మగవాళ్ళకు అతిథులు కావడమంత అసహ్యం మరొకటి ఉండదు" అని నవ్వింది ప్రమీల.

"అయితే టీ సరంజామా అంతా అక్కడే ఉంది. మీ చేత్తోనే చేసి కాస్త నాకూ ఇవ్వండి!" అంటూనే కూజాలోంచి నీళ్ళు కెటిల్‌లోకి వంపి స్టౌ ప్రక్కగా ఉంచాడు.

ప్రమీల చిన్న పీట ఒకటి వాల్చుకొని కూర్చొంది, స్టౌ వెలిగించి. "మీ ఊరేమిటి? మీకు తలిదండ్రులు ఉన్నారా? ఈ సంగతులన్నీ నాకు మీరు చెప్పాలి, సుజ్ఞాన్ బాబూ!"

"అవన్నీ మీకు చెబుతూ కూర్చొంటే మీకు ప్రొద్దు అవుతుందేమో?"

"ఫర్వాలేదు. చెప్పండి. ఇంట్లో ఏదో సాకు చెప్పగలను!"

"ఆడపిల్ల లీ విధంగా పెద్దవాళ్ళ కళ్ళలో దుమ్ముకొట్టడం అంత మంచి పని కాదేమో?"

"ఈ విధంగా అంటే? ఒక దురుద్దేశంతో నేను మీతో రాలేదు. మీ సేవా సంఘంతో పరిచయంచేసుకొందామని వచ్చాను. ఇక మీతో పరిచయంకూడా కాకతాళీయమే. ఉన్నది ఉన్నట్టుగా పెద్దవాళ్ళకి చెబితే ఉన్నది ఉన్నట్టుగా మాత్రం అర్థంచేసుకోరు. చెప్పి ఇరుకున పడడంకంటే కొన్ని విషయాలు



రహస్యంగా ఉండిపోవడంలోనే మేలు ఉంది. ఇకపోతే రెండు కళ్ళను నాలుగు కళ్ళను చేసుకొని నన్ను కాపలా కాచేంత పెద్దలెవరూ మా ఇంట్లో లేరు. మా నాన్నకీ, అన్నయ్యకీ నన్ను కాపలా కాచేంత అపనమ్మకం, అవసరం ఎప్పుడూ కలుగలేదు. మా మేనత్తకూడా ప్రత్యక్షంగా ఏదో పొరపాటు కనిపిస్తేగాని మందలించే మనిషికాదు! ఇంత దురదృష్టంలోకూడా నా అదృష్టం ఏమిటంటే చీటికి మాటికి చీవాట్లు, ఆజ్ఞలు లేకుండా నేను స్వేచ్ఛగానే పెరిగాను."

"స్వేచ్ఛ మనిషి ఎదగడానికి ఎంత దోహదం చేస్తుందో చెడిపోడానికీ అంత అవకాశం యిస్తుంది. మీరు స్వేచ్ఛను సద్వినియోగం చేసుకొంటారనే ఆశిస్తున్నాను!"

"నే నిలా మీ వెనుకవచ్చి దుర్వినియోగం చేసుకొంటున్నాననా మీ ఉద్దేశ్యం సుజ్ఞాన్‌బాబూ?" కొద్దిగా చిన్నబుచ్చుకొని అడిగింది ప్రమీల.

సుజ్ఞాన్ చిన్నగా నవ్వాడు. "మీకై మీరు నాతో రాలేదు! నేను మిమ్మల్ని ఆహ్వానించాను. వచ్చారు. నా పరిచయాన్ని మీరు జీవితంలో ఉపయోగించు కోవాలనే నా కోరిక! నానుండి ఏ సహాయం కావలసి వచ్చినా పొందే హక్కు మీకా రాత్రి ఏర్పడింది. ఎలాంటి సందేహం లేకుండా నన్ను మీ స్నేహితుడిగా స్వీకరించవచ్చునని మొదటిరోజే మీకు చెప్పాను!"

"అందుకేనా, ఇలాగ అవమానిస్తున్నారు?"

"అహఁ హఁ! కొద్దిగా జాగ్రత్తగా ఉండాలని హెచ్చరించాను! మీ జీవి తంలో ఇదొక క్రొత్త ప్రవాహం! బహుశః దీని ఉరవడి తీవ్రంగానే ఉండ వచ్చు. గట్టు గండివడకుండా కట్టుదిట్టంగా ఉండాలని చెబుతున్నాను."

"మంచిది!" అభిమానంగా అంది. కొద్దిరోజులక్రితం అత దెవరో తనెవరో? ఇలా ఒకర్ని ఒకరు అనుకొనే చనువు, అధికారం ఎక్కడినుండి వచ్చాయి? ఆశ్చర్యంగా తోచింది ప్రమీలకు. అతడితో పరిచయం పెంచు కోవడం తనలాంటి ఆడపిల్లకు అనుచితమేమోనన్న అనుమానం కూడా ఆ క్షణంలో తోచిందామెకు. నిజంగా ఇది పెద్దవాళ్ళ కళ్ళలో దుమ్ముకొట్టడమే. ఇది దురుద్దేశ్యంతో కూడినది కాకపోయినా దుష్ఫలితం ఇస్తుందేమో ఎవరికి తెలుసు?

టీ చప్పరిస్తూ అన్నాడు సుజ్ఞాన్: "నా గురించి అడిగారు కదూ? నే నొక పాలేరు కొడుకుని! మీ అగ్రవర్ణంవారంతా అస్పృశ్యులుగా భావించి ఊరవ తలికి తరిమికొట్టారే వాళ్ళ ఇళ్ళలో పుట్టాను! కాని, బాబుగారి అనుగ్రహంవల్ల ఇంతవాణ్ణి కాగలిగాను! ఏ జన్మ అనుబంధమో ఆయనకు నేనంటే వల్లమాలిన అపేక్ష. అందుకే ఆయన పిల్లలతో సమానంగా నన్నూ చదివించారు! ఒక మనిషినిచేసి వదిలిపెట్టారు!"

ప్రమీల విస్మయంగా "మీరు చెప్పేది నిజమేనా?" అంది.

"ఇందులో నమ్మలేనిది ఏముంది?"

"మిమ్మల్ని చూస్తే అలా లేరు!"

"అంటే?... అర్థమైంది మీ అనుమానం!" అని నవ్వాడు. "కట్టు బొట్టు మనుషుల్ని వేరుపరుస్తుందిగాని భగవంతుడు మనుషులందరికీ ఒకే అవయవ నిర్మాణం గావించాడు, ప్రమీలా! మీలో నల్లటివాళ్ళు ఉన్నట్టే మాలోనూ ఎర్రటివాళ్ళు ఉన్నారు! అందమైనవాళ్ళూ ఉన్నారు."

సుజ్ఞాన్ ముఖంలోకి చూస్తున్న ప్రమీల చటుక్కున చూపులు దించుకొంది.

సుజ్ఞాన్ మంచి ఆజానుబాహువు. స్ఫురద్రూపి. ఒకసారి చూచిన ఆడపిల్ల అంత సులభంగా అతణ్ణి మరిచిపోలేదు.

"ఇవి కడగడానికి పనిమనిషి ఉందా?"

"ఉంచేయండి. ప్రొద్దుటికి వస్తుంది."

రెండు నిమిషాల తరువాత సుజ్ఞాన్ గదికి తాళంపెట్టి ప్రమీలతో నాలు గిళ్ళవతల ఓ పాతకాలపు బంగళా సమీపించాడు. "సుమతి అని చెప్పానే? ఇదే ఇల్లు. ఇక్కడే మా భజన కార్యక్రమం, మీటింగులూ అన్నీనూ."

పెద్ద హాలులో సుజ్ఞాన్ స్నేహబృందమంతా తయారుగాఉన్నా రప్పటికే.

ఒక యువతి కొంచెం ఎత్తుమీద సీతారామ విగ్రహాలకు మల్లెపువ్వుల దండలు

అమరుస్తూంది! ఇరవై ఎనిమిదేళ్ళ వయసు ఉంటుందేమో! ఎర్రగా దొండ పండులా ఉంది. అంత అందమైన ఆడవాళ్ళను ఎప్పుడూ చూడలేదనుకొంది ప్రమీల.

ప్రమీలను చూచి పరిచయం ఉన్నదానిలాగే నవ్వింది. "రా, అమ్మా! సుజ్ఞాన్ చెప్పాడు నిన్ను తీసుకు వస్తున్నానని!" అంది.

ఆమె సుమతి అని, తనను చదివించిన బాబుగారి కూతురని పరిచయం చేశాడు సుజ్ఞాన్. "ఆ చివర పువ్వులచొక్కా వేసుకొన్నతడు – లక్ష్మీకాంత్. సుమతి తమ్ముడు. అత డిప్పుడు స్వగ్రామంలో తండ్రికి సాయంగా ఉంటు న్నాడు. మేమిద్దరం సహోదరులలా పెరిగాం. శరీరాలు వేరుగాని ప్రాణ మొక్కటే."

హాలులో చాలామంది ఉన్నారు. అటుకేసి చూడాలంటే సిగ్గుపడింది ప్రమీల.

ప్రమీల సుమతిదగ్గర కూర్చొంది చిరిచాపమీద. భజన ప్రారంభమయ్యే లోగా ఓ ఇద్దరు యువతులు ఓ ముసలమ్మా వచ్చి కూర్చొన్నారు ఆ చాపమీదే.

"పదములె చాలు రామా... నీ పదధూళులె పదివేలు..." కన్నులు అర మోడ్పులుచేసి, మృదువుగా తాళాలు మ్రోగిస్తూ శ్రావ్యంగా పాడుతున్నాడు సుజ్ఞాన్. తక్కిన కంఠాలు నెమ్మదిగా అందుకొంటున్నాయి. సుమతి, మరో ఇద్దరు కూడా పాడారు.

అర్ధగంట తరువాత సుమతి కర్పూర హారతి వెలిగించింది.

ప్రసాదం పళ్ళెం మరొక యువతి అందుకొంది.

"ప్రొద్దు పోయింది. ఆ అమ్మాయిని ఇంటికి పంపించిరావా, సుజీ?" అంది సుమతి.

సుజ్ఞాన్ వెనుక మౌనంగా కదిలింది ప్రమీల. బంగళాదాటి వచ్చేశాక, "మీరేదో పిశాచవధ సంఘమన్నారు. సేవాసంఘ మన్నారు. అక్కడ భజన పరులు తప్ప మరేమిటీ కనిపించలేదే?" అంది ప్రమీల.

"మేమే ఆ సంఘం. ఎవరైనా పెళ్ళికావలసిన ఆడపిల్లలు మా సంఘంలో చేరితే వరకట్నం లేకుండా పెళ్ళిళ్ళు జరిపిస్తాము. కాని, సవర్ణ వివాహం జరి పిస్తామన్న హామీలేదు. మా సంఘం తరఫునుండి ఎక్కువగా వర్ణాంతర వివా హాలు ప్రోత్సహింపబడుతూ ఉంటాయి. వరకట్న రహిత వివాహాలు చేసుకో గోరే ఉత్సాహవంతులైన యువకుల్ని మా సంఘంలో సభ్యులుగా చేర్చు కొంటాం. రేపు శుక్రవారం మా సంఘం తరఫున ఒక ఆదర్శ వివాహం జరుగు

తుంది. వరుడు రెడ్డి. వధువు బ్రాహ్మణ యువతి. పెళ్ళి రిజిష్ట్రారాఫీసులో నిరాడంబరంగా జరిగిపోతుంది. సుమతి బంగళాలో తేనీటివిందు జరుగుతుంది. ఆ రోజు మీరు రాగలిగితే మేం చేసే సేవ ఏమిటో మీకు కళ్ళారా చూచే అవకాశం కలుగుతుంది!"

''ఏ టైమప్పుడు రమ్మంటారు?" ప్రమీల ఉత్సాహంగా అడిగింది.

"సాయంత్రం నాలుగుగంటలకు సుమతి బంగళాకు వచ్చేయండి''

"తప్పకుండా వస్తాను!"

"మీరు మామూలు ఆడపిల్ల ఏంకాదు! మీలో మంచి సాహస ముందన్న మాట!" అభినందనగా అన్నాడు సుజ్ఞాన్. ప్రమీలవాళ్ళ వీధి మలుపువరకూ వచ్చి సెలవుతీసుకొన్నాడు.

## 7

శుక్రవారం సుజ్ఞాన్ చెప్పిన టైముకు సుమతి ఇంట్లో హాజరైంది ప్రమీల.

ఎవరెవరో ఉన్నారుగాని సుజ్ఞాన్ మాత్రం కనిపించలేదు.

సుమతి సాదరంగా ఆహ్వానించి మేడమీదికి తీసుకుపోయింది. పెళ్ళికూతురు అలంకరణలో ఓ యువతి కూర్చొని ఉందక్కడ. "ఇక్కడ కూర్చో. నేను మళ్ళీ వస్తాను!'' అంటూ సుమతి హడావిడిగా వెళ్ళిపోయింది.

చాలా సేపు నిశ్శబ్దంగా కూర్చోవడం ఇష్టంలేకపోయింది ప్రమీలకు. "మీ పేరేమిటండీ?"

"అనూరాధ."

"మీ దీ ఊరేనా?"

"ఉహుఁ విజయవాడ."

ప్రమీల ఆశ్చర్యానికి మేరలేదు. "ఇక్కడికెలా వచ్చారు? మీ పెళ్ళి సంగతి మీవాళ్ళకు తెలీదా?"

కురవడానికి సిద్ధంగా ఉన్న ఆకాశంలా ఉంది అనురాధ ముఖం. "ఉహుఁ" అంది తలత్రిప్పి. ఆ తరువాత ప్రమీల వేసిన ప్రశ్నలకు అనూరాధ చెప్పిన కథ ఇది: అనూరాధది విజయవాడ. తలిదండ్రులు అక్కతమ్ముళ్ళు చాలా మందే ఉన్నారు. మధ్యతరగతి కుటుంబం. అనూరాధపెళ్ళి అమ్మా నాన్న గుండెలమీద కుంపటి అయిపోయింది. ఎన్నో సంబంధాల తరువాత ఓ సంబంధం పదివేల కట్నంతో కుదిరింది. ఆ పదివేల డబ్బు, పెళ్ళి ఖర్చులు సర్దాలంటే కూటిగింజలకాధారమైన ఒక్క పొలం అమ్మక తప్పదు.



అనూరాధ బి. ఎ. చదువుకొన్నది. ఆలోచించగల తెలివిపరురాలు. తన పెళ్ళి చేశాక తలిదండ్రుల పరిస్థితి ఊహించుకోడానికే భయంవేసేది; మీ ఇల్లు వల్లకాడులా మార్చేసే ఈ కళ్యాణం నా కక్కరలేదని చెప్పింది. తలిదండ్రులు ఒక చిరునవ్వు నవ్వి తమపని తాము చేసుకుపోతున్నారు. ఒక పచ్చని సంసారాన్ని వరకట్నపిశాచానికి బలిచేస్తున్న ఈ పెళ్ళిని ఎలా ప్రతిఘటించాలో పాలుపోలేదు అనూరాధకు. కలం స్నేహం ద్వారా పరిచయం అయిన సుమతికి రాసిందీ సంగతి.

నీలా చదువుకొన్న యువతులు ఈ దురాచారం ఎంతమాత్రం సాగనివ్వకూడదని, గొర్రెదాటులా నడిచిపోయే ఈ సమాజానికి మనం ఒక క్రొత్తపని చేసి దృష్టి ఇటు మరల్చజేయాలని, ఇటువంటి క్రొత్తదనాన్ని చూడగా చూడగా వాళ్ళే అలవాటు పడిపోతారని, వెంటనే బయల్దేరి తనదగ్గరికి వచ్చేయమని వ్రాసింది సుమతి. కొంత డబ్బు ఎమ్. ఓ. కూడా చేసింది.

అనూరాధ సాహసంతో రైలెక్కిందిగాని ఆ సాహసం చివరిదాకా నిలువలేదు. తలిదండ్రుల రక్షణ అనేది ఆడపిల్లకు కంచుకవచంలాంటిది. ఆ కవచంలో బిడ్డ జీవితానికి కాపుకాచే మమత, శుభాకాంక్ష అన్నీ ఉన్నాయి. ఆ కవచం విరిసిపారవేసి ఈ విశాల ప్రపంచంలోకి ఒంటరిగా అడుగుపెట్టింది. ఇక్కడ మంచివాళ్ళే కాదు, చెడ్డవాళ్ళూ ఉన్నారు. సుఖాలేకాదు, కష్టాలుకూడా ఉన్నాయి.

ఇవి జీవితమనే నదికి రెండు తీరాలు. నదిలోపడిన గడ్డిపోచలాంటి తను ఏ తీరానికి పోతుందో ఎవరు చెప్పగలరు?

సుమతి ఆదరంతో ఆ పిల్లను ఆహ్వానించింది. ఎన్నివిధాలుగానో ధైర్యం చెప్పింది. నవసమాజంలో మనం ఒక క్రొత్తరకానికి పునాదులువేయాలి. అందు కోసం ఈ మమతలనూ, వేదనలనూ కఠినంగా తొలగించక తప్పదు. మన దృష్టి ముందుకేగాని వెనక్కితిరిగి ఆలోచించకూడదు! ఇలా ఎన్నో చెప్పింది.

సుజ్ఞాన్‌కు స్నేహితుడు, సుజ్ఞాన్ ఆదర్శాలను నమ్మినవాడూ, ఆ కార్య క్రమాలలో పాల్గొంటున్నవాడూ అయిన శంకర్ అనే రెడ్డి యువకుడు అనూ రాధను ఇష్టపడ్డాడు. అనూరాధకూడా ఇష్టపడితే పెళ్లిచేసుకొంటానని చెప్పాడు. అనూరాధ ఇష్టపడిందని చెప్పక్కరలేదు.

తలిదండ్రుల శుభాకాంక్షలను త్రోసివేసి వచ్చిన సంగతి అనుక్షణం ఆ పిల్ల మనసును కలచివేస్తున్నది. ఈనాడు తనొకరి జీవితంలో వధువుగా అడు గిడుతూ వెళ్లిపోతున్న ఈ సమయంలో ఒలికే ఆత్మీయుల అమ్మా నాన్నల ఆనందబాష్పాలకు తను నోచుకోలేదు!

అనూరాధ ముఖంలో అలుముకొన్న విషాదమేఘాలు ప్రమీలకు కథ చెబుతూ వర్షించసాగాయి. సుమతి ప్రవేశించింది. వస్తూనే అనూరాధను ఒక్క కసురుకసిరింది. "ఛ! ఏం పిల్లవు? ఇలాంటి సమయంలోనా నువ్వు ఏడవడం? శంకర్ చూస్తే ఏమనుకొంటాడు?" అంది. "శంకర్ లాంటి యువకుడు భర్త కావడం ఒక వరం, అనూ! జీవితంలో నువ్వు ఏడిచేందుకు అవకాశం, పశ్చా త్తాపపడే అవసరం ఎప్పుడూ రాదు!"

"శంకర్‌తో వివాహం ఒక వరంగానే భావించుకొంటున్నానక్కా. కాని ఈ వరం అమ్మానాన్నల చేతిమీదుగా గ్రహించగలిగి ఉంటే నాకెంతో నిశ్చింతగా ఉండేది!"

"ప్రపంచంలో నలుగురు చేయనిపని మనం చేస్తున్నప్పుడు సహజంగా ఒక విధమైన భయం, చేస్తున్న పనిమీదే అపనమ్మకం ఏర్పడతాయి; కాని, ఎవరూ భవిష్యత్తు ముందుగా దర్శించి చేయరు పని! నీ తలిదండ్రులైనా ఏం జరుగు తుందో తెలుసుకొని వరాన్వేషణ చేయరు! వాళ్ల దృష్టికి నచ్చినవాణ్ణి తెస్తారేగాని నీ అదృష్టానికి వాళ్లు కర్తలు కాలేరు! మేమైనా అంతే ప్రమీలా! నీ తలిదండ్రులు చేసిన పెళ్లి ఎలా నిశ్చింత అవుతుంది? మేం చేసింది ఎలా కాదంటావు?"

"నా పిరికితనంతో మిమ్మల్ని బాధపెట్టుతున్నానక్కా! బలవంతంగా మీరేదీ

చేయడంలేదు. జరిగిందంతా నా ఇష్టప్రకారమేః మిమ్మల్ని అవమానించి నా అపరాధాన్ని పెంచుకోనుః ఇక నేను ఏడవను. బాధపడను. అమ్మా నాన్నల గురించికదా నా బాధః నేను వద్దన్న పెళ్లి వాళ్లెందుకు చేయబోయారు? నా మాటకు విలువ నివ్వనివారికి ఆశిక్ష కావలసిందేః" కళ్లు దించుకొంది అనూరాధ బింకంగా.

"వరకట్నం వరకట్నమని అంతా ఘోషపెట్టడమేగాని అందుకు ప్రతీకారంగా ఏంచేస్తున్నారుః బిడ్డ సుఖపడాలని తాహతుకు మించిన సంబంధం చూచి తలో, మొండెమో తాకట్టుపెట్టే తలిదండ్రు లున్నంతవరకు, ఆ తలిదండ్రుల మాటమీదే ఆధారపడి వ్యక్తిత్వం మరిచిపోయే ఆడపిల్లలున్నంతవరకు ఈ బాధనుండి మనకు విముక్తిలేదు. వైవాహిక జీవితంమీది వ్యామోహంతో తలిదండ్రులు ఏ గోతిలోపడినా సంబంధం లేనట్లు వేల కట్నంతో సంతోషంగా ఇల్లుదాటే ఆడపిల్లలున్నంతవరకూ వరకట్నం తీసుకొనే పెళ్లికొడుకులూ ఉంటారు. మొదటి తప్పు ఈ ఆడపిల్లలదిః ఈ మొదటి తప్పుమీదే రెండవవారి తప్పు ఆధారపడుతుందిః"

"వరకట్నం ఇవ్వకపోతే ఎవరూ పెళ్లి చేసుకోరుకదండీః ఆడపిల్ల పెళ్లికాకుండా ఎన్నాళ్ళు ఇంట్లో ఉండిపోతుందిః వివాహితకున్న గౌరవం, భద్రత అవివాహితకు మన సంఘంలో ఎంతవరకున్నాయిః" ఇంతసేపటికి ధైర్యంచేసి అంది ప్రమీల.

"అదేకదా మన సమాజంలోని విచిత్రంః కాస్త వయసు మించిన అవివాహితను వృద్ధకన్య అని పరిహసించే ఈ సమాజంలోని మనుషులే, ఆడపిల్లవాళ్ళ కొంప కూల్చందే దాని మెళ్లో తాళికట్టరుకదాః ఇలాగే ఎందుకు జరగాలిః తండ్రి సంతానంలో మగపిల్లవాడు ఒక వయసు వచ్చాక ఇంటినుండి వెళ్ళక్కరలేదు గాని ఆడపిల్ల ఎందుకు వెళ్లిపోవాలిః అలా వెళ్లిపోకపోతే గుండెలమీద కుంపటిలా ఎందుకు వ్యధపడాలి ఆ తల్లిదండ్రులుః కన్న సంతానాన్ని సమంగా ప్రేమించినట్టే సమానంగా ఎందుకు పెంచడంలేదు? ఏ కారణంచేతైనా ఆడపిల్ల పెళ్లిచేసుకోనంటే నిరసించేపని ముందుగా తలిదండ్రులే ఎందుకు చేపడతారుః మగవాడి బ్రహ్మచర్యం గర్వకారణమూ, ఆడదాని బ్రహ్మచర్యం చులకన ఎందుకౌతున్నాయిః

"ఆడపిల్ల ఏకారణంచేతైనా వివాహం మానుకొంటే నిరసించడం అన్యాయం. అసలు తలిదండ్రులు మగపిల్లవాడు ఒక వయసు వచ్చాక ప్రపంచంలోకి వెళ్లి

పోయేలా ఎలా పెంచుతున్నారో ఆడపిల్లలనుకూడా అలాగే పెంచాలి! ఇక్కడ శీలం సమస్య అవుతుందని నలుగురూ అంటారా? ఆ శీలం రక్షించుకొనే విధంగానే తలిదండ్రులు ధైర్యసాహసాలతో పెంచాలి ఆడపిల్లను. మన సమాజంలో ప్రతి తల్లీ, తండ్రీ ఆడపిల్ల పెళ్ళిమీద తప్ప మరోవిధంగా ఆలోచించక పోవడం చాలా శోచనీయమైన సంగతి! ఆడవాళ్ళకి, మగవాళ్లకి సమాన అవకాశాలు వచ్చాయి. వచ్చాక కూడా ఆడపిల్లకు పెళ్లి ఒక్కటే పరమావధి అనుకొనే మూర్ఖం ఏమనాలి?"

ప్రమీల కొంచెం సిగ్గుపడుతూ అంది: "ప్రకృతి అనేది ఒకటుంది. ఒక వయసు వచ్చాక దాని ప్రభావం చూపుతూ ఉంటుంది. ప్రతి ఆడదాని మనసూ మగవాడి నీడలో ఒదిగిపోవాలనీ, అతడి ప్రేమలో కరిగిపోవాలనీ కోరుకొంటుంది. ఆ కోరిక తీరాలంటే పెళ్లి తప్ప మరో సురక్షితమైన మార్గం లేదు ఆడపిల్లకు! ఆ పెళ్లి కావాలంటే కట్నం పోయడంతప్ప మార్గంలేదు!"

"ఈ ప్రకృతి ఆకర్షణ, ప్రకృతి అవసరాలు మగవాడికీ ఉన్నాయి, చెల్లీ! అతడెందుకో నీకు కట్నంపోసి కొనడంలేదు?"

"వెనుకటికి అదే పద్ధతి ఉన్నదట. ఇప్పుడుకూడా కొన్ని జాతుల్లో అదే పద్ధతి ఉన్నది."

"ఇచ్చుకొనేది అయినా, పుచ్చుకొనేది అయినా ఈ పద్ధతి అనాగరికమైనది. పరస్పరం ప్రేమతో పెనవేసుకుపోవలసిన సంబంధం కట్నంతోనా కలిసేది? ప్రతి తండ్రీ కట్నంపోసి అల్లుణ్ణి కొననని, తన బిడ్డకు పెళ్లికాకపోయినా ఫరవా లేదని అనుకోనీ, అదే పట్టుదలమీద ఉండనీ—ఈ వరకట్న పిశాచం భుజా లెక్కి కూర్చున్న వరుళ్ళు చచ్చినట్టుగా దిగరూ? కాని, అలా జరుగడంలేదు మన సమాజంలో. ఒక తండ్రి అల్లుణ్ని కొనలేకపోతే, మరో తండ్రి రెండువేలు ఎక్కువిచ్చి అతడినే అల్లుణ్ణి చేసుకోవడంవల్లే వరకట్నమనే ఈ రాక్షసిని ఒక్క అడుగు కూడా కదల్చలేక పోతున్నాం. అసలు దాని ఒంటిమీద ఒక్క గాయం కూడా చేయలేకపోతున్నాం. ఉత్త హాహాకారాలు తప్ప!"

"మీరు ఈ వరకట్నం కారణంగానేనా పెళ్ళి చేసుకోనిది?"

సుమతి ఒక్క క్షణం మౌనంగా ఊరుకొని "కాదు," అని లేచి వెళ్లి పోయింది.

శ్రోత లిద్దరి ముఖాలూ సస్పెన్స్‌తో నిండిపోయాయి.

పావుగంట తరువాత అనూరాధతో క్రిందికి దిగింది ప్రమీల.

వధూవరులను ఓ ప్రక్క కుర్చీలలో ఆశీనులనుచేసి స్నేహితులు కానుకలు ఇవ్వసాగారు. వాటిలో చాలావరకు క్రొత్త సంసారానికి వలసిన వస్తువులు న్నాయి. సాయంత్రం శంకర్ తీసుకోన్న ఇంటికి వెళ్లిపోతున్నది అనూరాధ. శంకర్ తలిదండ్రులకు ఈ పెళ్లి ఇష్టంలేదు. అంచేత క్రొత్తకోడలికి వాళ్లింట్లో ప్రవేశించే అవకాశంలేదు!

తరువాత అందరికీ స్వీట్స్, కారా పంచబడింది. కాస్సేపటికి టీ కూడా వచ్చింది.

"సుజ్ఞానేశ్వర్! నువ్వూ ఓ ఇంటివాడివైతే ఈ పాపిష్టి కళ్ళతో చూచిపో తాను, నాయనా!" పొరుగువాడైన రామారావు అనే వృద్ధుడు అన్నాడు. ఆయన భజనకు హాజరౌతుంటాడు. ఈ సంఘ ఆశయాలను ప్రోత్సహించే సహృద యుడు. "నీ ద్వారా ఒక ఆడపిల్ల ఉద్ధరింపబడితే అంతకంటే కావలసిందేముంది, బాబూ? ఇంత చిన్న వయసులో నీ చేతులమీదుగా ఎన్నో పెళ్లిళ్ల చేశావు! ఎందరినో ఉద్ధరించడానికి నడుంకట్టావు! నువ్విష్టపడితే నీ పెళ్లి నేను చేస్తాను. నా ఎరికలో ఒక పిల్ల ఉంది. చాలా పేదసంసారం. కాని, ఉత్తమురాలు. ఆ పిల్ల సాహచర్యం చంద్రుడికి వెన్నెలలాగ శోభిస్తుంది నీకు!"

"అందరూ పల్లకీలెక్కితే మోసేదెవరు, తాతయ్యా? మా జీవితం మోయడా నికే వినియోగపడనీ!" చిరుమందహాసంతో అన్నాడు సుజ్ఞాన్". ఇప్పుడు నేను ప్రజల మనిషిని. పెళ్ళవుతే భార్యమనిషిని అవుతాను! ప్రజలకు నేను దూరమై పోతాను! నేను ప్రజలకు దూరం కావడం అన్నా, ప్రపంచంనుండి సెలవు పుచ్చుకోవడమన్నా ఒక్కటే నాకు!"

"నువ్వు చాలా తప్పు అభిప్రాయంలో ఉన్నావు, బాబూ! గాంధీజీ ప్రజల మనిషికాదా?, నెహ్రూ కాదా? వాళ్ళకు భార్యాబిడ్డలులేరా? ఉదాహరణకు కావలసి వస్తే చాలామందే ఉన్నారు నాడూ నేడూ కూడా. భార్యా బిడ్డలున్నవాళ్ల ప్రజల మనుషులుగా మిగలకపోవడమనేది అనాలోచితమైన మాట!"

ఈ వాద ప్రతివాదాలు ఎంతవరకు సాగేవో గాని ఓ ఎర్రటి ఐక్కపలుచటి యువకుడు కంగారుగా ప్రవేశించాడు. "సుజీ! శంకర్ మమ్మీ, డాడీ వచ్చేశారు కారులో!"

సూదిపడితే శబ్దం వినిపించేంత నిశ్శబ్దమైపోయింది హాలు. అనూరాధ భయంతో బిగుసుకుపోయినట్టుగా అయింది. మూడురోజుల క్రితం 'నువ్వు నా కొడుకువి కాదు పొమ్మని అనిపించుకొని ఇంటినుండి బయటపడిన శంకర్

ముఖంలోకి కూడా ఒక నల్లటితెర వాలింది. ఏళ్లైవేల కట్నం వచ్చే సంబంధం వదులుకొని పారిపోయివచ్చిన పిల్లను కోడలిగా చేసుకోడానికి వాళ్ళు ససేమిరా అంగీకరించలేదు!

శంకర్ తల్లి పట్టుచీరలో, ఖరీదైన ఆభరణాలలో లక్ష్మీనిలయంలా ఉంది. ఆయనకూడా ఖరీదైన దుస్తుల్లో వేళ్ళకి ధగధగలాడే ఉంగరాలతో వెండిపొన్ను చేతికర్రతో మహారాజ ఠీవితో వెలిగిపోతున్నాడు.

ఆవిడ అనూరాధ భుజంమీద చేయివేసి, "పదమ్మా మనింటికి!" అంది. ఆవిడ కళ్లెందుకో సజలాలుగా మారాయి.

రెడ్డిగారు సుజ్ఞాన్ ముఖంలోనికి సూటిగా చూస్తూ, "మీరు చేస్తున్నది సంఘ సేవ, సమాజకల్యాణమూ కాదు, బాబూ! కన్నవాళ్ళ గుండెల్లో రేపుతున్నారు చిచ్చు! కన్నబిడ్డలమీద మేం ఎన్ని ఆశలు పెట్టుకొంటామో ఆ ఆశలేవీ తీర కుండా రెక్కలొచ్చిన పక్షుల్లా వాళ్ళ ఇష్టమొచ్చినచోటికి ఎగిరిపోతే కన్న వాళ్ళ బాధ ఎలాంటిదో—మీకిప్పుడు తెలియదు. ఇలా నాలుగు పెళ్ళిళ్లు చేయగానే సంఘంలో మీరాసించిన మార్పు రాదు. అసలు మీ సేవకు మీ త్యాగానికి మీరు ఊహించిన ఫలితమే మీకందబోదు. ఎప్పుడో మీ పనులే మీకు వికటిస్తాయి. జన్మలో మరిచిపోలేని గుణపాఠం చెబుతాయి!" అనేసి చివ్వున తల త్రిప్పుకొని గబగబా అంగలువేస్తూ వెళ్ళిపోయాడు.

"పదరా, బాబూ!" శంకర్ తల్లి కొడుకునుద్దేశించి అంటూ కోడలు చెయ్యి పట్టి లేపింది.

రెండు నిమిషాల తరువాత వధూవరులతో కారు వెళ్ళిపోయింది.

ఆ మౌన నిశ్శబ్దవాతావరణంలో శాపాల్లా రెడ్డిగారి మాటలే ప్రతిధ్వనిస్తూంటే అందరి ముఖాలూ కళతప్పిపోయాయి. ఇటువంటి నిష్ఠుర, నిరసనవాక్యాలు తరచూ ఈ సంఘసేవకులకు వినిపించేవే అయినా ఈ రోజు మరీ హృదయంలో నాటుకుపోయి బాధపెట్టాయి!

అప్పటికి చీకటిపడి వీధుల్లో దీపాలు వెలిగాయి!

ఇంటిదాకా పంపించి వస్తానంటూ ప్రమీలతో బయల్దేరాడు సుజ్ఞాన్.

"ఎంతో అమూల్యమైన జీవితాన్నిపణం పెట్టి సేవచేస్తున్నారు మీరు! అందుకు తగిన విలువలో ఫలితం ఉండదనిపిస్తూంది, సుజ్ఞాన్ బాబూ! శంకర్ తండ్రిగా రన్నట్టుగా ఇలా నాలుగు పెళ్ళిళ్ళు చేసినంత మాత్రాన సంఘంలో మీ రాసించిన మార్పు వస్తుందా? నలుగురు దీనులను ప్రోగుచేసి విద్యాదానం చేసినంత మాత్రాన




ప్రపంచంలో దీనదరిద్ర నారాయణులను ఉద్ధరించినట్టవుతుందా? ఎందుకీ అనవసర త్యాగం? సంఘంలోని పెద్దమనుషులెవరూ మీ కార్యక్రమాలను ప్రోత్సహిస్తారనుకోను!" అంది ప్రమీల.

"కొన్ని వర్షబిందువులచేతే నేలమీద అపారమైన జలరాసి ఏర్పడుతూందని మరిచిపోకూడదు, ప్రమీలా!" సుజ్ఞాన్ పెదవులమీద చిరునవ్వు మెరిసింది. ఈ మారుమూల మేం చేసే సేవకూడా ఈ వర్షబిందువుల లాటిదే. ఒక దీపం వెయ్యిదీపాలను వెలిగిస్తుంది. మా సేవను, మా ఉద్దేశాలనూ మరో వెయ్యిమంది అందిపుచ్చుకొంటే జరుగని పనేముంది చెప్పండి! ఇక మా సంఘం చేసేసేవ అల్పమైనదిగా కనిపిస్తూందా మీకు? రెండు ఆకులతో పుట్టిన మొక్క శాఖోపశాఖలుగా పెరిగి వృక్షరూపం దాల్చడంలేదా?

"కలకత్తాలో మదర్ థెరెసా సంగతి విన్నారా? ఆమె విదేశస్తురాలు. కలకత్తాలో కాళీఘాట్ సమీపంలో చిన్న షెడ్‌లో ఆవిడ ఆశ్రమం ప్రారంభమౌతుంది. ఆమె ఆశ్రమఉద్దేశ్యం ఏమిటో తెలుసా? వీధుల్లో పడిన అవసాన దశలోని అనాథలను ఆశ్రమానికిచేర్చి ప్రశాంతంగా కన్నుమూయడానికి వసతులు కల్పించడమే. ఇప్పుడు దేశంలో ఆ ఆశ్రమానికి ఎన్నో శాఖలు వెలిశాయి. ఎన్నో విరాళాలు. ప్రైమ్‌మినిస్టరునుండి ప్రశంసలూ కురుస్తున్నాయి. ఇప్పుడు కూడా వాళ్ళు చేసేసేవ అదే. చాలామందికి ఇది వినడానికి హాస్యాస్పదంగా ఉంటుంది. బ్రతుకుతున్నవాళ్ళను వదిలిపెట్టి చనిపోయేవాళ్ళకు సేవ ఏమిటని!...కాని, మాతృగర్భంనుండి రోదనంతో బయటపడే మనిషి జీవితం రోదనతోటే పరిసమాప్తి కాకూడదు! ఒక మనిషి దిక్కులేకుండా, ఆత్మశాంతి లేకుండా చనిపోవడం చాలా విషాదకరమైన సంగతి! అందుకే ఆ ఆశ్రమ ఉద్దేశ్యం చాలా ప్రశంసనీయమైనది!

"ఇలా మేం ఒక సంఘమనేది స్థాపించి నాలుగుపెళ్ళిళ్ళుచేస్తే సమాజంలో మార్పు వస్తుందోరాదో ఇప్పుడు మీరేఆలోచించండి! ప్రతిఇంటా ఈవరకట్నమనేది

ఎంత కఠినసమస్య అయి కూర్చుందో, కుటుంబాన్ని ఎంత అశాంతి పాలు చేస్తున్నదో చూస్తున్నారు కదా? అలాంటప్పుడు మా సంఘ ఉద్దేశ్యాలను ఎవరు హర్షించరు?"

"మీరు కష్టమనుకోకపోతే జరిగేవాస్తవమేమిటో చెప్పనా, సుజ్ఞాన్ బాబూ? రెండు పువ్వులదండలతో శంకర్ అనూరాధ పెళ్ళి అయిపోయింది. కానీడబ్బులు కూడా వాళ్ళ కన్నవాళ్ళకు ఖర్చుకాలేదు. కానీ, అనుకొన్న సంబంధం కాలేదని శంకర్ తండ్రి బాధపడుతున్నాడు. అనూరాధ తలిదండ్రులుకూడా కన్న కూతురికి చేతులారా పెళ్ళిచేసి అత్తింటికి పంపలేదన్న లోటు ఉండనే ఉంటుంది? కట్నం డబ్బులు మిగిలినా, పెళ్ళిఖర్చులు మిగిలినా కూతురి విషయంలో కర్తవ్యం పాలించలేదన్న అసంతృప్తి తప్పదు! ఇప్పుడు చెప్పండి, ఈ పెళ్ళివల్ల మీరు సాధించింది ఏమిటి?"

"ఒక పెళ్ళి వరకట్నరాక్షసి నోటపడకుండా చేశామన్న తృప్తి చాలదా?"

"కాని, మీరు ఎన్ని నింధలు పడవలసి వస్తుందో తెలుసా?"

"ఫర్వాలేదు. నవసమాజ నిర్మాణంలో ఈ కష్టాలు తప్పవు!"

ఒక నిట్టూర్పు అణచుకొంది ప్రమీల.

## 8

రోజూ అయిదింటికల్లా గుడికన్న సాకుతో ఇంటినుండి బయటపడుతున్నది ప్రమీల. సుమతి బంగళాలో రాత్రి ఏడూ, ఎనిమిది గంటలదాకా ఉండిపోయేది.

ఇటీవల సుమతిదగ్గర బాగా చనువు ఏర్పడింది ప్రమీలకు. సుమతిదగ్గర చాలా పుస్తకాలు ఉన్నాయి. నవలలూ, వ్యాసాలూ ఎన్నో, మనిషి మనసు వికసింపజేసుకోడానికి కావలసినన్ని ఉన్నాయి. ప్రమీల కొన్ని అక్కడే చదివేది. కొన్ని ఇంటికి తెచ్చుకొనేది. చదువుతున్నకొద్దీ ప్రమీల జిజ్ఞాసా, మనసూ పెరిగిపోతున్నాయి.

సుమతి సోషల్ వెల్‌ఫేర్ ఆఫీసరుగా పనిచేస్తున్నది. ఎన్నో విషయాల్లో ఆమెకున్న ఖచ్చితమైన అభిప్రాయాలు, మనోధృతి ప్రమీలను ముగ్ధనుగా వించాయి. కొన్ని విషయాలలో మనిషి ఆత్మనిగ్రహం నిగ్గుదేరుతుంది!

"పరీక్ష కడతావా?" అందోరోజు సుమతి.

"ఈ చదువుకంటే పరీక్షకు చదివే చదువు గొప్పకాదులే, సుమతక్కా! పరీక్షలకని శ్రమపడడం ఇష్టంలేదు" అంది ప్రమీల.

"ఈ చదువు ఉద్యోగార్హత నిచ్చేది కాదుగా?"

"ఉద్యోగం దేనికి నాకు? మా అన్న బ్రతికి ఉన్నంతవరకు నా కింత అన్నంపెడతాడు. పెట్టనినాడు నువ్వున్నావు! నీకు వంటమనిషిగా కుదురుతాను. బ్రాహ్మలకి వంట చేయడం తప్పుకాదుగా?'' అంది నవ్వి.

ఆప్యాయంగా ప్రమీల భుజం తట్టింది సుమతి. "అయితే జీవితంలో ఇదివరకున్న అసంతృప్తి తొలగిపోయినట్టేనా?" అంది నవ్వి.

''ఆ! పెళ్ళి ప్రేమే జీవితంలో ముఖ్యంకాదని తెలుసుకొన్నప్పుడే నా అసంతృప్తి చెప్పకుండా పారిపోయింది. ఈ రోజు ఆనాటి సంగతులు-హరికృష్ణ నేను పొందలేననుకొన్నప్పుడు నాకు కలిగిన ఆలోచనలు, జీవితమే వృధా అనుకోవడం— అన్నీ గుర్తువస్తే హాస్యాస్పదంగా, దుఃఖంగా ఉంటుంది నాకు! అర్ధాంతరంగా రాలిపోయే చుక్కలా జీవితం ముగించడంకంటే నాతో పనున్న అనాథలు ఎంతోమంది ఉన్నారు ప్రపంచంలో. వాళ్ళకి అంకితం చేస్తాను ఈ జీవితం! ఆ అవకాశం మాత్రం మీరు నా కివ్వాలని కోరుతున్నా నక్కా!

"నేను మీలాగా చదువుకోలేదు. మీలాగా మాట్లాడలేను! నాది చిన్న ప్రాణం! చంద్రుడి ప్రక్క చుక్కలా మినుకు మినుకుమంటూ ఉంటాను మీ ప్రక్కన.

మరోసారి ప్రమీల తల నిమిరింది. "ఇదంతా హరికృష్ణను పోగొట్టుకొన్న వైరాగ్యమే?"

"ఊహుఁ. మీ స్నేహప్రభావం!"

''నిజంగా నువ్వు చుక్కలాంటి చిన్నదానివే. చుక్కలు చిన్నవి అయితేనేం? అమావాస్యనాటి రాత్రి అంబరసీమను దీప్తివంతం చేసేవి ఇవే. ఆ రాత్రి ఆకాశంలో ఎంత అందమైన వెలుగు అల్లుకుపోతుంది? భాషకందుతుందా ఆ అందం, ఆ ప్రకాశం?"

* * *

కొన్ని రోజులుగా కోడలిమీద రుసరుసలాడుతున్నది మంగమ్మ. సాయంత్రం అవడం ఆలస్యం, గడపదాటుతుంది ప్రమీల. రాత్రి ఏడెనిమిది అయితేగాని ఇంటికి రాదు! ఎక్కడున్నావే ఇంతసేపు అని అడిగితే గుడిదగ్గిర ఒక స్నేహితురాలింట్లో అని చెబుతుంది! స్నేహితురాలు ఉంటే ఉండవచ్చు. ఇలా రోజూ హాజరువేయించుకురావాలా? వయసువచ్చిన ఆడపిల్లవు. కట్టుతెంపుకున్న ఎద్దులా ఈ తిరగడమేమిటి అసహ్యంగా? ఇంట్లో ఉంటేనే నిందలు తప్పవు ఖర్మ చాలకపోతే.

మేనత్తగా తన కర్తవ్యం నిర్వహించడానికి నడుం కట్టింది మంగమ్మ. తమ్ముడి చెవిలో ఇల్లుగట్టుకు పోరసాగింది, ఆ మూడు ముళ్ళువేసి పంపితే తండ్రిగా నీ బాధ్యత తీరిపోతుందని.

ఫలితంగా కోదండరామస్వామి ఆలయం పూజారి అప్పలాచారి భార్యా కొడుకు సమేతమై ఓ మధ్యాహ్నం పెళ్ళి చూపులకు వేంచేశారు. పెళ్ళికొడుకు ఎక్కువగా చదువుకోలేదు. కాస్త మంత్రం తెలుసు. కోదండరామాలయంలో ఓ పది ఇరవై మంది పిల్లలను ప్రోగుచేసి వీధిబడి నడుపుతున్నాడు. వయసు పాతిక. మన్మధునికి వారసుడు కాకపోయినా మరీ అంత అనాకారికాదు. మంగమ్మ భాషలో చెప్పాలంటే చూపులకు బాగానే ఉంటాడు.

వాళ్ళు వచ్చేవరకు ప్రమీలకు ఈ సంగతే తెలియదు. వాళ్ల ఇంటినుండి బయల్దేరేదాకా ఎలాగో శాంతాన్ని చిక్కబట్టుకొంది. మేనత్త గౌరవం, తండ్రి గౌరవం నిలబెట్టింది.

"నాకు సంబంధం చూసేముందు నాతో చెప్పక్కరలేదా, నాన్నా?" అంది దుఃఖాన్ని అణిచిపెడుతున్న స్వరంతో.

"నా బాధ్యత నేను నెరవేర్చుకోడానికి నీతో ముందు చెప్పాలా, అమ్మా?" ఆయన తెల్లబోయి అడిగాడు. ఆయన మితభాషి. ఇంట్లో ఒకటి రెండు మాటలు తప్ప ఎక్కువగా మాట్లాడడు. కూతురి స్వభావమెలాంటిదో తెలుసుకొనే అవకాశ మెప్పుడూ ఆయనకు కలుగలేదు.

"బాగుంది, నాన్నా! నేనేం పసిబిడ్డనా? లేక గొడ్డునా, ఎద్దునా? మరీ అంత నా అభిప్రాయం తెలుసుకోనక్కర లేకుండానే మీ పని ఎలా చేసుకుపోవాలను కొన్నారు?"

"ఇంతకూ నీ ఘోష ఏమిటే, తల్లీ? పిల్లవాడు బాగాలేడనా? ఉద్యోగస్తుడూ టిప్‌టాప్ మనిషీ కాదనా? చామరంగు, కను ముక్కు బాగానే ఉంది. ఉద్యోగం చేయడంలేదు నిజమే. కాని వాడి నోట్లో మంత్రముంది. విద్యవుంది. చేరెడు నూకలు పుట్టించి నిన్ను పోషించకపోడు. అయినా ఆడదాని కాలు మంచిదైతే అతడు అష్టైశ్వర్యవంతుడే అవుతాడు!" అంది మంగమ్మ.

"నేనిదంతా వినదలుచుకో లేదత్తా! నే నసలు పెళ్లిచేసుకోదలచలేదు. అంతే నేను చెప్పదలుచుకొన్నది." ఇక చెప్పేదేమీ లేనట్టుగా బిగుసుకుపోయి కూర్చొంది.

ఇక శ్రోతల ముఖాలలో పరిగెత్తిన భావాలు వర్ణన కతీతమైనవి!

మరి కొద్దిరోజులు గడిచిపోయాయి!

యోగానంద్‌కు మంచి ఉద్యోగం అయింది. తహశీల్‌దారుగారి పిల్లల కతడు అయిదు సంవత్సరాలనుండి ట్యూటరుగా ఉంటున్నాడు. యోగానంద్ అంటే తహశీల్‌దారుగారి కెంతో అభిమానం. ఆ అభిమానంచేతే యోగానంద్‌కు అదృష్టవంతు డనిపించుకొనే ఉద్యోగం దొరికింది.

ఓ రోజు మంగమ్మ అంది: "బాబూ! మా పెద్దవాళ్ళకు రోజులు దగ్గరకు వచ్చేస్తున్నాయి. మీ అన్నా చెల్లెలు ఓ ఇంటివాళ్ళయితే చూసిపోతాం! నీ చెల్లెలికి మీ అయ్య చూసిన సంబంధం నచ్చలేదట. ఆ పిల్ల మనసులో ఉద్యోగం చేసుకొనేవాడు కావాలని ఉన్నట్టుంది. ఓ మూడు నాలుగువేలు ముడుపు కట్టుకోకపోతే చిన్నపాటి ఉద్యోగస్థుడైనా ఎలా దొరుకుతాడు? ఎలాగో నువ్వే ఈ సమస్య గట్టెక్కించాలి!"

"నేను చేయగలిగిందేమిటత్తా?"

"శాలిబండవాళ్లు నీకు అయిదువేలు ఇస్తామంటున్నారుగా! నువ్వొప్పుకొంటే..."

అప్పటికేదీ చెప్పకుండా మౌనంవహించిన యోగానంద్ వారంరోజుల తరువాత ఒక శుభవార్త వినిపించాడు. తహశీల్‌దారిగారి కూతురితో అతడికి వివాహం నిశ్చయమైంది.

"ఏమిస్తున్నారేమిటి?" అంది మేనత్త.

"ఏమీ ఇవ్వడంలేదు. రెండు ఖర్చులతో వాళ్ళు పెళ్లి జరిపిస్తారు."

"అయితే నీ చెల్లెలి చింతేమీ నీకక్కర లేదన్నమాట!"

యోగానంద్ మాట్లాడలేదు.

ఆ తరువాత తెలిసిన వివరాలబట్టి యోగానంద్ ఆశ బొత్తిగా వదులుకొంది మంగమ్మ. అత్తగారు బాగా ఉన్నవాళ్ళు. కూతురు కాపురానికి వచ్చే సూచనలేవీ లేవు. బహుశః యోగానంద్ మకాం అత్తవారింట్లోనే స్థిరపడవచ్చు!

ఈ సంగతులన్నీ చెల్లెలు చెప్పగా విని "భగవదేచ్ఛ!" అని ఒక నిట్టూర్పు విడిచి ఊరుకొన్నాడు యోగానంద్ తండ్రి.

తనకి ఓ వదిన వస్తూంది! కాని, వస్తూ కాస్త కళ్ళముందు కనిపించే అన్నయ్యను కూడా తీసుకుపోతుంది కాబట్టి ప్రమీలకు కూడా సంతోషం కలిగించలేదీ వార!

ఎవరి భావాలకు, ఉద్దేశ్యాలకు నిమిత్తం లేకుండా యోగానంద్ పెళ్లి జరిగి పోయింది.

పెళ్లిలో యోగానంద్ ఇంటివాళ్ళకు ఎలాంటి అమర్యాదా జరగలేదు. గౌరవం ఇచ్చి గౌరవం పుచ్చుకొనే మనుషులుగా కనిపించారు. యోగానంద్ భార్య గీత గర్వంలేని యువతి. ప్రమీల అక్కడ ఉన్న మూడురోజుల్లోనే మంచి స్నేహం ఏర్పరుచుకొంది గీత. 'వదిన మంచిది' అని ఎన్నిసార్లు అనుకొందో ప్రమీల.

మంగమ్మ అంచనాకు విరుద్ధంగా పెళ్ళయి వారం తిరగకుండానే యోగానంద్ ఆఫీసుకు సమీపంగా ఓ చక్కని డాబా ఇల్లు అద్దెకు తీసుకొని భార్యతో కాపురం పెట్టాడు. పెట్టడమేకాదు, తండ్రివాళ్ళను వచ్చి తనదగ్గరే ఉండి పొమ్మని ఆహ్వానించాడు.

కాని, యోగానంద్ తండ్రి ఇలా కొన్నాళ్ళు జరిగిపోనీ అన్నాడు. ఆయనకు గుడికి తిరగడం కుదరదు, ఈ కొత్త ఇంటికి వస్తే. ఇప్పుడున్న ఇంటికి తాము అద్దె ఇచ్చుకోవడంలేదు. గుడిపూజ ఉన్నంతవరకు ఈ ఇంటిఅద్దె చెల్లించనక్కరలేదు. ఎలాగో రోజులు గడిచిపోతున్నప్పుడు పెళ్లి కొడుకు నెత్తిన కూర్చోవడం దేనికి? అనుకొన్నాడు.

## 9

హరికృష్ణకు కూడా పెళ్లి అయింది. పెళ్ళయిన నెలరోజుల తరువాత అత్తగారిచ్చిన స్కూటర్‌మీద ప్రమీలను చూడడానికి వచ్చాడు, యోగానంద్‌కోసం వచ్చానన్న సాకుతో.

"అన్నయ్య ఇక్కడెందుకుంటాడు? వారం పదిరోజులకోసారి వచ్చి చూసి పోతాడంతే!'' అంది ప్రమీల.

''అయితే చుట్టమైపోయాడన్నమాట!"

"అతడిని అనడానికి మాకేం హక్కులేదు. జన్మ మా నాన్న ఇచ్చాడు. జీవితాన్ని అతడు నిర్మించుకొన్నాడు. ఆ జీవితంమీద మాకు ఎలాంటి హక్కూ లేదు!"

"రక్తానికైనా విలువ నివ్వక్కరలేదా?"

"డాక్టరువి! నీకామాత్రం శరీరశాస్త్రం తెలియదా? పుట్టినప్పటి రక్తమే ఇంకా అతడి శరీరంలో ప్రవహిస్తూందా?" పకపక నవ్వింది ప్రమీల.

"మీ ఇంట్లో ముగ్గురూ మూడు విచిత్ర ప్రకృతులుగల మనుషులు! మీ నాన్న



ఇహలోకంమీద ధ్యాసతో జీవిస్తున్నాడనుకోను. కర్మ శేషమేదో గుర్తువచ్చి అది తీర్చుకుపోడానికి రోజులు లెఖ్ఖపెడుతున్నాడా అనిపిస్తుంది. మీ అన్నయ్య? ఉత్త స్వార్థపరుడు. కన్నతండ్రి అయినాసరే, ఇచ్చినవాడికే తిరిగి ఇవ్వొచ్చు ననే మనస్తత్వం వాడిది? ఇక నిన్ను తలుచుకొన్నప్పుడల్లా నాకు కలిగే జాలి అంతుండదు, ప్రమీలా! నీ కనీసకోరికలైనా ఎవరు తీరుస్తారు?"

"కనీసకోరికలా? అవి ఏమిటి, హరీ?" అతడి జాలి అంతులేని జుగుప్సను కలిగించింది ప్రమీలకు. ఇతడుమాత్రం కాదూ స్వార్థపరుడు? ప్రేమించినదాన్ని కర్తవ్యమనే సాకుతో నిర్దయగా దూరంగా నెట్టివేయలేదూ? ఒకరిని నిందించే హక్కు ఇతడికిమాత్రం ఎక్కడిది?

"పెళ్ళి! ఈ వయసుకు కావలసిన తోడు!"

"నిన్ను ప్రేమించినరోజు, నువ్వు కాదన్నరోజు ఇవే నా మనసున నిండి పోయాయి, హరీ! నువ్వు కాదన్నరోజు జీవితమే సుదీర్ఘకాళరాత్రిలా కనిపిం చింది. ఆత్మహత్యచేసుకోబోయాను. ఓ పుణ్యాత్ముడు అడ్డుపకడకపోతే ఇప్పుడు నీ కంటిఎదుట ఈ ప్రమీల అనే మనిషి ఉండేదికాదు.

"కాళరాత్రిలాంటి జీవితంలోకి ఎక్కడిదో ఒక అపూర్వజ్యోతి వెలుగు ప్రాకి వచ్చేసింది. ఈ వెలుగులో ఈ ప్రేమ, విరహం ఎక్కడ మటుమాయ మయ్యాయో తెలియదు. వాటికి బదులుగా ఈ సమాజం, దుఃఖ వీచికలలో కొట్టుకుపోతూ ఎవరిచేతి ఆసరాకోసమో గాలిలో తడుముకొనే దీనులూ కనిపిస్తు

న్నారు. ఈ ఇంటినీ, ఈ కట్టుబాట్లనూ త్రెంచుకొని మాకోసం వచ్చెయ్యి అని చెబుతున్నట్టుగా అనిపిస్తూంది!

"నా మనసు ఇప్పుడు కోరుతున్నది మగతోడుకోసం కాదు, హరీ! జీవితంలో ఏ పని అయినా నిర్భయంగా చేయగలిగిన స్వతంత్రంకోసం. అందుకు తగిన ఆత్మబలంకోసం!''

''ప్రమీలా, నువ్వు చెప్పేదంతా నిజమేనా?" హరికృష్ణ శరీరం స్వేదంతో తడిసిపోయింది. భయవిహ్వల స్వరంతో ప్రశ్నించాడు: "నువ్వు ఆత్మహత్యకు ఒడిగట్టావా?"

"నేను అబద్ధం చెప్పడంలేదు, హరీ! ఒకరోజు నువ్వు చేసిన గాయం అటు వంటిది. నువ్వు నీ కర్తవ్య పథాన నిరాటంకంగా సాగిపోవడంకోసం ఒకముల్లును ఏరి పారేసినట్టుగా పారేశావు నన్ను! నువ్వు ముల్లులాగా పారవేసింది ఒక నిండుహృదయాన్ని, హరీ! విసిరి పారేసినప్పుడు హృదయభాండంలోని ప్రేమామృతం ఒలికిపోయి ఆ ఖాళీలో కాలసర్పం పడగవిప్పి ఆడింది. జీవితాన్నే కాటందు కోవాలని తహతహ లాడింది!''

"మైగాడ్! ఎంత పొరపాటు జరిగిపోయేది నావల్ల!" హరికృష్ణ కళ్ళు చప్పున నీటిమయమై పోయాయి. "ఆ పుణ్యాత్ముడు ఎవరు, ప్రమీలా? అతడికి నేను కృతజ్ఞత చెప్పుకోవాలి! నువ్వు ఆత్మహత్యే చేసుకొని ఉంటే అది ఆత్మహత్య అయ్యేదికాదు. హత్య అయ్యేది. కర్తవ్య పథంలో సాగిపోతూ వెనక్కి తిరిగి చూచుకొంటే నాకేం కనిపించేదో తెలుసా? భూతగృహం కనిపించేది. వికృత రూపాలతో, వింత అరుపులతో ఆ గృహం నిండిపోయి భయకంపితుడిని చేసేది. ఆ గృహంలో ఒక ప్రేమమూర్తి హత్యకు కారకుడిని నేనని ఎప్పుడూ మరచి పోయేవాడినికాదు. ఇక నాకు శాంతి ఎక్కడ ఉండేది? జీవితమంతా వెనక్కి తిరిగి చూడకుండా కళ్ళుమూసుకొని పరిగెత్తడమే. ఆ పుణ్యాత్ముడు నిన్నేకాదు, నన్నుకూడా రక్షించాడు."

"అదృష్టవశాత్తు నా ఆత్మహత్యా ప్రయత్నం ఫలించిఉంటే అందుకు కారకు డివి నువ్వని బాధపడేవాడివికాని నేను చనిపోయినందుకు, నీ ప్రేమలేని జీవితం ఊహించుకోడానికే మనస్సంగీకరించక చనిపోయినందుకుమాత్రం నీనుండి రెండు కన్నీటి బిందువులు కూడా నేను నోచుకొనేదాన్ని కాదు కదూ, హరీ?"

"నీ చావుకు నేను రెండు కన్నీటి బిందువులు రాల్చేవాడినో, కాదో భగ

వంతుడు సాక్షముంటాడు, ప్రమీలా! వైజయంతి బ్రతికి ఉన్నంతవరకు ఆ సంగతి నా పెదవి దాటకూడదు!"

"అబ్బ! నీ కర్తవ్య నిష్ఠకు భగవంతుడు ఈ క్షణంలో ప్రత్యక్షం కావాలి గాని ఎందుకో కావడంలేదు!" బలవంతంగా నవ్వింది ప్రమీల. "మీ ఆవిడ పుట్టింట్లోనే ఉందా?"

"ఉహుఁ. వారం రోజులైంది అమ్మ తీసుకువచ్చి!"

"కొత్తకాపురం! పెళ్ళాం కాపురానికి వచ్చింది! ఆవిడ సమక్షంలో గడప వలసిన ఈ సమయాన్ని నా సమక్షంలో గడుపుతున్నావు! భేషుగ్గా ఉంది నీ కర్తవ్యనిష్ఠ!"

ప్రమీల ఆరోపణ అబద్ధం కాదన్నట్టు ముఖాన్ని మలినపరుచుకొని కూర్చొన్నాడు హరికృష్ణ. ప్రమీల ఉండవలసిన స్థానంలో ముక్కూ మొగం తెలియని వైజయంతి ఉంది. ఆమెను ప్రేమించడానికి, ఆమె సమక్షంలో తేలిగ్గా మసల డానికీ తను కొన్నాళ్ళు సాధన చేయక తప్పదు!

"నీ భార్య ఎలా ఉంటుందో నేను చూడనేలేదు. ఆమెను ఎప్పుడు పరిచయం చేస్తావు?"

"నువ్వోసారి మా ఇంటికి రా!"

"తప్పకుండా వస్తాను!"

## 10

మేనత్తను, "హరి భార్యను చూసి వద్దాం, అత్తా!" అని అడిగిందోనాడు ప్రమీల.

"ఏం చూడాలి? వాళ్ళుత్త గర్విష్టులు, బాబూ! ఇంకా ఇప్పుడు కోడలి రాకతో అంతస్తు పెరిగింది. కళ్ళు నెత్తిమీదికే వచ్చి ఉంటాయి యశోదమ్మకు" అంది మంగమ్మ.

"వాళ్ళేమీ మనకు మర్యాదలు చేయనక్కరలేదు. వైజయంతిని చూసివద్దాం అంతే."

బలవంతంమీద అంగీకరించింది మంగమ్మ. ఓ సాయంత్రం అత్తా కోడళ్ళు బయల్దేరారు.

"నీ కోడలేదీ, యశోదా?"

"కూర్చో, అక్కా! కోడలు పైనుంది. ఒసే, రాజీ! వదిన్ని పిలుచుకురా!"

అయిదు నిమిషాల తరువాత రాజీతో దిగిన యువతిని రెప్పార్పకుండా చూడ సాగింది ప్రమీల. ఆకుల చాటున విచ్చుకొన్న పువ్వులా ఉంది వైజయంతి. ఇంకా స్త లావుంటే బాగుండేదనిపిస్తుంది. తెల్లటి తెలుపున్నా, కను ముక్కు వేటికవి బాగున్నా ఆ ముఖం ఉండవలసినంత కళగా లేదు; మెడలో, చేతులకు క్రొత్తనగలు మెరుస్తున్నాయి.

మంగమ్మతో తమకున్న బంధుత్వాన్ని తెలిపి కోడలికి పరిచయంచేసింది యశోదమ్మ.

ఏదో బస్తాలో వేసి మూతి కట్టినట్టుగా ఉక్కిరిబిక్కిరి అవుతూ నిలబడిన వైజయంతి, అయిదు నిమిషాల తరువాత, "పైకి వెడదాం రా;" అంటూ ప్రమీలను ఆహ్వానించి పైకి పరిగెత్తింది.

అత్తా, యశోదమ్మ పెళ్లికబుర్లలో, బంధుత్వాలు తిరగేయడంలో పడి పోయారు. నెమ్మదిగా ప్రమీల లేచి వైజయంతి గదిలో ప్రవేశించింది.

ఆ గదిలో ప్రవేశిస్తూనే తెలిసిపోయింది. అది నూతన దంపతులకు ఏర్పాటు చేయబడిన గది అని. కొద్దిక్షణాలు ప్రమీల హృదయం ఎలాగో స్పందించింది. స్టీల్‌ఫ్రేమ్ సగం తెరిచిన పుస్తకంలా టేబిల్‌మీద నిలబెట్టబడి వుంది. హరికృష్ణ, వైజయంతిల ఫోటోలు రెండు అందులో ఉన్నాయి. గోడమీద చిత్రంలో రాధాకృష్ణులు ప్రేమమైకంతో మునిగి ఉన్నారు. ప్రక్కనే యమున ప్రవహిస్తూంది. గుబురు పొదలలో కోయిల కూస్తున్నది. నెమలి పురివిప్పి ఆడుతున్నది. మురళీగానం ప్రకృతిని చుట్టివేసింది.

"హరి డిస్పెన్సరీకి వెళ్ళాడా?"

''ఆc.'

"ఎలా సాగుతోందట ప్రాక్టీసు?"

''నే నడుగుతానా ఆ సంగతులన్నీ?"

"నువ్వడక్కపోతే అతడు చెప్పడా?''

"ఊహుc."

"ఏ కాలంలో దంపతులు, బాబూ?'' ప్రమీలకు కుతూహలం రేగింది. ''ఏకాంతంలో మీరేం మాట్లాడుకొంటారు మరి?''

"నాకు సిగ్గు, బాబూ! నేనసలు ఆయనతో మాట్లాడను!"

"మాట్లాడకుండా ఎన్నాళ్ళు గడుస్తుందేమిటి?"

నిశ్శబ్దంగా ఉండిపోయిన వైజయంతి కాస్సేపటికి నెమ్మదిగా అంది: "నీకు డాక్టరు బాగా పరిచయమా?"

ఒక్కక్షణం సందేహంగా చూచి అంది ప్రమీల: "ఆఁ. మా అన్నయ్య, అతడు క్లోజ్ ఫ్రెండ్స్! ఇక్కడ పిల్లల గోలతో చదువుకోడానికి వీలుగా ఉండదని మా ఇంటికి వచ్చి చదువుకొనేవాడు."

"నిన్ను ఆత్మీయంగా భావించుకొని నేనొకసంగతి చెప్పాలనుకొంటున్నాను, ప్రమీలా! దొంగతనం చేసిన మనిషిలా నేను ప్రతిక్షణం బిగుసుకుపోతున్నానిక్కడ! ఏ క్షణంలో ఆ రహస్యం బయటపడుతుందో, అప్పుడు వీళ్ళెంత హీనంగా చూస్తారో తలుచుకొంటే నా గుండె ఇప్పుడే ఆగిపోయేలా ఉంది. ముఖ్యంగా ఆయన నన్ను అసహ్యించుకొనే పరిస్థితే వస్తే నేనింత విషం పుచ్చుకొని చావక తప్పదు!"

వైజయంతి ముఖంలోకి ఆసక్తిగా చూడసాగింది ప్రమీల.

"నా నిర్దోషిత్వానికి సాక్ష్యంగా ఆయనవైపు మనిషి ఒకరుంటే చాలునన్న ఉద్దేశ్యంతో నేనీసంగతి నీతో చెబుతున్నాను. నిజంగా... నిజంగా ఆయన్ని మోసగించే ఉద్దేశ్యం నాకు లేదు. ఈ సంగతి ఆయనకు చెప్పివేయాలని పెళ్ళికిముందే ఎంతో అనుకొన్నాను. కాని, నా పెళ్ళికోసం మావాళ్లు పడుతున్న ఆరాటం చూస్తూ ఈ పెళ్ళిని చేజేతులా భగ్నంచేయలేకపోయాను.

"అందరు కన్నెపిల్లల్లా నాకు వివాహయోగ్యత లేదు. చిన్నప్పటినుండి గుండెజబ్బుతో, మూర్ఛలతో పెరిగిన శరీర మిది. నా రోగం తెలిసిన పురుషుడెవడూ నన్ను ప్రేమించి జీవనసహచరిగా చేసుకోడానికి సాహసించడు! ఈ విషయం దాచి ఈ సంబంధం చేశారు మావాళ్లు. నెలరోజులుగా మూర్ఛలు లేవు. గుండెనొప్పి తరుచుగా రావడంలేదు. పెళ్లయ్యాక రెండుసార్లు మాత్రం వచ్చింది. పెళ్లికి ముందు ఒక స్పెషలిస్ట్‌తో ట్రీట్‌మెంటు యిప్పించారు!

"మొన్న ఇక్కడికి వచ్చినరోజు నొప్పి వచ్చింది. ఎరివతో చెప్పుకోడానికీ వీల్లేదు. నాతో తెచ్చుకొన్న పిల్స్ మింగి దుప్పటి బిగదీసి ముడుచుకు పడుకొన్నాను. కాని, ఇది ఎంత నరకమో తెలుసా? వచ్చిన కష్టమైనా, ఒంట్లో పుట్టిన జబ్బు అయినా ఎదుటివాడికి చెప్పుకొని స్వాంతన పొందకపోతే ఉన్నది రెండింతలు భారమై గుండెలను క్రుంగదీస్తుంది!"

ఆర్ద్రమైన మనసుతో వైజయంతి చెయ్యి అందుకొని నొక్కింది ప్రమీల. క్రొత్తగా కాపురానికి వచ్చిన పిల్ల! ఒంట్లో జబ్బు దాచి అత్తగారివాళ్లను మోసం

చేస్తున్నాననే బాధ. చెబితే ఎలాంటి విషమ పరిణామాలకు దారితీస్తుందోనని భయం! గుండెలో నొప్పివచ్చినప్పుడు పైకి చెప్పుకోలేని అసహాయస్థితి! వధ్యస్థానంలో నిలబడిన మనిషి పడే చిత్రహింస పడుతోంది వైజయంతి. ముప్పైవేల కట్నంతో, ఏభైవేల బంగళాతో, ఏడెనిమిదివేల స్కూటరుతో అత్త వారింటికి వచ్చిన ఆడపిల్ల సుఖం ఇలాగున్నది! అనుక్షణం గుండె పిడికిటిలో పెట్టుకొని, ఏ క్షణాన ఏ భయంకరమైన అల విరుచుకుపడుతుందోనని ఎదురు చూస్తూ... జీవితంలో ఏ నూతన వధువుకూ ఇలాంటి పరీక్ష రాకూడదు.

"వైజయంతీ! నువ్వు భయపడేదేమీ జరుగదు!" ప్రమీల మృదువైన స్వరంతో అంది, వైజయంతి వేలిని ఉన్న ఎర్రరాళ్ళ ప్రదానపు ఉంగరాన్ని అటు ఇటు కదిలిస్తూ.

''జరుగదా? ఎందుకు జరుగదు? ఒక జబ్బుమనిషిని భార్యగా భరిస్తూ ఎవరు జీవితం నాశనంచేసుకోడానికి ఇష్టపడతారు గనుక?'' ఆశ్చర్యంగా అంది వైజయంతి.

"నువ్వు ఏది తెలిసిపోతుందని గుండె అరచేతిలో పెట్టుకొని ఎదిరిచూస్తు న్నావో అది రహస్యంగా ఏంలేదు, వైజయంతీ! అందరికీ తెలుసు! హరికి తెలుసు. మీ అత్తగారివాళ్ళకూ తెలుసు. పెళ్ళికిముందే తెలుసు!"

"తెలుసా? తెలిసే చేసుకొన్నారా?" వైజయంతి ముఖం పాలిపోయింది. క్రమంగా కళ్ళూ ముఖం ఎరుపెక్కిపోయాయి! "తెలిసే చేసుకొన్నారు! దీని అర్థం? డబ్బుకోసం కదూ? మనిషిని కాదన్నమాట ఆయన చేసుకొంది? ఇప్పు డర్థమౌతూంది ఆ మనిషి ఎంత నీచుడో? అందుకేనా పడగ్గదిలోకి వస్తూనే మంచంమీద పడి నిద్రపోవడం? ప్రేమపూర్వకమైన ఒకమాట, ఒక చల్లనిచూపు కరవైపోయింది. అదిగో ఆ చాపచుట్ట నాకు గతిఅవుతున్నది రాత్రిపూట! భగవాన్..." వెక్కి వెక్కి ఏడుస్తూ మంచంమీద పడిపోయింది.

"కాదు, కాదు!" ప్రమీల కంగారుగా ఏదో చెప్పబోయింది. కాని, వైజయంతి అప్పటికే కొయ్యలాగా నీలిగింది! స్పృహ తప్పిపోయింది.

"యశోదత్తా!" ప్రమీల పెద్దగా కేకవేస్తూ క్రిందికి పరిగెత్తింది. "వైజయంతి మూర్ఛపోయింది!"

యశోదమ్మ నింపాదిగా లేచి, ''ఇంక మా కష్టాలు మొదలయ్యాయన్న మాట!" అని ఒక దీర్ఘంతీసి మెట్లెక్కింది.




ఆలస్యం కాకుండా హరికృష్ణ పిలిపించబడ్డాడు. వైజయంతికి జరుగవలసిన వైద్యం చకచకా జరిగిపోయింది.

వైజయంతికి స్పృహ రాకముందే ప్రమీల పాలిపోయినముఖంతో మేనత్త చేయిపట్టుకొని క్రిందికి వచ్చింది. యశోదమ్మతో చెప్పి అత్తా, కోడళ్ళు వచ్చేశారు.

## 11

మూడురోజుల తరువాత ఒకనాడు కిటికీదగ్గర కూర్చొనిఉంది ప్రమీల సమీపంగా స్కూటర్ శబ్దం వినిపించి గుండె దడదడ లాడింది. తన ముఖం ఎలా చూపించేది హరికి? వైజయంతి ముందు అతడిని దోషిగా నిలబెట్టవలసి వస్తుందని అనుకోలేదు. వైజయంతి భయం తీర్చే ఉద్దేశ్యంతో ఆ సంగతి బయటపెట్టిందిగాని ఆమె యిలా అపార్థంచేసుకొంటుందని తెలిస్తే చెప్పేదా? ఏమైనా పొరపాటు జరిగిపోయింది తనవల్ల! ఈ మూడురోజులనుండి ఇదే బాధ వేధిస్తున్నది ప్రమీలను. ముఖం వాడిపోయింది. కళ్ళలో ఏదో భయం చోటు చేసుకొంది.

హరికృష్ణ స్కూటర్ ఆపి లోపలికి వచ్చాడు.

ముఖం త్రిప్పుకొని కూర్చొంది ప్రమీల, పెదవి కొరుక్కుంటూ.

హరికృష్ణ తనే కుర్చీ లాక్కొని కూర్చున్నాడు. కాస్సేపు మౌనంగా ఊరుకొని, "వైజయంతితో నువ్వు ఏంచెప్పావు, ప్రమీలా?" అన్నాడు హీన స్వరంతో.

అశ్రుజలంతో ప్రమీలకు కళ్ళు నిండుకొన్నా యప్పటికే. "నువ్వేమను

కొంటున్నావు, హరీ? స్త్రీసహజమైన ఈర్ష్యను ప్రదర్శించానుకొంటున్నావా?" అంది విచలితంగా.

"ఉహుఁ."

"ఇప్పుడు వైజయంతి ఆరోగ్యం బాగుందా?"

హరికృష్ణ ముఖం బీభత్సంగా ఉంది. గడ్డం పెరిగింది. కళ్లు లోపలికి పోయాయి. అప్పుడప్పుడే తుఫాన్ వాతావరణంనుండి బయటపడివచ్చిన మానవుడిలా ఉన్నాడు. "బాగుంది."

"వైజయంతి నిన్నేదయినా అడిగిందా?"

"ఆఁ. నన్ను డబ్బుకోసమే చేసుకొన్నారా? అని అడిగింది. మొన్నటి వరకు మాట్లాడని మనిషి కొంచెం కోలుకొన్నప్పటినుండి ఎన్నో ప్రశ్నలు వేస్తున్నది. ఎన్నో అపరాధాలు మోపుతున్నది నా మీద! మొన్నటివరకు ఉన్న తెర ఏదో తొలగిపోయింది. గండిపడిన చెరువులా ఆమె నోటినుండి వెలువడే వాక్ప్రవాహం ఆగడంలేదు!"

"ఏం చెప్పావు నువ్వు? అపరాధిలా తలవంచుకొని ఆమె ఊహలను బలపరిచావా?"

"ఉహుఁ. అలనాడు ధర్మరాజులా నేనూ అబద్ధం ఆడగలిగాను. నేను నిజంగా డబ్బుకోసమే చేసుకొన్నాను వైజయంతిని. కాని, ఆ నిజం ఆమె ముఖం మీద చెప్పేసి ఆమెను ఆ క్షణమే చంపలేకపోయాను! డబ్బుకోసం కాదన్నాను. నీకున్న జబ్బుసంగతి ఒకరిద్దరు చెప్పారు గాని డాక్టరును కాబట్టి బాగుచేసుకోగల ననుకొన్నానని, ముఖ్యంగా నువ్వు పెళ్ళిచూపులలో నచ్చావని చెప్పాను!"

"వైజయంతి నమ్మిందా?"

"నమ్మకపోయి ఉండొచ్చు! కాని, నమ్మక గత్యంతరం లేదు ఆమెకు. నమ్మక ఇప్పుడు ఏంచేయగలుగుతుంది? త్రెంచుకుపోలేదుకదా ఈ సంబంధం?" శుష్కహాసం చేశాడు హరికృష్ణ.

ఆ రోజు వైజయంతికీ తనకూ జరిగిన సంభాషణ అంతా చెప్పి, "నువ్వెంత చెడ్డవాడివి, హరీ? నీ కొకనాడు ఏంచెప్పాను నేను? మామూలు స్త్రీకంటే కూడా రోగిష్ఠిదైన వైజయంతి నీ ప్రేమనూ, ఆదరణనూ ఎక్కువగా కోరుతుందని చెప్పాను. ఈ పెళ్ళి నీ మానవత్వానికి ఒక పరీక్ష అనికూడా చెప్పాను. కాని, నువ్వు చేసిందేమిటి? ఆమెను చిత్రహింసకు గురిచేశావు! నీ కర్తవ్య పాలనా యజ్ఞానికి ఆమెను బలిపశువుగా చేశావు!"

హరికృష్ణ కళ్లు చెమర్చాయి. రుద్ధస్వరంతో అన్నాడు: "నిన్ను వదులు కొన్నంత సులభంగా వైజయంతికి నా హృదయంలో చోటు ఇవ్వలేకపోతున్నాను, ప్రమీలా! కర్తవ్య మనే పేరుతో నిన్ను నా మనసునుండి మెడపట్టి ఒకగెంటు గెంటా ననుకొన్నానుగాని, నీ రూపం వెయ్యిరూపాలయి నా మనసులో సందడిస్తున్నది. కోటి గొంతుకలై నీ మనసు నన్నే పిలుస్తున్నట్టు పిచ్చెత్తి పోతున్నాను. ఇక వైజయంతిగురించి ఎవరికి పట్టింది?"

ప్రమీల నవ్వింది. "ఆ ప్రేమగాథ ఒకనాటి స్వప్నం మాత్రమే. అసలు నిన్ను నేను ఒక్కసారికూడా అనుకోవడంలేదు. నా ఒక్క గొంతుకతో కూడా నిన్ను పిలువడంలేదు! ఎందుకీ అనవసరమైన చిత్తభ్రమలు? నీ ప్రేమవైఫల్యానికి వైజయంతిని ఎందుకు బలిపెడతావు? ఇక నువ్వు ఇక్కడికి రావడానికి వీల్లేదు. నన్ను తలుచుకోడానికి వీల్లేదు!

"ఇంత ఆత్మబలం లేనివాడివి ఇన్ని జీవితాలలో నరకం సృష్టించడానికి ఎందుకు కారకుడివయ్యావు? నీ బలహీనత క్షమార్హం కాదు, హరీ! నీ దారి మార్చుకోకపోతే నువ్వు చక్కగా నరకానికే పోతావు!"

"ఇప్పుడు నేనున్నది నరకం కాదా?" నీరసంగా నవ్వి లేచాడు హరికృష్ణ.

"నాకు ఒక మాట చెప్పి వెళ్లు, హరీ!" ప్రమీల ఆపింది. "కేవలం డబ్బు కోసమే వైజయంతిని పెళ్లిచేసుకొన్నావు! మీ అప్పులు తీరాయి! రెండుచేతులా సంపాదించుకొనే అవకాశాలుకూడా ఏర్పడ్డాయి. మీ అంతస్తు పెరిగిపోయింది. వీటన్నిటికి కారణమైన వైజయంతి విషయంలో ప్రేమ అలా ఉంచి నీకు కాస్త కృతజ్ఞతకూడా లేదా?"

"ఊహుం. లేదు. ఎందుకుండాలి? ఈ వైజయంతి అబ్బ కొనుక్కోకపోతే మరో జయంతి నాన్నగారు కొనేవారు. అమ్ముడుపోయిన వ్యక్తికి ఒక హృదయం ఒక కృతజ్ఞతకూడానా? వైజయంతి తండ్రి పెద్ద పొరపాటుచేశాడు. తన కూతురికి అంతస్తున్న మగడికోసంకాక తన కూతుర్ని ప్రేమించే వరుణ్ణి వెదుక్కొంటే బ్రతికిపోయేవాడు. కట్నంపేరుతో ఆయన ఇచ్చినడబ్బుతో ఒక అనామకుడు పెద్దమనిషి కాగలిగేవాడు!"

"బాగుంది, హరీ! కట్నం తీసుకొని ఇప్పుడు బుద్ధిమంతుడిలాగ పిల్ల తలిదండ్రులకు హితోపదేశం చేస్తున్నావా?" నవ్వకుండా ఉండలేకపోయింది ప్రమీల.

"అవును, చేస్తున్నాను. వరకట్న బాధితులకు గీతోపదేశమే చేస్తున్నాను.

తన కొడుకును వేలంలో పెట్టి ఆనందంగా కట్నంకోసం చేయిజాచే తండ్రే తన కూతురికి కట్నం ధారపోయవలసి వచ్చినప్పుడు 'ఈ వరకట్నం ఎప్పుడు రూపుమాసిపోతుందో, ఎప్పు డీ కష్టాలు విరగడౌతాయో' అని వరకట్నరాక్షసి రూపుమాసిపోవడానికి చేతనైనంతవరకు శాపనార్థాలు పెడతాడు, మెటికలు విరుస్తూ: కూతురికి వరకట్నం ఇవ్వాల్సి వచ్చినప్పుడు వచ్చే ఆలోచనలు కొడుక్కు వరకట్నం తీసుకొంటున్నప్పుడు ఎందుకని రావు? కొడుకు చదువు కొరకు చేసిన అప్పులో, కూతురిపెళ్లో, మరేవో ఆర్థికమైనచిక్కులో ఇచ్చేప్పుడు వచ్చే ఆలోచనలు తీసుకొంటున్నప్పుడు రానీయవు. వరకట్నం తీసుకొనే వరుని తండ్రినీ, వరుణ్ణీ మనం ఎంత నీచంగా దూషించినా వాళ్లలో సహృదయతా, మార్పూ రావు. వాళ్ళకున్న అవసరాలు అలాంటివి: వాళ్లు కట్నం తీసుకోక తప్పని పరిస్థితిలో ఉంటారు:

"ఇక రావలసిన మార్పు, చేయవలసిన ఉపదేశం కన్నెతరఫువాళ్లకే. వేలు కుప్పలు పోసి తయారుగా ఉన్న డాక్టరునో, లాయరునో కొనేబదులు కాస్త ముందుచూపుతో ఏ పేదఇంటి పిల్లవాడినో తీసుకువచ్చి చదువు చెప్పించి పిల్లనిచ్చి పెళ్ళిచేసి ఓ ఇంటివాడిని చేయడం ఉత్తమం: సంతలో కొనే ఎద్దులా అల్లుడిని కొన్నదానికంటే ఈ పద్ధతిలో పిల్ల సుఖపడడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది: ఇప్పుడు చూడరాదూ వైజయంతి అవస్థ?"

"అందరూ శివలె పెళ్ళికిముందే హృదయం పోగొట్టుకొన్నవాళ్ళే ఉంటారా ఏమిటి?" ప్రమీల చురగ్గా అంది. "అలా దారినపోయే దానయ్యను పట్టుకొని తీసుకువచ్చి అల్లుడి అర్హతలు స్వయంగా కల్పించుకోడానికి మన సమాజంలో ఆడపిల్ల తండ్రి ఆత్మగౌరవహాని: అందుకు మన సంప్రదాయం ఒప్పుకోదు కూడా: వేలు కుప్పవోసి అల్లుణ్ణి కొనడంలోనే అతడి అంతస్తు వ్యక్తమయ్యేది? ఆకాశమంత పందిరీ, భూదేవి అంత అరుగూ వేసి, కులస్తుల నందరినీ పిలిచి, విందు కుడిపించి పెళ్ళిచేస్తేనే ఆడపిల్ల తండ్రి కీర్తిపతాకం గగనంలో ఎగిరేది: ఎంత తెలివితక్కువవాడు కూడా తన దర్జా ప్రదర్శించుకోడానికి ఇలాంటి సువర్ణావకాశాన్ని వదులుకొని దారినబోయే దానయ్యను పట్టుకొచ్చి విద్యాబుద్ధులు చెప్పించి, రెండు పూలదండలతో పిల్ల పెళ్ళి చేసి పంపడానికి ఒప్పుకోడు !"

"ఈ డాంబికగౌరవమే ఆడపిల్ల తండ్రిని అధఃపాతాళానికి అణగద్రొక్కుతూంది: ఇది ఇలాగే సాగుతూన్నంతవరకు వరకట్నం తీసుకొనేవాళ్ళను తిట్టడ మెందుకు? రక్తమాంసాలు పీల్చే రాక్షసులుగా అభివర్ణించడం ఎందుకు?

కుక్కినవేనుల్లా ఒంట్లోని రక్తమంతా ధారబోసి, పైసా పైసా కూడబెట్టి అలాగే ఆకాశమంత పందిరీ భూదేవి అంత అరుగూ వేసి రంగరంగ వైభవంగా పెళ్ళి చెయ్యమను; ఎవరు కాదన్నారు?"

"సరిగా సుమతికూడా నీలాగే మాట్లాడుతుంది. నువ్వు వాళ్ళ సంఘంలో చేరవలసినవాడివి, హరీ!"

"సుమతా? ఎవరామె?"

సుజ్ఞాన్‌తో పరిచయం దగ్గరనుంచి వాళ్ళ సంఘం, వాళ్ళ ఉద్దేశ్యాలు అన్నీ చెప్పుకువచ్చింది ప్రమీల.

"అయితే, నన్నొకసారి తీసుకువెళ్ళి వాళ్ళను పరిచయం చెయ్యవూ?"

"ఒక్కడివికాదు! వైజయంతినికూడా తీసుకురా! ప్రతి ఆదివారం సాయంత్రం వాళ్ళ సంఘ సభ్యులంతా ఒకచోట చేరి చేయవలసిన పనులు చర్చిస్తుంటారు! ఆ రోజు నిన్ను వాళ్ళకు పరిచయంచేస్తాను! ఎందులో పనికిరాకపోయినా డాక్టరుగానైనా వాళ్ళకు పనికివస్తావు!"

"డాక్టరుగా తప్ప మనిషిగా నాకేమీ విలువ లేదన్నమాట?"

"వైజయంతిని సంతోషపెట్టగలిగినరోజే నువ్వు మనిషివయ్యేది!"

## 12

ఒక ఆదివారం సాయంత్రం స్కూటర్ వెనుక వైజయంతిని కూర్చోబెట్టుకొని వచ్చాడు హరికృష్ణ.

దంపతులకు చిరునవ్వుతో స్వాగతం చెబుతూనే వైజయంతిని పరిశీలనగా చూసింది ప్రమీల. ఆ ముఖంలో ఇదివరకటి సిగ్గు, సంకోచం ఏంలేవు. శరత్కాలపు నీలాకాశంలా స్వచ్ఛంగా ఉంది వెన్నెలలాటి చిరునవ్వు పెదవుల మీద మెరుస్తూంది.

మంగమ్మ ఒకసారి పలకరించి లోపలికి వెళ్ళిపోయింది. ప్రమీల టీ తీసుకు వచ్చింది.

"ఆ రోజు నేను చేసినపని తలుచుకుంటే సిగ్గుతో చితికిపోతుంటాను, వైజయంతీ! హరిని చాలా బాధపెట్టావు కదూ?" అంది ప్రమీల.

"సిగ్గుతో ఛితికిపోవడం దేనికి, ప్రమీలా? నీకు తెలియకుండానే నా కొక ఉపకారంచేశావు. మా మధ్య ఉన్న తెర తొలగించావు. నువ్వు రాకపోతే నేను ఎన్నాళ్ళు ఆ నరకంలో ఉండిపోవలసి వచ్చేదో, ఆ చాపచుట్ట ఇంకెన్నాళ్ళు గతి అయ్యేదో చెప్పలేను!"

"అయితే చాపచుట్టకు సెలవు ఇప్పించివేశాదన్నమాట హరి?" ఓరగా చూసి నవ్వింది ప్రమీల.

స్నేహితుల ఇంటికి వెడుతున్నామని మేనత్తతో చెప్పి ఇవతలికి వచ్చింది ప్రమీల

* * *

ఆ రోజు సుజ్ఞాన్‌ను పరిచయం చేయలేకపోయింది ప్రమీల.

వీళ్ళ అనాధ సేవాసంఘం సహాయంతో చదువుతూన్న ఓ స్టూడెంట్ టైఫాయిడ్ జ్వరంతో కన్ను తెరవకుండా పడివుంటే ఆసుపత్రిలో చేర్చటానికి వెళ్ళాడట సుజ్ఞాన్.

"మీ కిదేం సద్బుద్ధి? కేసు సీరియస్ అంటున్నారు. ధర్మాసుపత్రిలో ఎవరు చూస్తారు అతడిని? ప్రత్యేకంగా చికిత్స చేయించలేకపోయారా?" పరిచయాలు అయి కొంతసేపు మాట్లాడాక సుమతితో అన్నాడు హరికృష్ణ.

"అతడికి రాజవైద్యం చేయించడానికి మా దగ్గర డబ్బు అంత అనవసరంగా లేదు, బాబూ! ధర్మాసుపత్రి ఆసుపత్రి కాదా? అందులో పనిచేసేవాళ్ళు చదువు కొన్నవాళ్ళు కాదా?"

"నా ఉద్దేశ్యం అదికాదు."

"మీ ఉద్దేశ్యం నాకు తెలుసు. ముడుపు ముట్టందే ధర్మాసుపత్రుల్లో శ్రద్ధగా చూడరని! పదవిలో ఉన్నవాడు అవినీతిపరుడు ఎప్పు డౌతాడో తెలుసా, హరిబాబూ? ప్రజలు అవినీతిపరులు, అవకాశవాదులూ అయినప్పుడే అధికారి అవినీతిమార్గాన పడడానికి అవకాశం కలిగేది! తన అవసరాన్ని ముందుగా దాటించుకుపోయే తొందరలోపదవిలో ఉన్నవాడికి డబ్బుఆశ చూపుతాడు మనిషి. జింకపిల్లను ముందరపెట్టాక తినని చిరుత, డబ్బు ముందరపెట్టాక తీసుకోని అధికారి ఎక్కడైనా ఉంటారా? తీసుకొన్నవాడు లంచగొండి అయితేఇచ్చినవాడికి ఏం బిరుదివ్వా లంటారు? అధికారినుండి పని జరుగాలంటే లంచం తప్ప మరో సాధనం లేదనుకొనే తెలివితక్కువతనం ప్రజలు తొలగించుకోవాలి! అవినీతి పల్లకి ఎక్కించి మోసే పందు లున్నంతవరకు మనకు సమాన అవకాశాలు, సరైన న్యాయం అందవు, హరిబాబూ! ముందు ప్రజల్లో మార్పు రావాలి!"

"ఇది సత్యకాలం కాదు, సుమతిగారూ? కలికాలం. ఇప్పుడు నిజాయితీ కున్న ప్రయోజన మెంతో మీకు తెలియదా? ముడుపు కట్టుకోని మనిషివైపు ఎవడు చూస్తాడు?"




ఈ వాదం ఎంతసేపు సాగేదోగాని, వైజయంతి అడ్డుకొంది. ''ఇక వెడదామా? మరోసారి వచ్చి కూర్చొందురుగాని!"

## 13

మంగమ్మకు ఏటా వందరూపాయల భరణం అందుతుంది అత్తగారినుండి. అది పంటలమీద వెళ్ళి తెచ్చుకొంటుంది మంగమ్మ. వారం పదిరోజులు అత్త వారింట్లో ఉండి డబ్బు తీసుకువచ్చేస్తుంది. ఈ సారి వెళ్ళిన మంగమ్మ తిరిగి రాలేదు. ఆమె రెండురోజులు జ్వరంకాచి చచ్చిపోయిందని వార్త వచ్చింది.

వార్త తెచ్చిన మనిషి ఆ సంఘటన పదిసార్లు వర్ణించి చెబితేగాని నమ్మలేక పోయారు.

ఆవిడ ప్రొద్దున ఎనిమిది గంటలకే పోయిందట. వార్త చేరేప్పటికి సంధ్య పడింది. ఆవిడ ఈసరికే బూడిదైపోయి ఉంటుంది. ఇప్పుడు వెళ్ళడానికి బండీ లేదు. ఇహ తెల్లవారాక ఏదో ఒక బస్సు చూచుకొని ఎక్కాలి. ఎనిమిది మైళ్లు నడిస్తేగాని ఆ ఊరు చేరలేరు!''

మరునాడు ప్రొద్దుటే ప్రమీలను వాళ్ళ అన్నయ్య ఇంటికి పంపించి ప్రమీల తండ్రి ఒక్కడే బయల్దేరాడు.

మూడురోజుల తరువాత ఒక కుర్రవాడు వచ్చాడు, మీ నాన్న ఊరినుండి వచ్చాడు రమ్మన్నాడని.

ప్రమీల వచ్చేసరికి ఆయన మునగదీసుకు పడుకొని ఉన్నాడు. తండ్రి అలా

పడుకొని ఉండగా ఎప్పుడూ చూడలేదు ప్రమీల. "ఏం, నాన్నా ?" గాబరాగా సమీపించింది.

"నీ గొంగళి తీసుకువచ్చి కప్పమ్మా ! చలి కడుపులోంచి ఎగదోసుకు వస్తూంది !" ఆయన కంఠం చలితో వణుకుతూంది ! ఎన్ని కప్పినా చలి తగ్గలేదు.

"మందు ఏదైనా పడకపోతే ఎలా, నాన్నా?''

"ఈ చలి కాస్త తగ్గనీ అమ్మా ! రాజయ్యగారి దగ్గరికి వెళ్ళి మందు పుచ్చుకొంటాను."

రాజయ్యగారు హోమియోపతి వైద్యం చేస్తుంటారు. ఈ ఇంటి వైద్యుడు ఆయనే. ఒకటి రెండు రూపాయలతో పోతుంది ఆయన ఫీజూ, వీళ్ళ కొచ్చే సుస్తీనూ.

శాస్త్రి గంటతరువాత లేచి నీరు కావిపట్టిన ఉత్తరీయం ఒకటి చొక్కాలేని భుజాలచుట్టూ కప్పుకొని బయల్దేరాడు రాజయ్యగారి దగ్గరికి.

మరురోజు పూజా పునస్కారాల కార్యక్రమం నిర్విఘ్నంగా నిర్వర్తించ గలిగాడు. కాని, రెండోరోజు మళ్ళీ పడకబెట్టాడు చలితో. పదిహేను రోజులైనా ఆయన ఈ వరుస జ్వరంనుండి బయటపడలేకపోయాడు. రోజురోజుకూ ఆయన శరీరంలో శక్తి తగ్గిపోసాగింది

ఓ రోజు ప్రమీల చలితో ఎగిరిపడుతూన్న ఆయన వీపుమీద చేతు లదిమి పట్టి కూర్చొని ఉంది. ''అన్నయ్యకు కబురుచేయనా, నాన్నా ?" అంది.

"ఎందుకమ్మా ? నీకు భయంగా ఉందా ?"

''భయంకోసం కాదు, నాన్నా ! ఈ సమయంలో అతడు నిన్ను కనిపెట్టుకు ఉండడం ధర్మం.''

''అతడి విషయంలో నేను తండ్రిగా నా ధర్మం నిర్వహించాను గనుకనా, తండ్రి విషయంలో అతడికి ధర్మమనేది ఒక టుండడానికి ? అతడీ ప్రపంచంలో ఎవరికీ రుణపడకుండా పెరిగాడమ్మా ? మనిషికి అంతకంటేకూడా ఏం కావాలి ?"

తన తండ్రి మూర్ఖుడుకాదు. అజ్ఞాని అంతకంటే కాదు. శాస్త్ర పరిచయం, ధర్మవిచక్షణ ఉన్నాయి. కాని ఎందుకిలా తన సంతానంపట్ల ఉపేక్ష వహించాడు ?"

కూతురి మనసులో మాట చదివినట్టుగా అన్నాడు శాస్త్రి : ''నేను చిన్నప్పటి

నుండి నష్టజాతకుడినేనమ్మా ! అదృష్టమనేది నా కెక్కడా కనిపించలేదు. నాలాంటి బీద బ్రాహ్మడు ఒకాయన తన కుమార్తె కన్నెచెర వదిలించడం కోసం నన్ను గృహస్థును చేశాడు. సంసారధర్మ నిర్వహణలో మీ రిద్దరు పుట్టారు. మిమ్మల్ని ఎలా పెంచి పెద్దజేయాలో నాకు తెలియలేదు. అప్పు చేయడమంటే భయం. అప్పుచేసి తీర్చకపోతే అదొక పాపం ! ఋణగ్రస్తుణ్ణి కావడమంటే మళ్ళీ జన్మకు సీటు సంపాదించుకోవడ మన్నమాటే. జన్మ అంటే ఎంత భయంకరమైనదో నేనీ జన్మలో చూశాను. మళ్ళీ జన్మ ఎత్తడమా ? అందుకేనమ్మా ! తండ్రిగా మీకు నేనేమీ చేయలేకపోయాను. ఏదీ ఇవ్వలేక పోయాను !''

ఒకరోజు హరికృష్ణ అన్నమాట గుర్తు వచ్చింది ప్రమీలకు. ''ఖర్మశేష మేదో గుర్తువచ్చి అది తీర్చుకు వెళ్ళిపోడానికి రోజులు లెక్కపెడుతున్నాడా అనిపిస్తుంది !''

హరి సరిగ్గా అన్నమాట ఇది !

''జన్మ అంటే ఎంత భయంకరమైనదో తెలుసుకొన్నవాడివి ! ఇద్దరికి జన్మ నెలా ఇచ్చావు, నాన్నా ?'' అని అడగాలనిపించింది ప్రమీలకు. కాని, ఆయన ఇప్పటికే పశ్చాత్తాపంతో క్రుంగిపోతున్నాడు ! జీవితం అస్తాద్రిలో మునిగి పోతున్నది. ఇప్పుడు తమకు జరిగిన అన్యాయం గురించి ఏమని అడగాలి ? అడిగి ప్రయోజన మేమిటి ?''

## 14

తండ్రి పడకపెట్టినప్పటినుండి శివాలయం తాళాలు ప్రమీలచేతికి వచ్చాయి. ఉదయం, సాయంకాలం గుళ్ళో దీపారాధన, శివార్చన ప్రమీల భక్తితో నిర్వ హిస్తూంది ! రెండు వీధుల కవతల చిన్న ప్రాకారం కలిగిన గుడి ఉంటుంది. పూజకు కావలసిన పుష్పాలు గుడిచుట్టూ ఉన్న చెట్లు ఇస్తాయి.

ఒకరోజు తాళంచెవులు తీసుకొని గుడికి బయల్దేరింది ప్రమీల. గుడి సమీపంలోనే ఏదో పనిమీద అటువైపుగా వచ్చిన సుజ్ఞాన్ కనిపించాడు.

''అటువైపు రావడంలేదు ? మమ్మల్ని మరిచిపోయినట్టున్నారు, ప్రమీలా !'' అన్నాడు చిరునవ్వుతో.

''మరిచిపోలేదు, సుజ్ఞాన్‌బాబూ ! మా మేనత్త ఈ మధ్య మాతో చెప్ప కుండా స్వర్గలోక యాత్రకు వెళ్ళిపోయింది. మా నాన్నగారుకూడా ప్రస్తుతం అదే ధ్యాసలో ఉన్నట్టున్నారు !''

అరే! సుజ్ఞాన్ ముఖం విచారంగా మారిపోయింది. "ఎందుకో రాలేదను కొన్నాంగాని మీరు ఇలాంటి ఇబ్బందిలో పడిపోయారని అనుకోలేదు!''

గుడి తాళాలు తీసింది ప్రమీల.

ప్రమీల పూజ ముగిసేవరకు చేతులు కట్టుకొని స్థిమితంగా నిలబడి చూడ సాగాడు సుజ్ఞాన్.

పాణి గొట్టంనుండి నీళ్ళు పడుతూంటే శుభ్రంగా శిరఃస్నానం చేశాడు లింగ మయ్య. విభూతి రేఖలు దిద్దుకొన్నాడు. గంధపు బొట్టు అద్దుకొన్నాడు. శిరసున నవకుసుమాలు అలంకరించుకొన్నాడు. ప్రమీల పెట్టిన పప్పుబెల్లం తిన్నాడు. భక్తులకు వరమివ్వడానికి ప్రశాంతంగా కూర్చున్నాడు!

సుజ్ఞాన్ తీర్థ ప్రసాదాలు తీసుకొన్నాడు.

గుడి తలుపులువేసి బయల్దేరింది ప్రమీల.

''ఆడవాళ్ళు గుడిపూజకు పనికివస్తారా?" అన్నాడు సుజ్ఞాన్.

"ఆడవాళ్ళందరి సంగతేమోగాని కన్నెపిల్లలు భగవంతుని కిష్టమైన పురాణ గాథ లెన్నో విన్నాం. ఇష్టమైనప్పుడు ఇంట్లో అయితేనేం, గుళ్ళో అయితే నేం పూజకు పనికిరారా?"

"పురాణ గాథలు వదిలేయండి. శాస్త్రం ఒప్పుతుందా?"

"శాస్త్రాలన్నీ పురుషజన పక్షపాతం వహించినవే. వాటిని నమ్ముకొంటే స్త్రీకి పతి పాదసన్నిధిని తప్ప మరెక్కడా అడుగుమోప సందుకూడా చూపలేవు అవి! ఆడదాని బ్రతుకు అంధకారం చేసినవే ఈ శాస్త్రాలనుకొంటాను!''

''సుమతి సావాస దోషమా?''

"సుమతి అక్కవల్ల, ఆమె పుస్తకాలవల్ల నేను చాలా నేర్చుకొన్నానండీ!"

దోవలో శాస్త్రిగారికి వచ్చిన జ్వరం గురించి, జరుగుతూన్న చికిత్సగురించి వివరంగా అడిగి తెలుసుకొన్నాడు సుజ్ఞాన్. రోగిని పరామర్శించి పోడానికేమో ఇంటివరకూ వచ్చాడు.

శాస్త్రికి చలి అంతకుముందే తగ్గిపోయింది. కాని, జ్వరంతో ఒళ్ళు మిట్ట మధ్యాహ్నం ఎండలో బండ కాగినట్టుగా కాగిపోతున్నది. మూలగడంకూడా ఎక్కువగానే ఉన్నది.

సుజ్ఞాన్ ఒంగి ఆయన ఒంటిమీద చెయి వేయబోయాడు.

ప్రమీల చెయ్యి మెరుపులా ముందుకువచ్చి వారించింది. ''ఆయన ఇప్పుడు స్నానం చేయలేదు. పాలుకూడా తాగకుండా అలా పడివుండాల్సిందే."

సుజ్ఞాన్ ముఖం కందగడ్డలా ఎఱ్ఱబడిపోయింది. ఇంత అవమానం జన్మలో అతడు ఎవరివల్లా పొంది వుండడు! అత డొకనాడు ప్రాణదానంచేసిన ప్రమీల నిస్సంకోచంగా చేయగలిగింది!

సుజ్ఞాన్ గిర్రున వెనక్కి తిరిగాడు.

"తెలియక వచ్చాను. నా అడుగులుపడి మీ ఇల్లుకూడా అపవిత్రమైపోయి వుంటుంది. గోమూత్రం చల్లుకొంటేగాని శుద్ధిపడదేమో? మీ ఇబ్బందిలో మరో ఇబ్బంది కలిగించినందుకు సిగ్గుపడుతున్నాను!"

సాయంత్రం ఒక అపరిచిత యువకుడు గుమ్మంముందు ప్రత్యక్షమయ్యాడు. మల్లెపువ్వులాంటి తెల్లని దుస్తుల్లో ఉన్నాడు. చేతిలో మెడికల్ ఛెస్ట్ ఉంది. సుందరమైన ముఖంమీద చిరునవ్వు చిందులేస్తూంది!

ప్రమీల ఆశ్చర్యాన్ని అణిచిపెట్టుకొని మృదువుగా, "ఎవరు కావాలండీ?" అంది.

"నా పేరు గౌరీ మనోహర్. వృత్తికి డాక్టర్ని. కులానికి బ్రాహ్మణ్ణి. సుజ్ఞాన్‌కు స్నేహితుణ్ణి – అతడి కోరికమీద శాస్త్రిగారిని చూడడానికి వచ్చాను."

"రండి!"

శాస్త్రి ప్రొద్దుటినుండి స్పృహలేకుండా పడివున్నాడు.

అయిదు నిమిషాలు శ్రద్ధగా పరిశీలించిన డాక్టరు కనుబొమలు ఆలోచనతో ముడుచుకొన్నాయి. "ఇంట్లో ఈయనతో మీ రొక్కరే ఉంటారా?'' అన్నాడు ఇంజక్షన్‌చేసి, ఏవో మాత్రలిచ్చి.

'ఆఁ.'

"ఇవాళ రాత్రికి తోడుగా ఎవరినైనా పిలుచుకొంటే మంచిది!''

"మా అన్నయ్యకు కబురుచేశాను. వస్తాడేమో!" అంది ప్రమీల. డాక్టరును గుమ్మందాకా సాగనంపి, "ఈ రాత్రి తోడు అవసరమే అంటారా? ఈ రాత్రి మృత్యుదేవత మా తలుపు తట్టడం ఖాయమేనంటారా?'' అని అడిగింది. ఆ అడగడంలో భయంగాని, దుఃఖంగాని లేవు! జరుగనున్నదానికి సిద్ధపడక తప్పదన్నట్టుగా ఉంది.

"బహుశః తప్పదనుకొంటాను!" తల త్రిప్పుకొని వెళ్ళిపోయాడు డాక్టరు.

## 15

డాక్టరు ఊహ నిజమైందిగాని ఒకరోజు ఆలస్యంమాత్రం జరిగింది.

యోగానంద్ పితృకార్యం అయిందనిపించి ప్రమీలను తీసుకొని తమ యింటికి

వచ్చేశాడు. పదిహేనేళ్ళుగా నీడనిచ్చిన దేవస్థానం వదిలి వచ్చేస్తుంటే ప్రమీలకు ఎలాగో అనిపించింది. ఒక నెలరోజులలో ఎంత మార్పు? ఒక నెలలోనే అన్నా చెల్లెళ్ళకు పిలుపువచ్చి వెళ్ళిపోయారు పైలోకాలకి!

ఇక్కడికి వచ్చాక ప్రమీలకు ఎవరో పరాయింట మసలినట్టుగా ఉందిగాని స్వంతమనుషులుగా కనిపించలేదు. అయితే అది అన్నావదినల దోషం మాత్రం కాదు. వదిన ఎంతో ప్రేమగా చూస్తుంది. స్నేహంగా ఉంటుంది. అన్నగారు కూడా చాలా మృదువుగా మారిపోయాడు. "ప్రమీలా!" అంటూ అతడు నోటి నిండా ఆత్మీయంగా పిలిచినప్పుడల్లా ఎవరో క్రొత్తవ్యక్తి పిలిచినట్టుగా ఉలిక్కి పడుతూంది ప్రమీల. ఇదివరకు ఎంతో ఉదాసీనంగా కనిపించే అన్నయ్య ఇంత మృదువుగా ఎప్పుడు మారిపోయాడు? మరుభూమిలాంటి మనిషిలో హఠాత్తుగా ఈ సెలయేటిజాలు ఎక్కడ పుట్టి ప్రవహిస్తూంది?

అది భార్య సహచర్య మహత్యమని కొన్నాళ్ళలో గుర్తించింది ప్రమీల.

చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకొన్నాడు. తండ్రి ఉన్నా అతడు తండ్రిగా ఎప్పుడూ మసలలేదు. తలచెడి ఇంటజేరిన మేనత్త కాస్త ఉడకేసిపెట్టడంతప్ప ఆవిడా ఈ పిల్లల్ని ప్రేమించలేదు. ఆ వయసుతో ఎన్ని కోరికలు సమాధి అయిపోయాయో, ప్రేమ ఆదరణకు కరువై ఆ మనసులో ఎంత దుఃఖం, ఎంత ఒంటరితనం గూడుకట్టుకొన్నాయో పుట్టించిన ఆ విధాతకే తెలిసిఉండాలి.

ఇప్పుడు భార్య అయిన ఈ యువతి సాహచర్యంలో పురుషుడు పొందగలి గినవన్నీ పొందుతున్నాడు. ప్రేమ, ఆదరణ, స్నేహం, సేవ-దేనికీ లోటులేదు. మామగారి పలుకుబడితో మంచి పదవిలో ఉన్నాడు. ఈ మధ్యే స్కూటర్ కొన్నాడు. హోదాకు తగ్గట్టుగా ఇంటినిండా సామాను అమరింది.

మధుమాసం రాగానే మోడులన్నీ చివురించి పుష్పించినట్టుగా పాతికేళ్ళ తరువాత అతడి జీవితం క్రొత్త చివుళ్ళువేసింది భార్య ఆగమనంతో. ప్రేమ అంటే, మమత అంటే ఏమిటో-ఆమెవల్లే తెలుసుకొన్నాడు.

ప్రమీలపట్ల అతడి బాధ్యతను ఓ శుభముహూర్తాన గుర్తుచేసింది గీత.

"ఓ ఆరేడువేలు అప్పు అయితే అవుతుంది. తీర్చుకోలేరా మీరు? ఆడపిల్ల ఓ ఇల్లు మెట్టి భర్తా పిల్లలతో కలకలలాడుతూంటే అదే మనకు శుభమండీ! మా చిన్నాన్న బావమరిది..." అప్పుడే తను ఎన్నికచేసిన సంబంధం కూడా చెప్పేసింది.

"అలాగే చూద్దాం! సెలవురోజుల్లో మనిద్దరం అక్కడికివెళ్ళి మాట్లాడివద్దాం!"



యోగానంద్ ప్రసన్నంగా అన్నాడు. భార్యమాటకు ఎదురు చెప్పటంగాని అతడికి వేరే అభిప్రాయంగాని లేవు.

## 16

దాదాపు నెలరోజుల తరువాత ప్రమీల సుమతి బంగళాలో అడుగుపెట్టింది

"ఏమ్మా! ఇన్నాళ్ళు ఎక్కడ మాయమైపోయావు?" అంది సుమతి. "మంచి సమయానికే వచ్చావుగాని నువ్వొక సహాయం చెయ్యాలోయ్!"

"ఏమిటక్కా? నేను మీకు సహాయం చేయగలంత దాన్నా?"

"చీమవా, దోమవా? మా అంత మనిషివి కాదాయేం?" సుమతి నవ్వింది. "సుజీని నువ్వు మూడురోజులు కాస్త కనిపెట్టి ఉండాలి!"

"ఏమైందతడికి?"

"ఏమైందని అడుగుతున్నావా? ఒకరోజా, రెండురోజులా ఇరవైరోజుల జ్వరం! మృత్యుముఖంనుండి బయటపడ్డాడు. నిన్నటినుండి పథ్యం తీసుకొంటున్నాడు. ఇప్పుడు వచ్చిన సమస్య ఏమిటంటే, శ్రీరామనవమి ఇంక మూడురోజులే ఉంది. ఇంటిదగ్గర నాన్నగారు శ్రీరామనవమి ఉత్సవం ఘనంగా జరిపిస్తాడు ప్రతిఏడూ. ఆరోజు అన్నదానం కూడా జరుగుతుంది. అన్ని ఏర్పాట్లూ ఈ వయసులో నాన్నగారినుండి కావు. లక్ష్మి కొంచెం అశ్రద్ధ మనిషి. వాడికి పనిపాటలంటే బొత్తిగా ఓపిక తక్కువ! సుజీ ఆరోగ్యం బాగుంటే చింతే ఉండేదికాదు. భీముడిలా అన్నిపనులూ అతడు చూచుకొనేవాడు. ఇప్పుడు నేను కూడా వెళ్ళకపోతే నాన్నగారు చాలా ఇబ్బందిపడతారు!"

"సుజ్ఞాన్‌బాబు ఎక్కడుంటున్నారిప్పుడు?"

"ఇక్కడే. మేడమీద ఉన్నాడు. పద...అతడికిప్పుడు అలసటకూడదు! నౌకర్లమీద వదిలేసి వెళ్ళడానికి మనస్కరించడంలేదు!...సుజీ! ఎవరొచ్చారో చూడు!"

ఇతడు సుజ్ఞాన్ బాబేనా అన్నట్టు చూడసాగింది ప్రమీల. దృఢమైన అతడి శరీరం బలహీనంగా తయారైంది. మృత్యుదేవత తన కోరలతో నొక్కి మరీ వదిలేసి నట్టుంది.

ప్రమీల క్షీణస్వరంతో "ఏం జ్వరం?" అంది.

"ఏం జ్వరమైనా మంచిదిమాత్రం కాదు." సుమతి అంది.

ప్రమీల అతడి మంచంమీద ఒక అంచున కూర్చొని అతడి చెయిమీద చెయి వేసింది.

"అరెరే! ఇప్పుడు ఏం అవసరమని నన్ను తాకారు? ఇంటికెళ్ళి మళ్ళీ స్నానం గీనం..." వెక్కిరించినట్టుగా కాక నొచ్చుకొన్నట్టుగానే అన్నాడు సుజ్ఞాన్.

"ఇంతేనా మీరు నన్ను అర్థంచేసుకుంది." ప్రమీల కళ్ళు చటుక్కున నిండుకొన్నాయి. "నేనారోజు చేసినపని మీ హృదయాన్ని గాయపరుస్తుందని నాకు తెలుసు, సుజ్ఞాన్‌బాబూ! ఈ విషయమై మరోసారి వచ్చి మీదగ్గర క్షమాభిక్ష అర్థించాలని అనుకొన్నాను. ఆ ధైర్యంతోనే నేనారోజు అవమానించి వెళ్ళగొట్ట గలిగాను! అదే ధైర్యంతోనే ఇన్నాళ్లు నిశ్చింతగా కూడా ఉన్నాను."

"క్షమ అర్థిస్తే సరిపోతుందనుకొన్నారా?" ఆశ్చర్యంగా చూశాడు సుజ్ఞాన్. "మనిషిని మనిషి తాకకూడదని ఎవరు, ఏ శాస్త్రకారులు ఏర్పరచారో నాకు తెలియదు. కాని, ఇది చాలా క్రూరమైన శిక్ష. మనిషి అస్పృశ్యుడెప్పుడౌతాడో తెలుసా, ప్రమీలా? కేవలం ఒక మనిషికడుపులో పుట్టినంత మాత్రాన కాదు. తన లాభమే చూచుకొనేవాడూ, ఇతరులసొమ్ము ఆసించేవాడు, మాటతప్పేవాడూ-వాడూ అనాచారీ, అస్పృశ్యుడూనూ!

"ఆ రోజు మీరు గుర్తుచేసేదాకా నేను హరిజనుణ్ణని గుర్తురాలేదు. ఆ రోజు నా హృదయంలో అయినగాయం మామూలు గాయం మాత్రం కాదు!"

"తెలుసు. నాకు తెలియదని చెబుతున్నారా?"

"తెలుసా? తెలిసే నన్ను అంటరానివాణ్ణి చేశారా?"

"అఁ! తెలిసే చేశాను. కాని, ధర్మం కాపాడుకోవడం ముఖ్యమైపోయింది ఆనాడు. మా నాన్నగారు ఎంత దరిద్రుడో అంత కఠిననిషపరుడు కూడా.

హోటల్ అంటే ఎలా ఉంటుందో చూచే అవసరం ఎప్పుడూ ఆయనకు కలుగ లేదు. బయటికివెడితే బ్రాహ్మల ఇంట తప్ప ఎక్కడా పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టేమనిషి కాదు: ఆయన జీవితంలో పంపునీళ్లు తాకలేదని చెబితే మీరు ఆశ్చర్యపడతారేమో? అవసరమైతే రెండు మూడు రోజులు ఉపవాసమైనా చేసేవారుగాని తన ధర్మాన్నిమాత్రం వదులుకోలేదు. అలాంటి మనిషి అవసాన దశలో ఉన్నాడు. కూతురిగా ఆయన సేవాభారాన్ని పిదవేసుకొన్నాను. మనిషిని ముట్టుకొంటే మైలపడతారో లేదో నాకు తెలియదు. నాకా పట్టింపూ లేదు. కాని, మా నాన్న నమ్మిన ధర్మం అది ఎలాంటిదైనా ఆయన స్పృహలో లేని సమయంలో రక్షించవలసిన బాధ్యత నాకుందంటారా లేదా?

''ఆ ధర్మం తరువాతే మీరు కనిపించినా, మీరంటే తక్కువ విలువ ఏమీ లేదు, నా మనసులో. జీవితం నరకమని, దాన్ని అంతంచేసుకోవడమే పరిష్కార అనుకొనే నన్ను ఆత్మహత్యనుండి రక్షించి జ్ఞానోదయం చేశారు: మిమ్మల్ని అవమానించి వెళ్ళగొట్టినా తరువాత విషయం చెప్పి క్షమించేలా చేసుకోగలనన్న ఆశతో ఉన్నాను: దేవుడు నన్ను అదృష్టవంతురాలిగా దీవించాడు కాబట్టి సరిపోయింది. లేకపోతే మీతో ఇలా చెప్పుకొనే అవకాశమే లేకపోతే, మీరు నా మాటలేవీ వినిపించనిచోటికే వెళ్ళిపోతే నేను జీవితమంతా పశ్చాత్తాపడుతూ కూర్చొన్నా తీరేది కాదా బాధ:''

సుమతి, సుజ్ఞాన్ ఆమె ముఖంలోకి చూస్తుండిపోయారు.

ఆ సంఘటన తరువాత సుజ్ఞాన్ పూర్తిగా అపార్థంచేసుకొన్నాడు ఆమెను ఆ రోజు ఎంత షాక్ తగిలిందీ అంటే చావు బ్రతుకులమధ్యకు తీసుకుపోయి వదిలింది ఆ బాధ. గుళ్లో తీర్థప్రసాదాలు ఇచ్చినప్పుడు గుర్తురాని అస్పృశ్యత ఇంటికి వస్తూనే ఎలా వచ్చిందన్న సందేహం పీడిస్తూనే ఉందతడిని.

"ఈ నాలుగురోజులూ మీ సేవచేసి నా అపచారానికి ప్రాయశ్చిత్తం చేసు కొంటాను:"

మరునాడు సుమతి అప్పగించవలసినవన్నీ అప్పగించి చెప్పవలసినవన్నీ చెప్పి ఊరికి వెళ్ళిపోయింది. ప్రమీల చీటీ ఒకటి వ్రాసి ఇంటినుండి తన బట్టలు తెప్పించుకొంది.

## 17

"వినుడు వినుడు రామాయణ గాథా వీనుల విందులుగా..."

తెల్లవారుఝామునే సమీపంలోని గుడినుండి లవకుశ రికార్డ్స్ వేసేస్తున్నారు.

ఈ రోజు శ్రీరామనవమి. సుమతివాళ్ళ ఇష్టదైవం పుట్టినరోజు పండుగ.

సాయంత్రం భజన కార్యక్రమం ఏర్పాటయింది. సుమతి లేకపోవడం, సుజ్ఞాన్ ఆరోగ్యం సరిగా లేకపోవడం కార్యక్రమం అంత ఉత్సాహంగా లేదు. సుజ్ఞాన్ ఎక్కువసేపు కూర్చోలేక పోవడంవల్ల రెండు మూడు కీర్తనలతో భజన ముగించి హారతి ఇచ్చేశారు.

"అప్పుడే పడుకొన్నారా?"

కళ్లు మూసుకు పడుకొన్న సుజ్ఞాన్, "ఉహూ" అన్నాడు.

"ధ్యానం చేస్తున్నారా?"

"ఊఁ."

"పడుకొనే?"

"నేను చేసే ధ్యానానికి పద్మాసనం అక్కరలేదు. నియమాలు అక్కర లేవు."

"మూఢభక్తి కాబోలు?" ప్రమీల నవ్వి "పాలు త్రాగుతారా? తీసుకువస్తాను" అంది.

తీసుకురమ్మన్నట్టుగా తలూచాడు.

అయిదునిమిషాల తరువాత ప్రమీల చేతినుండి పాలగ్లాస్ అందుకొని పాలు త్రాగుతూ తదేకంగా ప్రమీల ముఖంలోకి చూడసాగాడు. "మూడురోజులనుండి నా సేవాభారాన్ని మోస్తున్నావు. ఇంకా రెండు రోజులుంటుందేమో ఇది, సుమతి వచ్చేదాకా. అప్పటికి నీ అపరాధానికి ప్రాయశ్చిత్తం పూర్తి అయి విముక్తిపొంది వెళ్ళిపోతావు కాబోలు? కాని, ప్రమీలా! నిన్నిలా విడుదల చేయాలని లేదు నాకు!" అన్నాడు.

"లేదా? ఎందుకు?"

"నీ పొరపాటుకు శిక్షగా నువ్వు నాకు సేవ చేస్తున్నావు. ఇందువల్ల నేను పొందుతున్న సుఖం అంత త్వరగా వదులుకోవాలని లేదు. ఈ శిక్ష నీకు శాశ్వతంగా విధించే ఉపాయం ఏదైనా ఉందా అని ఆలోచిస్తున్నాను"!

"ఉపాయమే? కానీ డబ్బులు ఖర్చుకాకుండా దాసీని సంపాదించుకోవాలను కొంటున్నారన్నమాట?" అంటూ మనోహరంగా నవ్వింది ప్రమీల. "మా అన్నా వదినా నాకా మూడు ముళ్ళు వేయించేసి వదిలించుకోడానికి కుట్రపన్ను తున్నారు, సుజ్ఞాన్‌బాబూ! నా కిష్టంలేని చోటికి పంపబడే బదులు అలాగే నా

జీవితాంతం మీ సేవచేస్తాను - నా కింత కూడు గుడ్డకు లోటు లేకుండా చూస్తే చాలు! మీలాంటి మహానుభావుల సేవ ఊరికే లభిస్తుందా?"

"ఈ మాట పరిహాసంగా కాక నిజంగా అంటే ఎంత బాగుండేది!"

"నిజంగానే అంటున్నాను! మా నాన్న పోతూపోతూ రత్నంలాంటి విలువైన మాట ఒకటి చెప్పిపోయాడు. ఎవరికీ రుణపడని మనిషికంటే అదృష్టవంతుడు మరి లేడట! జీవితంలో ఇదొక్కమాట గుర్తుపెట్టుకొంటే కోరికలు, దానితోపాటు వచ్చే దుఃఖాలు అన్నీ వాడివారిన ఆకుల్లా తొలగిపోయి స్వర్గం అనేది ఏర్పడుతుంది! మా అన్నా వదినల అపేక్ష నాకు కంటకంగా ఉంది. నాకు పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేదు. దీనజనసేవ మీరు చేయండి. మీ సేవ నేను చేస్తాను! బ్రతుకుతెరువు ఆలోచనలేకుండా రోజులు గడిచిపోతే చాలు!"

సుజ్ఞాన్ ముఖంలో నవ్వు ఎగిరిపోయి చీకటి అలుముకొంది.

"కానీ, సుజ్ఞాన్ బాబూ! మీరు మూసినకన్ను తెరవకుండా పడితే రాత్రిం బవళ్లు మీ సేవచేసిందట సుమతి అక్క. ఒకరోజు మీకు సీరియస్ కావడంతో ఏడుస్తూ కూర్చుందట. అంత ప్రేమించే మనిషిమీద కలగని లోభం ఈ మూడురోజుల సేవకు నామీద ఎందుకు కలిగింది?"

"మేం ఒక తండ్రి పిల్లల్లా చిన్నప్పటినుండీ ఒకేచోట పెరిగాము. ఆమె నాకంటే ఒక ఏడాది పెద్దది కూడా. ఆమె నన్ను ఆశీర్వదించవలసిన మనిషే కాని, ఆమెనుండి నేను ఏది ఆశించినా అనుచితమే అవుతుంది."

"మీరు ఒకేచోట పెరిగారా?"

"ఆఁ. నా చదువంతా ఈ బంగళాలోనే జరిగింది. చదువు పూర్తి అవుతూనే ఓరోజు హఠాత్తుగా "సుజీ, ఎక్కడైనా రూమ్ చూసుకో" అని చెప్పేసింది. నా వల్ల ఏదైనా పొరపాటు జరిగిందాని మథనపడ్డాను అడిగాను. 'పొరపాటు నావల్లే జరిగింది. నీవల్లకాదు' అంది. నాకు అర్థం కాలేదు. అర్థమయ్యేలా ఆమె చెప్పలేదు. ఇప్పుడున్న రూమ్‌లోకి మారిపోయాను! మళ్ళీ మొన్న స్పృహ లేని స్థితిలో ఈ బంగళాకు వచ్చాను!"

రెండురోజుల తరువాత సుమతి వచ్చింది. ఆమెతోపాటు ఆమె తండ్రిగారు కూడా వచ్చారు. ఆయన దాతృత్వం, దయాగుణం అన్నీ విన్న ప్రమీల ఆయన్ని ఎలా ఊహించుకొంటున్నదో అలాగే ఉన్నాడు ఆయన. ధవళచ్ఛాయ గలిగిన స్థూల శరీరం. వెండి తీగల్లా బారుగా పెరిగిన గడ్డం. నుదుట గంధపు

బొట్టు. ముఖంలో తరగని చిరునవ్వు. ఆ చూపుల్లో ఏదో పవిత్రత ఉట్టి పడుతూ వినమ్రభావం కలుగజేస్తూంది.

ఆయన వస్తూనే సుజ్ఞాన్ మంచంమీద కూర్చొని అతడి గుండెలమీద చెయ్యి ఉంచి, "ఇప్పుడు కులాసాగా ఉన్నట్టేనా, బాబూ?" అన్నాడు వాత్సల్యంగా.

"ఆఁ. కాస్త నీరసం తప్పితే ఏ బాధా లేదు!"

"నీరసం ఉండదూ? నెమ్మదిగా రక్తం పడుతున్నకొద్దీ నీరసం తగ్గిపో తుంది. ఎలాంటి జ్వరమది? నేను వచ్చినరోజు పూర్తిగా స్పృహలేదు! మీ అమ్మ నిన్ను కంటూనే కన్నుమూసింది. మీ నాన్న దొంగల చేతులనుండి నా సొమ్ము రక్షించడంకోసం నా వాకిట్లో ప్రాణం వదిలాడు! ఆ క్షణంనుండి నిన్ను నా కొడుకుగా స్వీకరించాను! రాళ్ళలో రాయిగా కలిసిపోవలసినవాణ్ణి రత్నంగా మలిచాను. దేశమాత కంఠహారంలో పొదిగాను! నా కన్న సంతానం వట్లకూడా నాకింత గర్వం కలుగలేదెప్పుడూ. నిన్ను చూచుకొని గర్వపడ్డాను.

"ఆ జ్వరంలో నిన్ను చూచి విధాత నా గర్వభంగం చేయడానికే తల పెట్టాడా ఏమిటన్న శంకతో నా గుండెలు కదిలిపోయాయి! గండంగడిచి బయట పడ్డావు! ఆ శ్రీరామచంద్రుని కటాక్షం సంపూర్ణంగా నీమీద ఉందన్న నమ్మకం నాక్కలిగింది, బాబూ! ఇంకేం ఫరవాలేదు నీకు!"

సుజ్ఞాన్‌కు అలవడిన భక్తితత్పరత, సేవాభావం ఈ వృద్ధుడి శిక్షణలోనే లభించాయని ఒకనాడు సుమతి చెప్పగా విన్నది ప్రమీల.

సుమతి తండ్రి భగవంతుడియందు అచంచలమైన విశ్వాసం కలవాడు సాధారణంగా భగవంతుని నమ్ముకొన్నవాళ్లు ఆయన పరీక్షలకు గురియై దరిద్రంతో అష్టకష్టాలు పడుతుంటారు. కాని, ఆయనకు క్రితం జన్మలోనే ఆ పరీక్ష ముగించి ఈ జన్మలో అక్షయసంపదలిచ్చి ఆశీర్వదించాడేమోనని పిస్తుంది. ఆయనకు దేనికీ లోటులేదు, ఇద్దరు బిడ్డల తరువాత భార్యా వియోగం తప్ప. ఎంత సంపద ఉన్నదో, అందుకు తగ్గ దాతృత్వమూ ఉంది. వంశ పరంపరంగా వస్తూన్న ఆయుర్వేదవైద్యం ఆయనకు కాలక్షేపంగా ఉపయోగ పడుతూంది.

సుజ్ఞాన్ తండ్రి ఆయన దగ్గర పాలేరు. నమ్మినబంటు. ఒకనాటి అమావాస్య నాటి రాత్రి ఇంట్లో దొంగలుపడి యజమాని త్రిజోరీ ఎత్తుకుపోతుంటే ప్రాణా పాయమని తెలిసీకూడా దొంగలకు అడ్డువెళ్ళాడు. దుడ్డుకర్రతో తలమీద






సత్కరించి పారిపోయారు దొంగలు. తల రెండై అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు సుజ్ఞాన్ తండ్రి.

ఆ కృతజ్ఞతతో సుజ్ఞాన్ రక్షణభారం స్వీకరించాడు సుమతి తండ్రి. సుజ్ఞాన్‌ను ఇంటి పిల్లవాడుగా చూసుకోవడం-కులస్తులు గాలి దుమారం లేపడానికి కారణ మైంది. ఎవరి బెదరింపులకూ లొంగక తను నమ్మిన ఆదర్శానికి కట్టుబడ్డాడు సుమతి తండ్రి. డబ్బున్నవాడు కాబట్టి ఆయన్ని ఏమీ చేయలేకపోయారు!

వృద్ధుడి వాత్సల్యపూర్ణమైన దృక్కులు ప్రమీలమీద ప్రసరించాయి. "ఏమ్మా, ప్రమీలా! బాగున్నావా?"

"నా పేరు మీకెలా తెలుసు, బాబుగారూ?" ప్రమీల ఆశ్చర్యం వ్యక్తం చేసింది.

"నీ సంగతంతా సుమతి నాకు చెప్పింది!" సరళంగా నవ్వాడు. "అదృష్ట వశాత్తూ నీకు సుజ్ఞాన్‌వంటి దేశభక్తుల పరిచయం లభించింది. దీన్ని నీవు వృథాచేసుకోవనే నా ఆకాంక్ష. సంఘపు కట్టుబాట్లు, సంప్రదాయం అంటూ ప్రతి ఆడపిల్లా ఇంట్లో బందీ అయితే దేశమాతకు దిక్కు ఎవరు చెప్పు? ఆ కట్టు బాట్లు తెంచుకొని దేశమాత సిగలో పూవుగా పరిమళించాలని ఆశీర్వదిస్తున్నా నమ్మా!"

ఎందుకో ప్రమీల కళ్ళలో నీళ్ళు మెరిశాయి. ఆయన ఆశీర్వాదానికి కృతజ్ఞతో, పులకింతో చెప్పలేం!

## 18

అయిదు రోజుల తర్వాత ఇంటికి వచ్చిన ప్రమీలను అన్నగాని, వదినగాని ఒక్కమాటకూడా అడగలేదు. ఎక్కడున్నావు; ఇలా ఎవరింట్లోనో ఉండిపో వచ్చా అని ప్రశ్నించలేదు. ముభావంగా ఊరుకొన్నారు. వాళ్ళకు ఇంచుమించు ఆ సంగతులన్నీ ఎలాగో తెలిసిపోయాయి. ప్రమీలకోసం ఏడెనిమిదివేల అప్పులోపడే అవసరం మాత్రం ఇక లేదని గుర్తించారు. ఆమె ఒకరి చేతిలోని మనిషీ కాదని గుర్తించారు. ఈనాడు హఠాత్తుగా ప్రమీలకు ఆంక్షలు విధించే మూర్ఖుడుకాడు యోగానంద్. ఆ హక్కు తనకు లేదని తెలుసు.

"హరి భార్యకు రాత్రినుండి నొప్పులు వస్తున్నాయట. హాస్పిటల్లో అడ్మిట్ చేశారు. ఇంకా కనలేదు" అంటూ ఓ నాడు వార్త తెచ్చాడు యోగానంద్.

గీతతోపాటు ప్రమీల కూడా వెళ్ళింది హాస్పిటల్‌కు.

వైజయంతికి గంటకు ముందే ప్రసవమైంది. బాబు పుట్టాడు. వైజయంతి నీరసంగా ఉన్నా ముఖం తృప్తితో వెలిగిపోతున్నది.

"ఒంట్లో కులాసాగా ఉందా?"

'ఆఁ.'

"రాత్రినుండి సతాయించాడన్నమాట ఈ వెధవ!" వైజయంతి కాళ్ళవైపు తొట్టెలో దూదిరేకులా పొత్తిళ్ళలో నిద్రపోతున్న బాబును చూస్తూ అంది గీత.

వైజయంతి గర్వంగా నవ్వింది. "నా ఆరోగ్యం బాగుండలేదని, ఆయన ఇప్పుడే పిల్లలు వద్దన్నారు. నేనే పట్టుబట్టాను! ఆడదానికి తల్లికావడంకంటే అదృష్ట మేముంది చెప్పు! ఆ అదృష్టంకోసం ఈ జన్మ ఆఖరైనాసరే, తల్లి నౌతానని చెప్పాను!"

"దేవుడిదయవల్ల అంతా సక్రమంగా జరిగింది. రెండో కాన్పుకు ఆడపిల్ల పుడితే ఆపరేషన్ చేయించుకో ఇక! నీ ఆరోగ్యం అంత మంచిదికాదని ఒప్పు కోవాల్సిందే గదా?"

"ఆయనా అదే అన్నారు!"

హరికృష్ణ వచ్చాడు. తొట్టెలో తన ప్రతిరూపాన్నీ, ఆ ప్రతిరూపానికి జన్మ నిచ్చిన తల్లినీ కంటినిండుగా తృప్తిగా చూచుకొన్నాడు.

వైజయంతి చెయ్యిమీద చెయివేసి "ఒంట్లో కులాసాగా ఉందికదా?" అన్నాడు అనురాగం తొణికే స్వరంతో.

"ఆఁ." వైజయంతి కళ్ళు మిలమిల మెరిశాయి.

"మొత్తానికి నీ పట్టుదల నెగ్గించుకొన్నావు!"

ప్రమీల ఆశ్చర్యంగా అతడినే చూస్తున్నది. అంతులేని ఆకాశంలా అతడి హృదయంలో నిండిపోయిన ప్రమీలకు ఇప్పుడు మారుమూల కాస్త సందుకూడా లేదక్కడ. అతడి గృహిణి, బాబు నిండిపోయారు. ఒకనాడు ఎంతో అసంభవ మనుకొన్న ప్రేమ ఈనాడు ఎంతో సహజంగా అల్లుకుపోయిందతడిని! భార్యా బిడ్డలమీద మమత గట్టు త్రెంచుకు ప్రవహిస్తూంది! ఇవాళ ఇక్కడ నిలబడిన ప్రమీలకేసి కన్నెత్తిచూచే తీరికకూడా లేదతడికి!

"వస్తాము, వైజయంతీ!" ప్రమీల, గీత సెలవుతీసుకొని వచ్చేశారు.

రాత్రి భోజనాలయి, వంటిల్లు శుభ్రంచేసుకొని పక్కలు వేసుకొనే సమయంలో ఎవరో పిడుగులాంటి వార్త తెచ్చారు. వైజయంతి వాతం క్రమ్మి చచ్చిపోయిందట!

యోగానంద్ స్కూటర్ మీద రివ్వున వెళ్ళిపోయాడు.

ఇంటికి తాళంపెట్టి వదినా మరదళ్ళు రిక్షా మాట్లాడుకొని ఎక్కారు.

వాళ్ళు ఇంటికి వెళ్ళేప్పటికి వైజయంతి దీర్ఘనిద్రపోతూ తెల్లగుడ్డ కప్పుకొని వరండాలో దర్శన మిచ్చింది!

హరికృష్ణ యోగానంద్ గుండెల్లో ముఖముంచి క్రుళ్ళి క్రుళ్ళి ఏడుస్తున్నాడు.

ఒకరోజైనా నిండకుండానే తల్లిని పోగొట్టుకొన్న బాబు కేర్ కేర్ మంటున్నాడు, వాళ్ళ అమ్మమ్మ ఒళ్ళో.

## 19

భజన ముగిసింది. సుమతి హారతి ఇచ్చింది. ప్రమీల, మరొకమ్మాయి ప్రసాదం పంచారు.

"మీ రా అమ్మాయిని ఏంచేయాలనుకొన్నారు?" ఒకతడు అడిగాడు సుజ్ఞాన్‌ను.

"పెళ్ళి!"

"ఎవరికిచ్చి? ఆ పిల్ల ఎంత చదువుకొన్నదైనా, అందగత్తె అయినా కులం సంగతి మరిచిపోడానికి ఎవరు ఇష్టపడతారు? పెళ్ళిచేసుకొని కాపురం పెట్టాక వాళ్ళమ్మ ఏ క్షణంలో ఊడిపడి దౌర్జన్యంతో లాక్కుపోతుందో తెలియదుకదా? ఇలాంటి అలాంటి ఆడదికాదు! ఈ నగరంలో పేరుమోసిన వేశ్య!''

సుజ్ఞాన్ చురుగ్గా చూసి అన్నాడు: ''స్వప్న వేశ్య కూతురైనా మనిషి అలాంటిది కాదుగా? ఆ పిల్లకు ఆ వృత్తి ఎంతమాత్రం ఇష్టంలేదు. మన సహాయం

అర్థించింది. ఇలాంటివాళ్ళకు మనం సహాయం చేయలేకపోతే మన సంఘం నిష్ప్రయోజనమౌతుంది "

"కాదు, భాయ్ ! స్వప్న తల్లి బాగా డబ్బున్నది : పోలీస్ డిపార్ట్‌మెంట్‌నే చేతిలో పెట్టుకొంది. దాని ఇష్టానికి వ్యతిరేకంగా నడిచినవాళ్ళను అది నామ రూపాల్లేకుండా చేయగలదు."

"అలాగని స్వప్నను నిస్సహాయంగా వదిలివేయగలమా ? ఈ సమాజసేవే కష్టాలతో కూడుకొన్నది, విశ్వం ! కష్టాలను ప్రేమించాల్సిందేగాని పారిపో కూడదు మనం !"

స్వప్న అనే అమ్మాయి నెలరోజులక్రితం సుజ్ఞాన్ దగ్గరికి వచ్చి తన కథ చెప్పుకొంది.

స్వప్న అందమైన యువతి. కాలేజీలో బి. ఎ. చదువుతూంది. ఏం పాపం చేసుకుందో తను వేశ్యకూతురై పుట్టానని వాపోయింది. తనకా వృత్తి చేయడం ఇష్టంలేదు. పెద్దగా చదువుకోకపోయినా, ఆస్తిపాస్తులు లేకపోయినా ఏ కులమైనా తన్ను పెళ్ళిచేసుకొని సంసారిగా జీవితం గడుపుకొనే అవకాశ మిచ్చే మగవాడైతే చాలు — తను పెళ్ళి చేసుకొంటానంది. తల్లి వెకిలిచేష్టలతో ప్రతిరాత్రి ఒక గండమైపోతుందని ఏడ్చింది. మీ సంఘంద్వారా నాకు సహాయం చేయమని అర్థించింది.

తప్పకుండా చేస్తానని మాటిచ్చాడు సుజ్ఞాన్.

ఆమెకు తగిన వరుణ్ణి వెదికేలోగానే ఓ రాత్రివేళ పారిపోయి వచ్చింది సుజ్ఞాన్ గదికి. అతడి కాళ్ళు పట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చేసింది. "ఈ శరీ రాన్నిక పవిత్రంగా ఉంచుకోవడం నాకు సాధ్యంకాదు, సుజ్ఞాన్‌బాబూ ! నా కెక్కడైనా కాస్త విషం తెచ్చిపెట్టండి !"

సుమతి దగ్గరికి తీసుకువచ్చి ఆ రాత్రి ఆమెకు అప్పగించాడు.

ప్రస్తుతం ఆ పిల్లకోసం వరాన్వేషణ సాగుతోంది !

## 20

ఒకనాడు యోగానంద్ హరికృష్ణ ఇంటినుండి వచ్చాక, హరికి రెండోపెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నాయని చెప్పాడు భార్యతో, అక్కడేఉన్న ప్రమీల కూడా వినాలనే ఉద్దేశ్యంతో.

"యశోదత్త మన ప్రమీలనిస్తే చేసుకొంటామన్నట్టు మాట్లాడింది ! హరికి కూడా ఆ ఉద్దేశ్యం ఉన్నట్టుంది !"

"ప్రమీల ఇష్టపడాలికదా?" అంటూ ప్రమీల ముఖంలోకి చూచింది గీత. అక్కడ ఏ భావమూ కనిపించలేదు? "రెండో పెళ్ళి అని ఒకటేగాని చిన్న వయసువాడు! బాగా సంపాదిస్తున్న డాక్టరు! రెండో పెళ్ళి అయినా చేసుకొనే వాళ్ళ అదృష్టవంతులనే చెప్పాలి!"

ప్రమీలకు కలిగిన జుగుప్స అంతా ఇంతా కాదు.

ఆ సాయంత్రం గీత, యోగానంద్ షాపింగ్‌కు వెళ్ళారు. ప్రమీల ఒక్కతే ఉంది ఇంట్లో.

వాకిట్లో స్కూటర్ ఆగిన శబ్దం వినిపించిన కాస్సేపటికి హరికృష్ణ లోపలికి వచ్చాడు.

"అన్నా వదిన లేనట్టున్నారు?"

"లేరు బజారుకు వెళ్ళారు! బాబు బాగున్నాడా?"

"బాగున్నాడు!"

"తమరు మళ్ళీ పెళ్ళికొడుకు కాబోతున్నారట!"

"తప్పా?"

"ఛీ! నువ్వెంత సిగ్గులేనివాడివి! వైజయంతి పోయి నెలయినా కాలేదు. అప్పుడే ఆమెను మరిచిపోయి ఆ స్థానంలోకి మరొకరిని తెచ్చుకోవాలను కొంటున్నావా?"

"క్రొత్తవా రెవరినీకాదు. నిన్నే తెచ్చుకోవా లనుకొంటున్నాను, ప్రమీలా! ఒకనాడు నిన్ను చేపట్టడానికి అడ్డువచ్చిన కర్తవ్యభారం ఈనాడు రాదు!"

"ఛీఛీ! నువ్వెంత చెడ్డవాడివి, హరీ! చెడ్డవాళ్ళందరిలోకి చెడ్డవాడివి!" ముఖంలో ఎంత జుగుప్సను చూపవచ్చో అంతా చూపింది! "ఒకరోజు నన్ను గాఢంగా ప్రేమించావు! పరిస్థితులు అనుకూలించక వైజయంతిని వివాహం చేసుకొన్నావు! ఆమెను ప్రేమించావు! గృహరాణితో అనుభూతులెన్నో పంచు కొన్నావు: అందుకు తీయటి గుర్తుగా ఒక బాబు ఉదయించాడు. ఈ రోజు అన్నీ మరిచిపోయి మరో స్త్రీ సాహచర్యాన్ని కోరుతున్నావు. నిన్ను చూస్తుంటే ఇక ఈ మనుషులమధ్య కలిగే ఈ ప్రేమ, ఈ మమత అన్నీ మిథ్యే అని పిస్తూంది! మనిషితోపాటే మమతకూడా నశిస్తుందా?"

"నువ్వొక ఆవేశంలో అంటున్నావు, ప్రమీలా! వైజయంతి స్మృతి నాలో పదిలంగా ఉంటుంది. నన్ను దరిద్రంనుండి విముక్తిచేసిన వైజయంతికి నేనెంతో కృతజ్ఞుణ్ణి. అలాగని ఆ స్మృతితో అవసరాలన్నీ తీరవుకదా?"

"ఓ! హరీ! చాలా సేపైందా వచ్చి?" యోగానంద్, వెనుక గీత ప్రవే సించారు.

## 21

స్వప్న, మల్లిక్ పుష్పహారాలతో రిజిష్ట్రార్ ఆఫీసునుండి బయటికి వస్తూనే అభినందించడానికి వచ్చిన స్నేహబృందంతోపాటు స్వప్న తల్లికూడా ఉంది!

స్వప్న చటుక్కున ముఖం త్రిప్పుకొన్నది!

తల్లి ఆనందంతో చేతులుచాచి ముందుకు వచ్చింది. "జరిగినవన్నీ మరిచిపో, తల్లీ! పాపిష్టిదాన్ని. నీ మనసు కనిపెట్టక చాలా కష్టపెట్టాను. పెళ్ళిబొట్టుతో ఎంత కళగా ఉన్నావమ్మా? నా చేతులమీదుగా నీ పెళ్ళి చేయలేకపోయాను. అల్లుడుగారూ, నన్ను మీరిద్దరూ క్షమించి ముందుగా మా ఇల్లు పావనం చేయండి. రేపు వ్రతం అదీ చేశాక అమ్మాయిని మీతో పంపిస్తాను!"

"ఆ పాపిష్టి కొంపలో నేను అడుగుపెట్టడమా? ఛీ!" కసురుకొంది స్వప్న.

"మనిషి తన తప్పు తెలుసుకొన్న తరువాత క్షమించడం నేర్చుకోకపోతే మనం మనుషులంకాము, స్వప్నా! అమ్మను క్షమించు. ఆమెకు కష్టం కలిగించకు!" సుజ్ఞాన్ అన్నాడు.

"సుజ్ఞాన్ బాబూ! మొత్తానికి మీరు ఘటికులు! ఎన్ని కష్టాలువచ్చినా అనుకొన్న పని సాధిస్తారు!" ఆనందిని తనకు సహజమైన వెకిలినవ్వు నవ్వింది. "రేపు విందుకు మీరంతా రావాలి! నన్ను కృతార్థురాలిని చేయాలి!"

"అవస్యం!"

ఆనందిని మరోసారి సుజ్ఞాన్ స్నేహబృందంకేసి తిరిగి అతి వినయంగా చేతులు జోడించి "రేపు మీరంతా మా ఇంటికివచ్చి నన్ను కృతార్థురాలిని చేయాలి!" అని, స్వప్న చెయ్యందుకొని కారువైపు కదిలింది, అల్లుడుగారిని చూపులతోనే ఆహ్వానిస్తూ.

సుజ్ఞాన్‌తోపాటు అక్కడ మిగిలిపోయిన అందరి ముఖాలలో ఒక ఆశ్చ ర్యంతోపాటు విజయగర్వంతోకూడిన ఒక మందహాసంకూడా ఒలికింది!

* * *

ఆ రోజు విందుకు సుమతి వెళ్ళలేదు, అనారోగ్య కారణంగా.

ఆ రోజు భజన అయ్యాక ప్రమీల వెళ్ళాలనుకొందిగాని సుమతి ఎందుకో వెళ్ళనివ్వలేదు. ఆ రాత్రి అక్కడే ఉండిపోయింది ప్రమీల.

"సుమతీ!" సుజ్ఞాన్ ముద్దుగా పిలిచాడు.



సుమతి త్రుళ్ళిపడి లేచింది, అతడి కంఠం ఏదోలా వినిపించడంతో. "సుజీ, ఏమిటి అలా ఉన్నావు?" కంగారుగా అతడిని సమీపించింది.

"నన్ను హాస్పిటల్‌కు తీసుకుపో, సుమతీ! భోజనంలో స్లో పాయిజన్ ఇచ్చారు! ఆనందిని ఇంట్లోనే నా కెలాగో అనిపించింది. రిక్షాలో ఇంటికివచ్చి అయిదు నిమిషాలు పడుకొన్నాను. ఊహుఁ. నాలికమీద ముళ్ళు వచ్చేస్తున్నాయి. కడుపులో మంట! ఆనందిని మోసం గుర్తించాను! గదికి తాళంకూడా వేయకుండా వచ్చేశాను. పనిమనిషిని పంపించి తలుపు తాళం వేయించు!" నీరసంగా సుమతి మంచంమీద ఒరిగిపోయాడు.

సుమతి బాణంలా దూసుకుపోయింది, టాక్సీ పిలువడానికి.

"ఇంకో అయిదునిమిషాల తరువాత నేను మాట్లాడగలనో లేదో, ప్రమీలా! నా దగ్గరగా రా!" ప్రమీల చేతిని తన చేతుల్లోకి తీసుకొన్నాడు. "నాకంటే పెద్దవాళ్ళను మాతృమూర్తులుగా, చిన్నవాళ్ళను సోదరీమణులుగా భావించే నేను నీ దగ్గరికి వచ్చేప్పటికి దుష్టుణ్ణి అయిపోయాను! నిన్ను అలాగ భావించుకోలేకపోయాను. ఇరవై ఎనిమిది సంవత్సరాలుగా ఖాళీగా ఉన్న హృదయపీఠంమీద నీ మూర్తిని ప్రతిష్ఠించి ఆరాధించాను. ఈ సంగతి నీకు వ్యక్తంచేయలేకపోయాను. ఎప్పటికప్పుడు సిగ్గుకలిగేది. ఇక ఇప్పుడు మౌనంగా ఊరుకొంటే ఇంకెప్పుడూ ఈ సంగతి చెప్పలేనేమో, ప్రమీలా!"

ప్రమీల కళ్ళనుండి ఒకటే ధారగా అశ్రువులు ప్రవహించసాగాయి. ఏదో చెప్పబోయిందిగాని దుఃఖంతో గొంతు పెగల్లేదు.

కాని, సుజ్ఞాన్ ఆ కళ్ళలో తనకు కావలసిందేదో చదువుకొని తృప్తిగా ఒక నిట్టూర్పు విడిచాడు. "బ్రతకగలిగితే నిన్ను పొందుతాను, ప్రమీ!" అన్నాడు గొణిగినట్టుగా. "నా శక్తిని దేశానికి పూర్తిగా ధారబోయకుండానే హఠాత్తుగా ఇక్కడినుండి వెళ్ళిపోవలసి వచ్చినట్టుంది! మృత్యువంటే నాకు భయమేలేదు. దానినుండి పారిపోవాలనీలేదు. కాని, అది ఈ రూపంగా రావడంమాత్రం నాకు కొంచెం దుఃఖంగా ఉంది!"

*　　*　　*

అర్ధరాత్రి సుజ్ఞాన్ స్నేహితులతో కిటకిటలాడిపోయింది హాస్పిటల్. అందరి ముఖాలలో ఆందోళన, భయం నిండిపోయాయి. నిమిష నిమిషానికీ వాచీలు చూచుకొంటున్నారు.

తూరుపురేకలు విచ్చుకొంటున్న సమయంలో 'సుజ్ఞాన్ ఇకలేడు' అన్న వార్త అతడి స్నేహితులకు అందింది. డాక్టర్ల ప్రయత్నమంతా విఫలంచేసి సుజ్ఞాన్ ఈ లోకంనుండి వెళ్ళిపోయాడు.

## 22

ఆనందిని పోలీసులకు దొరకలేదు. ప్రస్తుతం పలాయనంలోఉంది. స్వప్నను కూడా తీసుకువెళ్ళింది. క్రొత్తపెళ్ళికొడుకు మల్లిక్ గదిలోంచి బయటికి రాలేక అవమానంతో, దుఃఖంతో క్రుంగిపోతున్నాడు.

*　　*　　*

సుజ్ఞాన్ మరణంవల్ల అందరికి కలిగిన దుఃఖం ఒకఎత్తు. సుమతికి కలిగిన దుఃఖం ఒకఎత్తు.

పిచ్చిదానిలా తయారైంది సుమతి. అన్నం నీళ్ళకు దూరమై మూడురోజు లవుతూంది. ప్రమీల గంటసేపుగా బ్రతిమాలుతూంది! నువ్వే ఇలాగైపోతే ఎలాగని మందలిస్తూంది.

"సుజీ మీకంతా స్నేహితుడు మాత్రమే. కాని, నాకు... నా హృదయ మందిరంలో పూజింపబడుతున్న దేవుడమ్మా అతడు! ఇద్దరం ఒకచోట పెరిగాము. అతడి సాహచర్యం నాలో కలిగించిన భావం వేరు. అతడిలో కలిగిన భావం వేరు. అతడికి నాన్నగారు పితృతుల్యులు. నేనంటే సహోదర ప్రేమ. కాని, పాపిని... పెరిగి పెద్దదాన్నైఅయి విచక్షణ కలిగేనాటికి బలంగా అతడి మీద ప్రేమ నాటుకుపోయింది. అది మార్చుకోడానికి నాకు వశంకాలేదు. అతడు

అనుక్షణం కంటిముందు మసులుతూంటే నా వికారం ఎక్కడ బయటపడి పోతుందోనని అతడి చదువు పూర్తిఅవుతూనే ఇంట్లోంచి తరిమివేశాను.

"అతడు లేని సంఘసేవలు నేనేం చేస్తాను? అతడే నా ప్రాణం, నా ఉత్తేజం, నా శక్తి. అతడితో అన్నీ పోయాయి. మిగిలింది ఈ కట్టె. దీన్ని నిలుపుకో వాలన్న ఆసక్తి నాకేంలేదు!" చెంగు ముఖంమీద కప్పుకొని భోరుమంది.

"సుజ్ఞాన్‌బాబు ఎక్కడికీ వెళ్ళలేదక్కా! ఈ ప్రపంచంలో దీనదుఃఖితుల మధ్యనే ఆయన ఆత్మ పరిభ్రమిస్తూ ఉంటుంది. వాళ్ళ సేవలోనే మనం ఆయన్ని చూడగలుగుతాం. ఇలా వైరాగ్యంలో పడిపోయి మన జీవితాల్నే మనం అలక్ష్యంచేసుకొని ప్రపంచంనుండి పారిపోవాలనుకొంటే సుజ్ఞాన్‌బాబు కనిపించదక్కా!"

సుమతి ఏడుపుమానేసి ఆశ్చర్యంగా ప్రమీల ముఖంలోకి చూడసాగింది.

"ఈ ప్రపంచంలో ఒక మనిషిని ఎక్కువమంది ఇష్టపడితే భగవంతుడు కూడా అతడినే ఇష్టపడతాడేమో? అందుకే మంచివాళ్ళను చాలారోజులు ఉంచడు నేలమీద. జ్యోతిప్రకాశం ఉజ్వలమైనకొద్దీ చమురు అంత తొందరగా తగ్గిపోతూ ఉంటుంది. అలాగే మంచివాళ్ళ ఆయువుకూడానేమో! అందుకే సుజ్ఞాన్‌బాబు మన మధ్యనుండి అంత తొందరగా వెళ్ళిపోయాడు. కాని, ఆయన వెలిగించిన జ్యోతులింకా ఉన్నాయి, అక్కా! అందులో నేనొకదాన్ని. ఒకనాడు ఆయన రక్షించితెచ్చిన ఈ జీవితాన్ని ఆయన ఆదర్శానికే అంకితం చేస్తాను! వెలగగలిగినంతవరకు వెలిగి మరికొన్ని దీపాలను వెలిగిస్తాను!"

కొడిగట్టిన దీపాన్ని దులిపి వత్తి పెద్దది చేశాక నిండిపోయే వెలుగేదో సుమతి ముఖంలో కనిపించింది. ఒక ఉత్తేజంతో ప్రమీల చెయ్యి అందుకొంది. "పద! దీన దుఃఖితులమధ్య సుజీ దొరుకుతాడేమో చూద్దాం! ఇక చచ్చేంత వరకు ఈ చేతులు మనం విడువొద్దు. ఇలాగే కలిసి ఎంతదూరమైనా నడిచి అతడిని కనుగొందాం!"






అప్పుడే రైలు దిగిన నాగభూషణరావు చేతిలో సూట్‌కేస్ పట్టుకుని స్టేషను బయటికి వచ్చాడు. "రిక్షా కావాలా సార్?" అంటూ తన చుట్టూ మూగిన రిక్షావాళ్ళని ఒకసారి కళ్లు చిట్లించి విసుగ్గా చూశాడు.

"ఏరా...వస్తావా?"

"చెప్పండి సార్ ... ఎక్కడికి?" అన్నాడు వాడు సీటు దులుపుతూ.

"గాంధీ చౌక్."

"రండి...కూర్చోండి."

"ఏం పుచ్చుకుంటావ్?"

"రూపాయి ఇప్పించండి సార్."

"ముప్పావలా ఇస్తాను...వస్తావా?"

"అబ్బే...కుదరదండీ...ఎత్తు-పైగా ఎదురుగాలి."

"అయితే పో..."

ఇంకో రిక్షావాడిని అడిగాడు నాగభూషణరావు.

"ఏటి ... గాంధీ చౌకేనా? ... రూపాయి యిప్పించండి దొరా!"

ముప్పావలాకి ఒక్కపైసా కూడా ఎక్కువ యివ్వనని చెప్పి ముందుకు అడుగులు వేశాడు.

"ఇదిగో రిక్షా ... నిన్నే...గాంధీ చౌక్ వస్తావా?"

"ఆ...రూపాయిపావలా యిప్పించండి"

"ఏమిటీ?!...రూపాయిపావలా నా?! ...నేనీ ఊరికి క్రొత్తనుకున్నావా ఏమిటి? ... ముప్పావలా యిస్తాను... వస్తేరా-లేకపోతే పో..."

"ఎప్పుడైనా రిక్షా ఎక్కిన మొగమేనా ఇది" అని పొగరుగా అంటూ వెళ్లిపోయాడు వాడు.

నాగభూషణరావుకి వాడిమీద గొంతు దాకా కోపం వచ్చింది. కాని ఏం చెయ్యగలడు?...




ఇంకొంతమందిని అడిగాడు. ఎవ్వరూ రూపాయికి తగ్గలేదు. నిజానికి స్టేషనుంచి గాంధీచౌక్‌కి ముప్పావలా సరియైన ధరే. కాని రైల్లోంచి దిగినవాళ్లు బాబూ ఎంత చెప్పినా వస్తారని రిక్షా వాళ్ళు వాళ్లిష్టమొచ్చిన విధంగా అడుగు తుంటారు.

నాగభూషణరావుకి విసుగుపుట్టింది. ప్రయాణంచేసి చాల బడలికగా ఉంది. దానికితోడు రాత్రంతా రైల్లో నిద్రలేదు. "పోనీలే ... ఒక్క పావలాతో నేను మిగిల్చేదేమిటి? ... రూపాయి యిచ్చి వెళ్లిపోతాను" అనుకున్నాడు.

"ఏయ్ రిక్షా ... గాంధీచౌక్‌కి వస్తావా?" అంటూ ఒక రిక్షావాడిని అడిగాడు.

"రండి బాబూ...కూర్చోండి"

"ఏం తీసుకుంటావ్?"

వాడెలాగూ రూపాయి అడుగుతాడని అనుకుంటూ ప్రశ్నించాడు నాగభూషణ రావు,

"ముప్పావలా యిప్పించండి బాబయ్యా!..." అన్నాడు రిక్షావాడు అతివినయంగా.

"పదణాలు ఇస్తాను ... వస్తావా? ..." అన్నాడు నాగభూషణరావు.






ఓరే..."

"ఇదేమిట్రా...ఇలా వచ్చేశావ్?''

"నాన్న..."

"ఆః మొన్ననేగా ఆసుపత్రిలో చేర్పించి..."

అతనేమీ మాట్లాడక, యెదురుగుండా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

నేను నిర్ఘాంతపోయి చూస్తూవున్నాను.

వాడు ఆరంభించాడు.

"అలా చూస్తూవుంటే లాభంలేదు. మీ ఆఫీసరుకు చెప్పి, వెంటనే బయలు దేరు...మరి శవ...''

వాడి స్వరంలో గాద్గదికత లేదు. అనుమతినిపొంది, నేను వాడి ననుస రించాను. ఆఫీసు గడియారం రెండు గంటలు కొట్టింది.

నాలో నేను చాలా బాధపడుతున్నాను. ఈ రెండురోజుల్లో ఒక్కసారైనా అసు పత్రికివెళ్ళి, రోగిని చూడలేకపోయానే అని. ఎంత పొరపాటు, ఎంత అజ్ఞానం! దైనందిన అట్టహాసంలో ఈ కొద్దిపాటి కర్తవ్యానికి కూడా అవకాశం లేక పోయింది!

దిద్దుకో వీలులేని తప్పుకు యావజ్జీ

పితం ప్రాయశ్చిత్తమే. అంతే. ఒక్క సారైనా వెళ్లి చూసివుంటే ఆ రోగి కోరేది ఇంకేమీలేదు. తనలోని దీపం ఆరిపోతున్నా, మరొక ఉజ్జ్వల దీపం కేసి చూస్తూవుంటే ఏదోతృప్తి: ప్రేమకు నోచుకోనివారికి ప్రేమ గాథలు ప్రాణ ప్రదమైనట్లు. అంతమాత్రపు సానుభూతి నాలో కరువైంది.

"డాక్టరు యేం ఫరవాలేదన్నాడు గదరా," అన్నాను.

"అవును..."

"మరి..."

"నాకు ఆఫీసుకు ఆసుపత్రినుంచి ఫోన్‌కాల్ వచ్చింది. 'మీ నాన్నగారు పరమపదించారు. మీరు వెంటనే రావాలి అని:"

"అయితే నువ్వు..."

"శెలవు దొరకలేదు. పైగా ఆదుర్దా ఏమీ లేదని డాక్టరు ఉదయమే చెప్పె:"

"సమయానికి నువ్వూ లేవన్నమాట ఆయన దగ్గర?"

"లేను. నే వెళ్ళేప్పటికే శవమంది రానికి మార్చారు."

బలవన్మరణంకన్న కూడా ఏకాంత మరణం మరింతఘోరం: ఆ జీవి ఏం వినాలని, ఏం చెప్పాలని వ్యథపడి, క్షోభపడి వుంటుందో? చీకటి కమ్ము కుంటున్న ఆ సంధ్యాసమయంలో ఏ ప్రత్యక్ష ముఖం కేసో చూస్తూ, కనులు మూయాలని కాంక్షించని జీవి ఎవ డుంటాడు? సర్వశక్తినీ, హరించి పోతున్న సర్వశక్తినీ శుష్కనేత్రాల్లో ఇముడ్చుకొని, ఆ సజీవ ముఖంకేసి చూస్తూవుండటమే జీవి కోరేది. కాని ఆ కోరిక, మృత్యుశయ్యపైని కోరికకూడా కొంతమందికి తీరని కోరికే. ధూళిధూస రితమై, పెనుగాలులు హోరెత్తు స్మృతి వీధిలో సలుపుపరిదేవన యమపాశపీడన కన్న కూడ క్షోభ.

వాడు నా భుజాన్ని తట్టాడు. "బావుంది. ఏమిటి ఇంకా ఏవో ఆలో చనల్లో పడ్డావు. ... ముందు కర్తవ్యం చూడాలి" అన్నాడు.

"అవును...మరి...ఆయన సదాచార సంపన్నుడు...శవ వాహకులు:"

"అప్పుడే రెండు దాటింది. ఆకాశం అంతా మబ్బు మబ్బుగా వుంది...సాధ్య మైనంత త్వరలో......"

"సరే...అయితే... ఆసుపత్రినుంచే ఫోనుచేద్దాం...కారుకు"

కారువాడు పాతిక అడిగాడు. యాభై అడిగినా ఇచ్చేవాళ్ళమే. ఆసుపత్రి శవ మందిరపు ద్వారంలో నిలబడ్డాం.

"మీ.. అమ్మగారు" అన్నాను.

ఒక్కమాటుగా వాడి ముఖం అంతా కదలబారింది. కళ్లు నిలకడ తప్పినయ్.

"అదేరా...మరీని: ఇవాళ పొద్దున ఆవిడ ఆసుపత్రికి బయలుదేరుతానంటే, సాయంకాలం తీసుకువెళ్తాలే అని ఆపాను ...ఇప్పుడావిడకోసం మా మేనల్లుడిని

పంపాను..ఆవిడముఖం..ఎలా చూచేది?" అన్నాడు కంపిస్తున్న గొంతుతో.

ఎవడో తలపాగా చుట్టుకున్న వాడొ కడు మెల్లిగా మా ముందు ప్రత్యక్ష మయాడు. అంతకు ముందునుంచికూడా వాడు ఆ ప్రాంతాల్లోనే ఉన్నట్టు నాకు ఛాయగా గుర్తు. కాని నా చూపుగాని, ఆలోచనగాని వాడిమీదకు అంతకు మునుపుపోలేదు.

"బాబు...గారూ!''

చూశాం వాడికేసి. ఏదో ఒంటెద్దు బండివాడిలా ఉన్నాడు. ఈ సమయంలో వీడెవడు? నా కాశ్చర్యమేగాక, తీవ్ర కోపం వచ్చింది. అందుకు బహుశ నా స్వంత అశక్తతే కారణం కావొచ్చు. నిస్పృహ, ఆశక్తత ఎక్కువగా కోపానికి ఆజ్యం పోస్తయ్.

"అరగంటలో వెళ్లి పోతాం" అన్నాడు వాడు.

"ఎక్కడికిరా?"

నా ప్రశ్న వినిపించుకున్నట్టు లేదు వాడు.

"గిత్తండి బాబు...గిత్త...జోరుగా ఎళ్తుంది."

"వీడి బండి గోల ఏమిటి?"

''ఏమిటీ గొడవ?" అన్నాను.

వాడు జవాబు చెప్పాడు. ఒక్క అరగంటలో శవాన్ని బండిలో శ్మశానానికి చేరుస్తానంటున్నాడు. నేను, మిత్రుడు ఇద్దరం కొంచెంసేపు తెల్ల పోయాం. ఈ ఆసుపత్రి ద్వారాలనుంచి సూటిగా అంతిమయాత్ర చేసేవారి వాహన సౌకర్యం గురించి ఆలోచించి ఉంటే, బహుశ అంత ఆశ్చర్యానికి అవ సరం ఉండేదికాదు. చటుక్కున వీడెవడో చిన్న రైల్వేస్టేషన్ ముందు బాడుగ మాట్లాడుతున్నంత తేలిగ్గా మాట్లాడటం నాకు చిత్రంవేసింది. గోడ అవతల ఉన్న ఒంటెద్దుబండి గూడు, ఎద్దు నల్ల మూపురం, కొమ్ములు కనపడినయ్.

"తెలిసి వచ్చావా?" అని అడిగాను.

"కాదు బాబూ! ప్రొద్దూకులా ఇక్కడే ఉంటాను."

రోజూ శవాలను జేరవేయటమే అన్నమాట నీ పని?"

"అవును...బాబూ!''

"ఇప్పటికి ఎన్ని వందలమందిని లాక్కుపోయావు?" అని అడిగాను వెటకారంగా.

వాడు పెద్దగానవ్వుతూ "అదేంటి బాబూ...దేవుడు చల్లగా చూడాలిగాని మిమ్మల్ని మటుకు..." అన్నాడు.

నా గుండె జలదరించింది. వాడి మాట పిడుగులా పడింది చెవిలో. ఎంత నవ్వుతూ చెప్పేశాడు...మళ్ళీ క్షణంలో తమాయించుకున్నాను.

మా వాడికి విసుగు తోచింది. "వాడితో ఏమిట్రా నీకు? ఇలాగే ఏదో ఒక అశుభం అనిపించుకోటం సరదా" అని నన్ను చివాట్లుపెట్టి, "పో అబ్బీ,

 నగు




పో...మేం కారుకు ఫోనుచేశాం" అన్నాడు.

వాడి తీరు మారింది.

"అదేంటి బాబూ! కారెందుకూ... అదొచ్చేలోపు తీసుకుపోతాను...పరుగెత్తిస్తాను గిత్తని" అన్నాడు.

''ఉండరా బాబూ నువ్వు...నువ్వో మిత్రా పీడ" అని మా వాడు అంటూనే ఉన్నాడు ఆ కారు రానే వచ్చింది.

''ఏమి సార్...శీఘ్రంగా పోదాం" అన్నాడు డ్రైవరు.

"కొంచెంసేపు ఆగాలి" అన్నాడు మావాడు.

టాక్సీలోంచి ఎవరో దింపుతూన్నట్టు దిగింది వాడి తల్లి. ఆమె ముఖంలో, కళ్లలో జీవం లేదు. ఇళ్ళు నిప్పంటుకున్నప్పుడు, ఆ జ్వాలలకు చుట్టుప్రక్కల చెట్టు, చేమ కమిలిపోయినట్టుంది ఆమె ముఖం. నోట మాటలేదు. గందరగోళం లేదు. గుండె బాదుకోవటం లేదు. జీవశక్తులన్నీ దగ్ధమై, కేవలం ఆకారం మటుకు నిలిచి ఉన్నట్టుంది. ఆ కళ్లలోని దవానలంముందు, కార్చిచ్చు చిన్న నిప్పునలుసు. ఏడ్పుల్లో, పెడబొబ్బల్లో, – ఏదోవిధమైన ఒక ఉపశమనం! ఏదో బరువు తృణమాత్రమైనా తగ్గినట్టుకాని ఈ రోదన హీన. నిశ్శబ్దదుఃఖం, లోతులోతుకు, మరింత లోతుకు దించుకుపోయే పదునుకత్తి! ఆ నిబ్బరం, ఆ స్తబ్దత, ఆ మౌనం చాటున, శతసప్త సముద్రముల ఘోష ఉక్కిరిబిక్కిరి అవుతూ ఉంటుంది. ఆ దుఃఖము ఒకరికి వినికిడికి కాదు, ఒకరి ఓదార్పుకు కాదు. అది సహజీవి విచ్ఛేదంవల్ల

శరీరంలో అణువు అణువున చీల్చుకుని ఘోషించు భగ్నాత్మవేదన! మృతినుంచి జనితమైన ఈ దుఃఖానికి మృతే ఓదార్పు!

కొడుకును గుండెకదుముకున్న ఆమె అశ్రువులు, జీవిత రహస్యాన్ని, సత్యాన్ని వ్యక్తంచేసే దుఃఖాక్షరాలు. గొడ్డలిపెట్టుకు చెట్టు అల్లల్లాడినట్టు ఆమె తల్లడిల్లింది.

"ఎంత పాపిష్టిదాన్ని!"

కారు డ్రైవరు తొందరచేస్తున్నాడు. మెల్లిగా శవాన్ని కారులో పడుకో పెట్టాము. ఎక్కడ దెబ్బతగిలిపోతుందో! చేతికెక్కడ కారు తలుపు గీచుకుం టుందో! మోకాలి కెక్కడ దెబ్బ తగులు తుందో! నిర్జీవ ఆకృతి. కాని ఇంకా జీవించి ఉన్నట్టే మమత! నాకొక చిన్న నాటి విషయం గుర్తు వచ్చింది. ముసలి అవ్వ శవమును పాడెపై పరుండబెట్టి, ఆమె మెడను తాడుతో బిగించబోగా, ఆ వ్యక్తిని ఒక తోపుతోశాడు చూస్తూ ఉన్న కుర్రవాడు. ఆమె జీవించి ఉన్నట్టు, తాడు ఒరిపిడి కామె గొంతుక ఒరుసుకొని పోతుందని ఆ కుర్రవాని బాధ. అ పెద్దవ్యక్తి చిరు నవ్వునవ్వి పాశబంధనం పూర్తిచేశాడు.

కారెక్కబోతున్నాం. అ తలపాగా వాడు నాకేసి, డ్రైవరుకేసి మహాతీక్ష ణంగా చూస్తూ, గొణుక్కుంటున్నాడు. వాడి చూపులకు నా గుండె మళ్ళీ జలద రించింది.

"నేనైతే మూడు రూపాయలకు తీసుకుపోయేవాడిని. ఇవ్వండి కారుకు పాతికరూపాయలు."

వాడి మాటల విసురు స్పష్టంగా విన బడింది.

ఆ ఒంటెద్దుబండి నల్లనిగూడు, ఆ ఎద్దు నల్లటి మూపురం, వాడి ఎరుపు అంచు తలపాగా, కారులో కూర్చున్న నా కళ్ళలో అనుక్షణం మెదులుతూనే ఉన్నాయి!

"పొద్దూకులూ ఇక్కడే ఉంటాను."

"శవాలను జేరవేయటమే పని."

ఎంతో తాపీగా వాడన్న మాటలు నాకిప్పటికీ వినిపిస్తూనే ఉంటయ్. ఆప్తులు రోగుల గృహాగమనానికి ఎదురు చూస్తూ ఉంటే, ఇక్కడ, వీడు వారి శ్మశానాగమనానికి ఎదురు చూస్తూ ఉంటాడు. రోగులంటే వాడికి శత్రుత్వం లేదు. పైగా ఇష్టమే. ఎప్పుడు స్ట్రెచర్ శవమందిరంవైపు వస్తుందా అని చూస్తూ ఉంటాడు.

అది వాడి...!






ఒకానొక నగరంలో ఒక సంపన్ను రాలైన యువతి ఉండేది. ఆమె భర్త అస్తమానమూ ప్రయాణాలమీద తిరుగుతూ ఉండేవాడు. ఆమె ఒంటరితనం భరించలేక ఒక అందమైన యువకుడి స్నేహం సంపాదించి, అతనితో సుఖంగా కాలక్షేపం చేస్తూ వచ్చింది.

ఒకసారి ఆ యువకుడు ఒక ముసలివాడితో తగాదాపడి, మొహం పగలగొట్టి గడ్డంపట్టి పీకాడు. ముసలివాడు వెళ్ళి ఆ నగరపు వలీ (నగర రక్షణాధికారి) వద్ద ఫిర్యాదుచేసి, యువకుణ్ణి ఖైదు చేయించాడు.

తన ప్రియుణ్ణి ఖైదులో పెట్టినవార్త తెలియగానే ఆమెకు విచారమూ, ఆగ్రహము కూడా కలిగాయి వెంటనే ఆమె ఒక పథకం ఆలోచించి, చక్కగా అలంకరించుకుని, వలీగారిని చూడాలని అర్జీ పెట్టుకుని, విజ్ఞాపనల హాలులోకి వచ్చింది. ఆమెకుగల ఆకర్షణశక్తితో ఆమె ఏ విజ్ఞాపన నైనా తీర్చుకోగలిగి ఉంది.

ఆమె వలీకి వందనంచేసి, "వలీదొరగారూ, మీరు ఖైదులో పెట్టిన ఫలానా యువకుడు నా అన్న. మా ఇంటికిఅతనే దిక్కు. అతనిపై ఆరోపణ చేసినవాడు పచ్చిదొంగ. అతని అభియోగం వట్టి అబద్ధం. మీరు న్యాయం దయచేయించి,

నా అన్నను విడిచిపెట్టాలని మిమ్మల్ని అర్థించటానికి వచ్చాను. మీరు కాదన్నట్టయితే మా ఇల్లు కూలిపోతుంది. నేను తిండికి మాడి చచ్చిపోతాను." అన్నది.

ఆమె చూచిన క్షణంలోనే వలీగారి గుండె గుబగుబలాడ నారంభించింది. అందుచేత ఆయన "మీ అన్నను విడిచి పెట్టడానికి నాకాటే అభ్యంతరంలేదు. ప్రస్తుతం నువ్వు వెళ్ళి జనానాలో కూర్చుంటే నేను పనిముగించుకు వచ్చి విషయం మాట్లాడతాను,'' అన్నాడు.

అతని ఉద్దేశం గ్రహించి ఆమె తనలో "మురికి గడ్డం వెధవా, నీవు నా వంటిమీద చెయ్యివెయ్యటం ఈ జన్మలో జరగదు" అనుకుని, పైకి, "వలీ దొర గారూ, మనం మాట్లాడుకోవటానికి ఇక్కడకన్న మీరు మా ఇంటికి వస్తే మరింత సౌకర్యంగా ఉంటుంది. జనానా నాకు బొత్తిగా కొత్త ప్రదేశం" అన్నది.

వలీ సంతోషంతో," ఇల్లెక్కడ?" అని అడిగాడు.

"ఫలానిచోట సూర్యాస్తమయం వేళకు మీకోసం ఎదురుచూస్తూంటాను" అని చెప్పి ఆమె వెళ్ళిపోయింది. వలీకి సముద్రంలో మునిగిపోతున్నట్టుగా ఉన్నది.

ఆమె అక్కడినుంచి కాజీ (న్యాయాధికారి) వద్దకు వెళ్ళింది. ఆయనవృద్ధుడు ఆమె ఆయనతో "కాజీ మహాశయా, తమరు నా పైన తమ న్యాయదృష్టి పంకించాలి. అల్లా తమరికి ఇంతకు మరింత మేలుచేస్తాడు," అన్నది.

"నీకు అన్యాయం చేసినది ఎవరు?" అని కాజీ అడిగాడు.

"ఒక దుర్మార్గుడు మా ఇంటికి దిక్కయిన మా అన్నను అబద్ధపు ఆరోపణలతో ఖైదులో పెట్టించాడు. . తమరు నాకోసం వలీగారితో ఒకమాట చెప్పి మా అన్నను విడిపించాలి," అన్నదామె.

ఆమెను చూసి, ఆమె మాట వింటూంటే కాజీగారికి ఆమెమీద వెర్రి మోహం పుట్టుకొచ్చింది. ఆయన ఆమెతో "నేను నీ అన్నసంగతి చూస్తాను. నీవు ఇప్పుడు మా ఇంటి జనానాలో కూర్చో. నేను తీరిక చిక్కగానే వచ్చినప్పుడు మనం మాట్లాడుకుందాం,'' అన్నాడు.

"ముష్టి ముండాకొడకా, నీకు నేను దొరుకుతానా?" అని లోపల అనుకుని ఆమె పైకి, "అయ్యా, నేను మీకోసం మా యింటిదగ్గిరే ఉండటం మేలు. అక్కడ స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చు." అన్నది.

"అయితే మీ ఇల్లెక్కడ? '

"ఫలానాచోట. సూర్యాస్తమయం అయిన కొద్దిసేపటికి తమకోసం ఎదురు చూస్తూంటాను," అని చెప్పి ఆమె కాజీ వద్ద సెలవుతీసుకుని, వజీరును వెతుక్కుంటూ వెళ్ళింది. ఆమె వజీరుతో యువకుడి ఖైదువార్త చెప్పి, అతన్ని




విడుదలచెయ్యటానికి ఉత్తర్వు దయ చేయించమన్నది.

"అదేమంత కష్టంకాదు. ఈ లోపుగా నువు వెళ్ళి జనానాలో కూర్చుంటే నేను వచ్చి కలుస్తాను. అప్పుడు సంగతంతా మాట్లాడుకుందాం," అన్నాడు వజీరు.

"మీ తోడు! నాకు చెడ్డ సిగ్గు. మీ జనానాలో కూర్చోలేను. అలాంటి సంభాషణకు మా ఇల్లే ఎంతో మంచిది. ఇవాళ సాయంకాలం సూర్యాస్తమయం అయిన ఒక గంటకు నేను తమకోసం ఎదురు చూస్తూంటాను," అని ఆమె తన ఇంటి ఆనవాళ్ళు చెప్పి, రాజువద్దకు బయలు దేరింది.

ఆమె తన సముఖానికి రాగానే, రాజు ఆమెను చూసి, "యా అల్లా, ఈమెను అనుభవించని జన్మ ఎందుకు?" అనుకుని, పైకి దయగా, "నీకు ఎవరు అన్యాయం చేశారు?" అనడిగాడు.

"మా రాజు న్యాయపరిపాలనలో అన్యాయం ఎక్కడిది?" అన్నదామె.

"అల్లా ఒకడే న్యాయస్వరూపుడు. నీకు నానుంచి ఏంకావాలి?" అన్నాడు రాజు.

"మా అన్న విడుదలకు ఉత్తర్వు దయచేయించండి. అతన్ని అక్రమంగా ఖైదుచేశారు." అన్నదామె.

"అదెంత భాగ్యం? అమ్మాయీ, నువు వెళ్ళి జనానాలో కూర్చో. న్యాయం జరిగి తీరుతుంది," అన్నాడు రాజు.

"మహారాజా, అలా అయితే, నేను మా యింటికే పోతాను. మన సంభాషణ లాంటిదానికోసం చాలా తతంగం ఉంటుంది. స్నానాలూ వగైరా! ఆ ఏర్పాట్లన్నీ మా యింట అయితేనే సక్రమంగా జరపగలను. ఇవాళ రాత్రి మా ఇల్లు రాజభవనంలాగ చేస్తాను."

రాజు, "అలాగే కానీ," అన్నాడు.

ఆయన రావటానికి ముహూర్తం నిశ్చయమైనాక ఆమె రాజుగారివద్ద సెలవుపుచ్చుకుని ఒక వడ్రంగివద్దకు వెళ్ళింది.

ఆమె వడ్రంగితో, "ఇవాళ సాయం కాలంలోపుగా నువు ఒక బీరువా తెచ్చి మా ఇంట ఉంచాలి. బీరువా బాగా పెద్దదిగా నాలుగు అరలు కలిగి ఉండాలి. అరపైన అర ఉండాలి. ప్రతి అరకూ విడిగా తలుపూ, బలమైన తాళాలూ ఉండాలి," అన్నది.

"ఈ సాయంకాలం లోపుగా తయారుకాదు," అన్నాడు వడ్రంగి.

"నువు అడిగినంత ఇస్తాను."

"అలా అయితే తయారవుతుంది, దొరసానీ. నేను వెండీ, బంగారము అడగను. నాకు కావలసిందేమిటో నువు ఊహించవచ్చు. అలా దుకాణం వెనక్కు ఒకసారి రా, కొలతలను గురించి మాట్లాడుకుందాం," అన్నాడు వడ్రంగి.

ఆమె నవ్వి, "పిచ్చి వడ్రంగీ, నీకు లౌక్యం తెలీదు. మనం మాట్లాడుకునే విషయానికి నీ దుకాణం వెనకభాగమా తగినచోటు? బీరువా పంపించిన తరవాత సాయంకాలం అలా మా యింటికి వచ్చావంటే తెల్లవార్లూ కొలతలనుగురించి మాట్లాడుకుందాం... అన్నట్టు జ్ఞాపకం వచ్చింది. నాకు కావలసింది అయిదు అరలు, నాలుగుకాదు. అవును నేను బీరువాలో భద్రంచేసే అద్భుత వస్తువులకు అయిదు అరలు కావాలి," అని తన ఇంటి అనవాళ్లు వడ్రంగికి ఇచ్చి వచ్చేసింది.

ఆమె భోషాణంలోనుంచి అయిదు అంగీలు, వేరు వేరు రంగులవి పైకి తీసి పెట్టుకున్నది. వంటకాలూ, తాగుడూ సిద్ధం చేసి, అక్కడక్కడా పూలు అమర్చి, ఇంట్లో ధూపం వేసి, తన అతిధుల కోసం ఎదురు చూడసాగింది.

సూర్యాస్తమయం కాబోతూండగా వడ్రంగివాడి మనిషి బీరువాతెచ్చి, ఆమె కోరిన ప్రకారం అతిధులు కూర్చునే హాలులో పెట్టి వెళ్ళిపోయాడు. ఆమె దాని తాళాలు సరిచూసే వ్యవధికూడా లేకుండా తలుపుకొట్టి వలీ లోపలికి వచ్చాడు

ఆమె మర్యాదగా లేచి, సలాంచేసి, కూర్చోబెట్టి, ఫలహారాలు మేపింది. ఆమె తనకేసి చూసే వేడిచూపులకు తట్టుకోలేక తరతర లాడిపోతూ వలీ ఆమెను అప్పుడే అనుభవించబోయాడు. కాని ఆమె అతడి కౌగిలినుంచి తప్పించుకుని "మీకు స్వారస్యంకూడా తెలియదే. ముందు మీ దుస్తులు తీసేస్తేగదా చేతులూ కాళ్లూ కదిలేది?" అన్నది.

"దానికి ఆక్షేపణేముంది?" అంటూ వలీ, ఆమెకేసి ఓరచూపులు చూస్తూ ఆమె అందించిన పసుపుపచ్చ సిల్కు అంగీ, అదే గుడ్డతో తయారుచేసిన కుళాయి ధరించాడు. ఇలాంటి దుస్తులు పోకిరీ వినోదాలప్పుడు ధరిస్తారు.


ఆము వ

సిల్కు అంగీలో మునిగిపోయిన వలీ సుఖపడదామనుకుంటుండగా తలుపు మీద ఎవరో దబదబా తట్టారు.

"ఎవరికోసమన్నా ఎదురుచూస్తున్నావా?" అనడిగాడు వలీ కోపంగా.

ఆమె భయంతో వణికిపోతూ, అన్నట్టు ఈ పూటనా భర్త తిరిగి వస్తున్నాడు. ఆ మాటే మరచాను. ఆ తలుపు తట్టేది ఆయనే! అన్నది.

"నా గతేమిటి? నే నేంచెయ్యాలి?"

ఆమె ఉక్కిరి బిక్కిరి అయిపోతూ "ఈ బీరువాలో దూరండి," అని బీరువా అడుగు అర తెరిచింది.

"ఎలా దూరను?" అన్నాడు వలీ.

"వంగుని కూచోండి."

వలీ కింది అరలో దూరి, వంగుని కూర్చున్నాడు. ఆమె ఆ అరకు తాళం వేసి, రెండో అతిథిని తీసుకరావటానికి వెళ్ళింది.

ఈ వచ్చినవాడు కాజీ. ఆయనకు కూడా అన్ని మర్యాదలూ జరిగాయి. ఆయన ఎర్ర అంగీ ధరించి ఆమెను కలియబోతుండగా, ఆమె, "మా అన్న విడుదలకు మీరింకా ఉత్తరువు రాయలేదు," అన్నది.

కాజీ ఉత్తరువు రాసి ఆమె చేతికి ఇస్తుండగా తలుపు చప్పుడయింది.

"నా భర్త" అని ఆందోళనగా అని, ఆమె కాజీని కిందినుంచి రెండోసొరుగులో పెట్టి తాళంవేసి, మూడో అతిథికి తలుపు తీయబోయింది.

ఈసారి వచ్చినవాడు వజీరు. అతనికీ అదేగతి పట్టింది. ఆయన ఆకుపచ్చ అంగీ, కుళాయీ ధరించి, బీరువా మధ్య అరలో దాక్కున్నాడు.

తరవాత వచ్చిన రాజుగారి గతీ అంతే అయింది. ఆయన నీలం అంగీతో సహా నాలుగో అరలో దూరాడు. మనిషి స్థూలకాయుడు కావటాన అరలో ఇరకటం ఆయనకు అమితమైన బాధ కలిగించింది.

ఈ సారి వచ్చినవాడు వడ్రంగి. వాడి కళ్లలో ఆకలి తాండవిస్తుంది. వాడు వస్తూనే ఆమెమీద పడబోయాడు. కాని ఆమె వాడితో, "ఇదేమిటి, వడ్రంగీ, ఈ పెఅర ఇంత చిన్నది చేశావు? అందులో ఏమీ పెట్టలేకుండా ఉన్నాను," అన్నది.

"ఆ అరకేం వచ్చింది? అందులో నాలాంటివాళ్ళు నలుగురు పట్టుతారు," అన్నాడు వడ్రంగి.

"ఏదీ? చూపించు," అన్నదామె.

వడ్రంగి ఒక కుర్చీపీటమీద ఎక్కి పై అరలోకి దూరాడు. వెంటనే ఆమె ఆ అరకు తాళం వేసేసింది.

తరవాత ఆమె కాజీ రాసి ఇచ్చిన ఉత్తరువు చేతపట్టుకుని ఖైదుకు వెళ్ళి ఖైదునుంచి తన ప్రియుణ్ణి విడిపించుకుని

ఇంటికి తెచ్చింది. ఇద్దరూ కలిసి గబ గబా ఇంటిలోని విలువైన వస్తువులన్నిం టినీ చిన్నచిన్న పెట్టెలలోకి సర్ది వాటితో బయలుదేరి, మరొకదేశం వెళ్ళి పోయారు. వారి కథ అక్కడితో ముగిసింది.

బీరువాలో ఉన్న అయిదుగురూ ఇల్లు నిశ్శబ్ద మయ్యేదాకా కిక్కురుమనకుండా ఉండిపోయి, తరవాత ఒకరొకరే గట్టిగా మాట్లాడసాగారు, రాజూ, వడ్రంగీ, తప్ప అందరూ ఏదో ఒకటి అన్నారు.

వజీరూ, కాజీ ఒకరి కంఠాలు ఒకరు పోల్చుకుని, "మీరేనా కాజీ?" అంటే "మీరేనా, వజీర్?" అని ప్రశ్నించు కున్నారు.

"మనం భలే ఇరుకులో పడ్డామే. ఇంకా నయం రాజుగారు ఇందులో పడ్డారు కాదు," అన్నాడు వజీరు.

"మీరు నోళ్ళు మూయండి. నేను ఇక్కడే ఉన్నాను," అన్నాడు రాజు.

వెంటనే వడ్రంగి, "మహారాజుగారికి జయంకలగాలి. ఇదంతా నా మూలానే జరిగిందనాలి. నేనే ఈ బీరువా తయారు చేశాను. ఐతే నేనూ ఇందులోనే ఉన్నాను," అన్నాడు.

కొంతసేపటికి ఆ యువతి భర్త తిరిగి వచ్చాడు. తలుపు ఎంత తట్టినా ఎవరూ పలకలేదు. ఇరుగు పొరుగువాళ్ల సహాయంతో అతను తలుపు పగులగొట్టి లోపలికివచ్చి బీరువా చూచాడు. అందులో నుంచి మాటలు వినిపించేసరికి, అతను దయ్యాలు చేరాయనుకున్నాడు.

ఇరుగు పొరుగువాళ్ళు బీరువాను తగలబెట్టేసి దయ్యాలను మారణహోమం చెయ్యమని సలహా ఇచ్చారు.

అంతపనీ జరిగేదే, కానీ కాజీ గొంతెత్తి "మహా జనులారా, తొందర పడకండి. మేం దయ్యాలంకాదు, ఫలానా ఫలానా వాళ్లం," అంటూ తాము ఎలా మోసపోయినదీ చెప్పాడు.

వెంటనే అక్కడ ఉన్నవాళ్ళు బీరువా అరల తాళాలు పగలగొట్టి, పంచరంగుల తొడుగులలో దాగివున్న అయిదుగురు పెద్దమనుషులనూ వెలికి తీశారు. ఆ యువతి భర్తకు జరిగిన అన్యాయం గురించి తెలుసుకొని రాజు అతన్ని తన రెండో వజీరుగా నియమించుకున్నాడు.






ఏలూరులో... ఒక హోటల్లో ... కాఫీ కార్డరిచ్చి ... పేపరు చూస్తున్న కంట్రాక్టరు లక్ష్మణస్వామి చూపు ... అక్కడే... ఆ ఫోటోమీదే ఆగి పోయింది. గబగబ ఆ ఫోటోక్రింద వ్రాసినదంతా చదివాడు. అంతే రయ్యిన బయటకు దూసుకుపోయాడు. హోటలు యజమాని నోరు తెరిచి చూడసాగా

డంతే. కాఫీ తెచ్చిన సర్వర్ 'ఆయన' కోసం అటు యిటు చూసి, లాభంలేక, బల్లలక్రింద, కుర్చీలక్రింద చూడ సాగాడు, అనుమానంతో.

వడ్డీలు గుంజి, ఏనుగుపొట్టంత పొట్ట పెంచిన వడ్డీవ్యాపారస్తుడు 'దగాచంద్' పేపర్లో ఆ ఫోటో చూడగానే బయటకు పరిగెత్తబోయి, సైడ్ కాల్వలోపడి, నలుగురు సాయంపట్టి లేపితే లేచి, నడవటానికి ఓపికలేక రిక్షాపిలిచి, "పొట్టి శ్రీరాముల మార్కెట్టుదగ్గరకు, విద్యార్థులుండే రూమ్స్..." అని చెప్పి తన శాల్తీని రిక్షా ఎక్కించాడు. ఈయ నిప్పుడు బేరమాడకుండానే రిక్షా ఎక్కాడు కానీ... ఇంతకు ముందెప్పుడూ ఓ అర్ధగంటసేపు బేరమాడికానీ ఎక్కేవాడు కాదు!

ఆఫీసు పుస్తకంలో కాంపు కెడుతున్నానని వ్రాసి, ప్రభుత్వ జీపులో దూరపు బంధువుల పెండ్లి కెడుతున్న ప్రభుత్వోద్యోగి రవణరావు, పేపరు చదువుతూ చదువుతూ – ఆ ఫోటోచూసి 'కెవ్వున' అరిచి, జీపును వెనక్కు తిప్పించాడు. ఏమీఅర్థంకాని డ్రైవరు...బహుశా ఆయనకు అర్జంటుగా పిచ్చిపట్టిందేమోనని అనుమానం కలిగి, భయంతో జీపును ఎనభైమైళ్ళ వేగంతో పోనియ్యసాగాడు.

అతి సుకుమారంగా చవర్లెట్ కారు డ్రైవ్‌చేస్తూ, మనుషులడ్డురాకపోయినా తన "సరిగమ" హారన్ అందరికీ వినపడాలని హారన్ కొడుతున్న మిస్ హెలెన్ కారాపి, ఆమె స్నేహితురాలు మిస్ కిస్‌మిస్ పేపర్లోపడిన ఆ ఫోటో చూపించగా, మిస్ హెలెన్ 'కెవ్వున' అరచి 'రయ్యిన' దూసుకుపోయింది ముందుకు ఆ 'కెవ్వున' కేకకు, కార్లో 'రయ్యిన' పోతున్న హెలెన్‌ను చూసి అక్కడేదైనా 'కౌహరా' లాంటి తెలుగు భయంకరచిత్రం షూటింగు జరుగుతుందేమోనని అటు యిటు చూసిన జనులు, కెమెరాలు, ఫోటోగ్రాఫర్లు లేక పోవడం చూసి, వెళ్ళిపోతున్న కారును గుడ్లప్పగించి చూడసాగారు.

అసలింతకీ ఇదంతా ఏమిటంటే, మద్రాసు స్టేట్ లాటరీ బంపర్ ప్రయిజు పదిలక్షలు కొట్టేసిన విజేత ఫోటో అది! అతనెవరోకాదు. ఒక నిరుద్యోగి. నామధేయం రవి. ఏలూరులోనే బి. ఎ. పూర్తిచేసి, ఉద్యోగంకోసం కాళ్ళరిగేలా తిరిగిన రవి చాలామందికి పరిచయస్తుడే!

బి. ఎ. మొదటి సంవత్సరం చదువుతున్నరోజుల్లో బుద్ధే గడ్డితినో లేక గడ్డే బుద్ధితినో... ఏదో ఒకటి., రవి రాణి యింటికి వెళ్తే, తిట్టి...నానా మాటలని బయటకు గెంటిన ఆ రాణితండ్రి సన్నాసి-సారీ సన్యాసిరావు, ఈ వార్త విని, రవి గదిచుట్టు మూడు ప్రదక్షిణలుచేసి, రవి 'దర్శనం' చేసికొని మరీ వెళ్ళాడు.

వడ్డీ వ్యాపారస్థుడు దగాచంద్, "ఏమయ్యా రవీ, బావున్నావా? ఏంటి సలీమధ్య కనపడ్డంలేదు?...అదిసరేగానీ నువ్వు నాకివ్వవలసిన డబ్బుగురించి బాధపడకు! .. నీయిష్ట మొచ్చినప్పుడియి .. అహ(...వడ్డీ వద్దులే" అనేసి వెళ్ళిపోయాడు. (?)

—ఉమెన్స్ కాలేజీ బ్యూటీ రోభా తండ్రి పంచ వూడిపోతున్నా— అదేమీ పట్టించుకోకుండా ఆదరా బాదరగావచ్చి, రవిని ముద్దుపెట్టుకున్నంత పనిచేసాడు.

'అచ్చమ్మ' సి ని మా హా లు ప్రొప్రయిటర్ తన డొక్కుకారులో వచ్చి, "రూమ్‌లో ఏం తోస్తుందయ్యా నువ్వు మరీనూ!? సాయంత్రం కారు పంపిస్తాను, అలా సిన్మాకిరా" అని డిగ్నిఫైడ్‌గా అప్లికేషన్ వేసిపోయాడు.

'కొత్తగా గుడి కడతాం' అని చందాలు ప్రోగుచేస్తున్న రామానుజం టపా .. టపా.. టపా మూడు కొబ్బరి కాయలు రవి గదిగుమ్మంమీద కొట్టి, లోపలికి వచ్చి, కప్ప నోరంతా తెరుచుకొనేలా నవ్వి, "మన వూరివాడికి తగులుతే కొబ్బరికాయలు కొడతానని మ్రొక్కుకున్నానోయ్. అంతా దేవుడి దయ . దేవుని గుడికి చందా.. అహ(.. మరల వస్తానులే" అని వెళ్ళిపోయాడు.

నిజాన్ని తారుమారుచేసి అబద్ధంగా మార్చి కోర్టుల్లో అనేక కేసులు గెలిచి, ఆ డబ్బుతో కొన్న ఫియట్ కారులో వచ్చినలాయర్ సూరిబాబు, "నీకేమన్నా కోర్టు వ్యవహారాలుంటే నన్ను కల్సుకోవోయ్. ఇకనుంచి నేనే మీ ఫామిలీ లాయర్‌ని" అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఎన్నికరోజుల్లోకూడా రవి ముఖం చూడని ఎం. ఎల్. ఎ. అప్పలస్వామి అంబాసిడర్ కారులో వచ్చి, "ఛ!ఛ! మనదేశం రోజురోజుకు దిగజారిపోతుందోయ్. అంతెందుకూ? మా బావ పార్వతీశం లేడూ?.. నీకు తెలియదనుకుంటా.. మొన్న మంత్రయి.. తినేసాడయ్యా!.. రామ రామ.. లడ్డూలు కాదయ్యా.. డబ్బయ్యా డబ్బు! ఆ(.. మరలా ఎక్కడా అనకుస్మీ. అసలిటువంటివాళ్ళంతా మంత్రులు ఎందుకవుతున్నారంటావ్? అహ( మనలోమాట. నీలాంటి యువకులు ముందుకు రాకపోవటంవల్లనే కదయ్యా ఇదంతానూ!!

అవునుమరీ! యువకులంతా ముందడుగు వేస్తేనేకదయ్యా దేశం బాగుపడేది!? అందుకే నే చెప్పేది విను. నీ మకాం మాయింటికి మార్చేయి. అబ్బ, ముందు నే చెప్పేది వినవయ్యా స్వామీ! నాతోపాటే తిరుగు. నిన్ను మంత్రులకు ఎమ్మెల్యేలకు పరిచయంచేస్తాను. వచ్చే ఎన్నికల్లో నువ్వు నిలబడుదువుగాని! అవునయ్యా నువ్వే— అదేంటోయ్ అలా అయిపోయావ్? ... కళ్ళు తిర్గుతున్నయ్యా? రెస్టు తీసుకో" అని రవి

బుర్ర గిరగిర తిరిగేటట్లుచేసి ఆనక వెళ్ళిపోయాడు.

ఆయనలా పోగానే ప్రభుత్వోద్యోగి రవణరావు 'ఇలా' దూరాడు, రవి గది లోకి దూరి, ఏదేదో వాగి, "అన్నట్లు.. నీకు లడ్డూలు బాగా యిష్టమనుకుంటాను. ఇందాక అప్పలస్వామితో మాట్లాడుతుంటే విన్నాలే. మొహమ్మాట పడకోయ్. నీకు మేనమామంతటివాడిని. మా 'పంకజం' లడ్డూలు బాగా చేస్తుందోయ్. 'పంకజం' ఎవరంటావా? భలే వాడివోయ్. నీ మరద...ఆ...అదే నా కూతురోయ్. సరే, రేపు డబ్బా లడ్డూలు పంపుతాను. మొహమాటపడక తినవోయ్" అని ఎక్కడలేని బంధుత్వం తెచ్చిపెట్టి, పోయాడు.

ప్రస్తుతం ఆ వూర్లోనే నివసిస్తున్న మాజీ విద్యాశాఖమంత్రి ఈ వార్త వినగానే, తాను పదవిలోవున్నప్పుడు సంపాదించిన 'ఆస్టిన్' కారులోవచ్చి, "కంగ రాసులేనన్సయ్యా! పదిలస్సలు కొట్టే సావ్ మొత్తానికి· లక్కీసాన్సంటే నీదే నయ్యా. ఇంతకీ నే సెప్పొస్సేదేటిదంటే 'ఇద్యలేన్నివాడు ఇంత పసువు' అన్నారు గదటయ్యా· అంచేత నే సెప్పేది ఇను కొని బుద్ధిగా సదువుకో. నీకు పై సదువులకు సీటు చూసేపని నాది: ఏటంటావు? పోసీ సదువుమీద 'యింతరెస్టు' లేపోతే ఎలచ్చన్లో నిలబడ్తావేటి? నువ్ నిలబడ్తే సెప్పు. నిన్ను గెలుపిత్తాను. ఆఁ" అని ఏదో గోదావరి భాషలో మాట్లాడి, ఆ భాష అర్థంకాక ఛస్తున్న రవిని చూసి జాలిపడి, 'మరల వస్తా లేవోయ్' అని వెళ్ళిపోయారు.

ఏడుగు రాడపిల్లలతండ్రి కుటుంబరావు ఆదరా బాదరగా వచ్చి ఏంమాట్లాడాలో తోచక నానా హంగామా చేసి పోయాడు.

తనని చదివిస్తున్న చిన్నాన్న చనిపోతే, చదువుకు కావల్సిన డబ్బు మేనమామ అప్పారావుని అడుగుతే, 'అడ్డమైనవాళ్ళందరికీ డబ్బివ్వ లేనోయ్- అప్పుగానైనాసరే, అని మొహంమీదే అన్న ఆ మేనమామ అప్పారావే ఈ వార్త చదివి హైదరాబాద్‌నుండి టాక్సీలో అర్జంటుగా వచ్చి, ఊపిరాడకుండా చేసి, "మా యింటికొచ్చేవోయ్ అల్లుడూ? అమ్మాయి కూడా నీ కోసం ఎదురు చూస్తుంటుంది" అనేసాడు. మరి అనడూ?!—

"వెధవ బి.ఏ. డిగ్రీకే మా కంపెనీలో ఉద్యోగం యిస్తే మేము దివాళా ఎత్తవలసిందే" అన్న ఉమా కంపెనీ యజమాని శ్రీధరరావుగారు, తనకు పెళ్ళికావలసిన పిల్లవుందని గుర్తుకొచ్చి అమాంతంగా కారులో వచ్చిపడి, రవికి షేకెండ్ యిచ్చి, ఆ చేతిని అయిదు నిమిషాలు నలిపిపడేసి, నీకు నా సెక్రటరీ ఉద్యోగం యిచ్చేస్తానోయ్. ఆ మధ్యే



ప్పుడో అడిగావుకదా!!" అనేసి పోయారు.

జిల్లాకలెక్టరు వెంకటప్ప రవిని 'దర్శనం' చేసుకుందామని గవర్న మెంటు ఎంబాసిడర్‌లో రవి రూమ్ దాకా వచ్చి, ఆనక అక్కడకు రాగానే అభిమానం అడ్డొచ్చి, "పోనీయ్‌డ్రైవర్" అన్నాడు. కారు బుర్రున ముందుకు పోయింది.

రవి కనపడగానే ఎక్కడ అప్పడుగుతాడోనని భయంతో బిడ్డీ కొట్ల వెనుక, సందులలో దాక్కొనే స్నేహితులు ఒక్కసారి వూడిపడి రవిని దండలతో నింపేసారు. ఆ రాత్రికి ఒక సినిమా ప్రోగ్రాం కూడా ఏర్పాటుచేసేసారు కూడానూ.

అదేం డబ్బు మహిమోకానీ...రోజూ రవిని కన్నెత్తిచూడని కాలేజీ అమ్మాయిలు ఇప్పుడు రవి కనపడగానే ముప్పయిరెండు పళ్ళు కనపడేలా నవ్వుతున్నారు. పోనీ 'వాళ్ళు...పెళ్ళికాని అమ్మాయిలు' అని సరిపెట్టుకుందే పోతుంది. తస్సాదియ్యా! పెళ్ళయిన అమ్మలక్కలు కూడా రవిని ఎగాదిగా చూస్తున్నారు మరి.

పేషెంట్లకోసం ఎదురుచూసి, చూసి ఎవరూ రాకపోయేసరికి విసిగెత్తి, ఇంటికి బయల్దేరబోయిన డాక్టర్ పని లేని రావు రవిని చూడగానే పరిగెత్తి కెళ్ళి, 'నాకేం జబ్బులేదు మొర్రో' అంటున్నా వినకుండా, రెక్కపట్టుకొని క్లినిక్‌కు లాక్కుపోయి, 'బలం వస్తుందోయ్' అంటూ ఇంజక్షను పొడిచి పడేసాడు. అంతటితో ఆగకుండా విటమిన్ మాత్రలు ఓ గుప్పెడు రవిజేబులో కుక్కి 'ట్రీట్‌మెంటుకు రోజూ రావోయ్! నెల రోజులలో బంతిలా తయారవుతావ్' అన్నాడు.

రవికి పదిలక్షలు తగిలిందనగానే ఎందరో రేసుగుర్రాల్లా పరిగెత్తబోయి కొంద రరటిపండు తొక్కలమీద, మరి కొందరు బురదలో కాలువేసి జారి నడుం. కాళ్ళు విరగ్గొట్టుకొని హాస్పిటల్లో జాయినయ్యారు కానీ, లేకపోతే వాళ్ళ పాటికి రవి ప్రాణం తోడేసేవారేః

ఇలా అందరూ కలిసి తనని ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే మొదట రవి బిత్తర పోయినా, తర్వాతది వినోదంగా, కాల క్షేపంగా వుంది.

ముఖ్యంగా రవి ఆడపిల్లల తండ్రు లందర్నీ బాగా ఆకర్షించాడు. రవి కిప్పుడు హుందాతనం వచ్చింది. ఛాతి పైకెత్తుకొని నడుస్తున్నాడీ మధ్య. ఎక్క డికి పోయినా 'బాడీగార్డ్స్'లా ఓ పది మంది స్నేహితులనబడే వైధవలుంటు న్నారు.

రవిని చూడగానే ఇప్పు డే అమ్మా యైనా సకిలిస్తుంది. ఏ అబ్బాయైనా విష్ చేస్తాడు. ఉమాకంపెనీ యజమాని శ్రీధరరావుగారు రవికి సెక్రటరీ ఉద్యోగం యివ్వటమే కాకుండా, తన డొక్కు కారును కూడా రవికి ప్రెజెంట్ చేసే సారు, తన అల్లుడవుతాడనే నమ్మకంతో.

రవి కిప్పుడు తీరికలేదు. ఒక ప్రక్క ఉద్యోగం. మరొకప్రక్క కట్టలుకట్టలుగా ఉత్తరాలు వచ్చి పడుతున్నాయి. 'మా అమ్మాయి వహీదారెహమాన్‌లా వుం టుంది. నమ్మకం లేకపోతే ఓ సారి వచ్చి చూసిపో,' 'మా అమ్మాయి జ్యోతి లక్ష్మి నోట్లోంచి వూడిపడిందంటే నమ్మ బ్బాయి. నువ్వు 'సై' అంటే ముహూర్తం పెట్టేస్తాము,' 'మా అమ్మాయి డూప్లి కేటు హేమ్మాలిని. నీకు తగినఅమ్మాయి' 'మా అమ్మాయికి జ్యోతిలక్ష్మి పర్స నాలిటీ, హేమ్మాలిని బుగ్గలు, లీనాచందా వర్కర్ నోరు, యోగితా బాలి కళ్ళు, వాణిశ్రీ ముక్కు, ముంతాజ్ చెవులు. పెళ్ళి చూపులకి ఎప్పుడొస్తావో టెలిగ్రాం కొట్టు.' 'మా అమ్మాయి అరుణా ఇరాని ప్రతిబింబం అనుకోవోయ్ అల్లుడూ...' ఇలాగః

పోనీ ఇవన్నీ ఆడపిల్లల తండ్రులు వ్రాసినవి. వారి బాధ వారికుంది. తస్సా దియ్యా...పత్రిక ఎడిటర్‌కి కథలెలా వచ్చి పడతాయో, రవికి ప్రేమలేఖలలా వచ్చిపడుతున్నాయి.

ఆ భాష, ఆ లిపి నానా అవస్థలుపడి చదివి తలనొప్పి తెచ్చుకున్నాడు రవి. ప్రేమలేఖలుమాత్రం కుప్పలుగా వస్తు న్నాయి, ఫొటోలతోసహా. వాటిని చదివి పెట్టడానికి ఓ స్నేహితుడు నడుం బిగిం చాడు అతనికీ ఆ పూబోణులు వ్రాసిన కొన్ని కొన్ని పదాలు అర్థంకాక, తెలుగు డిక్షనరీ వెతికి, అందులో అటువంటి పదాలు ఎక్కడా కనపడకపోయేసరికి నిరుత్సాహపడిపోయాడు.

ఇంత చదివిన మీకు రవి అమాయ కుడేమోనన్న అనుమానం కలుగవచ్చు.




కాని కాదండోయ్. రవి ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే రకం! కానీ పైకిమాత్రం ఏమీ తెలియని సన్నాసిలా కనపడతాడు. ఆతనికి మంచి ఆశయాలెన్నో వున్నాయి.

* * *

"గుడ్‌మార్నింగ్ సార్!" అన్నాడు రవి లోపలికివస్తూనే. "గుడ్‌మార్నింగ్ మైడియర్ బాయ్," అన్నారు శ్రీధర రావుగారు నవ్వుతూ.

రవి సోఫాలో కూర్చున్నాడు.

"ఏమిటోయ్ సంగతులు?" అన్నారు పేపరు ప్రక్కన పెడుతూ.

"ఏమున్నాయండీ! నన్ను బ్రతక నీయటం లేదు.

"ఎవరూ?..."

"ఇంకెవరండీ! మనుషులు. 'మా అమ్మాయిని చేసికో...మా అమ్మాయిని చేసికో—' అని ఒకటే గోల. మొన్న ఒకమ్మాయి 'ఐ లవ్ యూ' అంటూ పా పాడి నే కసిరేసరికి ఠోడున నవ్వి పోయింది. మొన్న కలెక్టరుగారు వచ్చారు...మా అమ్మాయిని చేసికో వోయ్ అంటూ."

అదిరిపడ్డారు శ్రీధరరావుగారు.

"ఏమన్నావ్? కలెక్టరుగారా?"

"అవునండి..." వినయంగా చెప్పాడు రవి.

ముచ్చెమటలు పోసాయి శ్రీధరరావు గారికి. ఎవరో ఒకరు ఈ బంగారాన్ని తన్నుకుపోతారు. లాభంలేదు. ఇక ఊరుకోకూడదు. "చూడు రవీ! – నిరుద్యోగివైన నీకు ఉద్యోగం యిచ్చాను. అదీ నా సెక్రటరీగా. నాకున్న ఒక్కతే కూతురు, రజని. అందంగా వుంటుంది. చూసేవుంటావ్. దాని మనసంతా నీ మీదే. నువ్వు కాదంటే అది ఏ

నీ మొహ్మో గొడ్డో చూసుకుంటుంది.."
అని కన్నీళ్లు తెప్పించుకుంటూ అన్నారు.

"కలెక్టరుగాడు..." అంటూ నవ్వి నాడు రవి.

"చూడు రవీ...వాళ్ళంతా నీ డబ్బు కోసం వస్తున్నారు. నేను నీ హితంకోరే వాడిని. పైగా మనది ఒకటే కులం. నా తర్వాత ఈ కంపెనీ, ఆస్తి అంతా నీకే వస్తుంది. నామాట కాదనకు. నా కోసం కాకపోయినా రజని కోసం...

ఆయన కళ్ళలో నీరుచూసి, మంచులా కరిగిపోయాడేమో, 'అలాగే' అన్నాడు రవి.

ఆనందంలో పైకెగరబోయి, బాగో దని విరమించుకున్నాడు శ్రీధరరావు గారు.

రవి తనని పెండ్లిచేసుకోవటానికి ఒప్పుకున్నాడని విన్న రజని గాలిలో విహరించసాగింది. ఆవిడ ఊహాలోకంలో అ మె రి కా...ర ష్యా...ప ట్టు పా ను పులు... ఇంపాలా కారు... ఇంకా... ఇంకా...

ఆలస్యం అవుతే రవి మరల ఎక్కడైనా ఏ జ్యోతిలక్ష్మిలాంటి అమ్మాయి వలలో పడతాడోనని భయంతో శ్రీధర రావుగారు అర్జంటుగా రవికి, రజనికి పెండ్లి జరిపించేసారు.

ఈ వార్త విన్న రవి మేనమామ గుండెపగిలేలా బోరుబోరున ఏడ్చి అనక గుండె నొప్పితో హాస్పిటల్లో జాయినయ్యారు.

—కుటుంబరావు స్పృహతప్పి పడి పోయాడు.

ఈ వార్త విన్న కంట్రాక్టరు లక్ష్మీకాంత స్వామి తాను నిల్వచేసిన సిమెంటు బస్తాలు వరదలో పడిసి గడ్డకట్టుకుని పోయినప్పుడు పడిన బాధకంటే మరింత ఎక్కువగా బాధపడ్డాడు.

'ఉమెన్స్ కాలేజి బ్యూటీ' తండ్రి 'అంత అందంగా వున్నావు, వాడిని వలలో వేసికోలేకపోయావు కదే!' అని కూతురుమీద విరుచుకుపడ్డాడు.

చవర్‌లెట్ కారులో తిరిగే సుందరి హెలెన్ ఈ వార్త వినగానే ఆటోమేటిక్‌గా చెట్టుకు గుద్దేసింది. అప్పుడు కూడా అది ఏదో తెలుగు సిన్మాషూటింగను కొని చుట్టూచూసిన జనం, అక్కడ ఫొటోగ్రాఫర్లు, కెమెరాలు లేకపోవడం చూసి, 'ఓలమ్మో!' అంటూ హాస్పిటల్‌లో చేర్చారు.

ఈ వార్త విన్న ప్రభుత్వోద్యోగి రమణరావు రాత్రంతా ఒహాటే పిచ్చి కేకలు! డ్రైవర్ చెప్పినదంతా విని నిజంగా పిచ్చిపట్టిందేమోనని, 'నాకు పిచ్చిలేదు మొర్రో'అని మొత్తుకుంటున్నా వినకుండా బరబరా వైజాగ్ లాక్కుపోయారు, జుట్టుపట్టుకుని.

* * *

అంతకు క్రితంరోజునే శ్రీధరరావు గారు డొక్కుకారులో క్యాంప్‌కు వెళ్లారు.

డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుని తనలో తను నవ్వుకుంటున్నాడు రవి.

"అబ్బ! ఏమిటో శ్రీవారు తమలో తమే నవ్వుకుంటున్నారు." అంటూ వచ్చి రవి ప్రక్కనే కూర్చుంది రజని.

"ఏం లేదు ఒకటి గుర్తుకువచ్చింది." అన్నాడు రవి. రజని నేలపై కాలిబొటన వ్రేలు రాస్తూ కూర్చుంది.

"ఏమిటి?" అన్నాడు రవి. ఏదో అడగాలని చూస్తున్నదని గ్రహించి.

"నిన్న క్లబ్బుకి వెళ్ళానుకదా..." మొదలుపెట్టింది రజని.

"అవును, వెళ్ళావు! వెళ్ళలేదని ఎవరన్నారు?"

"ఎవరూ అనలేదులెండి. అక్కడ తలెత్తుకోలేకపోయాను" అన్నది కన్నీళ్ళు తెచ్చుకుంటూ.

"ఎందుకు? మెడనరంకానీ పట్టేసిందా...? మన డాక్టరుకు ఫోను చేయలేకపోయావా!"

"మీ కన్నీ నవ్వులాటగానే వుంటాయి..." కోపంగా అంది రజని.

"సర్లే చెప్పు."

"'మీ ఆయనకు పది లక్షలున్నాయి కదా. ఈ డొక్కు కారేమిటి? ఇంపాలా కానీ...చవకలెవ్‌కానీ కొనరాదా' అని అందరూ ఒకటే గోలపెడుతు[illegible]..."

"అయితే [illegible] ఫ్రిజ్ [illegible] కొనేది ఇప్పట్లో [illegible]."

"వాళ్ళ[illegible] కూడా తప్పే ముందంటే [illegible] పైకి నడుస్తుంది. [illegible]"

రవి మాట్లాడలేదు.

"ఇంపాలా[illegible] [illegible]కొనుక్కొందామండీ..." రవి భుజాన్ని చేతులు వేసి గారాబంగా అడిగింది రజని.

అయినలా కరిగిపోయాడేమో, "డబ్బున్నప్పుడు తప్పక కొందాం రజీ!" అన్నాడు.

"ఆ...డబ్బు! డబ్బు! బాంక్‌లో పదిలక్షలు పెట్టుకొని! ఇష్టంలేదని చెప్పరాదూ!! డొంకతిరుగుళ్ళు దేనికి!" అన్నది బుంగమూతి పెట్టుకొని.

"ఇంకెక్కడివి పదిలక్షలు!! నిన్ననే దేశరక్షణనిధికి ఇచ్చేసాను." చాలా శాంతంగా చెప్పాడు రవి.

తెలుగు సినిమాలో హీరోయిన్‌లా 'కెవ్వున' అరిచింది రజని. కాంప్‌లో వున్న శ్రీధరరావుగారు ఉదయం పేపరు చూస్తూ, ఈ వార్త చదివి మాటా మంతీ లేకుండా అలాగే ఒరిగిపోయారు.

# కథానదీ సాగరం

పాపా

సాగరం మనిషి సగమైనాడు. నిద్ర మాత్రలు మానలేదు, అలమారాలో సీసాలూ ఉన్నాయి.

"అబ్బాయ్‌! నువ్వు మూఢుడివేం కాదు; నువ్వారికే పెద్దైతే, గోదావరి పేరున ఏదైనా మంచిపని తలపెట్టేవా రింకెవ రున్నారురా?" అంది సోమ్మవ్వ మేల్కొలుపుతున్నట్టు.

ఆ మాటకు సాగరం కళ్లు తెరిచాడు.

"ఔను, గోదావరికి చెందవలసిన హారాన్ని కూడా అందుకే ఉపయోగించ వచ్చు!" అన్నాడు లేస్తూ; అంతలోనే ఇంటిముందో కారు ఆగింది. తలుపు తెరుచుకొని వయసుమీరిన ఒకాయన దిగాడు. అప్పటికే కారుచుట్టూ పిల్లలూ, ఆడ, మగా మూగి వింతగా చూస్తు న్నారు. కారులోపలున్నవాళ్ళు కనపడ కుండా అద్దాలవెనక మెరుస్తున్న రంగు రంగుల పరదాలున్నాయి.

వచ్చిన పెద్దమనిషి శ్రీమంతుడిలా గున్నాడు. నల్లటి కళ్ళద్దాలు, పెద్ద మీసాలు, చెంపలు, ఖరీదైన దుస్తులు సినిమాల్లో జమీందార్లా గున్నాడు.

"మీ దగ్గిరున్న వజ్రాల హారాన్ని కొందామని వచ్చాను; శ్రీకాకుళంలో దానికి బయాణా యిచ్చినవాడు తానేదో వెలలేని వజ్రాలహారాన్ని అప్పుడే కొనేసి జేబులో పెట్టుకున్నట్టు గొప్పగా చాటు కుంటున్నాడు; దానికి తగిన ధర వాడివ్వ లేడు. దాని విలువ వాడికేం తెలుసు గనక? నాకు తెలుసు—మీరెంత కిద్దామను కుంటున్నారు?"

"మీకు తెలుసునన్నారుగా, ఎంతి స్తారు?"

"ఎంతకైనా కొంటాను!"

"ఈ ఊళ్లో ఆడవాళ్ళ కేదైనా చిన్న అదనపు ఉపాధికల్పించే చిన్నరకం పరిశ్రమలు పెట్టాలనుకుంటున్నాను. ఉద్యోగాలుచేసే చదువులేక, తట్ట పట్టు కొని కూలినాలికి వెళ్ళలేక, ఇంటిపట్టునే ఏదైనా చేసి, కొద్దిపాటి ఆదాయం వచ్చినా సర్దుబాటవుతుందని అనుకుం టున్న ఆడవాళ్ళున్న కుటుంబాలెన్నో ఉన్నాయి; అలాంటి వాళ్ళకోసం—ఉదా హరణకు – అగ్గిపెట్టెల తయారీ అను కోండి—ఇళ్ళదగ్గిరే పెట్టెలు అవీ అంటిం చేసి యిస్తూ నాలుగుపైసలు సంపాదించే అవకాశం ఉంది. వేరేచోట నిప్పుపుల్లలు చేసి నింపి బంగీకట్టేదానికి మరి కొంత మందికి పని కల్పించవచ్చు. ఇంకా కుట్టుమిషన్లు కొన్ని కొని, వాటిని కొన్ని ఇళ్ళకు యివ్వాలి. గుడ్డలు యిచ్చి పిల్లల దుస్తులూ, ఆడవాళ్ళదుస్తులూ తయారు చేయించవచ్చు. వాటి విక్రయానికి తగిన

ఏర్పాట్లు చేయాలి. ఇందువల్ల కూడా కొంతమంది ఆడవాళ్ళు ఇంటిపట్టున ఉండే ఏదో కొంత సంపాదన చేసుకో వచ్చు. ఇప్పటికి యీ రెండు ఆలోచనలు ఉన్నాయి. ఇలాంటివి పెట్టడానికి కొంత కలిసిరావాలి!" అన్నాడు సాగరం.

"యోగ్యమైన ఆలోచనలే! పెట్టుబడి అంతా లభిస్తుంది! లాభసాటిగా నడుపు కోవడమే మీ వంతు."

"లాభాలకోసం కాదు! నేను పెట్టుబడి దారీ మనిషిని కాను, నాకోసమూ కాదు, పేరుకోసమూ కాదు...''

"ఎవరి పేరుకైనా కానీండి, అంతా మీకు లభిస్తుంది,...తర్వాత నేను ఇంకో పనిమీదకూడా వచ్చాను; నాకొక్క కుమార్తె ఉంది. పెళ్ళిచేయాలనుకుంటు న్నాను. హారంకొని సాలంకృత కన్యా దానం చేద్దామని నా సంకల్పం!..." అంటూ నసిగాడు పెద్దమనిషి.

"తప్పకుండా చే సె య్యం డి!" అన్నాడు సాగరం.

"నీలాంటి యోగ్యుడికే!'' అన్నాడు పెద్దమనిషి.

''మీరు నాతో హాస్యాలాడ్డానికే వచ్చినా, కోపం తెచ్చుకొనే స్థితిలోలేను, వెళ్లండి !" అన్నాడు సాగరం విసుగ్గా.

"హాస్యానికి అనలేదు బాబూ! మీరు నాకెంతో నచ్చారు. అదీగాక యిప్పుడు మనం యెంతో గర్వించదగినట్లుగా తెలుగులో ఎంతోమంది మంచి రచయి త్రులు ఉన్నారు; అలాంటి రచయిత్రి అనిపించుకోవాలని మా అమ్మాయికి చాలా ఉబలాటం! కాని స్వంత ఊహ తక్కువ...'' అంటూ పెద్దమనిషి ఏదో రహస్యం చెప్పడానికి సంకో చిస్తున్నవాడిలా నసిగాడు. సాగరం చెప్పండి అన్నట్లు చూశాడు.

"ఏం లేదు, మరి...మనలో మాట, మంచి కథలు, నవలలు రాసే రచ యితే దొరికితే వాటిని తనపేరుతో చెలా మణి చేసుకోవచ్చుననే ఆలోచనా ఉంది. మాటవరసకి మీరే అనుకోండి. మీకేమీ అభ్యంతరం లేకపోతే మీ అమూల్య రచనావస్తువుల్ని మా అమ్మాయికి ఉదా రంగా యిచ్చారనుకోండి. అందువల్ల మీకూ చాలా కలిసివస్తుంది. అవి బహు మతి పొందితే ఒక్కనయాపైసా కూడా ముట్టకుండా మీకు దఖలు చేసుకొనే పూచీ రాసియిస్తాను. పైగా అంతకు అంత మేంకూడా సమర్పించుకుంటాము. ఎవరో ఏరుదాటి తెప్పకాల్చే వారుంటే ఉంటారు. అలాంటి ఘా తు క ం జరగదు...,'' అంటూ పెద్దమనిషి బహు లౌక్యంగా చెప్పుకుపోతూంటే సాగరం చిరాకుగా చూశాడు.

"మీరేం మొహమాట పడనవసరం లేదు. మీ రింకేం కోరినా సిద్ధం. మీరు ఇతర భాషల్లో వచ్చినవాటిని అలాగే తెలుగులోకి దించి సొంత సరుకులా చెలామణీ చేసుకోగల సమర్థులనీ కూడా

విన్నాం. ఇంతవరకూ మా అమ్మాయికి మరో భాష రాకపోవడంవల్ల యింత యిన్నాంది. సవ్యంగా సాగుతుంది ప్రఖ్యాతులు ఎప్పటికీ ఎక్కడపోయినా విదేశీ సరుకుని తెలుగు పెట్టవెట్టేసి రోజుకి నాలుగేసి నవలలు వదిలేస్తున్నారు. అలాంటివేమీ అమ్మాయికి అందుబాటులో లేవు, కనీసం నాలుగు సినిమాలైనా చూసి అన్నీకలిపి ఒకనవల చేసేదానికైనా మా అమ్మాయి సినిమాలు చూడ్డానికి వీల్లేదు. కళ్ళజబ్బు! సినీమాలు చూడరాదని డాక్టరు సలహా! అంచేత మంచి కథకుడు-అంటే-కనీసం ఒక లేఖకురాలికి సరుకు యిచ్చే కథలు చెప్పగలవాడు కావాలి, మా అమ్మాయికి!...." అంటూ కొంటెగా చిరునవ్వు విసిరిన పెద్దమనిషిని కసురుతూన్నట్లుగా సాగరం, "వెళ్ళండి! మీ అమ్మాయి సంగతి ఇంకేమీ చెప్పకండి, వెళ్ళిపోండి!" అన్నాడు.

"ఆమెని చూస్తేకాదనలేరు!-దిగ్భ్రాంతిలో ముంచెత్తుతుంది మిమ్మల్ని—"

"అవసరంలేదు. నాతో హాస్యాలాడ్డాకా వచ్చారు? మరోప్పుడైతే మీకు తగినట్టే చెప్పేవాడినే కాని, ఇది నా గుండె తరుక్కుపోతున్న కాలం, వెళ్ళండి, మీ అమ్మాయిని పదిలంగా దాచుకొని మరీ వెళ్ళండి!"

"నేను హాస్యానికి రాలేదు బాబూ! చూస్తే విడిచిపెట్టలేరని తీసుకువచ్చాను! ఆనందంలో ముంచెత్తుతుందనే తెచ్చాను!"

"ముంచెత్తి ముంచేస్తే ఏం పోగాని తీసుకొచ్చారన్నమాట! కథ చెప్పేవాడు తప్పితే మీ కింకెవ్వరూ దొరకలేదా?"

"లేఖకురాలికి కల్పితాల్లోంచి విడుదలకు పడుతూ కథలు చెప్పే కథాసారథుడు నువ్వుగాక యింకెవరుంటాడు. అమ్మాయి ముఖంచూసి నువ్వే ఆ మాట అడుగు మరి. ముందు అమ్మాయిని చూసి, తర్వాత మాటాడుదువుగాని..."

"నేను చూడను!"

"నేనే చూపిస్తాను. ఎలా చూడవో నేనూ చూస్తానబ్బాయ్!" అంటూ పెద్దమనిషి కారుదగ్గిరికి చరచరా వెళ్ళి తలుపు తెరిచి కుమార్తెను దింపి తీసుకొస్తున్నాడు. కొత్త పెళ్ళికూతురు ముస్తాబుతో తలవంచుకొనే వస్తున్నది-వెంట బుజ్జికూడా ఉన్నాడు.

సాగరం ఎగిరి గంతేసి "గోదావరీ!" అంటూ పరుగున వెళ్ళి పట్టుకున్నాడు, గోదావరిని ఉక్కిరి బిక్కిరిచేస్తూ.

"గోదారమ్మే! ఆ అమ్మే? అమ్మి వచ్చేసింది!" అంటూ వీధిలో ఆడవాళ్ళు అంతా కలకలం చేస్తూన్నారు.

సోమ్మవ్వ వేణుగోపాలస్వామి ఆలయం దిక్కుకి దండాలు పెట్టేస్తూనే ఉంది చేతులెత్తి.

* * *

పెద్దమనిషి వేషం తీశేశాడు. అవ్వ



ఏగాదిగా అతడిముఖం పరీక్షగా చూసి చూసి, కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు పట్రారా నాయనా! ఎవరొచ్చారో తెలుసా? వేగం పట్రా!...,''అంటున్నది తొట్రుపాటుతో.

"పెద్దమ్మా! వద్దులెద్దూ! ఇప్పుడవన్నీ...పిల్లను చూడు, నీ మనవరాలే!...,'' అన్నాడు సూర్యనారాయణ. అంతలో సాగరం వెండిచెంబుతో నీళ్ళు తీసుకువచ్చాడు.

"సూరిబాబురా! సూరిబాబు!–నీకు మేనమామే అవుతాడు. మా మరిది కొడుకే! ఎప్పుడో ఇల్లువొదిలి దేశాలు పట్టాడు–నా మందమతి మండిపోను! ఇప్పుడు గుర్తొచ్చింది, మా తోడికోడలు పేరూ గోదావరమ్మే కదా మరి!" అంటూ అవ్వ సాగరంతో గబగబా చెప్పేస్తోంది. సాగరం సూర్యనారాయణను బిత్తరపోయి చూస్తున్నాడు.

సోమ్మవ్వ సూర్యనారాయణవేపు తిరిగి, "ఔరా! సూరిబాబూ! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు, ఎంత త్వరగా ముసలితనం ముంచుకొచ్చిందా నీకు. అయినా ముఖంలో పోలిక లెక్కడికి పోతాయిలే!–అన్నట్టు–నువ్వు ఒక్కడివే వచ్చినట్టుంది, గోదావరి అమ్మేదీ? తీసుకురాలా?" అంటూ చప్పున నాలుక కరుచుకొని విచారంగా తలదించుకుంది సోమ్మవ్వ. సూర్యనారాయణ తలవంచుకున్నాడు బాష్పనయనాలతో.

సాగరం వజ్రాలహారాన్ని తెచ్చి సూర్యనారాయణ కిచ్చాడు. వొణుకుతున్న చేతులతో దాన్ని పట్టుకుని సూర్యనారాయణ. "సావిత్రీ లేదు!, ఇందుబాలా లేదు!, రాజా లేదు!... అమ్మా! గోదూ! నువ్వున్నావు! ఇప్పుడు నువ్వే నాకున్న అన్నీ! మీ అమ్మ మెడలోదే, వేసుకోమ్మా!," అంటూ గోదావరి మెడలో పెట్టాడు హారాన్ని సూర్యనారాయణ. వజ్రాలు కొత్తకాంతితో మెరుస్తున్నాయి. సాగరానికి; తలెత్తి సిగ్గుగా సాగరాన్ని చూసింది గోదావరి; అప్పుడే వేణుగోపాలస్వామి ఆలయంలో ప్రారంభమౌతున్న బాజా భజంత్రీలు వినిపించాయి.

ఆ రోజే వేణుగోపాలస్వామి కళ్యాణం. సన్నాయిమేళం కళ్యాణిరాగాలాపన వినవస్తూన్నది. శంఖనాదం వినిపిస్తూన్నది. గంటలు మార్మోగుతున్నాయి. మంగళ తూర్యనాదాలు దిక్కులకు వ్యాపిస్తున్నాయి.

అగ్గిపెట్టెల తయారీకి, దుస్తులతయారీకి కావలసిన సన్నాహ సమాలోచనకు అదే ముహూర్తమైంది.

* * *

శుద్ధ ఏకాదశి వెన్నెల నందనం పందిరి మల్లెలమీద మరింత తెల్లగా కురుస్తోంది. గుడిలో ఆనందభైరవి కీర్తనేదో వాయిస్తున్నారు.

"సముద్ర మథనం తర్వాత అందులోంచి వచ్చిన అమృతానివి గోదావరీ!" అన్నాడు సాగరం.

"అమృతాన్ని నేను కాదు,—అమృతాన్ని ధరించిన గోదావరిని!," అంది గోదావరి నునుసిగ్గు వెన్నెలలో మిలమిల మంటూండగా.

"నిజం!...మంచిమాట అవ్వకు చెబుదాం పద!" అంటూ సాగరం గోదావరి భుజం పట్టుకున్నాడు. గోదావరి సిగ్గుపడింది మరీ మరీ గుమ్మందగ్గిర నించుని బుజ్జి తమాషాగా చూస్తున్నాడు.

"నే చెప్పలేదూ! కథానందసాగరం సుఖాంతమే అని!" అన్నాడు సాగరం.

"గోదావరి సాగరాన్ని తరించి మళ్లా తిరిగొచ్చేసిందనా?" అన్నది గోదావరి.

"ఔను! తన సాగరాన్నే చేరుకున్నది గదా మరి! ఉత్తినేకాదు, అమృతాన్ని ధరించి మరీ!" అన్నాడు సాగరం.

ఎత్తిపట్టి చక్రసంచాలనం చేసే చూపుడు వేలులాగ దూరంగా వెన్నెట్లో వెల్లవేసిన వేణుగోపాలస్వామి ఆలయగోపురం తెల్లగా మల్లెమొగ్గలాగ కనిపిస్తున్నది. గోదావరి అటే చూస్తూన్నది. ఆలయంనుంచి సురటి రాగంతో సన్నాయిపాట మంగళహారతి వినిపిస్తూన్నది.

గోదావరి వీపు మెల్లగా తట్టుతూ సాగరం, "మంచిమాట అవ్వతో చెప్పాలి, పద మరి!," అంటూ గోదావరితో గుమ్మంవేపు దారితీశాడు.



# చిన్న కోరిక

ముద్రగడ సూర్య ప్రకాశరావు

ఆనందరావుకు చాన్నాళ్ళనుండీ ఒక చిన్న కోరిక తీరకుండా ఉండిపోయింది. ఆ కోరిక ఘడియ ఘడియకూ మనసులో మెదులుతూ నిలువెత్తునా అతనికి అసంతృప్తిని కలిగించేది. అది అంత పెద్ద కోరికేంకాదు, కలువరేకుల్లాంటి కళ్ళతో, కళ్ళకొసలనుండి వయ్యారంగా చూసే చూపులతో, ఆదరంగా సన్నగా నాజూగ్గా ఉన్న అమ్మాయి ప్రక్కన తను ఠీవిగా సిగరెట్ కాల్చుకుంటూ, సరదాగా కబుర్లుచెప్పి ఆమెను నవ్విస్తూ ఆమె చిరునవ్వులను నాజూకు నవ్వుల్లోని అందాన్ని హృదయంలో నింపుకుంటూ, అలా షికారుగా మెయిన్‌రోడ్డుమీద నడచుకుంటూ, బీచ్‌కెళ్ళి, అక్కడ ఆ అమ్మాయితో కొంతసేపు కబుర్లు చెప్పుకోవడం. ఇదీ అతని కోరిక. చాల చిన్న కోరిక. కాని ఇంత చిన్న కోరిక కూడ తీరకుండా ఉండిపోయింది. కారణం...అతనితో అలా తిరగడానికొచ్చే అమ్మాయి దొరక్కపోవడమే.

పోనీ తన భార్యనే అలాంటి అమ్మాయిగా ఊహించుకొని షికారుకు వెల్దామనుకున్నాడు. కాని అది అన్ని విషయాల్లోనూ అతని అంసతృప్తిని మరింత ఎక్కువచేసిందే తప్ప ఫలితం మాత్రం కనిపించలేదు. ఎందుకంటే అతను కోరిన అమ్మాయి లక్షణాలు ఏ ఒక్కటికూడా అతని భార్యలో లేవు. ఆమె పొట్టిగా, లావుగా, నల్లగా వుంటుంది. చీపికళ్ళు, అతనివైపు వయ్యారంగా చూడ్డానికి బదులు ఉరిమినట్లు చూస్తుంది. అతను మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా అన్ని మాటలూ

మాట్లాడేస్తుంది. అదీగాక అంత దూరం, అంటే సూపర్ బజార్ నుండి. బీచ్ వరకూ నడవమంటే మాత్రం 'నేను ఛస్తే నడవను. అంతంతలేని దూరాలు నడవటం మాకు అలవాటేలేదు. మేము ఎక్కడికెళ్ళినా రిక్షాల్లోనే వెళ్తూండేవారం మా పుట్టింటి దగ్గర. కాని పెళ్ళయ్యాక ఇప్పుడు మీరు అంతంత దూరాలు నడిపిస్తే నేను వప్పుకోను.' అంటుంది. ఆనందరావు కలాంటి సందర్భాలలో ఏడవాలో నవ్వాలో తెలీదు.

అదీగాక 'అంతమంది మగాళ్ళ మధ్య నడవటం నాకిష్టం ఉండదండీ సిగ్గుగా ఉంటుంది,' అంటుంది. 'అదేంటే సిగ్గెందుకు దీంట్లో తప్పేంఉంది. నువ్వు విశాఖపట్నంలో పనిచేస్తున్నవాడ్ని కాదు, ఏ పల్లెటూరివాడ్నో చేసుకోనుండవలసింది. ఎక్కడకో కదలకుండ వంటింట్లోనే కూర్చుని పొద్దు గడిపే సుండేదానివి' అంటే గుర్రుగా చూస్తుంది.

పోనీ ఎలాగోలా ఏ సినిమాకో అని బయలుదేరదీస్తే 'నా ప్రక్కనున్నప్పుడు మాత్రం మీరు సిగరెట్లు చుట్టలు కాల్చకూడదు. అలా అయితేనే నేను సినిమా కొస్తాను' అంటుంది. అదేంటే నా కలవాటు కదా, అంటే వప్పుకోదు.

ఈ విధంగా పాపం, ఆనందరావు కోరిక తీరలేదు.

తనతో అలా తిరగడానికొచ్చే అమ్మాయి లెవరున్నారా? అని చాలా సార్లు ఆలోచించాడు. అతని ఆలోచనల కెవరూ అందలేదు. అతని దురదృష్టవశాత్తు కాలేజీలో చదివే రోజుల్లో కొందరైనా అందమైన అమ్మాయిలతో ఫ్రెండ్‌షిప్ ఉండిఉంటే, ఇలాంటి సమయాలలో వాళ్ళను రిక్వెస్టుచేస్తే వప్పుకొనేవారేమో? కాని ఆ రోజుల్లో అమ్మాయిలతో మాట్లాడ్డం అంటేనే 'అదోలా' భయంగా వుండేది. ఒక్కోసారి వాళ్ళే కలుగచేసుకొని పలుకరించినా మాట్లాడటానికి తడబడేవాడు. వాళ్ళు నవ్వుకొని అతన్ని ఆటపట్టించేవాళ్ళు. ఇలాంటి జ్ఞాపకాలు అతని బాధను మరింత హెచ్చుచేసేవి.

బంధువుల పెళ్ళి అని విజయవాడ నుండి ఆనందరావు అత్తమామలు ఇంకొంతమంది బంధువులు విశాఖపట్నం వచ్చి వాళ్ళింట్లో దిగారు. అంతమంది బంధువుల్ని చూడగానే అతని గుండె ఆగినంత పనయింది. కాని వాళ్ళలో అందంగా ఉన్న ఓ అమ్మాయిని చూడగానే కాస్తంత సర్దుకుంది. ఆమెలో తనకకావలసిన అమ్మాయి లక్షణాలన్నీ ఉన్నాయి. ఇప్పటికైనా దేవుడు తన మొర ఆలకించాడనీ, ఎలాగైనా ఈ అమ్మాయిని వప్పించి తనతో షికారుకు తీసుకెళ్ళాలనీ నిశ్చయించుకొని, కల్పించుకొని ఆ అమ్మాయితో మాట్లాడటం, ఏవేవో విట్లువేసి ఆ అమ్మాయిని నవ్వించడం లాంటివి చేసి

చనువు పెంచుకొని అవకాశం దొరికితే తన కోరిక వెల్లడిద్దామని అనుకున్నాడు. 'మీరందరూ ఓ పదిరోజులయినా మా యింట్లో ఉండాల్సిందే, కాని అంత తొందరగా వెళ్తే మాత్రం ఒప్పుకొనేది లేదని' వాళ్ళతో అన్నాడు.

వాళ్ళందరికీ వండి వడ్డించలేక సతమతమయిపోతున్న అతని భార్యామణి, భర్త అస్తమానం ఆ అమ్మాయితో కల్పించుకొని మాట్లాడటం తినేసేలా చూడడం, ఇవన్నీ గమనించి, అతనింట్లో ఉన్నంతసేపూ వాళ్ళదగ్గరే కూర్చునేది. ఆవిధంగా ఆనందరావుకు ఆ అమ్మాయితో తన కోరిక చెప్పే అవకాశమే దొరకలేదు.

ఒకరోజు ఆ అమ్మాయే అడిగింది. "బావగారూ మీ ఊరు వచ్చాంకదా? మాకు ఇక్కడున్న ముఖ్యమైన ప్రదేశాలన్నీ చూపించరా?" అని.

"ఓ దానికేం—ఈ ఊళ్లో పెద్ద సూపర్ మార్కెటుంది. అక్కడ అన్ని రకాల వస్తువులు దొరుకుతాయి. ఈ ఊళ్ళో బ్రహ్మాండమైన మెయిన్ రోడ్డుంది; విశాఖపట్నం అంత చల్లగా ఉండటానికి కారణం సముద్రం ... ఇక్కడ మంచి బీచుంది. సముద్రపు టొడ్డుకెళ్ళి, కాస్సేపు కూచుంటే ఎంతో హాయిగా వుంటుంది."

పకపకా నవ్వేసిందా అమ్మాయి. "ముఖ్యమైన స్థలాలంటే అవా? ఇంకేమీ లేవా మీ వైజాగ్‌లో" అంది.

"ఉన్నాయనుకో. కాని అవే నాకు నచ్చిన ప్రదేశాలు" అన్నాను.

"అయితే నన్నెప్పుడు తీసుకెళ్తారు" అంది.

"రేపు ఆదివారం సాయంత్రం వెళదాం, మనిద్దరమే వెళ్తే అన్నీ తిరిగి చూడొచ్చు. మెయిన్‌రోడ్డుమీద సరదాగా నడుచుకుంటూ బీచ్‌కెళ్తే ఎంత బావుంటుందనుకున్నావు.''

ఈ మాటలు ఎక్కడినుంచి వింందో అతని భార్య తుఫానులా వచ్చి "ఆ ఆ...ఇద్దరే వెళ్తారు. నేనుకూడ వస్తాను, చూడవే చెల్లీ, పెళ్ళయి కాపు రానికివచ్చి ఇన్నేళ్ళయిందా? ఒక్కసారైనా మీ బావగారు నన్ను ఊరంతా తిప్పి చూపించారా? తీసుకెళ్తే ఏ సినిమాకో గుళ్లోకో తీసుకెళ్తారు" అంది.

"అదిగో, ఆ అబద్ధాలే వద్దన్నాను. నేను ఎప్పుడు వెళ్దామన్నా అంతంత దూరాలు నేను నడవలేనంటావు.''

ఈసారి అనన్లేండి. మా అమ్మ నాన్నగార్ని కూడా తీసికెల్దాం. రిక్షాలో గాని బస్సులోగాని వెళ్తే వేగంగా తిరి గొచ్చెయ్యొచ్చు," అంది.

అనవసరంగా మాంచి ఛాన్సు పోగొట్టేసింది, అని మనసులో అనుకుని పైకిమాత్రం "అలాగే" అన్నాడు.

మిగిలిన బంధువులంతా కూడా

బయలుదేరగా అందర్నీ కలిపి ఊరంతా తిప్పి తీసుకొచ్చాడు. ఆ మరుసట్రోజే వాళ్ళందరూ వెళ్ళిపోయారు.

రోజులు, నెలలు గడుస్తున్నాయి. కాని అతని కోర్కెమాత్రం తీరడం లేదు. కాగా వ్రేళ్ళుపాతుకొని మరింత బలిష్టంగా తయారవుతోంది. చాలసార్లు ఈ విషయమే ఆలోచిస్తూ బోలెడన్ని సిగరెట్లు తగలేశాడు. ఆలోచించగా, ఆలోచించగా అతనికో మంచి ఐడియా తట్టింది. ఆఫీసులో పనిచేస్తున్న సుందరిని అడిగితే? సుందరిలో తన ఊహా సుందరి పోలికలు చాల ఉన్నాయి. కాని సుందరి అంటే ఆఫీసులోని అందరు కుర్రక్లార్కులకు భయమే. ఎందుకంటే? మాట్లాడినంతసేపూ సరదాగా మాట్లాడి ఒక్కోసారి మూడ్ బాగోలేనప్పుడు కయ్యిమని లేస్తుంది. సుందరికి తను గొప్ప అందగత్తెనన్న అహంకారం కూడ ఉంది. అది ఆమె కళ్ళలో చేష్టలలో స్పష్టంగా కనిపిస్తుంది. అందుకే ఆమెతో తన కోరిక వెల్లడిచేస్తే ఎలా వుంటుందో అని జంకుతున్నాడు. చాల రోజులు ఈ ఆలోచనల్ని తనలో దాచుకున్నాడు. కాని ఒకరోజు ఉండబట్టలేక ధైర్యంచేసి అడిగేద్దామని నిశ్చయించుకున్నాడు. మధ్యాహ్నం లంచ్ అవర్‌లో అందరూ భోజనాలకు వెళ్ళాక ఆమె తన సీటులో కూర్చుని టిఫిన్ చేస్తున్న సమయంలో ప్రక్కన కూర్చుని నిమ్మళంగా అడిగాడు. "మీరు ఏమీ అనుకోనంటే ఒక చిన్న కోరిక మిమ్మల్ని కోరుతాను" అని.

"నేనేం దేవతనా మీ కోరికలు తీర్చటానికి" అని నవ్వింది. మళ్ళీ ఏదో ఆలోచించి, "ఏదో కోర్కె అంటున్నారు" అని సందేహంగా చూస్తూ సీరియస్‌గా అంది.

"అ...అబ్బే! అలాంటిదేం కాదండీ, బాబోయ్! అలా చూడకండి. ముందు నేచెప్పేదంతా సావకాశంగా వినండి. నా కోర్కెలో ఏ దురుద్దేశంలేదు. గుమస్తాగాడ్ని. చాలీ చాలని జీతంతో ఏ కోర్కెలూ తీరకపోయినా ఈ చిన్న కోరిక అటూ తీర్చుకుందామని ఉంది. మీరు అపార్థం చేసుకోనంటే!..." అని తన మనసులోని కోర్కె అంతా విశదీకరించి చెప్పాడు.

ఆమె నవ్వింది.

"ఇట్స్ వెరీ సిల్లీ...మీరు భలే వారండీ...ఇదీ ఓ కోర్కేనా! ఇంత చిన్న కోరిక తీర్చుకోవడంకోసం ఇన్ని సంవత్సరాలు వేస్టు చేశారా!" అని మళ్ళీ నవ్వి "ఓక అలాగే...ఒక ఆఫీసులో పనిచేస్తున్నవాళ్ళం, ఈ మాత్రం కోపరేషన్ మనలో లేకపోతే ఇంకెలా" అంది.

"అయితే ఎప్పుడు వెళ్దాం అంటారు" అన్నాడు ఆతృతగా.

అతని ఆతృతకు నవ్వొకుంది. "మీ



కన్వీనియెంట్ డేట్ చూసుకొని నాకు చెప్పారంటే ఆరోజు వస్తాను. కానిఒక్క సంగతి. ఇలావస్తున్నానని మీరు మరోలా భావించి పిచ్చి పిచ్చి వేషాలేస్తేమాత్రం" అంది పళ్ళుబిగించి.

"వొట్టు ... మీ తోడు. నన్ను నమ్మండి. నాకే దురుద్దేశం లేదు. ఆ రోజు మీరే చూస్తారుగా," అన్నాడు. ఆమెకు థేంక్స్ చెప్తూ.

ఇన్నాళ్ళకు తన కోరిక తీరుతుం దన్న సంతోషంలో హుషారుగా ఇంటి కొచ్చిన ఆనందరావుకు కుర్చీలో విచా రంగా కూర్చుని ఉన్న భార్య కనిపిం చింది.

"ఏం అలా కూర్చున్నావేం ఇవ్వాల?" అన్నాడు.

"ఏం చెప్పమంటారండీ! అర్జంటుగా నేను వూరెళ్లాలి, అమ్మకు వంట్లో బాగు లేదట. తీసుకెళ్లానికి మానాన్నగారొ చ్చారు" అంది.

"ఆ నిజమా!" అన్నాడు ఆనందంగా.

"ఇదేంటండీ మా అమ్మకు వంట్లో బాగులేదంటే అంత సంతోషపడిపోతు న్నారు" అంది ఉక్రోషంగా చూస్తూ.

"చచ్చాంరా" అని నాలిక కొరు క్కొని, ఏంటన్నావు! మీ అమ్మకు వంట్లో బాగులేదా? అరెరె జబ్బేంటో? పాపం...అన్నాడు విచారంగా ముఖం పెట్టి.

"జబ్బూలేదూ పాడూలేదూ జ్వరం అండీ. నీరసం ఎక్కువగా ఉందట. ఓ నాలుగురోజులు నే దగ్గరుంటే బాగుం టుందని నాన్నగారు అంటున్నారు."

"ఓ యస్ దానికేం..నాలుగురోజులు కాదు ఓ నెల్లాల పాటుండు. దానికేం భాగ్యం'' అన్నాడు లోపలినుండి ఉబి కొస్తున్న ఆనందాన్ని అణచుకుంటూ.

"మీకు మా గొప్ప వేళాకోలంగా వుంది. ఏంటి విశేషం ఈవేళ ఇంత

హుషారుగా ఉన్నారు. అయినా ఈ రోజు ఇంత ఆలస్యం అయిందేం?" అంది.

"అబ్బే! ఇదేం ఆలస్యం అరుగంటలకే ఇంటికొచ్చేశానుగా. బస్సు దొరకడం కొంచెం కష్టం అయింది, అందుకని కొంచెం ఆలస్యం."

"నాలుగున్నరకు ఆఫీసొదిలితే ఆరుకా ఇంటికి రావడం, ఊరుమీద షికార్లు కొట్టడం అంటే ఓయబ్బో ఏం సరదా."

"పెళ్ళి చేసుకున్నాక నేనెప్పుడు షికారెళ్లానే ... వెళ్తే సంచిపట్టుకొని ఏ బజారుకో వెళ్ళడం తప్ప," అనుకున్నాడు మనసులో.

"హోటేలు తిండితిని ఆరోగ్యం పాడుచేసుకోకుండా ఆఫీసునుండి ఇంటికి రాగానే వండుకు తినండి," అని పురమాయించి, వంటింట్లో ఎక్కడే సామాన్లున్నాయో చూపించింది.

ఆ మరుసట్రోజే అతని భార్యామణి తండ్రితో కలిసి పుట్టింటికెళ్ళింది.

ఆమె వెళ్ళినరోజు సాయంత్రం ఆఫీసునుండి ఇంటికెళ్ళకుండా సరదా తీరేలా ఊరంతా తిరిగి హోటల్లో తన కిష్టమైన కోడి బిర్యానీ తిని, కిళ్ళీ బిగించి దర్జాగా సిగరెట్ కాల్చుకుంటూ రాత్రి తొమ్మిది గంటలకు ఇంటికొచ్చాడు.

ఇంటిదగ్గర భార్యలేకపోవడంతో అతనికి ఎంతో రిలీఫ్‌గా వున్నట్టనిపించింది. ఆవిడుంటే ఇంటికొచ్చిందగ్గర్నుంచి ఒకటే నస. ఎన్ని తెచ్చి పడేసినా, 'ఇంకా అదికావాలి ఇది కావాలి' అని. తనకు వినడానికి ఓపిక లేకపోయినా ఏదో ఒకటి అలా వాగుతూనే వుంటుంది. ఆరోజు హాయిగా ఇంట్లోనే సిగరెట్లు కాల్చుకున్నాడు. డాబామీద వెన్నెల్లో పడుకొని ఆకాశంలో చుక్కల్ని చూస్తూ అందమైన సుందరి రూపాన్ని మబ్బుల్లేని ఆకాశంలో ఊహించుకుంటూ, నిద్రలోకి జారిపోయాడు.

ఆ మరుసట్రోజు సుందరితో కలిసి "రేపు ఆదివారం సాయంత్రం నాలుగున్నరకు మీయింటికొస్తాను. అక్కడ్నుంచి ఇద్దరం సూపర్ బజారుకు వెళ్ళి అక్కడ్నుంచి బయలుదేరుదాం" అన్నాడు. ఆమె వప్పుకుంది.

ఆదివారం మాంచి ట్రిమ్‌గా తయారయి టై కట్టుకుని మూడు సిగరెట్ పేకెట్లు జేబులో పెట్టుకొని సుందరి ఇంటికెళ్ళాడు. అతనికిష్టం అయిన చిలకాకుపచ్చరంగు చీరలో కళ్ళు జిగేల్ మనిపించేలా తయారయి అతనికోసమే ఎదురుచూస్తున్నదామె.

కాఫీ త్రాగి ఇద్దరూ బయలుదేరారు.

సూపర్ బజారు బస్‌స్టాపు దగ్గర సుందరి ప్రక్కన స్టైల్‌గా నిలబడి సిగరెట్ ముట్టించి తన కోర్కెకు ప్రారంభోత్సవం చేశాడు ఆనందరావు.




అందమైన సుందరి ప్రక్కన నిలబడి ఉన్న తన నందరూ ఈర్ష్యతో చూస్తు న్నట్లుగా అనిపించిందతనికి. ఫోజుగా కాలర్ సర్దుకున్నాడు. ఇద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ, నెమ్మదిగా నడుచు కుంటూ వెళ్తున్నారు. ప్రక్కనే దగ్గరగా నడుస్తూ ఆమెకు ఏ మాత్రం తన చేయి కూడా తగలనీయకుండా జాగ్రత్త పడుతున్నాడు.

ఆతని జాగ్రత్తను గమనించి నవ్వు కుంది సుందరి.

"ఫరవాలేదు లెండి, మరీ అంత బిగుసుకుపోయి నడవకండి 'ఫ్రీ' గా నడవండి. మీ చేయి తగిలినా నేనేం అనుకోను" అంది సన్నగా నవ్వుతూ.

"థేంక్స్" చెప్పి మామూలుగా నడవసాగాడు. అలా నడుస్తుంటే అతని కెంతో గర్వంగా, ఆనందంగా ఉంది. మరో సిగరెట్టు ముట్టించాడు.

"ఏవండోయ్! అలా వరసగా సిగ రెట్లు ఊదేస్తున్నారేంటి? అప్పుడే అర డజను కాల్చినట్టున్నారు. ఆఫీసులో ఎప్పుడూ కాల్చినట్టు నాక్కనిపించలేదు" అంది.

"అంత పెద్ద అలవాటు లేదనుకోండి. కాని ఈరోజు మాత్రం నేను మీ ప్రక్కగ రోడ్డుమీద ఉన్నంతసేపూ, నా పెదవుల మధ్య సిగరెట్టు ఉండవలసిందే."

అలా కబుర్లు చెప్పుకుంటూ ఇద్దరూ బీచ్‌వరకూ వెళ్ళారు.

ఇసుకలో కాళ్ళుదూర్చి కూర్చున్న ఆనందరావు ప్రక్కనే సుందరి కూర్చుంది.

చల్లగా వీస్తున్న పిల్లగాలికి సుందరి ముంగురులు చెదిరి ముఖంతో ఆటలాడు కుంటున్నాయి, ఆమె కళ్ళలోకి కృత జ్ఞతాపూర్వకంగా చూస్తూ.

"మీకేవిధంగా థేంక్స్ చెప్పుకో వాలో నాకు తెలీడంలేదు" అన్నాడు.

'దేని' కందామె కొంటెగా చూస్తూ.

"నాకింత కోపరేష నిచ్చినందుకు."

కిలకిల నవ్వి "ఏంటండీ మీరూ! మీ కోర్కేనూ, ఫన్నీ ఫెలో" అని అతని మోకాలిమీద చిన్నగా కొట్టింది.

గుండె ఝల్లుమంది ఆనందరావుకు, "ఏదీ మళ్ళీ కొట్టండి" అన్నాడు.

"నేనంటే మీకంతిష్టమా?" అంది, తన పెద్దకళ్ళను చక్రాల్లా తిప్పుతూ.

"అవునండీ! నాకేగనక పెళ్ళి అవ తుండా ఉండి ఉంటే మిమ్మల్నే చేసు కొనేవాడిని."

"నిజం."

"వొట్టు మీ తోడు," అంటూ ఆమె చేతిలో చేయివేశాడు.

"ఏంటండీ! చిన్నపిల్లాడిలా మీ వొట్టూ గిట్టూను" అంది, చేయి తీసు కోడానికి ఆమె ప్రయత్నం చేయలేదు. ఆనందరావు నరాల్లో తీయటి బాధ మొదలయింది.

ఆమె చేతినలాగే తీసుకొని సుతా రంగా ముద్దుపెట్టుకున్నాడు.

ఆమె గభాలున చేయి లాగేసుకొని "ఎందుకలా చేశారు? ఊ..." అంది, కోపంగా చూస్తూ.

"సారీ! ఎందుకో అలా చేయాలని పించింది."

"ఇప్పుడలా అనిపించింది. మరికొంత సేపుంటే? ఇంకేమనిపిస్తుందో?"

"అబ్బే! అదేం లేదండీ! చిన్న పొరపాటు...అంతే! తప్పుచేశానుగా అందుకని, ఏదీ ఈ చెంప ఛెళ్ళుమని పించండి" అన్నాడు బుంగమూతితో ఆమెవైపు చూస్తూ.

"ఛ ఛ అలా అనకండి. నేను మీ చెంప పగలగొట్టడమా?" అంది.

"క్షమించాననండి," అన్నాడు మళ్ళీ ఆమె చేయి పట్టుకోబోతూ.

"ఏయ్ ఇదిగో...మళ్ళీ" అంది నవ్వుతూ. అతనూ నవ్వాడు.

ఆనందరావుతో జతకలిపాయి ఎదు రుగా నున్న సముద్రంలోని కెరటాలు.

* * *

ఆ రాత్రే ఆనందరావుకు బ్రహ్మాండ మైన కలొచ్చింది. ఆ కలలో సుందరి




అతని కళ్ళలో కళ్ళు కలిపి గిలిగింతలు పెట్టింది. తెల్లవారగానే హుషారుగా లేచాడు. ఆ రోజంతా అతని కళ్ళలో సుందరే ఉంది. ఘడియ ఘడియకు "ఎందుకలా చేశారు?" అంటున్న ఆమె రూపం లీలగా కనిపించేది. ఆ రోజు రాత్రి 'ఫస్టు షో' ఇంగ్లీషు సినిమాకెళ్ళి, హోటల్లో భోంచేశాడు.

ఆ రాత్రికూడ సుందరి రూపం అతన్ని వదల్లేదు. కొంటెగా చూస్తూ "ఎందుకలా చేశారు?" అంటూ చిరుకోపం ప్రదర్శించింది. గభాలున సుందరిని చేయిపట్టుకొని లాక్కున్నాడు. సుందరి తన వడిలో కరగిపోయింది.

ఎవరో తలుపు 'దబదబ' బాదటంతో తెలివొచ్చేసింది. అప్పటికి తెల్లవారుతూంది. బద్ధకంగా లేచి అలాగే కూర్చున్నాడు. తలుపు దబదబలు ఎక్కువైపోయాయి. కిటికీ దగ్గరకూడ ఎవరివో నాలుగైదు గొంతుకలు విన్పిస్తున్నాయి "ఎవర్రా వీళ్ళు," అని విసుక్కుంటూ వెళ్ళి తలుపు తీశాడు. సుడిగాలిలా లోపల ప్రవేశించింది అతని భార్యామణి. "తలుపు తియ్యటాని కెందుకింత ఆలస్యం అయింది," అని ఆత్రుతగా అటు ఇటు చూస్తూ గది, వంటిల్లు, బాత్రూమ్ కలియతిరిగేసి ఎవరికోసమో, వెతికేస్తోంది.

పెట్టె బెడ్డింగుతో రిక్షావాడు ఆ వెనుక ఆమెతండ్రి లోపల ప్రవేశించారు. గుమ్మం దగ్గర, వీధిలోవాళ్ళు కొంత మంది నిలబడి ఉన్నారు.

ఇదంతా ఏంటో అర్థంకాక వెర్రి ముఖం వేసుకుని నిల్చున్నాడు ఆనంద రావు. అతని భార్య వీధి తలుపు గడియ పెట్టొచ్చి, అరగంటనుండీ అరచి చస్తూ తలుపు బాదుతుంటే, ఇప్పుడా తలుపు తియ్యడం...ఇంతసేపూ లోపల ఏం

చేస్తున్నారు" అంతతన్ని నిలదీసి అడుగుతూ.

"ఏంటే? నీకేవన్నా పిచ్చెక్కిందా? నిద్రలేచి తలుపుతీశాను. అవును, ఏం టిలా అర్జంటుగా ఊడిపడ్డావు. అక్కడ ఒక నెలన్నా వుంటావనుకున్నాను."

"ఆఁ... ఆఁ... వుంటాను... నెలరోజులు నేనక్కడ ఉంటే మీరు దాన్నెవర్తినో పెట్టుకొని జల్సా చేస్తుం డండి," అంది విసురుగా.

"అయినా ముగ్గురు పిల్లల తండ్రి వయి ఉండి కూడ ఇదేం పనబ్బాయి? అదెవరో అమ్మాయితో తిరుగుతున్నా వట. పెళ్ళాన్ని పుట్టింటికి పంపించి, ఇదేం పని?" అని అతని మామగారు అంటుంటే, "ఇంతసేపూ ఇదే అను కుంటే ఇప్పుడు మీరూత యారయారన్న మాట. వెంటనే స్నానాలవీ కానియ్యండి పెదవాత్తేరు వెళ్దాం" అన్నాడు.

"మమ్మల్ని పిచ్చాసుపత్రిలో జాయిన్ చేద్దామనా పెదవాల్తేరు అంటు న్నారు?" అంటూ ఎగిరిపడ్డాడాయన.

"ఓర్నాయనో ... ఇదేంగోలరోయ్ దేవుడో..."అని గోలపెట్టి జుత్తు పీక్కు న్నాడు, ఆనందరావు.

"మీ వేషాలన్నీ చూస్తున్నాలెండి, ఎప్పుడు పంపినా రెండు మూడ్రోజుల్లో తిరిగి వచ్చెయ్యమనేవారు ఇప్పుడు నెలరోజు లుండమనగానే అనుకున్నాను మీరిలాంటి వెధవ్వేషాలేవో వేస్తారని. మా పెద్దమ్మ కొడుకు చంటన్నయ్య టెలిగ్రాం ఇవ్వబట్టి సరిపోయిందిగాని... లేకపోతే...అమ్మా!...అమ్మా...ఎంత బరితెగించారు."

"టెలిగ్రామా? ఎందుకూ?...ఏదీ ఆ...టెలిగ్రాం" అన్నాడు చికాగ్గా.

టెలిగ్రాం సారాంశం ఇదీ: 'బావగారు ఎవరో అమ్మాయితో తిరుగుతున్నారు. వెంటనే నువ్వు బయలుదేరిరా' అనీ. అసలు సంగతంతా అర్థం అయింది అతనికి.

వాళ్ళిద్దరికీ నింపాదిగా, తన కోరిక, ఆ కోరికను సుందరికి చెప్పడం, ఆమె అంగీకరించడం, నా ఆదివారంనాడు ఇద్దరూ కలిసి షికారెల్లడం...అంతా వివరించి చెప్పాడు.

ఇంతలా చెప్పినా ఆమెమాత్రం నమ్మలేదు. "కథల్రాస్తారు కదా, ఇదీ ఓ కథే," అని కొట్టిపారేసింది

ఆ తరువాత సుందరినే ఇంటికి తీసు కొచ్చి, ఆమెచేతకూడ చెప్పించి వాళ్ళను శాంతింపచేసేసరికి, ఆనంద రావుకు చావుతప్పి కన్ను లొట్టపోయి నంత పనయింది.



# చెప్పకూడని నిజం

## పాలకోడేటి సత్యనారాయణరావు

ఆ ఇంటి ముందుకొచ్చి ఆగింది నల్లటి కారు. కార్లోంచి నెమ్మదిగా హుందాగా మరింత అందంగా దిగింది వసంత. నల్లటి ఆ కార్లోంచి తెల్లటి వసంత దిగుతోంటే మేఘాల మధ్యనుంచి అప్సరస దిగుతున్నట్లుగా ఉంది. కార్లోంచి దిగిన వసంత మళ్ళీ కారులోకి వంగి నెమ్మదిగా ఏదో మాట్లాడింది. ఆ తర్వాత చేతిలోని వేనిటీ బాగ్‌ను ఊపుకొంటూ ఇంట్లోకి నడిచింది—ఇదంతా ఇంటిముందున్న చిన్న పూలతోటకు నీళ్లు పోస్తున్న శేషగిరి చూడనట్లే చూశాడు. 'నిన్ను నేనూ చూశానోయ్, మిస్టర్ శేషగిరీ!' అన్నట్లుగా అతనికేసి ఓ చిరునవ్వు పారేసింది వసంత. అదీ చూశాడు శేషగిరి.

—ఇదంతా చూశాక శేషగిరి ఓసారి ఆకాశంకేసి చూశాడు. ఆకాశం అక్కడో మబ్బు, ఇక్కడో మబ్బు తప్ప, మిగిలిందంతా నిర్మలంగా ఉంది. పశ్చిమంలో ఎక్కడో సూర్యుడు అస్తమించనా, ఇంకో క్షణం ఆగనా అంటూ ఆలోచనలో పడ్డాడులా ఉంది. అతని ముఖంలోని ఎరుపురంగు పశ్చిమంలో అంతా కనిపిస్తోంది. ఎర్రటి ఆ రంగుల్లో ఇళ్ళకు పోతున్న పక్షులు తెల్లగా అందంగా కనిపించాయి శేషగిరికి.

'ఇపుడు వర్షం పడటంలేదు' అనుకొన్నాడు శేషగిరి.

*　　*　　*

వసంతను పెళ్ళిచేసుకోక మునుపు శేషగిరి వసంతను చాలసార్లు చూశాడు. కానీ ఎపుడూ వసంతలో ఇంతటి మార్పు వస్తుందని అనుకోలేదు. పెళ్ళి కాక మునుపు శేషగిరి వసంతలో అందాన్ని చూశాడు, ఆత్మీయతను చూశాడు; నిర్మలమైన పల్లెటూరి ముగ్ధత్వాన్ని చూశాడు.

రోజూ పొద్దున్న నీటుగా తయారయి, ఒక చేతిలో పుస్తకాలు, మరో చేత్తో టిఫిన్ కారియర్ పట్టుకొని బయలుదేరేది వసంత. ఎదురింట్లోంచి కొంత దొంగతనంగా కొంత ధైర్యంగా వసంతకేసి చూసేవాడు శేషగిరి. ఆ చిన్నప్పటి లేత మనసులో వసంతను ముద్రించుకొన్నాడు. ఎప్పటికైనా వసంతనే పెళ్ళి చేసుకోవాలనే అనుకొనేవాడు. ఏం జరిగిందో ఏమోగానీ వసంత ఎనిమిదో తరగతిలోకి వచ్చిందో లేదో చదువు మానేసింది. ఆ సంగతి తెలిసిన క్షణాల్లో శేషగిరి చాల బాధపడ్డాడు. వసంతను తను పెళ్ళిచేసుకొని పెద్ద చదువులు చదివించుకోవాలని నిర్ణయించుకొన్నాడు.

ఆ చిన్నతనపు ఆశలు అతనితో బాటుగానే పెరిగి పెద్దవయాయి. తనకు సంబంధాలు రావటం మొదలుపెట్టగానే ఇంట్లో స్పష్టంగా చెప్పాడు శేషగిరి తను వసంతనే చేసుకొని తీరతానని. ఇంట్లోవాళ్లు ముందు కాదన్నాగానీ తర్వాత తర్వాత తప్పక, వసంతవాళ్ళ ఇంటివాళ్ళతో ప్రయత్నాలు జరిపి, మంతనాలు సాగించి, చివరకు ఇద్దర్నీ ఒక ఇంటివాళ్ళను చేసేసారు.

మొదటిరోజున వసంతను ఒంటరిగా కలుసుకొనే అవకాశం దొరకగానే, ముందు అడగాలనుకొన్నది అడిగేశాడు శేషగిరి — ముందు ఆ ప్రశ్న విని ఆశ్చర్యపోయి, తర్వాత ఫకాలున నవ్వేసింది వసంత.

"నా కిప్పుడు చదువేమిటండీ?"

శేషగిరి ఆ ప్రశ్న విని చప్పబడిపోయాడు — తన వసంతేనా ఇలా అంటున్నది? తను అడగగానే సంతోషంతో తలకిందులు అయిపోతూందనీ, తన కోరిక తీరుతున్నందుకు ఎంతో సంతోషపడుతుందనీ, 'మీ దెంత మంచి హృదయమండీ!' నే నెంత అదృష్టవంతురాల్ని!' అనీ అంటుందనీ ఎన్నెన్నో అనుకొన్న శేషగిరికి వసంత అలా అడిగేసరికి నీరసం వచ్చింది. అయినా తేరుకొంటూ అన్నాడు—

"ఏం? ఇపు దేమొచ్చిందని?"

"ఆ, చదువు మానేసి అయిదేళ్ళు అయిందా? ఇంక ఇపుడు ఎలా చదవటం?"

"ఎలా చదవటం అంటే?"

"ఇపుడు వెళ్ళి స్కూల్లో కూర్చుంటే

ఇంకేముందీ ?" అంది వసంత సాధ్యమైనంతగా సాగదీసుకొంటూ.

శేషగిరికి నవ్వొచ్చింది —"ఇప్పుడు నిన్ను స్కూల్లో ఎవరు కూర్చోమన్నారు ? ఇంట్లోనే ఉండి ప్రైవేటుగా చదువుకొందువుగాని !"

వసంతకు శేషగిరి నిజంగానే అంటున్నాడేమో ననిపించి, అతని ముఖంలోకి చూసింది. శేషగిరి నవ్వుతూనే ఉన్నా, అతని ముఖంలో అతను అంటున్న మాటల వెనుకనున్న దృఢ నిర్ణయం కనిపిస్తోంది. వసంతకు అసలు చదవాలనే లేదు. ఆ మాట అంటే శేషగిరి ఏమంటాడో ఊహించుకోలేక నెమ్మదిగా అంది — "నా కీ వయసులో చదువుకోవాలని లేదండీ !"

"అదేమిటి వసంతా ! చదువుకు వయసేమిటి ? పైగా నీదేమంత పెద్దవయసని నీ ఊహ ? ఇరవై ఏళ్ళకే..." నవ్వేశాడు శేషగిరి.

"లేదండీ, నా కిపుడు చదువుకోవాలనే లేదు." ఇంక కొంతకాలం తర్వాత..."

''ఇపుడే చదవలేననేదానివి ఇంతకన్నా పెద్దవయసులో ఇంకేం చదవగలవు ? పైగా నీకు ఇంకొన్ని ఏళ్ళు వచ్చేస్తే అపుడు నీకు ఉద్యోగం దొరకదు !''

వసంత మరింతగా ఆశ్చర్యపోయింది— "ఉద్యోగమా ?"

"ఔను వసంతా ! భార్యా భర్తలు ఇద్దరం ఉద్యోగం చేసుకొంటే ఎంత బాగుంటుందంటావ్ ! ఇద్దరమూ హాయిగా కలిసి వెళ్ళచ్చు, కలిసి రావచ్చు— ఇదొకటే కాదు ఇంకా చాల ఉన్నాయి నా మనసులో కోరికలు... కానీ వసంతా, వీటన్నిటిని మనం కళ్ళారా చూడాలంటే ముఖ్యం నువ్వు చదువుకోవడం !..."

వసంత ఏమీ అనలేకపోయింది. శేషగిరి మనసులో ఆ క్షణం ఏమేమి ఊహలు ఉన్నాయో, ఆ ఊహల స్వరూపం ఏమిటో తను ఊహించుకొనే యత్నంకూడ చేయలేదు వసంత. తప్పదు, తను చదవాలి – శేషగిరి ఆనందంకోసం తను చదవాలి. అతని కోరికలు ఏమైనాసరే తను తీర్చగలిగితే తప్పక తీర్చాల్సిందే ! పైపెచ్చు తన్ను చదవమంటున్నారేకానీ ఇంకేం కాదు – తనకు ఆ వయసులో చదువుకోవాలని లేదు; తన మనసులో ఉండే కోరికలన్నీ ఒకటే – ఆ కోరికలు తన వయసులోనే ఉండే స్త్రీ లందరిలోనూ ఉండేవే ! తనేం ప్రత్యేకత కోరుకోవటంలేదు – సామాన్య స్త్రీగా బతకాలని ఉంది వసంతకు. భర్తతో కాపురం చేసుకోవాలనీ, తనూ పిల్లలతల్లి కావాలనీ, ఆ పిల్లలు అల్లరి చేస్తోంటే ఆనందించాలనీ ... ఇంతే వసంత కోరికలు – ఆ కోరికలు తీరాలంటే పెళ్ళి కావాలి. ఆ పెళ్ళి అయిపోయింది. కాని పెళ్ళి అయిన వెంటనే

భర్త కోరికలు... ఏమో, భర్త అనేదే సరి అయినదేమో!

వసంత మనసంతా అల్లకల్లోలం అయిపోయింది. ఆలోచనలు ఆమె మనసంతా ఆక్రమించాయి. చదవమని కొన్ని, చదవకూడదని కొన్ని ఆలోచనలు...

క్షణం ఆగి అంది వసంత — "నేను పాసవగలనో లేదో నండీ..."

నవ్వాడు శేషగిరి— "అదా నీ అనుమానం? అందరూ పాసవుతున్నారు గదా, నువ్వెందుకు పాసవలేవు వసంతా! నువ్వు చదువుతానని అను, చాలు. మిగతాదంతా నేను చూసుకొంటాను..."

వసంత ఏమీ అనలేదు

"చెప్పు వసంతా— చదువుకోవటం మహా పాపం అనుకొంటున్నావా ఏమిటి? ఇంత ఆలోచిస్తున్నావ్?"

వసంత సందేహిస్తూ అంది: - "మీ కంతగా ఇష్టం ఉంటే..."

"నాకోసం చదువుతా నంటావ్ మరి?"

"ఉహూ, నాకోసమూ చదువుకొంటా!"

శేషగిరి ఆ మాటలు విన్నతర్వాత వసంతను దగ్గరకు తీసుకొన్నాడు.

* * *

వసంత, వసంత బి. ఏ. అయిన రోజు...

'వసంతా— నా కెంత సంతోషంగా ఉందో తెలుసా ఈ రోజు!" అన్నాడు శేషగిరి.

శేషగిరి ఆనందంలో పాలుపంచుకొంటూ అంది వసంత: "మీ ఆనందం సంగతి దేవుడెరుగుగానీ నా ఆనందం సంగతి నేనుమాత్రం చెప్పలేకపోతున్నాను!"

"ఔనుమరి, ఎంతైనా ఈ రోజునుంచీ తమరు గ్రాడ్యుయేట్ గదా!"

"అందుకుగాదు మహానుభావా! మీ కోరిక తీర్చగలిగాననే తృప్తి, ఆనందం నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి."

శేషగిరికి ఆనందంతో ఒళ్ళంతా పులకరించింది. తనకోసం వసంత ఏదైనా చేస్తుందనే ఊహ అతన్ని ఒకసారి ఉక్కిరి బిక్కిరి చేసింది.

నెమ్మదిగా అన్నాడు— "వసంతా, నువ్వు ఎం. ఏ. కి కట్టాలి మరి!"

వసంత ఉలికిపడుతూ అంది— "బాబోయ్, ఇంకా చదువుకోవటమా? నా వల్ల కాదు-"

"అలా అనకు వసంతా. ఆలోచించు నువ్వు - పోస్ట్ గ్రాడ్యుయేట్‌వి అయితే నేనెంత సంతోషిస్తానో..."

"వద్దండీ— మీ కోరిక తీర్చటం కోసం చదివానేగానీ నాకు చదువుకోవాలనే కాంక్షే లేదు. పైపెచ్చు ఈ చదువుకోసం నే నెన్ని సుఖాల్ని పోగొట్టుకొంటున్నానో మీకు తెలీదు. పొద్దున్న ఇద్దరం లేచేసరికి ఏడున్నర. ఆ తర్వాత



మీరు తయారవటంలో మీరు నిమగ్న మవుతారు. నేనూ, నా వంటిల్లూ తయారు. అంతా అయేసరికి మీ ఆఫీసుకు టైం అయిపోతుంది. ఆదరా బాదరాగా రెండు మెతుకులు తినీ, తినక మీరు ఆఫీసుకు పరిగెట్టటం... నేను మెల్లిగా అన్నం తిని, రెండయిన తర్వాత ట్యుటోరియల్ కాలేజీకి వెళ్ళటం, ఆరున్నరవరకు అక్కడ నేను; అయిదింటికి వచ్చి ఒంటరిగా మీ రిక్కడ... ఎందుకొచ్చిన చదువు ఇదీ. ఎవర్ని ఉద్ధరించడానికి ?? — ఉహూ, నా వల్లకాదు, నేను ఇంక చదవనంటే చదవను !"

శేషగిరి క్షణంసేపు ఆలోచనలో పడ్డాడు. నిజమే - వసంత చెప్పేది నిజం - ఎన్నేళ్ళనుంచి ఈ సంగతి తనకు చెప్పాలనుకొని మనసులో ఉంచుకొందో ఏమో, ఈ రోజున బయటకు కక్కింది. కానీ... చదువుకోమని అనటం అంటే ఎదగమనటం — మానసికంగా పెరగమనటం ! చదువుకో గలగటమనేది ఎంత గొప్ప వరం ! తనకు ఆ వరం దక్కలేదు. తనకు చదివించేవారు లేక పోయారు. తన భార్య - వసంత - కేం ? తను ఉన్నాడు. కష్టనష్టాల నన్నిటినీ భరించటానికి తను సిద్ధం. 'చదువుకో వసంతా' అంటే చదవనంటోంది. 'మానసికంగా పెరుగు వసంతా' అంటే 'ఉహూ పెరగనంటోంది'— 'ఉన్నత శిఖరాలు అందుకో, వసంతా' అంటే 'వద్దు శిఖరాలకన్నా నాకు మీరే ముఖ్యం' అంటోంది వసంత — కానీ వసంత ఎదగాలి. ప్రపంచంలో ఉన్న మేధావు లందరి పేర్లలో వసంత పేరు ఉండాలి. ఈ రోజు ఈ క్షణిక సుఖాలకోసం, తుచ్ఛమైన శారీరక సౌఖ్యాలకోసం

ఆశయా లన్నిటినీ పణంపెట్టటం... ఊహూ, అది అలా జరగటానికి వీల్లేదు. వసంత చదవాలి. వసంతకోసం కాక పోయినా, తనకోసం వసంత చదవాలి - అదే అన్నాడు శేషగిరి.

వసంత మొహం మాడ్చుకొంటూ అంది— "మీ గొడవ మీదే కానీ నా బాధ అర్థంచేసుకోరేం? మీ కీ చదువుల దెయ్యం ఎపుడు పట్టుకొందో ఏమోగానీ నా ప్రాణం తినేస్తోంది!"

శేషగిరి అనునయిస్తూ అన్నాడు - "అలా అనకు వసంతా - నాది ఇది చాల చిన్న కోరిక - నా భార్య ఉన్నత శిఖరాల నధిరోహించా లనుకోవటం తప్పు పని కాదుగదా!"

"ఉహూ కాదు, నేనేమో ఉన్నత శిఖరాలు ఎక్కాలి. బాగానే ఉంది - అది మీ స్వార్థం. నా కోరిక లన్నిటినీ సమాధిచేసి మరీ శిఖరాల నధిరోహిద్దాం-" అంది వసంత ఉడుకుమోత్తనంతో.

శేషగిరి పకాలున నవ్వాడు. వసంత అలా అంటూందే కానీ తన మాట కాదు అనేది వసంతవల్ల కాదని శేషగిరికి తెలుసు

ఆ విషయంలో శేషగిరి రైటు. వసంత చాలసేపటి తర్వాత ఎం. ఏ. చదవటానికి ఒప్పుకొంది.

* * *

వసంత కష్టపడి రెండేళ్ళ ఎం. ఏంను మూడేళ్ళలో పూర్తిచేసింది. శేషగిరి ఆనందానికి పట్ట పగ్గాలు లేకపోయాయి.

ఎంతమందికి కలిగేను ఈ అదృష్టం? ఎంతమంది కాగలిగేరు పోస్ట్ గ్రాడ్యుయేట్లు? - ఎంతమంది కన్న కలలు ఇలా సాఫల్యం కాగలుగుతున్నాయి? - శేషగిరికి ఆకాశం అందుకొన్నంత ఆనందంగా ఉంది.

పరీక్షా ఫలితాలు వచ్చిన రోజున రాత్రి వసంతను దగ్గరగా తీసుకొంటూ అన్నాడు శేషగిరి - "తర్వాత ఏం చేస్తావు వసంతా?"

వసంత గుండెల్లో రాయిపడింది - అయిపోయిందనుకుంటే ఈ చిత్రకథ? ఇంకా ఎన్నేళ్ళు? - అయినా ఏముంది, ఇక చదవటానికి? - నవ్వుతూ అంది వసంత: "చేయటానికి ఏం ఉందండీ ఇంక?- ఇంటిపట్టున కూర్చోటమేగా?-"

ఈ సారి శేషగిరి ఉలికిపడ్డాడు - "అదేమిటి వసంతా? ఇంత చదువూ చదివింది ఇంట్లో అంట్లు తోముకోవటానికా?"

నవ్వింది వసంత - "అంట్లు తోమటానికి కాకపోతే పిల్లల్ని కనడానికి!-"

"దానికైతే చదవనక్కర్లేదు - ఇంత అవస్థా పడనక్కర్లేదు! కాదు వసంతా... క్షణం ఆలోచించు వసంతా - ఇంత చదువుకూ ఒక అర్థం కల్పించాలంటావా వద్దా?-"

వసంత క్షణం ఆగి అంది – "ఒక్క మాట చెప్పనాండీ ? – మీరు ఈ విషయంలో ఏమన్నా అనుకోండి, మీ ఇష్టం, ఇక నేను ఇంట్లోనే ఉండిపోతా ననేది మాత్రం నిజం !–"

"ఇంట్లోనే ఉండు, వద్దనలేదు. కానీ ఎటొచ్చీ నేను ఇంట్లో లేనపుడు నువ్వేం చేస్తావు ? – అందుకని నేను చెప్పేది ఏమంటే... !"

వసంత ఒకసారి శేషగిరికేసి చూసింది. ఆ చూపును తట్టుకోలేక పోయాడు శేషగిరి. తడబడుతూ అన్నాడు శేషగిరి – "అదికాదు వసంతా, నేను చెప్పేది విను, నీకు ఇష్టం లేకపోతే కాదను, అంతవరకూ... నిన్ననే వెళ్ళి విశ్వేశ్వర్రావుగారితో మాట్లాడి వచ్చాను. నిన్ను వాళ్ళ కాలేజీలో ఉన్న ఆ లెక్చరర్ పోస్టులో వేస్తానన్నారు !–"

"నిజంగానా ?–" నెమ్మదిగా అడిగింది వసంత.

"ఔను వసంతా – ఈ రిజల్ట్ రాక ముందే నేను వెళ్ళి అడిగాను. రిజల్ట్ రాగానే మళ్ళీ కనిపించమన్నారు. అందుకని ఇంకోసారి ఈ వేళ వెళ్ళివచ్చాను. ఆ పోస్టు నీకే ఖాయం చేస్తామన్నారు !–"

చాలాసేపు వసంత ఏమీ అనలేదు. చాల అవస్థపడుతూ అంది చివరకు వసంత – "మీరు చేసిన ఈ పని నాకేం నచ్చలేదు. నేను వెళ్ళి ఉద్యోగం చేస్తాననుకోవద్దు మీరు !"

"వసంతా !–"

"ఔనండీ, పెళ్ళయిన రోజునుంచీ చూస్తున్నాను, ఎంతసేపూ మీ గోల మీదే గాని నా బాధ అర్థంచేసుకోరేం ?– నాకు మీరు సంపాదిస్తున్న డబ్బు చాలు ఈ డబ్బుతో ఇద్దరం హాయిగా బతకవచ్చు. ఇంకా సంపాదించి బతకాలన్న పరిస్థితి కాదు మనది. అంతెందుకొచ్చిన తాపత్రయం ఇది ? – మీ గొడవ మీదే గానీ, నా పరిస్థితి కొంచెం అర్థంచేసుకోండి – నాకు ఇంట్లోనే ఉండాలని ఉంటుంది – మీరు కోరుకొన్నట్లుగా ఇంతకాలం గడిచింది. ఇక నా ఇష్టం. చదవటం మీకు ఇష్టం, చదివాను. అలాగే ఉద్యోగం మీకు ఇష్టం అంటే నేను చేస్తానను కోకండి ! నాకు ఇల్లు, ఇల్లు... ఇల్లే ముఖ్యం ! ఇంకేమీ అక్కర్లేదు తర్వాత మీ ఇష్టం !–"

శేషగిరి అవాక్కయిపోయాడు.

క్షణం ఆగి అన్నాడు శేషగిరి – "సారీ వసంతా. నువ్వనేదీ రైటే – ఈ విషయంలో నేను తొందరపడ్డాను. నా మాట వింటావనే ధైర్యంతోనే ఇలా చేశాను గానీ లేకపోతే నీ సలహా తీసుకొని తీరేవాణ్ణి !"

వసంత శేషగిరి అంటున్నది కట్ చేస్తూ అంది – "నేను ఉద్యోగం చేయనంటే మీ మాటకు విలువ ఇవ్వనని కాదు !–"

"పోనీ ఇసావనే అనుకొందాం –

అయినా ఈ విషయంలో తప్పే జరిగింది! తప్పుచేసింది నేనే! కాదనను!-రేపొ్ద్దున్నే వెళ్ళి విశ్వేశ్వరరావుగారితో చెప్పేసి వస్తాను ఈ సంగతి!-" అని శేషగిరి ప్రక్కకు తిరిగి పడుకొన్నాడు.

వసంతా, క్షణం పక్కకు తిరిగింది - ఏమిటో, పరీక్ష పాసయాక ఆనందమే లేకపోయింది. ఎవరికోసం తను ఇంత కష్టపడి చదివిందో, ఆ వ్యక్తే తను పాసయితే సంతోషపడకపోగా, ఇలా ఇబ్బందిగా ఫీలవటం వసంతకు బాధ కలిగించింది—

భర్తను నెమ్మదిగా తాకింది వసంత. శేషగిరి మరింతగా ముడుచుకొన్నాడు. నవ్వుతూ అంది వసంత - "చాల్లెండి!- ఒక సంగతి చెప్పనాండీ? - ఈ ఉద్యోగంలో మీరు చెప్పినట్లే చేర్తాను లెండి - ఇక ఇటు తిరగండి!"

"నిజంగానా!-"

"నిజమే! - ఇక అలక తగ్గించి ఇటు తిరగండి!-" అంది వసంత.

శేషగిరి వసంతకేసి తిరిగాడు. క్షణం తిరగకముందే వసంత శేషగిరి కౌగిలిలో ఇమిడిపోయింది - వసంత మనసు మాత్రం తీవ్రంగా ఆలోచిస్తోంది. ఎలా ఈ ఉద్యోగంనుండి తప్పించుకోవాలా? అని!

* * *

మనసెంతగానో ఎదురు తిరుగుతున్నా కానీ, ఆ మనసును చంపుకొంటూ కాలేజీకి వెళ్ళింది వసంత. ముందుగా వెళ్ళి విశ్వేశ్వరరావుగారికి కనబడింది. ఆయన నవ్వుతూ పలకరించాడు. పెళ్ళయినా కానీ చదువుకు నీళ్లొదలక శ్రద్ధగా చదివినందుకు అభినందించారు. అందరూ ఇలా ఆవస్థపడి తీరాలన్నారు. అపుడే వాళ్ళకు చదువు విలువ తెలుస్తోంది ఆ చదువు కొక సార్థకత ఉంటుందన్నారు విశ్వేశ్వరరావు గారు.

వసంత వింటోందే కానీ ఎలా ఈ ఉద్యోగంలోంచి తప్పించుకోవాలా అనే ఆలోచిస్తోంది - తనకు ఈ ఉద్యోగం చేయాలనిలేదు. ఇంట్లో హాయిగా ఉందామనిపిస్తుంది. ఉద్యోగంచేసి ఇంటికి తిరిగి వచ్చాక భర్తను వెళ్ళి నవ్వుతూ పలకరిస్తే, ఆ నవ్వుకు భర్త పులకరించిపోతోంటే చూడాలని ఉంటుంది తనకు - కానీ తన భర్త... తన కలలన్నిటినీ కల్లలుగానే చేస్తున్నాడు. ఇంత చిన్న కోరిక ఈ జన్మకు తీరేటట్లుగా కనబడటం లేదు వసంతకు.

కాలేజీకి వెళ్ళగానే ఒక గంట స్టాఫ్ రూంలో కూర్చున్నాక క్లాసుకు నడిచింది. పాఠం ఏదీ చెప్పాలనే ఉత్సాహం లేదు. కొత్తగా చేరిన ఈ ఉద్యోగం తనలో ఏమీ ఉత్సాహాన్నీ, ఉత్సుకతనూ పుట్టించలేక పోతోంది. అందుకే పాఠాలకు బదులుగా పరిచయం చేసుకొంది తన్ను తానుగా - తర్వాత క్లాసులో



మిగతావాళ్ళనూ పరిచయం చేసుకొంది. క్లాసు అయిపోయాక ఇంకో గంట స్టాఫ్ రూంలోనే గడిపి, ఆ తర్వాత ఇంటికి నడిచింది.

ఇంటి కొచ్చేసరికి...

ఇంట్లో వసంతకోసం శేషగిరి ఎదురుచూస్తున్నాడు.

తలుపుకు తాళం లేకపోవడంతో ఆశ్చర్యంగా తలుపు తట్టింది వసంత. తలుపు తీసిన శేషగిరిని చూసి ఆశ్చర్యపోయింది వసంత.

"ఇదేమిటి? మీరు ఆఫీసుకు వెళ్ళలేదా?"

నవ్వాడు శేషగిరి– "లేదు. ప్రొద్దున్న వెళ్ళాను కానీ సెలవుపెట్టి వచ్చేశాను."

"ఆదేం?"

"ఉద్యోగంనుంచి వచ్చిన శ్రీమతికి స్వాగతం చెప్పడానికి!"

—వసంతకు ఒళ్ళు మండింది. ఇదేమిటి ఇలా అన్నీ ఆడకోరికలు? భర్త ఉద్యోగంనుంచి రావటంకోసం భార్య ఎదురు చూడాల్సి ఉంది. అంతేకానీ... ఇలా, భార్య ఉద్యోగంచేసి రావటంకోసం ఎదురుచూసే భర్త ఎక్కడైనా ఉంటాడా?— ఛ...ఛ...

మనసులోంచి ఉవ్వెత్తున లేస్తున్న కోపాన్ని అణుచుకొంది వసంత.

నిస్సహాయంగా ఇంట్లోకి నడిచింది వసంత – ఇంట్లోకి నడిచేసరికి అక్కడ

మరింత ఆశ్చర్యం కాసుక్కూర్చుంది వసంతకోసం.

వంటయిల్లు అంతా నీటుగా సర్దబడి ఉంది. వంట అంతా అయిపోయినట్లుగా కూడా, గిన్నెలన్నీ జాగ్రత్తగా ఒకదాని మీద ఒకటి పెట్టబడి ఉన్నాయి. దగ్గరగా వెళ్ళి ఒక గిన్నె మూత తీసి చూసింది వసంత. గిన్నెలోంచి వంకాయ ముక్కలు వసంతకేసి పరిహాసంగా నవ్వాయి.

వసంత ఇంక కోపం పట్టలేక పోయింది

తన వెనకే నిలబడి తను చేస్తున్నది చూసి ఆనందిస్తున్న భర్తనుచూస్తే అసహ్యం కలిగింది వసంతకు. అసహ్యాన్ని దిగమింగుకొంటూ అంది వసంత — "ఎవరు చేయమన్నారు ఇదంతా?"

నవ్వుతూ అన్నాడు శేషగిరి : "భార్యకు సహాయం చేయాల్సింది భర్తేనని ఒకరు చెప్పాల్సింది కాదు!"

"సహాయం అంటే... వంట చేయమనా?"

నవ్వాడు శేషగిరి – "వంట మాత్రం పనికాదా? దాంట్లోమటుకు నీకు సాయం అక్కర్లేదా ఏం?"

వసంతకు ఏమనాలో అర్థంకాలేదు. ఏదన్నా కానీ భర్త ఏదో ఒకటి చెప్పి తీరతాడు. అలాటి భర్తతో ఏం చెప్పినా, ఏం చేసినా, అది అడవిగాచిన వెన్నెలే అవుతుంది – భార్యంటే తన భర్తకు ఇంత ప్రేమ ఉండటం బాగానే ఉంది గానీ, అది మరీ భరించలేనంతగా అయిపోతోంది—

ఇంత ప్రేమ మరీ ఇబ్బందిగా ఉంది. దీనికి ఎలాగో ఒకలాగున మంగళ హారతి పాడగలిగించ గలిగితే...వసంత మనసులో బాధ కలిగింది – ఆ బాధలో తళుక్కున ఒక ఆలోచన మెరిసింది— గానీ... ఇది వక్రపద్ధతి. ఇలా చేయటం మంచి పద్ధతి కాదు. అయినా ఈ మంచి తనపు సంకెళ్ళు ఇంకోలా విడిపోయేలా లేవు – వసంత నెమ్మదిగా ఆ ఊహకు కార్యరూపం ఇచ్చే ఆలోచనలో పడింది.

*　*　*

వారం రోజులు గడిచేసరికి వసంత కోరుకొన్న ఆ అవకాశం రానే వచ్చింది. ఆకాశం అంతా నెమ్మది నెమ్మదిగా మబ్బులు కమ్ముకొని, కాలేజీ అయ్యే వేళకు వర్షం మొదలయింది. వసంత వచ్చి వరండా దగ్గర నిలబడింది, అటూ ఇటూ తచ్చాడుతూ. ఒక పదినిమిషాలు గడిచేసరికి, విశ్వేశ్వరరావుగారు ఆఫీసులోంచి బయటకొచ్చి వసంతను చూసి ఆగారు.

"ఏమ్మా, ఇంటికా?"

"అవునండీ... కానీ వర్షం..."

"రామ్మా, నా కార్లో దింపేస్తాను మీ ఇంటి దగ్గర—"

వసంత క్షణం ఏమీ అనలేదు.

"రామ్మా. పర్వాలేదు!"

వసంత కదిలింది—

కొన్ని క్షణాల తర్వాత కారు ఇంటి ముందు ఆగింది. వసంత అనుకొన్నట్లుగా శేషగిరి ఇంటిముందు తచ్చాడుతూ కనబడ్డాడు. వసంత సంతృప్తిగా నిట్టూర్చుకొని కార్లోంచి దిగింది.

"రండి లోపలకు" అంది వసంత తనమీద పడుతున్న చినుకులను తుడుచుకొంటూ.

"ఇవేళ వద్దులేమ్మా - మీ ఇల్లు ఇదే గదా, ఇంకో రోజు ఎపుడైనా వస్తాను!... అయినా మీ ఇల్లు అదే అయితే, రోజూ నా కార్లోనే వచ్చేయచ్చు గదా!" అన్నాడు విశ్వేశ్వరరావుగారు.

వసంత ఆ మాటకు జవాబు ఇవ్వక, "థాంక్స్" అంటూ లోపలికి నడిచింది.

ఇంట్లోకి రాగానే శేషగిరిని నవ్వుతూ పలకరించి "వర్షం పడుతోందిగా, అందుకని..." అంది వసంత. శేషగిరి తనలో - తను తెచ్చిపెట్టుకొన్న - ఆ ఉత్సాహాన్ని గుర్తించాడో లేదోనని క్షణం చూసుకొని మరీ లోపలకు వెళ్ళింది.

శేషగిరి ముఖంలో రంగులు మారిన సంగతి, వసంత కెంతో తృప్తినిచ్చింది.

*　　*　　*

ఆ తర్వాత వారంరోజులూ వసంత విశ్వేశ్వరరావుగారి కారులోనే ఇంటి నుంచి కాలేజీకి, కాలేజీనుంచి ఇంటికి రావటం, పోవటం జరిగింది. కార్లోంచి దిగేటపుడు వీలైనంతవరకూ విశ్వేశ్వర రావుగారితో చనువుగా ఉండటం, కొంచెంగా నవ్వటం, రెండు సార్లు విశ్వేశ్వరరావుగారిని ఇంట్లోంచి పిలిచి కాఫీ ఇవ్వటం ఇవన్నీ శేషగిరి గమనించేలా వసంత చేసింది.

శేషగిరి మనసు కొంచెంగా ఇబ్బంది పడుతున్న సంగతి వసంత కెంతో హాయిగా కనబడింది.

వసంత ఆ రోజున ఇంటికొచ్చేసరికి శేషగిరి ముఖం మరీ మాడిపోయి ఉంది. వసంత ఏమయిందోనని ఒక్కసారి అనుకొందిగానీ, వెంటనే టేబిల్‌మీద ఉన్న కవరు చూడ్డంతో వసంతకు అంతా అర్థమైపోయింది

శేషగిరి బయట తోటలో చెట్లకు నీళ్లు పోస్తున్న సమయంలో ఆ కవరు విప్పి ఉత్తరం చదివింది.

"శ్రీ శేషగిరి గారికి—

ఇది మీకు ఎంతో బాధ కలుగజేసేదే కావచ్చు కానీ, నేను మీ శ్రేయస్సు కోరుకొని రాస్తున్నాను. మీ భార్య శ్రీమతి వసంత మీకన్నా విద్యాధికురాలు. మీకన్నా ఎక్కువ సంపాదిస్తోంది. కానీ అంతమాత్రంచేత భర్తను చిన్నచూపు చూడటం తగనిపనికదా! మీకన్నా శ్రీమతి వసంతగారికి, విశ్వేశ్వరరావు

గారిలో ఏం ఆధిక్యత కనబడుతోందో నాకు తెలీటంలేదు. మీకు తెలుస్తోందో లేదో మీరూ ఆలోచించండి - అయినా మన బంగారం మంచిది అయితే...

మీ హితైషి—"

ఆ ఉత్తరం పట్టుకొని వీధిలోకి వచ్చింది వసంత విసురుగా.

"ఏమిటండీ ఇదీ ?"

"అదే నేనూ అడగాలనుకున్నది !" అన్నాడు శేషగిరి వసంతతో.

"అంటే... ఏమిటి మీ ఊహ ?"

శేషగిరి ఏమీ అనలేదు.

క్షణం అక్కడే నిలబడి, వసంత ఇంట్లోకి వచ్చి మంచంమీద వాలింది.

అరగంట తర్వాత శేషగిరి వసంత దగ్గర చేరాడు. మంచంమీద బోర్లా పడుకున్న వసంత వీపుమీద చెయ్యివేస్తూ అన్నాడు నెమ్మదిగా : "సారీ వసంతా - నిన్ను బాధపెట్టాను."

వసంత ఏమీ అనలేదు.

"వసంతా, అనవసరంగా బాధపడకు ! అందులో నిజం ఉండి ఉండదన్న సంగతి నాకూ తెలుసు."

"అయినా..." వసంత గద్గదికంగా అంది.

"నిజమే ! అలాటివాటికి అసలు తావు ఇవ్వనే ఇవ్వకూడదు. ఎందుకైనా మంచిది, రేపు రాజీనామా చేసెయ్యి. నేను తీసుకెళ్ళి ఇచ్చి వస్తాను !" అన్నాడు శేషగిరి.

"అంటే, ఇందులో నిజం ఉందని.."

"ఛ, అదికాదు. నీకు ఉద్యోగం చేయటం ఇష్టంలేదని నాకు తెలుసు. అయినా నాకోసం చేరావు. అందులో ఇంకా ఇలాటివి తోడైతే నీ మనసు మరీ బాధపడుతుంది. ఎందుకు వసంతా ఇదంతా - అందుకే ఉద్యోగం వదిలెయ్యమంటున్నాను !" అన్నాడు శేషగిరి నెమ్మదిగా అనునయిస్తున్నట్టుగా.

వసంత నెమ్మదిగా నవ్వుకొంది - 'ఈ క్షణంలో ఆ ఉత్తరం నేనే రాశానండీ...' అంటే... ? ... అయ్యబాబోయ్—

'ఇది నేను చెప్పకూడని నిజం !' అనుకొంది వసంత, శేషగిరి కౌగిలిలో ఇమిడిపోతూ.






"నేను సినిమాకు పోతున్నాను"

అన్నాడు మొగుడు.

"ఈ సినిమా ఏమిటో నాకు తెలుసు!' అనుకున్నది భార్య. "నేనుకూడా రానా?" అన్నది.

"ఆఁ! మంచిసినిమా కాదు, నిద్ర పట్టక పోతున్నాగాని."

'ఈ నిద్రపట్టకపోవటమూ నాకు తెలుసు!' అనుకున్నది భార్య.

ఇవ్వాళ ఎనిమిదిన్నర పాసెంజరుకు ప్రసాదరావు బెజవాడ వెళ్ళాడు. ఇంటి దగ్గిర నీలవేణి ఒంటరిగా ఉంటుంది. అయ్యగారు తొమ్మిదింటికే సినిమావంక పెట్టి వెంచేస్తున్నారు!

ఎట్లాచేస్తారో మగవాళ్ళింత దుర్మార్గం? తన స్నేహితుడి భార్య కదా?

వాళ్ళిద్దరికీ—తన భర్తకూ, నీలవేణికి,—ఏదో సంబంధం ఉండవచ్చునని ఇవాళ ఉదయమే తనకు అనుమానం పోవడమూ, ఆ అనుమానం కాస్తా ఇప్పుడే రుజువుకావడమూనూ!

నిజానికి తన భర్తకంటే ప్రసాదరావు ఎన్నోరెట్లు అందగాడు. అతని మీద తనకు ఎన్నిసార్లు బుద్ధిపోలేదు! తను తూలిందా?

నీలవేణి-పేరు 'నాజూకేగాని-తనకంటే ఏ విధంగా అందకత్తె! తలుచుకున్నకొద్దీ మండిపోతున్నది!...ఈ పాటికి తన భర్త ప్రసాదరావుగారింటికి సగందూరంలో ఉంటాడు...ఆమె చివాలున లేచింది. దీపంతగ్గించి, తలుపులన్నీ దగ్గరగా వేసి బయటికొచ్చింది. బయటి తలుపు గొళ్ళెంపెట్టి ప్రసాదరావుగారింటికేసి బయలుదేరింది.

ఆట్టే దూరంలేదు. ఆదే ప్రసాదరావుగారిల్లు. తన భర్త జాడ ఎక్కడాలేదు. రోడ్డు లాంతర్లున్నచోట తప్ప అంతా చీకటి. అంతా నిశ్శబ్దం. చలికాలం కావటం మూలాన రోడ్డుమీద ఒక్కపురుగు లేదు, తొమ్మిదింటికే.

ఎదురుగా ఎవరో వస్తున్నారు, ఆమె గుండె గుబుక్కుమన్నది. అమ్మో! ప్రసాదరావు! రైలుకు పోనేలేదు.

ఇంటికి తిరిగి వస్తున్నాడు! పెళ్ళాం రహస్యం తెలిసిందో ఏమో!

అతన్ని లోపలికి వెళ్ళనివ్వరాదు. కొంప పోతుంది.

ఆమె నాలు గడుగులు ముందుకు నడిచి ప్రసాదరావును సమీపించింది.

ప్రసాదరావు నిర్ఘాంతపోయినాడు.

"ఏమమ్మా ఎవరికోసం? ఎక్కడికి?" అన్నాడు అతను. తను నవ్వింది. ఇంకా నయం, నవ్వగలిగింది.

"మీకోసమే!" అంది తరువాత అతనేమనుకున్నా సరే!

"నా కోసమా! నా ప్రయాణం ఆగి పోయిందని ఎట్లా తెలిసింది?"

"మీరు కూడా ప్రయాణమైనారని నాకు తెలీదు."

"పోనివ్వండి, నాతో ఇప్పుడేంపని!"

"మీతో ఒక అరగంటసేపు రహస్యంగా మాట్లాడాలి."

అతను నమ్మటంలేదు. "మా గొడ్ల పాకలో కూర్చుందామా?"

తను సరే నన్నది.

అతను ఒక నులకమంచం వాల్చి "కూచోండి!" అన్నాడు.

తను కూచుని అతని చెయ్యిపట్టుకు బలవంతాన కూచోపెట్టింది. అతనికి అర్ధమయింది.

"ఈ ఆలోచన ఎంతకాలంనుంచీ?" అన్నాడతను దగ్గరికి జరిగి.

"మనం చాలా తప్పు చెయ్యబోతు న్నాం. నాకు నీమీద ఎంతకాలంనించో ఉంది. స్నేహితుడి భార్యవని చంపు కున్నాను.........అదీకాక మా ఆవి డంటే నాకు చాలా గౌరవం.'

"మీ ఆవిడ! అయ్యోరాత!!" అను కుంది తను.

"ఈ వెధవ గొడ్లపాకా ఏమిటి? మనం మీ యింటికి పోదాం?" అన్నా డతను.

"మా యింటికా? వద్దు!"

"ఏం మీ ఆయన ఇంట్లో లేడుగా!"

ఆమె చివాలున లేచింది. ఇతనికంతా తెలుసు. తను నిష్కారణంగా శీలం చెడ గొట్టుకున్నది.

"ఎట్లా తెలుసు?" అన్నది వణుకు తున్న గొంతుతో.

"వాడు సినిమాకు వెళుతూ దారిలో నాకగుపించాడే!"

తను ఇక అక్కడ ఒక్కక్షణం ఉండలేదు, పరిగెత్తింది. వెనకనించి దయ్యాలూ, భూతాలూ తరుముకొస్తు న్నట్లు పరిగెత్తి కడప్రాణంతో వచ్చి కొంపలోపడి తలుపు బిడాయించు కున్నది.





# అనుభవం!

దూరదర్శి

ఉదయం పదిగంటలప్పుడు బైటికి వెళ్దామనుకుంటుండగా స్టీమరల్లే ఉన్న ఇంపోర్టెడ్ కారు ఇంటిముందు ఆగింది. నాకోసం వచ్చేవారెవరికీ అంత గొప్ప వాహనాలు లేనందువల్ల ఎవరికోసమోలే అనుకున్నాను.

కాని ఆ కారులోనుంచి విలువైనసూటు ధరించిన వ్యక్తి దిగి "రావుగారి ఇల్లేనా?" అనడిగాడు.

నేను 'ఔ' నన్నట్లు తల ఆడించగానే నమస్కరించాడు. లోపలికి ఆహ్వానించి కూర్చోబెట్టాను.

"రంగరాజపురం రాణిగారు శ్రీమతి సుశీలమ్మగారిసెక్రటరీని. ఇవాళ మధ్యాహ్నం రాజాగారు, రాణీగారు మద్రాసు వస్తున్నారు రేపుఉదయంవారు స్విజర్లండ్ వెళ్తారు. రాణీగారు తమతో పదినిమిషాలు మాట్లాడాలన్నారు. తమకు అవకాశం ఉంటే యీ సాయంత్రం ఐదుగంటలకు అడయారులోఉన్న వారి బంగళాకు దయచేయమని చెప్పారు," అన్నాడు అతను.

రంగరాజపురం రాణీ అంటే మహదైశ్వర్యవంతురాలు. పూర్వాశ్రమంలో ఆమె సుప్రసిద్ధ తారామణి. అటు సినిమాల్లోనూ, ఇటు నాటకాల్లోనూ మంచి పేరూ, మంచి డబ్బూ సంపాదించిన వ్యక్తి. ఆమె నటనకు ప్రేక్షకులు ఉర్రూతలూగేవారు. ఆ తరువాత ఆమె జమీందారుగారిని వివాహమాడి సంసార

జీవితంలో పడింది. అంత గొప్పవ్యక్తి ఆహ్వానం పంపిందంటే చాలా ఆశ్చర్య పడ్డాను.

"అలాగే వస్తాను" అని అనకుండా ఉండలేకపోయాను.

సెక్రటరీ లేచి నిలబడి "కృతజ్ఞుణ్ణి, మీ ఎడ్రస్ కనుక్కొనేందుకు మూడు గంటలు పట్టింది...కారు పంపమం టారా?" అన్నాడు.

"ఇబ్బంది కాకుంటే పంపండి," అన్నాను.

ఆయన నమస్కరించి వెళ్ళిపోయాడు

జీవితంలో సుశీలను ఒక్కసారే కలుసుకున్నాను. ఆ రోజుల్లో ఆమె కీర్తి ఆకాశమెత్తున మెరుస్తున్నది. నేను బి. ఏ. ఫైనల్ ఇయర్ చదివేవాణ్ణి. సాహిత్యం మీద మనసుపోయి ఒక నాటకం రాశాను. కాలేజీ నాటక సమాజంవాళ్ళకు అది నచ్చి నాటకం ఆడాలని తీర్మానించు కున్నారు. సుశీల కథానాయిక పాత్ర ధరిస్తే కలెక్షన్ చాలా వుంటుందని నాటక సమాజం ఆర్థికంగా మంచి స్థితిలో వుండ గలదనీ ఆశించి, ఆమెను అర్థించారు. ఏ మూడ్‌లో వున్నదోకాని ఆమె అంగీక రించింది. ఐతే ఆ నాటకం ఒకసారి చదవాలన్నది. సమాజంవాళ్లు ఆ నాట కాన్ని ఆమెకు ఇచ్చారు.

పదిరోజుల తరువాత సమాజం వాళ్లు నాకు కబురు పెట్టారు. నా నాటకం ప్రదర్శించబడినట్లు, గొప్ప రచయితగా గుర్తించబడినట్లు కలలుగంటూ వెళ్ళాను.

"సుశీల యీ నాటకంలో నటించే నన్నది—" అన్న పిడుగులాంటి వార్త సమాజంవాళ్ళు అందించారు.

"ఎందుకని?" అని అడిగాను.

"మాకు తెలియదు...నిన్నొకసారి పంపితే నాటకాన్నిగూర్చి చర్చిస్తా నన్నది," అన్నారు వాళ్ళు.

ఏ వైనా కొద్ది మార్పులు చేస్తే సరి పోతుందేమో? ఐనా అంత గొప్పతారతో మాట్లాడే అవకాశం వచ్చినందుకు సంతో షించాను.

ఆ సాయంత్రం ఆమె ఇంటికి—ఇల్లా అది బ్రహ్మాండమైన రాజమందిరం!— వెళ్ళాను. పావుగంట కాచుకూర్చున్నాక గదిలోకి సుగంధంతో కూడిన పిల్లతెమ్మె రలు ప్రవేశించినవి. వాటి వెనుకనే మెరుపుతీగల్లే వున్న సుశీల ప్రవేశించింది. ఆ అందచందాలూ, ఆ హొయలు, ఆ ఠీవి, ఆ కాంతీ—ఒకటేమిటి ఆమె మానవజాతికి గాక, దేవాంశకు సంబం ధించిన వ్యక్తి అనే భావాన్ని కలిగించి తీరుతుంది. నాకు తెలియకుండానే లేచి నిలబడి నమస్కరించాను.

కూర్చోమని సైగచేసి, ఆమెకూడా కూర్చొని "నువ్వేనా ఈ నాటకం రాసింది?" అన్నది.

ఏకవచన ప్రయోగంచేసినా నేను కించపడలేదు. ఆమె గొప్పదనే భావమూ



వయస్సులో నేను చిన్నవాణ్ణనే జ్ఞానమే అందుకు కారణాలు అయివుంటవి.

"ఔనండీ!" అన్నాను.

"నాటకం జీవితానికి దర్పణంగా వుండాలి; అంతేకాని ఏదో ఆదర్శం కోసమని పాకులాడుతూ, సందర్భశుద్ధి లేని సన్నివేశాల్ని సృష్టించటం, నిజానికి దూరంగా జరగటం కూడదు..."

"నా నాటకంలో వాస్తవికత లేదంటారా?"

ఆమె సెలయేటి గలగలలను జ్ఞాపకం చేసే నవ్వు నవ్వింది.

"వాస్తవికత! ఎక్కడున్నది ఆ నాటకంలో! కథానాయిక చాలా అందగత్తె, ధనవంతురాలు. సుగుణవతి, విద్యావతి; అలాటి వ్యక్తి కుంటికాలువాణ్ణి పెళ్ళిచేసుకొని సుఖపడిందని రాశారు. ఆమెకు ఏం ఖర్మ? అంతకన్న మంచి సంబంధం దొరకలేదా?" అన్నది సుశీల.

"ఆమె అతన్ని ప్రేమించింది!" అన్నాను.

"ప్రేమా? ప్రేమంటే నీకేం తెలుసు? నీ తల్లీ, అక్కచెల్లెళ్లూ తప్ప వేరొక స్త్రీతోటి పరిచయమన్నా వున్నదా?

ప్రేమను అనుభవించకుండానే ప్రేమను గూర్చి మాట్లాడే హక్కు నీ కేమున్నది? నీ వయసుకు ప్రేమ అంటే అర్థమయ్యే శక్తిలేదే? ప్రేమకు కూడా అర్హతలు వుంటవి. దాహమైనదని మురుగు గుంటలో నీళ్లు తాగుతామా? అంతస్తు చూడకుండా, అర్హత పాటించకుండా గుడ్డెద్దు చేలోపడినట్టు ప్రేమించేయడం ఎలా సాధ్యం?'' అన్నదామె.

"ప్రేమ గుడ్డిదన్నారు కదండీ!" అని సమర్థించాను.

"ప్రేమించేవాళ్ళు కూడా గుడ్డివాళ్ళా యేం?"

"కనీసం మానవత్వం, సానుభూతి మొదలైనవి..."

నా మాటలకు అడ్డంవచ్చి ''మానవత్వం! ఆ పేరుతో తన సుఖ సౌఖ్యాలు నాశనం చేసుకోవటం, సానుభూతిఅంటూ సుడిగుండంలోకి దూకటం మొదలైనవి కథల్లో సాధ్యమేమో గాని నిత్యజీవితంలో మాత్రం కాదు. అంత మానవత్వమూ, సానుభూతి ఉంటే ఐశ్వర్యము ఉన్నది కనుక కొంత ధనసహాయం చేయవచ్చునేమో? అంతేకాని తన జీవితసర్వస్వాన్ని కురూపియైన భర్తపాదాలముందు సమర్పించటం మూర్ఖత్వం అవుతుంది! వాస్తవానికి చాలా దూరం!" అన్నది ఉద్రేకంగా.

"కథ మార్చాలంటారా?" అన్నాను.

"మార్చేందుకు వీలులేదు. ఎక్కడ మారుస్తావు? మొత్తమంతా అతుకుల బొంతలా వున్నది. ఇలాంటి నాటకంలో నేను నటించలేను. ప్రేమ సౌందర్యానికి అంకితమై వుంటుంది. కాని, వికృతాలకూ, కురూపత్వానికి ప్రేమ ఏమిటి-ప్రేమ!" అని ఆ చివరి పదంలో తన యీసడింపును వ్యక్తపరచింది.

"కురూపులకూ, వికృతాకారులకూ ప్రేమ వుండదంటారా?"

"కురూపి సౌందర్యవతిని ప్రేమిస్తాడు; కాని సుందరి కురూపిని ప్రేమిస్తుందా? ఉభయులూ కురూపులైతే అది వేరొక విషయం!"

"అయితే ఈ నాటకాన్ని ఏంచేయమంటారు?"

ఆమె ఫక్కున నవ్వింది.

"నీవు రాసిన నాటకాన్ని ఏం చేయాలో నన్నెందుకు అడుగుతావు? తీరా అడిగావు కనుక చెపుతున్నాను. పదిమందిచేత చదివించో, పదిమంది ముందు ఆడించో నవ్వులపాలు గాకుండా దాన్ని తగలెయ్యి!''

"నాలోని రచయితను నాశనం చేయమంటారా?"

"నీలో రచయిత వున్నాడనుకోవడం నీ అహం! వాస్తవానికి దూరమైన రచన నిస్సారం. కాలాన్ని ఎందుకు వృథా చేసుకుంటావు? చదువుకో," అన్నదామె.

నా నవనాడులూ కుంగిపొయ్యాయి.




ఇక మాట్లాడేందుకు మాత్రంఏమున్నది? నన్ను పిలిపించి గాయపరచి, అవమాన పరిచింది. ఇక ఆ స్థలంలో నిలవలేక పొయ్యాను. 'వెళ్ళివస్తాను' అనికూడా చెప్పకుండానే, దెయ్యాలూ, భూతాలూ తరుముతున్నట్లు వేగంగా బైటికి నడిచాను.

దీర్ఘంగా ఆలోచించాను. ఆమెచెప్పిందే నిజమనిపించింది. ఎంతో అనుభవంతో ఆమె మాట్లాడింది; కేవలం నన్ను గాయ పరచటం ఆమె వుద్దేశ్యమై వుండదు. ఆమెకు అంత తీరిక ఎక్కడున్నది? దానివల్ల ఆమెకు లాభమేమిటి? తప్పు దార్లలోపడి కేవలం ఆదర్శాలకోసం వాస్తవికతను బలిపెట్టకుండా నన్ను హెచ్చరించటమే ఆమె ఉద్దేశ్యమై వుండాలి. కొన్నాళ్ళు బాధపడినా, ఆ నాటకాన్ని పెట్టెలో అడుగున పడేశాను. కష్టపడి రాసింది కనుక ఆమె చెప్పినట్లు తగలెయ్యబుద్ధికాలేదు. రచనలు మానుకున్నాను. ఆ తరువాత క్రమంగా అదంతా మరచిపొయ్యాను. ఈపదేళ్ళలోనూ నేనొక నాటకం రాశాననే విషయమే జ్ఞాపకం రాలేదు. ఇప్పుడు రాణిగా ఆమె పంపిన ఆహ్వానాన్ని వినగానే ఇదంతా జ్ఞాపకం వచ్చింది.

ఆ నాడు ఆమె వ్యక్తపరచిన భావాలనే ఆమె జీవితంలో అనుసరించింది. నవయవ్వనుడూ, సుందరరూపుడూ, సకలైశ్వర్యవంతుడూ అయిన రంగరాజపురం జమీందారునే వివాహమాడింది. ప్రేమ ఎటు మొగ్గాలో ఆమె ఆదర్శప్రాయంగా రుజూచేసింది.

* * *

సరిగ్గా ఐదింటికల్లా వాళ్ళకారులోనే జమీందారుగారి బంగళా జేరాను. అప్పటికే పాతికమందిదాకా హాలులో వేచివున్నారు సెక్రటరీ ఎదురొచ్చి నన్ను ఆహ్వానించాడు. నన్ను హాలులోకి కాకుండా ఆ పక్కనున్న పెద్ద గదిలోకి తీసుకొనివెళ్ళి కూర్చొబెట్టాడు.

కాచుకొనివున్నవాళ్ళంతమందివుంటే నేను బయటపడేటప్పటికి రాత్రి ఏ పదకొండో అవుతుందనిపించింది.

"చాలా ఆలస్య మౌతుందా?" అన్నాను.

"నో, నో," . వాళ్ళందరూ రాజా గారిని చూసేందుకు వచ్చారు. రెండు నెలల క్రితం ఆయనకు పక్షవాతం వచ్చి కుడిపక్క పడిపోయింది. కుడివైపున్న అంగాలేవీ పనిచేయవు. మూతి వంకర పోయి మాటకూడా సరిగారాదు. చికిత్స కోసమే స్విజర్లెండ్ వెళుతున్నారు," అన్నాడు సెక్రటరీ.

దగ్గర్లోనే పిడుగు పడినట్లయింది. రూపసి, రూపసిని ప్రేమించింది; ఐశ్వర్యం, ఐశ్వర్యాన్ని ఆకర్షించింది. అదే ప్రేమగా పెనవేసుకొని మహావృక్ష మల్లే కనిపించింది. ఈడూ, జోడుకు నమూనాగా వున్న ఈ జంటలో ఒకరికి అంగవైకల్యం ప్రాప్తించింది. రాణి ఎంత కృంగిపోయి వుంటుందో? ఆమె ప్రేమ కూకటి వేళ్ళతో కదిలి వుండాలి. ఆమె జీవితం ఎంత తారుమారైందో!

నా ఆలోచనలకు అంతరాయం కలి గిస్తూ, "తమ రాకను రాణీగారికి తెలియ పరుస్తాను," అని సెక్రటరీ మాయ మయ్యాడు.

నే నింకా పూర్తిగా ఆలోచనల్లో నుంచి బయటపడక ముందే రాణీగారు గదిలోకి వచ్చారు. ఆ హొయలు, ఠీవి, అంద చందాలు ఏమీలేవు. శోక, విషాదమూర్తి దైన్యం కరడుగట్టిన ముఖంతో, పాలి పోయిన చెక్కిళ్ళతో, తనను తానే హీన పరుచుకున్న విధంగా కనిపించిం దామె.

ఆశ్చర్యం నుంచి నేనింకా తేరుకోక ముందే ఆమె నాకు నమస్కరించింది. "బాగున్నావా?" అని ఎంతో మృదు మధుర స్వరంతో అడిగింది.

ఇంతగా మర్యాద చేస్తుందని నేను అనుకోలేదు. ఆమెకు వచ్చిన కష్టానికి ఎలా సానుభూతి చూపాలో తెలియలేదు.

"ఆ నాటకం మీదగ్గర వున్నదా?"

"ఉన్నదండీ!"

ఒక కవరు నాకు అందించిందామె.

"ఇందులో పదివేల రూపాయ లున్నాయి. ఆ నాటకాన్ని ఖరీదైన పేపరు మీద చక్కగా అచ్చు వేయించండి. ఎక్కడా నాపేరు కనబడకూడదు. ఆ తరువాత నాకో వంద కాపీలు పంపండి."

నే నేదో మాట్లాడబొయ్యాను.

"వస్తాను.." అన్నదామె. చూస్తుండ గానే ఆమె కళ్ళనుంచి టపటపా కన్నీటి బొట్లు రాలుతున్నాయి. తనను తాను సంభాళించుకునే స్థితిలోకూడా లేదు. వెళ్ళిపోయింది.

ప్రేమ స్వరూపం అనుభవంలోకి వచ్చి, మానవత్వమే మారిపోయి నట్లయింది. అనుభవం ఎంత ఖరీదను కొన్నా చౌకగానే లభ్యమైనదని అనుకో వాలేమో!?

# భార్యల్లోనే ఉంది




తాయారమ్మ ఏడుస్తూ కూర్చుంది.

భారతనారీమణి అంతకంటే ఏం చేస్తుంది?

పూర్వకాలంలో అయితే తలకు వాసెకట్టు కట్టి, కన్నీరు మున్నీరుగా ఏడ్చేది. ఇప్పుడు గదిలో ఒకమూల కూర్చొని, కుమిలి కుమిలి ఏడుస్తోంది. మొత్తంమీద ఏదో ఒక యేడుపు. జీవితమంతా ఏడ్చి ఏడ్చి పోయేటప్పుడు ఒక ఖుల్లి వికారపు నవ్వు నవ్విపోతోంది. 'మహా పతివ్రతమ్మా! ఎటువంటి చావు వచ్చింది!' అని మిగిలిన అమ్మలక్కలు అంతా నోరూర్చుకుంటారు. దాని ప్రాశస్త్యాన్ని గురించి పురుషులు పుస్తకాలు రాస్తారు. కన్నీటిచుక్క ఊరే స్థలాన్నుంచి, పడే ప్రదేశంవరకూ వర్ణిస్తారు.

వేడి, ఎంత సుతారంగా చింది, ఏ విధంగా ఆరిపోతోందోకూడా వర్ణిస్తారు; ఈ వాతావరణంలో పెరిగిన భారత నారీమణి కష్టాలను ఏవిధంగా ఎదుర్కొంటుంది? కష్టాలను ఎదుర్కోలేక ఏడ్చి ఏడ్చి చివరకు పతివ్రత అయి ఊరుకుంటోంది. ఈ విధంగా నడుస్తూ వుంది హిందూదేశం.

అయితే, నే నిప్పుడురాసేది తాయారమ్మని గురించి— హిందూదేశాన్ని గురించీ కాదు, పాతివ్రత్యాన్ని గురించీ కాదు.

తయారమ్మ ఏడుస్తూవుందని చెప్పాను. అందులో ఆమె తప్పేమీ లేదని యిప్పుడు చెపుతున్నాను. ఏడవక ఏం చేస్తుంది? ఒకే ఒక భర్తని నమ్మి, తన జీవితాన్ని అతనికి అర్పించివేసింది. ఇప్పుడతనికి తాను పనికిరాకుండా పోయింది. అతనికి ఏదన్నా అపకారం చేస్తేనో, తప్పుచేస్తేనో, అవమాన పరిస్తేనో అనుకోవచ్చు; అదేమీ లేదు.

ఒక సంవత్సరంనుంచీ అమె శరీరంలో దొంద ఏర్పడి— ఆమె ఇష్టం లేకుండానే పెరుక్కొచ్చింది. లావయితే వికారంగా వుంటానని ఆమెకి తెలుసు. అందుకని తగ్గటానికి చాలా ప్రయత్నించింది. మందులు తిన్నది. భోజనం మానేసి, పళ్ళరసంమీద బ్రతికింది. ఆ శరీరంతో వన్,టూ-వన్,టూ- వన్, టూ- అనుకుంటూ కసరత్తు చేసింది. ఏంచేసినా నాలుగు రోజులు తగ్గినట్లే వుండి, బుస్సున పొంగుకొచ్చేది. శరీరం అన్నతరవాత పెరక్కా, తరక్కా ఊరుకుంటుందా? ఇంత మాత్రానికే యింత కష్టపెట్టాలి!

మొదట్లో తాయారమ్మ భర్త చాలా ప్రేమగా వుండేవాడు. వాళ్లిద్దలాగా, నీడలాగా అంటుకుని తిరుగుతూ వుండేవాడు. ఒక రోజున, "తాయారమ్మా, నీకీ పేరు బావుండలేదు. మార్చేద్దాం" అన్నాడు.

"పోనిద్దురూ?"

"అలా కాదు, నామాట విను."

ఆమెకూ పేరు మార్చుకోవాలనే వుంది. ఏ పేరయితే బాగుంటుందా అని మీమాంస వచ్చింది.

"పుష్పావతి" అన్నాడు.

"ఛీ, పాడు," ఆమెకు యీ పేరు రజస్వలానంతర వివాహాన్ని జ్ఞప్తికి తెచ్చింది.

అతడు మరొక పేరు చెప్పాడు.

"రాజరాజేశ్వరి."

ఆమెకు కన్యకా పరమేశ్వరి జ్ఞాపకం వచ్చి కోమట్లు కట్టించే మేడలూ, సత్రాలూ, ధాన్యపుబస్తాలూ కళ్ళముందు కదిలినై. ఆమె వొప్పుకోలేదు

"అయితేనువ్వే చెప్పు. నాకుతోచటం లేదు," అన్నాడు. అప్పటికి ఆమెకీ తోచలేదు. మర్నాడు చెప్పింది 'మైథిలి.' అతనికి మిథునం జ్ఞాపకం వచ్చింది.

'మిధునం దంపతులు— కర్కాటకం, ఎంద్రకాయ' అని హాస్యం చేశాడు.

ఆమెకు సిగ్గువేసి ఆ రోజునుంచీ ఆ పూసెత్తటం మానేసింది. ఒక రోజున అతడే చెప్పాడు.

'శ్యామల'- 'శ్యామ.'

ఆ రోజులకూ, తాయారమ్మ లావెక్కిన యీ రోజులకూ ఎంత భేదం? ఇప్పుడు అతను తాయారమ్మని షికారు తీసుకువెళ్ళటం మానేశాడు. వెళ్ళినా, చీకటిపడ్డ తర్వాత రెండోఆటకు తీసుకువెళ్ళి, సరాసరి ఇంటికి జేరవేస్తున్నాడు. మరో స్త్రీ జతవుంటే, పార్కుకు తీసుకువెళ్తాడు. చూచేవాళ్లు వాళ్లిద్దరిలో తన భార్య యెవరో తెలుసుకోలేరని అతని ధైర్యం. ఆమెని చూడగానే వాడు లొాదులుగావున్న ఎరుపు చొక్కా తగిలించుకున్న వాడిలాగా చీదరించుకుంటున్నాడు. సాయంకాలం ఆమె తల దువ్వుకొని, పూలు ముడుచుకొని సింగారించుకొని కంటబడితే ఆమె శరీరాన్ని కొలుస్తున్నట్లుగా, సిలెండర్ని చూచినట్లు చూసి వెళ్లిపోతున్నాడు.

ఇక ఆ యింట్లో తాయారమ్మ ఎలా వుంటుంది?

ఎందుకుండాలి? అందులో పతివ్రత కూడాను— "నాకులేని సుఖం లేనేలేదు, ఆయన్ని కష్టపెట్టటం ఎందుకు?" అనుకున్నది. వెంటనే పుట్టింటికి బయలుదేరింది. ఆ శరీరాన్ని అతికష్టంమీద బస్సులు నిలిచేస్థలానికి చేరవేసింది.

బస్సులు వస్తున్నాయ్. దిగేవారు దిగుతున్నారు, ఎక్కేవారు ఎక్కుతున్నారు.

ఆ జనాన్నిచూస్తే ఆమెకు దిగులు వేసింది. హఠాత్తుగా అసహ్యం వేసింది. ఈ పాడు ప్రపంచంలో ఒకరి సంగతి ఒకరికి పట్టనే పట్టదుగదా! ఎక్కడికి ప్రయాణాలు? ఎందు కీ తొందర? కొంప లన్నీ మునుగుకుపోతున్నాయా? అంతలో తనకూ ఈ మానవజాతికీ యేమీ సంబంధములేదని ఆమెకు అనిపించింది. మరి ఇక ఎవ్వరితో సంబంధం? ఆ బస్సుతోనా? శరీరం కంపించింది. ఒక బస్సు ఝుయ్యన మోతచేసుకుంటూ బయలుదేరింది. ఇకామె అక్కడ నిలబడలేక పోయింది. పుట్టింటికి తన్ను మోసుకుపోయే బస్సు వచ్చేదాకా కొంచెం దూరంగా కూర్చుందాం అనుకుంది.

అక్కడికి ఇరవై గజాల దూరంలో ఒక పిల్ల కూర్చుని వుంది. మూట పక్కన పెట్టుకొని, చెట్టుని ఆనుకొని కూర్చుంది. తాయారమ్మ అక్కడికి నడిచింది. ఆ పిల్లని చూడగానే, తాయారమ్మ హృదయం కొట్టుకొంది. ఆ పిల్ల ఎంత సన్నగా వుంది? ఎంత నాజూగ్గా వుంది— అవ్వాయిచువ్వలాగా, చాకల్లే. వుండేలుబద్దలాగా వుంది. పక్కనించి చూస్తే ఆమె చెంప కోసిన హల్వాముక్క

లాగావుంది. ఆ పిల్లని చూసేకొద్దీ తాయారమ్మ శరీరం బరువెక్కింది. గుండెలు బిగబట్టినై. ముందు నెమ్మదిగా చేత్తో అనుకొని చతికిలబడింది. శరీరాన్ని అంత చక్కగా, సున్నితంగా, సునాయాసంగా వుండేటట్లు ఎలా పోషించుకో గలుగుతూవుందో అడిగి తెలుసుందామని బుద్ధిపుట్టింది. కాని, ఎలా అడగటం? ఏమని పిలవటం? ఏమీ తోచలేదు. కొంచెంసేపుండి ఇలా అన్నది– "ఆకులు రాలిపోతున్నాయ్."

"ఊఁ అంటూ ఆ పిల్ల ఆమెవైపుకు తిరిగింది. తిరిగిన పళంగా ఆ పిల్ల చూపులు అలాగే గుచ్చుకుపోయినై. తాయారమ్మని ఆశ్చర్యంగా చూస్తూ, చూపులు తిప్పుకోలేకపోయింది.

తాయారమ్మ అంత శరీరం వుడికి పోయింది. ఆ పిల్ల యింకా ఇటే చూస్తూ వుంది. ఏదో మాట్లాడాలి– "ఈ ఊళ్లో రాలిన ఆకులకన్నా పురుషులు ఎక్కువ వున్నారు."

ఆపిల్ల జవాబు చెప్పలేదు. అలాగే ఆశగా, జాలిగా చూస్తూంది. తన భర్త లాగే తన శరీరాన్ని కొలుస్తూవుందా? ఆమె చూపుల్ని మరల్చాలి ––"ఎండిన ఆకులు గలగల మంటాయ్"

"అవును," అన్నది పిల్ల.

"తొక్కితే అంటయ్."

"తొక్కకపోయినా అంటయ్."

ఆ పిల్లది ఎంత చక్కని గొంతు! పెదవి కదిపితే అమృతం వొలుకుతూంది. తాను మాట్లాడితే బావిలోనుంచి మాట్లాడినట్లు వుంటుంది. సళసళ కాగే నూనెలో నీటిబొట్టు పడ్డట్లు వుంటుంది. గచ్చుమీద రాతిముక్కతో గీచినట్లు వుంటుంది. ఇంత పెద్ద శరీరంలోనుంచి పెకలించుకొచ్చే ఆ కీచుగొంతు తలుచుకుంటే, ప్రాణం చివుక్కుమన్నది. ఏమన్నా కానీ అడగాలి. ఇవన్నీ ఎలా అలవరుచుకుందో అడగాలి. ఆ పిల్లవంక చూడకుండా పుల్లతో యిసుకలో గీస్తూ ప్రశ్నించింది.

"చూశారా?"

"ఏమిటి?"

"అదే!"

"ఏదీ?"

"అదే."

"బస్సా?"

"ఊఁ."

ఇక సంభాషణ సాగలేదు. రెండు బస్సులు పెద్ద మోతతో వచ్చి ఆగినయ్ ఒక బస్సు పెద్దమోతతో బయలుదేరింది. ఎందుకో చెప్పలేంగాని, ఆ బస్సు చేసిన మోతకు తాయారమ్మకు ధైర్యం వచ్చింది–"వెధవ మోత."

"ఊఁ" ఆ పిల్ల రెప్ప వెయ్యటం లేదు.

"మోత."

"ఏదీ."

"అదే."



"ఓహో"

"బస్సు."

ఆ పిల్ల తాయారమ్మని గుటకలు మింగుతూ చూస్తూనేవుంది. తాయారమ్మకి తగని సిగ్గు. స్నానాలగది జ్ఞాపకం వచ్చింది. బస్సుల్లో జనం ఎక్కుతున్నారు. దిగుతున్నారు. ఈ బస్సులన్నీ జనాన్ని ఒక ప్రపంచాన్నుంచి మరొక ప్రపంచానికి జేరవేస్తున్నయ్యా? ఎక్కడా దిక్కుండా అలాగే తిరుగుతూవుంటే ఎంత బాగుంటుంది! కుంటివాళ్ళ బస్లు అలాగే తిరుగుతూ వుంటై. వాళ్ళకి అదే యిల్లు - అదే ప్రపంచం.

"ఏవూరు వెళ్తున్నయ్యో?"

అడిగింది తాయారమ్మ.

"ఏవీ?"

"బస్సులు."

"ఏమో!"

తాయారమ్మకు ధైర్యం యెక్కువయింది-"మీదే వూరు?"

"నాదా?"

"ఊ."

"వెళ్తున్నాను."

"ఎక్కడికో!"

"పుట్టింటికి." ఆ పిల్ల చాలా విదారంగా చెప్పింది.

సన్నగా నాజూగ్గావున్న అమ్మాయి

కూడా వృద్ధింటికి ఎందుకు వెళ్ళటం? తాయారమ్మ ఆలోచించింది...

బస్సు బయలుదేరింది. ఒక ముసలమ్మ రెండు మూటల్తో తూలిపోతూ వచ్చింది. కండక్టర్లు మా బస్సు ఎక్కమంటే, మా బస్సు ఎక్కమని చెరొక రెక్క పట్టుకుని లాగుతున్నారు. చెరొక మూటా తీసుకుని తమ కారుల్లో కూర్చున్నారు. ఆ ముసలమ్మ అటూ యిటూ చూస్తూ, వెర్రిచూపుల్తో నిలబడిపోయింది తాయారమ్మ ఆ పిల్లతో చెప్పింది—"మీరు సన్నగా వున్నారు."

"నేనా?"

"ఊ."

"సన్నగానా?"

"ఊ."

ఆ పిల్ల మాట్లాడలేదు.

"ఎలా వుండగలిగారు?"

"నా ఖర్మ."

తెర విడిపోయింది. తాయారమ్మ ఆ పిల్లని సూటిగా చూచింది.

"ఏవమ్మా!"

"నేను సన్నగావుంటం మావారికి ఇష్టంలేదు."

"ఇష్టంలేదూ?"

"ఉహూ."

"ఎందుకని?"

"లావుగా లేననీ!" ఆ పిల్ల కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగి, చెక్కిళ్ళ మీదుగా జారుతున్నాయి.

తాయారమ్మ శరీరం కదిలింది. నూతన చైతన్యాన్ని పొందింది. హృదయం ఆరాటపడింది. ఏమిటిదీ? ఏదో బాధ, తెలియని వుత్సాహం, అర్థంకాని ఆవేదన ఆమెని కలవర పరచాయి. కొందరికి సన్నగా వుండటం కూడా ఇష్టంవుండదూ? మళ్ళీ ఈభర్తల్లో ఇన్ని జాతులా? ఏజాతి భర్తకు అనుకూలంగా ఆ భార్య తయారవ్వాలీ? భార్యకు వేరే జీవితం లేదూ? భర్త జీవితంతో కలిపి అల్లుకుపోవటమేనా? ఆ పని భర్త లెందుకు చెయ్యరు? పక్కనున్న పిల్ల సంగతికూడా మరిచిపోయి తీవ్రాలోచనలో పడిపోయింది.

"నాకొక్క సంగతి చెప్పరూ," అని ఆ పిల్ల అడిగింది.-కన్నీళ్ళు వేళ్ళతో తుడుచుకొని రెప్పలు రెపరెప లాడించి ముందుకి వంగి అడిగింది.

కాని తాయారమ్మ వినిపించుకోలేదు. వినిపించుకునేస్థితిలో లేదు. ఇద్దరు భార్యాభర్తలు ఆమె ముందునించి బస్సు దగ్గిరకు వెళ్తున్నారు. భర్త వెనకవచ్చే పదార్థంతో తనకేమీ సంబంధంలేనట్లుగా నడుస్తున్నాడు. వెనకవచ్చే ఆ పదార్థం మాత్రం చంకన మూటపెట్టుకొని భర్త మీదే చూపులువుంచి, అతన్ని కలుసుకోవటానికి అడుగులు వేస్తూవుంది. ఆ పిల్ల దీనంగా అడిగింది—"చెప్పరూ, మీరింత లావు యెలా అయ్యారు?"

తాయారమ్మకి ఆ పిల్ల కనిపించటం

లేదు. ఆమె మాటలు వినిపించటంలేదు. మరొక భర్త బస్సు ఎక్కాడు. పిల్లని చంకన పెట్టుకొని భార్య యెక్కటానికి ప్రయత్నిస్తూ వుంది. పిల్ల చంకలో నించి జారిపోతూవుంది. ఆమె సిగ్గుతో చచ్చిపోతూ, ఎక్కలేక బాధపడుతూ భర్తని జాలిగా చూచింది. భర్త క్రోధంగా చూచి, గిరుక్కున తల తిప్పుకున్నాడు. పిల్ల ఏడ్చింది. కండక్టరు 'ఇదొక తగలాటం' అన్నాడు. భర్త లోలోపల ఉడికిపోతున్నాడే కాని మొహం తిప్పలేదు. ఈ పరిస్థితుల్లో ఆమె తన భార్య అని యితరులకు తెలియనివ్వటం ఇష్టంలేక ప్రాణాలు బిగపట్టుకొని కూర్చున్నాడు.

తాయారమ్మ ఆలోచించింది. ఏ భర్త అయినా ఇంతేనా? ఇన్నిరకాల భర్తల్లో తన భర్త ఒకరా? కొన్ని దృశ్యాలు సినిమాలోలాగు మెహాన మొత్తినట్లు కనిపించినై తాయారమ్మకి.

—ఒకటో దృశ్యం—

పొరుగింటి సుబ్బయ్య పిల్లలు కలగ లేదని అహర్నిశలూ భార్యను వేపుకు తిన్నాడు—"ఎందులోనన్నా పడి చావ రాదూ పీడా వొదుల్తుంది." ఆ యిల్లాలు ఒకటే యేడుపు. మర్నాడే సుబ్బయ్య మరొక భార్యను కట్టుకున్నాడు.

—రెండో దృశ్యం...

వెంకయ్య కనిపించాడు. పిల్లలు అక్కర్లేదు అనుకున్నకొద్దీ పిల్లలు కలిగారని భార్యని తరిమేశాడు. ఆమె ఆత్మహత్య చేసుకుంది. కిరసనాయిలు పోసుకొని, కాల్చుకొని మరీ చచ్చింది.

ఈ ఆలోచనల్తో తాయారమ్మశరీరం వొణికిపోయింది. అన్నిటికీ భార్యలదే బాధ్యతా? ఇలా యెందుకు జరగాలి? తప్పెవరిది? భర్తల ఆజ్ఞల్ని ప్రశ్నించ కుండా పాలించే భార్యలదేనా? నేనెందుకు లావు తగ్గాలి? నాకు మల్లే మా ఆయన యెందుకు లావు అవగూడదూ?

అకస్మాత్తుగా తన భర్త సన్నగా బుగ్గలు తోసుకుపోయి అసహ్యంగా వుంటాడని తెలుసుకుంది. ఆయన లావు అవ్వాలిసిందే. కనుక్కుంటాను—లావు అవ్వాలిసిందని అడుగుతాను.

ఆ పిల్ల అడిగింది, "చెప్పరూ? నా కాపురం నిలబెట్టరూ?"

తాయారమ్మ వినిపించుకోకుండా యింటికి బయలుదేరింది. అంత శరీరం దూదిపింజలాగుంది. ఆ బరువు యేమ యిందో గబగబా యింటికి వెళ్ళింది. ఇంట్లో ఆమె భర్త వంటగదిలో చేతులు కాల్చుకుంటున్నాడు. కత్తిపీట ఒక మూల పడివుంది. బెండకాయ ముక్కలు తరిగి ఒక పళ్లెంలో వున్నాయి. పొయ్యి మీద యేదో వుడుకుతూంది. అతడు పడే అవస్థ చూసేటప్పటికి తాయారమ్మకు జాలివేసింది. కోపం మాయమైపోయింది. అడుగుదాం అనుకున్న ప్రశ్నలన్నీ

ఆమె హృదయంలోనే ఇంకిపోయినై. అలాగే చూస్తూ నిలబడిపోయింది.

అతడు మసిగుడ్డ తెచ్చాడు. మసి గుడ్డతో పొయ్యిమీద గిన్నె దించబోయాడు. మసిగుడ్డ ఒక పక్కకు పోయింది. చెయ్యి మరో అంచు పట్టుకుంది. కాలింది. 'ఉష్' అని వేలు నోట్లో పెట్టుకున్నాడు.

తాయారమ్మ హృదయం రెపరెపలాడింది. పురుషులంతా పసిపిల్లలే, ప్రవర్తించటంలో భేదంగాని అంతా అమాయకులే! అనాదినుంచీ స్త్రీ జాతిలో జీర్ణించుకుపోయిన జననిసత్వం (కవిత్వ భాషలో మాతృహృదయం) పైకి వుబికింది. కన్నీటిబొట్లు బొట బొట రాలాయి-"మీ కెందు కొచ్చిన అవస్థ చెప్పండి..."

అతడు తల పైకెత్తి చూశాడు. గడపనిండా తాయారమ్మ కనిపించింది. కోపం వచ్చింది. పౌరుషం వచ్చింది. నోట్లోనుంచి వేలు తీసి, మళ్ళీ పొయ్యిమీద గిన్నె దించబోయాడు. తాయారమ్మ చెయ్యి ఇవతలకులాగి, "చాల్లెండి. సంతోషించాం. మీరు వెళ్ళి స్నానం చెయ్యండి. స్నానమయ్యేప్పటికి వంట పూర్తిచేస్తా" అంది.

అతడు ఉరిమిచూస్తూ, "ఇందాకటి నుంచీ ఎక్కడ చచ్చావ్? ఏం కొంపలు పట్టుకు తిరుగుతున్నావ్?" అన్నాడు. చెడామడా తిట్టి వేలు నోట్లో పెట్టుకున్నాడు.

అతని కోపం చూస్తే, ఆమెకు ఆనందం కలిగింది. అతని కోపం ఆమె జనిస హృదయానికి అహ్లాదాన్ని కలిగించింది. జీవితంలో ఒక్క ఘడియ నూతనాభిప్రాయలతో నలిగి, ఉలిక్కి, బాధపడ్డ ఆమె మనస్సుకి అప్పుడు శాంతి లభించింది.

"ఊఁ తరవాత," అని అతన్ని చూచి చిరునవ్వు నవ్వింది?

అతనికి అసహ్యం వేసింది. అక్కడ నుంచి చెరచెరా వెళ్ళిపోబోయాడు. ఏదో జ్ఞాపకంవచ్చి, గడపలో ఆగి తిరిగి చూశాడు. తాయారమ్మ తృప్తిగా, భూదేవిలాగా పొయ్యిదగ్గర కూర్చుని పొయ్యి వూదటానికిగాను, ముందుకు వంగటానికిగాను ప్రయత్నిస్తూవుంది.

"ఛీ! ఎంత లావుగా చతికిలబడింది" అని అతడు తనలో తాను అసహ్యించుకొని బయటకి వెళ్ళాడు.





# టీ కప్పులో కల్లోలం

మధురాంతకం రాజారాం

పై అధికారులను గురించి క్రింది ఉద్యోగులు ఫిర్యాదు చేయడం సర్వత్రా వున్నదేనని మీరు భావించవచ్చు. ఒకటి రెండు సంఘటనలు ఏకరువు పెడితే గానీ మీకు నా వాదంలో పసదనం బోధ పడదని నాకు తెలుసు. ఉదాహరణకు అలిమేలు మంగమ్మ విషయమే తీసుకోండి. ఇందులో నా పొరబాటేమైనా వుంటే మీరే చెప్పండి...

అలిమేలుమంగమ్మంటే ఆవిడ కూడా మా హెడ్‌మిస్ట్రెస్ విమలాదేవిలాగా, మా శ్రీమతి రాజేశ్వరిలాగా ఒక మామూలు ఆడమనిషే ననుకునేరు! కాదు. కానే కాదు. శేషాద్రి శిఖరాలపైన తెనుగువారి యిష్టదైవమై వెలుగొందుతున్న శ్రీనివాసమూర్తి వున్నాడు గదా, సాక్షాత్తుగా ఆయనగారి యిల్లాలే ఈ అలిమేలుమంగమ్మ. క్షమించాలి. ఈ కథలో ఆమె గూడా ఒక పాత్రగా ప్రవేశపెట్టబడడం లేదు. పాపం. ఆవిడ నిమిత్తమాత్రురాలు.

మా బడిలో ఒక ప్రెయర్ హాలుంది

అందులో గోడపైన దండిగా జాతీయ నాయకుల చిత్రాలున్నాయి. మధ్యలో ద్వారబంధానికి ఎగువగా రెండు పెద్ద పెద్ద పటాలు ఒక జంటగా అమరి వుండేవి. అందులో ఒక పటంలోనేమో వేంకటేశ్వరుడు, రెండో పటంలోనేమో అలిమేలుమంగతాయారు బడికంతా ఒక పెద్ద దిక్కులాగా ఆ పురాణ దంపతులక్కడ వాళ్ళపాటుకు వాళ్ళు నెలకొని వుండేవారు. ఈలోగా ఏం జరిగిందంటే మా బడిలోని మూషిక రాజాలకు బొత్తిగా తిండి కరువొచ్చి పడింది. ఇది పనికొచ్చేది, యిది పనికి రానిది అన్న విచక్షణలేకుండా అవి ప్రతి కాగితాన్నీ అప్పళంగా అపహరించడం ప్రారంభించేసరికి, మా జాగ్రత్తలో మేముండి పుస్తకాలు, పత్రికలు మొద లైన వాటిని పెట్టెల్లోనూ, బీరువాల్లోనూ పెట్టి తాళం వేసుకోసాగాము. క్రుద్ధ మూషికాలు కాగితాల తరువాత తినదగిన వస్తువులకోసం పరిశోధన కొనసాగిం చాయి. ఈ పరిశోధనలో ఒక చిట్టెలు కకు గోడకూ, పటానికీ లంకెగా కట్టి వున్న త్రాడుగూడా ఒక ఖాద్యపదార్థం లాగే గోచరించింది. ఈ అవాంతర కృత్యంవల్ల ఒకనాడు అలిమేలుమంగమ్మ పటం గబుక్కున నేలపైన పడి పోయింది.

అద్దం ముక్కముక్కలై పోయిందని వేరుగా చెప్పనవసరం లేదుగదా! బాగు చేయించి మళ్ళీదాన్ని యథాస్థానంలో పెట్టవలసింది పోయి హెడ్‌మిస్ట్రెస్ విమలాదేవి పటాన్ని తీయించి లైబ్రరీలో బీరువాల వెనుక పెట్టించింది.

"పటానికి అద్దం వేయించరా మేడమ్?" అని ప్రశ్నించాను.

"ఇప్పుడేం తొందరొచ్చింది లెండి! నిదానంగా ఆలోచిద్దాం—"

అదేంమాట! భార్యాభర్తలిద్దరూ కలిసి వుండడమే న్యాయం. లోకం హర్షించే దిన్నీ, సమాజానికి శ్రేయస్కరమైన దిన్నీ అదే! ఎటొచ్చీ వాళ్ళను విడదీయ డమే మహాపాపం.

"పోనీ ఒక పని చేద్దామా మేడమ్! పిల్లలదగ్గర చందాలు వసూలు చేద్దాం—"

"మిస్టర్ మూర్తీ! సర్వీసుకు మీరు కొత్తవాళ్ళేమీ కాదు. ఎనిమిదేళ్ళుగా యిదే స్కూల్లో పని చేస్తున్నారు. రూల్సు, రెగ్యులేషన్స్ మీకు తెలిసినవే! ఐనా ఉండుండి ఒక అనుచితపు పని చేసి నా గొంతుమీది కెందుకు తెస్తారో నాకు తెలియకుండా వుంది. అది కాదండీ! చీటికీ మాటికీ మీరు పిల్లల దగ్గర డబ్బులు వసూలుచేస్తారా? వాళ్ళు యిళ్ళకు వెళ్ళి డబ్బులకోసం పీడిస్తే పేరంట్స్ పైవాళ్ళకు అర్జీలు పెడితే, వాళ్ళు ఛార్జస్ ఫ్రేమ్‌చేస్తే ఎక్స్‌ప్లనేషన్సు వ్రాయలేక చచ్చేది నేనేగదా!"

హెడ్‌మిస్ట్రెస్ గారికి యింత

మాటుగా కోపం రావలసిన అవసర మేమిటో నాకు స్ఫురించలేదు.

విమలాదేవి మా బడికి బదిలీ అయి రావడం ఏడెనిమిది నెలలమాట. ఆమెకు ఎప్పుడు, ఎందుకు, ఎవరిపైన కోపం వస్తుందో, దాన్ని ఆవిడ ఎలా అవిష్కరిస్తుందో తెలుసుకోడం యింతవరకూ నా చేత గాలేదు.

నెలరోజుల క్రింతవరకు గుడ్డిలో మెల్లగా పరిస్థితి ఒకరకంగా వుండేది. ఇటీవల ఒక సరిక్రొత్త పరిణామం పుట్టుకొచ్చింది. ఎందుచేతనో హెడ్ మిస్ట్రెస్‌గారికి ముంగరవారి వీధిలో తాను కాపురమున్న యిల్లు నచ్చలేదు. వేరొక అద్దెయిల్లు కోసం అన్వేషణ జరుగుతోందని విన్నాను. పుల్లమీద పుట్రలాగా మా వీధిలోనే ఒక యిల్లు కుదిరింది. అక్కడికి రావడంతో, వచ్చిన కొత్తలోనే మా హెడ్‌మిస్ట్రెస్ గారికిన్నీ, మా శ్రీమతికిన్నీ పరిచయం ఏర్పడింది. అంతటితో గృహజీవితంలో గూడా నాకు మనశ్శాంతి కరువైపోయే ప్రమాదం పొడసూపింది——

ఎలాగంటారా? అదే చెబుతున్నాను.

* * *

ఒకనాటి సాయంకాలం నే నింటికి వెళ్ళేసరికి గంట ఏడయింది.

"ఎలాగైనా మీరు మంచివాళ్ళు. బడి వదలిపెడితే నేరుగా యింటికే వచ్చేస్తారు!" అంది రాజేశ్వరి. "ఈ రోజు కొంచెం ఆలస్యమైందిలే రాజేశ్వరీ!" అన్నాను.

"ఆలస్యం కావడం తప్పనిగాదు. కానీ ఒక రోజు నేను సినిమాకు వెళ్ళి ఒకటి రెండు గంటలు ఆలస్యంగా వస్తానను కోండి! అప్పుడు మీ రూరుకుంటారా?"

నిస్సందేహంగా యిది కొత్త ధోరణి! అందువల్ల గూఢార్థాలకూ, దురర్థాలకు తావివ్వకుండా ఆచి, తూచి మాట్లాడ దలచుకున్నాను—— "కారణం లేనిదే ఆలస్యం జరుగుతుందా? ఆలస్యంగా రావడమనేది నీ విషయంలో గూడా ఎప్పుడైనా జరగొచ్చు. నే నేమీ కోప్పడను..."

"మంచిది! ఒక విషయంపైన మనకు పరిష్కారం కుదిరింది. రెండోది, తెల్లవారుతున్నప్పుడు మీరు పడుకునే వుంటారు:-నేను లేచి కాఫీ చేసి తీసికొస్తే గానీ లేవరు. ఎందుకమ్మా! ఇకమీదట ఒకరోజు నేను లేచి కాఫీచేస్తే, యింకో రోజు మీరు చేసి తీసుకరావాలి..."

"ఒప్పుకున్నాను. రేపటి ఉదయం వంతు నాదే!"

"ఇకపోతే సంసారంలో భార్యాభర్త లిద్దరూ సమానమే గదండీ! బండికి చక్రాలెలాగో, మనిషికి కళ్ళెలాగో, సంసారంలో భార్యాభర్త లలాగని మీరు వినలేదా? మరైతే నేను మిమ్మల్ని 'మీరు' అంటాను గదా! మీరు

మాత్రం నన్ను నువ్వు అని వ్యవహరించడం దేనికి?"

"ప్చ్ ప్చ్, ఎంత పొరపాటు జరిగిపోయిందో చూశారా రాజేశ్వరిగారూ! మన్నించాలి. ఇకపైన నేను మిమ్మల్ని 'మీరు' అనే వ్యవహరిస్తాను. చాలక పోతే 'తమరు' అని గూడా అంటాను. కానీ ఒకసందేహమండీ! ఈ బుద్ధి మీ అంతట మీకే పుట్టిందా? లేకుంటే ఇతరులెవరైనా బోధపరిచారా?"

తెచ్చిపెట్టుకున్న నిగ్రహం పటాపంచలుకాగా రాజేశ్వరి పక్కున నవ్వేసింది—"బాబ్బాబూ! మీకు పుణ్యముంటుంది. చిన్నదాన్ని పట్టుకుని మీరు 'అండీ' అనీ 'మీరు' అనీ మాట్లాడటమేమిటండీ. ఖర్మ. మీకు తెలిసివుండదమెందుకైనా మంచిదని పాఠం అలాగే ఒప్పజెప్పాను. ఇదంతా మీ హెడ్ మిస్ట్రెస్‌గారి గీతోపదేశం!"

"అయ్యో! పాపం! ఆవిడ ఉపదేశం బూడిదలో పోసిన పన్నీరు కావలసిందేనా రాజేశ్వరీ! నువ్వు నాతో పోరాటాన్ని ప్రారంభించవా?" అన్నాను.

"ఊరుకోండి బాబూ! నా కిప్పుడెంతో హాయిగావుంది. మీరు కొత్తగా నాకు హక్కు లిచ్చినంత పుణ్యం. మీతో పోట్లాట పెట్టుకున్నానంటే నాకు మతిపోతుంది..."

ఇంకా నయం. రాజేశ్వరికైతే మతిపోతుంది...ఇల్లు గూడా పదిలంగా వుండదు గనుక నాకప్పుడిక గోదారే శరణ్యం.

పనులన్నీ ముగించుకుని రాజేశ్వరి మళ్ళీ ఓ అరగంటసేపటికి హాల్లోకి వచ్చింది. చలనంలేకుండా వాలుకుర్చీలో పడుకున్న నా వైపు చూస్తూ తెల్లబోయి "నిజంగానే మన యింట్లో పోరాటం ప్రారంభమైపోయినట్టు అలా నిర్ఘాంత పడిపోయి కూచున్నారేమండీ?" అంటూ పలకరించింది.

"కాదు రాజేశ్వరీ! నువ్వు హక్కుల పోరాటం ప్రారంభిస్తావు. నేను నిరాకరిస్తాను. నువ్వు తిరుగుబాటుచేస్తావు. ఇల్లు రణరంగంలా తయారౌతుంది. ఈ పరిణామంవల్ల ఒక వ్యక్తికి ఆనందం కలిగేపక్షంలో మన మెందుకలా చేయగూడదూ?"

అనుమానంగా నా వైపు చూడసాగింది రాజేశ్వరి.

* * *

పదిరోజుల తర్వాత ఒకనాటి ఉదయం నేను తోటలో రావిచెట్టు క్రింద కూర్చుని వుండగా హెడ్‌మిస్ట్రెస్‌గారి నుంచి పిలుపు వచ్చింది.

"మూర్తిగారూ! సిద్ధార్థుడిలా రావిచెట్టుక్రింద కూచున్నారేమండీ! క్లాసు లేదా?"

లేదన్నాను.

"నేనూ గమనిస్తున్నా ననుకోండి. మునుపటిలా మీరు ఉత్సాహంగా లేరు.



అనారోగ్యంగా వుంటే సెలవుపెట్టి ట్రీట్‌మెంటు యిప్పించుకోగూడదూ?"

"ఎందుకులెండి మేడమ్! సెలవుపెట్టి యింటిదగ్గర కూచుంటే అనారోగ్యం మరింతగా విషమించేటట్టుంది. అది యిల్లు గాదు. అడవి, రగడ లేనిరోజు లేదు. స్కూల్లోవున్నంతవరకేనామనసుకు శాంతి, ఇంటికి వెళ్ళడమంటే భయమై పోయింది. ఐనా ఈ బాధలు మీకేమర్థమౌతాయి లెండి మేడమ్! ఇలాంటి బాదరాబందీ లేవీ మీకు లేవు..."

హెడ్‌మిస్ట్రెస్‌గారి ముఖం విరిసిన శతపత్రమై పోయింది—"ప్రసక్తి వచ్చింది గనుక చెప్పాలనిపిస్తోంది. గృహమే కదా స్వర్గసీమ అని వింటుంటాం. ఊరికే ఎలా తయారౌతుంది? అలా మలచుకోవాలి. సాయంకాలం యింటికి వెళ్తాను. ఎక్కడివస్తు వక్కడ, యిల్లంతా శుభ్రంగా వుంటుంది. మాట్లాడ్డానికి ఎవరో యిరుగు పొరుగు ఆడవాళ్లు వచ్చి పోతుంటారు. కాలం హాయిగా గడచి పోతుంది. భోజనంచేసి పడుకోడమే ఆలస్యం—గాఢనిద్ర! లేవండమ్మగారూ! కాఫీతయారైంది! అంటుంది వంటలక్క. లేచి పేపరు చూస్తుంటాను. టిఫినుసిద్ధం. స్నానం చేస్తాను. డ్రెస్ చేసుకుంటాను. బడికి హాజరైపోతాను. చింతలనీ, వంతలనీ అందరూ అంటుంటే వినడమే! వాటి రంగూ, రుచీ ఎలా వుంటుందో గూడా నాకు తెలియదు..."

''తీరిక సమయాల్లో మీరు పుస్తకాలు చదవడంగానీ, సినిమాలకు వెళ్ళడంగానీ వుండదా మేడమ్" వీలయినంత సిన్సియర్‌గానే ప్రశ్నించాను.

"అబ్బే, అవంటేనే నాకు రోత. వాటిని 'హేట్' చేస్తాననుకోండి. ఎంత సేపైనా ఒక మగవాడున్నా, ఒక ఆడ మనిషిన్నీ! లేదంటే రెండు మూడు

జంటలు. ఒకరివెంట ఒకరు, పరిచయాలు ప్రేమలు, వియోగాలు, విషాదాలు, అసూయలు, అనుమానాలు, వట్టి చెత్త! సారహీనమైన గొడవకదండీ నాకేం నచ్చదు."

"అదృష్టమంటే మీదే మేడమ్. నిండయిన ఆనందం మీ సొత్తు. నాకా ప్రాప్తంలేదు" అంటూ వేడిగా నిట్టూర్చాను.

కొన్ని కొన్ని దేవతలను సంతృప్తి పరచడంకోసం ఎన్నెన్నో చేయరాని పనులు చేయడంలేదా? ఆ దేవతలతో పోల్చిచూస్తే మా హెడ్‌మిస్ట్రెస్ విమలాదేవి ఎంతో మేలు. ఈవిడకు కొన్ని అబద్ధాలతో మేరుపర్వతమంత ఆనందం కలుగుతుంది. ఆఅబద్ధాల పునాదులపైన ఆమె ఒక కృత్రిమమైన ఆనందసౌధం నిర్మించుకోడంలో నాచేతనైన సహాయం నేనూ చేస్తున్నాను. తప్పేముంది?

కానీ నాకున్నంత నిదానం, ఉపకార చింతన (నటనాపటిమ అనుకోండి పోనీ) మా ఆవిడకు లేకపోయింది. ఎంతో ప్రయత్నంమీద ఆమె ఒక నెలరోజులు మాత్రం నేను నియమించిన హద్దుల్లో వుండగలిగింది. ఆ నెలరోజుల్లో గూడా ప్రతిదినమూ ఒక కంప్లెయింటే! మగవాడు స్త్రీకి తీరని అన్యాయం చేశాడు. భోగవస్తువుగా వాడుకున్నాడు. యంత్రంకంటె భిన్నమైనదిగా భావించ లేదు తన స్వార్థానికి యింధనంగానే ఉపయోగించుకుంటూ వచ్చాడు. స్థూలంగా యిది హెడ్‌మిస్ట్రెస్ విమలాదేవి వాదం.

అక్కడి కక్కడ ఆ వాదానికి తల వూపి, యింటికిరాగానే నాతో తలపడేది రాజేశ్వరి.

"ఏమండీ! మగవాళ్లందరూ అలాంటి దుర్మార్గులే నంటారా?"

"కొందరు మంచివాళ్ళు గూడా వుండవచ్చు..."

"మరైతే ఆడవాళ్లలో మాత్రం చెడ్డవాళ్లు లేరా?"

"చెప్పలేం! వాళ్లల్లో గూడా కొందరు చెడ్డవాళ్లు వుండొచ్చు..."

"అలాగైతే మీ హెడ్‌మిస్ట్రెస్‌గారు మగవాళ్ళపైన అలా విరుచుకపడిపోతుంటారెందుకండీ?"

"ఏమో; ఆవిడనే అడగరాదా?"

"అడిగేదాన్నే; మీరెక్కడ బాబూ! మీరు నా నోటికి బుట్టి పెట్టేశారు..."

తాత్కాలికంగా మౌనం. మళ్ళీ మొదలు.

"ఏమండీ! పెళ్ళి అనేది తప్పా?"

"కాదే."

"మరైతే అదేదోవట్టి పనికిమాలిన పనైనట్టు ఆవిడ అలా తీసి పారేస్తుం దెందుకండీ?"

రాజేశ్వరీ! ఎవరి పిచ్చి వాళ్ళ కానందం. నీ కెందుకు? నువ్వూరుకో-"

"ఏం వూరుకోడమో బాబూ! ఎందు

కొచ్చిన పీడ! నే నక్కడికి వెళ్ళనే వెళ్ళను..."

కానీ హెచ్. యం. విమలాదేవి ఈవిడ కంపెనీకోసం తహతహ లాడి పోతున్నట్టుగా ప్రతిరోజూ రమ్మని కబురు పెట్టేది. రాజేశ్వరికి వెళ్ళక తప్పేదిగాదు.

ఇలా మరికొన్ని రోజులు గడిచాయి.

చివరకు నే నే దైతే జరుగుతుందని భయపడుతూ వచ్చానో అది కాస్తా జర గనే జరిగింది.

ఒకనాటి సాయంకాలం నేను షికా రుకు వెళ్ళి తిరిగి వచ్చే సరికి రాజేశ్వరి ఎదురుగావచ్చి "అయ్యా! మీ హెడ్ మిస్ట్రెస్‌గారితో స్నేహానికి తెగ తెంపులు" అంటూ ప్రకటన జారీ చేసింది.

"ఎందుకు రాజేశ్వరీ! ఏంజరిగింది?" కంగారుగా ప్రశ్నించాను.

"ఆవిడ గొప్పల్ని ఎంతకాలమని సహించగలం? నా చేతగాలేదు. మొదట నాకెన్ని చీరలున్నాయో అడిగి తెలుసు కుని, ఆ తరువాత లోపలికి తీసుకెళ్ళి బీరువా తెరిచింది. అందులో నాలుగైదు అరలనిండా చీరలేవున్నాయి తెండి, ఒక చిన్న షాపులాగా! ఒక్కొక్క చీరనే పైకితీయటం, అంచు, పైటచెరగు, నేత దేనికది విడివిడిగా చూపించడం, ఆ చీర ఎక్కడ కొనిందీ, ఎంతకు కొనిందీ వివరించటం—యిలా ఒక ప్రదర్శనమే మొదలైంది. ఈ సత్కాలక్షేపం ఒక గంటసేపు కొనసాగిన తర్వాత నేనుండబట్టలేక ఒక మాటనేశాను..."

"చెప్పు రాజేశ్వరీ! ఏమన్నావు?"

"చీరలన్నీ బాగున్నాయండీ! కానీ ఏంలాభం? కట్టుకుంటే చూచి ఆనందించ డానికి ఎవరూ లేరుగదా!...అనేశాను."

నేను హతాశుడినై కుర్చీలో కూలబడి పోయాను.

రాజేశ్వరికి మాత్రం చీమ కుట్టి నట్టయినా లేదు.

ఆమె తనంతట తాను చెప్పుకు పోతూంది—"అమ్మగారి ముఖం అప్పుడు చూడాలి. కళ్ళల్లో కన్నీళ్ళ, చూపుల్లో కోపాలు...ఉడుకుమోత్త నంతో బుసలు కొట్టిందనుకోండి? పైన బడి నా ఒళ్ళంతా రక్కేస్తుందేమో నను కున్నాను. అంతపని జరగకముందే పరుగెత్తు కొచ్చేశాను."

* * *

'యుద్ధానంతర ప్రశాంతి' అంటారు గదా! మాకూ మా హెడ్‌మిస్ట్రెస్‌గారికీ మధ్యఅలాంటిప్రశాంతినెలకొన్నట్టయింది బడిలోనైతే ఒకరి ముఖం ఒకరు చూచు కోటం తప్పదంలేదు, కానీ మాటలు బాగా తగ్గిపోయాయి. ఆఫీసు రూంలో సంచలనమే లేదు. హెడ్‌మిస్ట్రెస్‌గారి వైఖరి చూస్తుంటే ఆమె బడికి బయల్దేరి వస్తున్నట్టులేదు. ఏదో సంతాప సభకు వచ్చి వెళ్తున్నట్టుంది. ఫ్యాను నరసయ్య

ద్వారా మరికొన్ని వర్తమానాలు గూడా తెలియసాగాయి. ఎన్నడూలేనిది ఈ మధ్య అతడు 'అమ్మగారూ! మీకు క్లాసుంది' అంటూ జ్ఞాపకం చేయవలసి వచ్చిందట! ఒకసారి అలా చెప్పడానికి వెళ్ళగా ఆమె విస్తుపోతూ "ఎక్కడిది? నాకిప్పుడు క్లాసులేదే!" అంటూ టైం టేబిల్ చూచిందట. "అమ్మగార్కూ! ఇప్పుడు జరుగుతున్నది ఉదయం కాదండీ! సాయంకాలం" అంటూ నరసయ్య పొరబాటును గుర్తుకు తెచ్చేసరికి ఆమె ముఖం వెలవెల పోయిందట! "ఇదేం విడ్డూరమండీ బాబుగారూ! బడి వదలిపెట్టినా ఈమెకు యింటికి వెళ్ళాలన్న ధ్యాసలేదే! పొద్దుపోయి దీపాలు వెలిగినా కుర్చీలో బొమ్మలా కూర్చుండి పోతుంది. "అమ్మగారూ! ఇంటికెళ్లరా" అని అడిగితే "ఇంటికా నరసయ్యా! వెళ్ళాలి. నడిచే ఓపికలేదు. ఓ రిక్షాతెచ్చి పెట్టు బాబూ!" అంటుంది. బాబుగారూ! ఈవిడేమైనా ముసలిదా, ముతకదా? మ్రోతులా అలా వుండిపోయిందెందుకండీ?" అంటూ నరసయ్య వాపోయాడు.

జీవితం ఒక సువర్ణ కలశం. కాల పురుషుడు వంతువారీగా అందులో అమృతం కురిపిస్తాడు. సకాలంలో నువ్వు వెళ్ళవు. ఏమౌతుంది? నీ కలశం ఖాళీగా వుండిపోతుంది.

పిడలావచ్చి, నిశ్శబ్దంగా మసలుకుంటూ, నీరసంగా యింటికి వెళ్ళిపోతూ వచ్చిన హెడ్‌మిస్ట్రెస్ విమలాదేవి ఒకానొక సోమవారంనాటి ఉదయం తనకు మారుగా బడికి సెలవుచీటి పంపింది.

"జ్వరమంటే జ్వరంకాదండీ బాబుగారూ! నిన్నటి దినమంతా మూసిన కన్ను తెరవలేదు" అన్నాడు నరసయ్య.

ఆ రోజు సాయంకాలం వీలయినంత తొందరగా యింటికి వెళ్ళాను. త్వరగా తెమలమనేసరికి సినిమా ప్రోగ్రాం కాబోలు ననుకుని మా ఆవిడ పరవశించి పోయింది. హెడ్‌మిస్ట్రెస్‌గారి యింటికనేసరికి ఆవిడ ముఖం చింతాకంతై పోయింది.

"నేన్రాను! అంతగా అవసరమైతే మీరు వెళ్లండి," అంటూ మంకు పట్టు పట్టింది.

"కాదులే రాజేశ్వరీ! మనం మానవులం. రాతిబొమ్మలం కాము. కష్టసమయాల్లో తోటి మనుషులను ఆదుకోలేకపోతే యిక మానవులమనిపించుకోడానికి ఎలా పనికొస్తాం..."

"చెప్పండి బాబూ చెప్పండి. పరోపకారమే పరమ ధర్మమనండి. మానవసేవే మాధవసేవ అనండి. టీచర్లుగదా, మీకు తెలియని నీతులా?"

కానీ ఏ మాట, కామాటే చెప్పుకోవాలి. 'మనసు నవనీతం, పలుకు వజ్రాయుధం' అంటారే ఆ మాట కొంత వరకూ ఆడవాళ్ళ విషయంతో గూడా




నిజమేనేమో అనిపిస్తుంది. తీరా హెడ్ మిస్ట్రెస్‌గారి యింటికివెళ్ళి ఆమె పరిస్థితి కళ్ళజూచిన తరువాత రాజేశ్వరి విల విల లాడిపోయింది. పడక సర్దింది. దుప్పటి సరిగ్గా కప్పింది. పేషంటు తలను తన ఒడిలోకి తీసుకుని నెమ్మదిగా కాఫీ త్రాగించింది. 'అదికాదండీ! జ్వరం యింత ముమ్మరంగా కాస్తోంది గదా! మా కొకమాట చెప్పిపంపకూడదా? మీకంత కానివాళ్ళమై పోయామా మేము' అంటూ మనసుకెంతో నొచ్చుకుంది.

"చెప్పి పంపకపోయినా మీ రొస్తారని నాకు తెలుసు" సజల నయనాలలో నుంచి రాజేశ్వరివైపు చూస్తూ అంది విమలాదేవి.

అప్పటికి నేనొకణ్ణి అక్కడే వున్నట్టు రాజేశ్వరికి గుర్తుకొచ్చింది — "అదేమిటండీ! అలా నిల్చుండిపోయారు. వెళ్ళండి. పరుగెత్తండి. డాక్టరు సూర్యనారాయణగారిని తీసుకురండి. ఇక్కడున్నట్టుగా రావాలిమరి..."

అరగంట సేపట్లో నేను డాక్టరు సూర్యనారాయణగారిని రంగంపైన ప్రవేశ పెట్టాను. రోగిని పరీక్షించి రోగ నిదానంచేసి ఆయన ఒక ఇంజక్షను చేశాడు. తన ఇంజక్షను ప్రభావంవల్ల పదిగంటలకల్లా ఒళ్ళంతా చెమటలు పట్టి జ్వరం తగ్గిపోతుందన్నాడు.

తన మాటలోని నిజా నిజాలను మా కళ్ళ ఎదుట నిరూపించ దలచి నట్టుగా ఆయన మాతో ఖాతాఖానీ వేస్తూ అక్కడే కూర్చుండిపోయాడు.

"చాలా థేంక్సండీ డాక్టరుగారూ! పిలవగానే వచ్చేసే డాక్టర్లయితే వుంటారుగానీ, పేషంటుకు నయమయ్యే దాకా అక్కడే వుండిపోగల డాక్టర్లు చాలా అరుదు" అన్నాను.

"మరేం పర్వాలేదులెండి మూర్తి గారూ! నాకేమైనా పెళ్ళామా? బిడ్డలా? మిలటరీ సర్వీసులో వుండిపోవడం మూలాన నేను సంసారం ఊబిలో పడి పోలేదు. అవసరమైతే పేషంటును ఎంత సేపైనా కనిపెట్టుకుని వుండిపోగలను." వింపాదిగా అన్నారు డాక్టరు సూర్య నారాయణ.

* * *

జ్వరం పూర్తిగా తగ్గిపోవడానికి వారంరోజులు పట్టింది. శరీరంలో మళ్ళీ మునుపటి ఉత్సాహం పుంజుకో డాని కింకొక వారంరోజులు కావలసి వచ్చింది. డ్యూటీలో జాయినైన రోజున విమలాదేవిలో నవచైతన్యం కాన వచ్చింది.

"జ్వరం వచ్చినా వచ్చిందిగానీ, వచ్చిన జ్వరం మీకు మేలే చేసినట్టుంది" అన్నాను.

ఆమె నవ్వింది.

ఆ నవ్వుకు అర్థమేమిటో నాకప్పుడు బోధపడలేదు.

ఆనాటి సాయంకాలం చిన్న అంత రంగిక సమావేశం ఒకటి జరిగింది.

"మూర్తిగారూ! మనం పెద్దవాళ్ళమై పోయాం. కానీ చిన్ననాటి గుణాలు కొన్ని యింకా మనల్ని అంటిపెట్టుకునే వున్నాయి. నా చిన్నతనంలో నేను నా తోటి పిల్లలదగ్గర ఓ అందమైన వస్తువు కనిపిస్తే ఓర్చుకోలేక పోయేదాన్ని. మంచిగానో, చెడ్డగానో దాన్ని నా స్వంతం చేసుకోవాలనిపించేది. మనకు లేని అందమైన వస్తువు యింకొకరి కుండ గూడదు మనకు దక్కని ఆనందం యింకొకరికి దక్కకూడదు. నాలోని ఈ గుణంవల్ల నే నెన్నోసార్లు మీ మన సుకు నొప్పి కలిగించి వుంటాను. అందుకు మీరు నన్ను మన్నించాలి..."

"ఎంతమాట? మిమ్మల్ని నేను మన్నించడ మేమిటి?" అన్నాను.

"బహుశా మీకు జ్ఞాపకం వుండి వుంటుంది. పటం క్రిందపడి అద్దం పగిలి పోతే నేను దాన్ని తీయించి లైబ్రరీలో బీరువాల వెనుక పెట్టించాను.

"అవునవును. ఇప్పుడా ప్రసక్తి ఎందుకు?" అన్నాను.

"ఇప్పుడందుకు నేను దఖ్ఖిస్తు న్నాను. దయచేసి దానికి అద్దంవేయించి యదాస్థానంలో పెట్టించాలి..."

"అలాగే మేడమ్, అలాగే!"

* * *

ఆ తరువాత నెలరోజులకు కన్యకా పరమేశ్వరి ఆలయంలో విమలాదేవి పెళ్ళి వైభవంగా జరిగింది. తన జీవిత కాలాన్ని పూర్తిగా ఒక పేషంటుపైన డివోట్ చేయడానికి డాక్టరు సూర్య నారాయణ అంగీకరించాడు. నూతన దంపతుల్ని గౌరవించడంకోసం మేము ప్రెయర్ హాల్లో విందు ఏర్పాటుచేసి నప్పుడు పతిదేవుడి సరసన కొలువు దీర్చిన అలిమేలుమంగమ్మ ముసి ముసి నవ్వులు వెదజల్లింది.




శ్రావణ మాసపు ఆకాశం మసక మసకగా ఉంది. రాత్రంతా చిత్తడి జల్లు కురిసి అప్పుడప్పుడే కాస్త విశ్రాంతి తీసుకుంటున్న నింగి ఏమీ ప్రసన్నంగా కనబడటంలేదు. కళ్ళు తెరుస్తూనే బయటి వాతావరణంలో ఉన్న బరువంతా తన గుండెలమీద చేరినట్లయి కళవరపడ్డాడు శ్రీధరమూర్తి. అలవాటుప్రకారం రెండు చేతులూ పైకి సాగదీసి ఒళ్ళు విరుచుకుని నడిమంచాన బాసింపట్టు పెట్టి కూర్చున్నాడు. మనసంతా తడిసి బరువెక్కిన చిగురుటాకులా కదిలిపోతోంది. సరిగ్గా మూడు నెల్లనుండీ ఈ తడి ఆరడం లేదు. ఈ బరువు తగ్గడంలేదు. ఎప్పుడు తాను ఆరిన రెక్కల్ని తేలిగ్గా గాలిలో ఆడిస్తూ స్వేచ్ఛగా ఈ లోకంలో విహరించగలదో తెలీడంలేదు. తనకు జీవితమంతా శ్రావణమాసమై పోతుందేమోనన్న భయంకూడా పట్టుకుంది మధ్య. శ్రావణమేఘాలన్నిటినీ మనస్సులోనూ కళ్ళల్లోనూ బంధించి లక్ష్మి తన్నిలా వేధిస్తోంది. తనమీద కోపం తెచ్చుకుని దూరంగా వెళ్ళిపోయిన తన లక్ష్మి!

మూర్తి లేచి దొడ్లో వేపపుల్ల విరుచుకున్నాడు. మనస్సులో కదిలే ఆలోచనల్తో సమానంగా నోట్లో వేపపుల్ల అటూ ఇటూ ఆడుతోంది. పొగ మబ్బులు పోరాడే ఆకాశంమీదికి వెలుగురేఖలు,

అప్పుడే ఎవరో చేతికొద్దీ విసిరేసిన పారి జాతపు పువ్వుల్లా పరుచుకుంటున్నాయ్. వాటి కాడల ఎర్రదనం లాగానే ఉదయ రాగం, కనీ కనపడనట్లు సర్దుకుంటు న్నది. శ్రీధరమూర్తి మనస్సులోమాత్రం ఎక్కడా వెలుగుతెరలు లేవు. లక్ష్మికి కోపం తగ్గేదెప్పుడు? కలకలా విరిసే ముఖంతో మళ్ళీ ఆవిడ తన చేతుల్లో వాలిపోయేదెప్పుడు? ఎప్పుడో వస్తుంది. ఈ మేఘాలు విచ్చుకుని ఇంత నడీ శ్రావణదినాన సూర్యకాంతి మెల్లగా విరుస్తున్నట్లే తన లక్ష్మికూడా వస్తుంది. మూర్తిగబగబా మొహం కడుక్కున్నాడు పనిమనిషి హోటల్‌నుండి పట్టుకొచ్చిన కాఫీ పొగలు చిమ్ముతూంది. తన మన సంతా అటువంటి పొగలే? అనాలోచి తంగా కాఫీగ్లాసు పట్టుకోగానే చెయ్యి చుర్రుమన్నది. ఆ చురుకుదనం మెద డుకు తగిలి ఏవో జ్ఞాపకాలు బూదర బూదరగా మనసంతా అల్లుకోసాగినయ్. ఆ మసక తెరల మాటున రాధ! మన స్సును చురుకు దెబ్బలు కొట్టి, తన్ను నిబ్బరంగా నిలవనీయక, కొనవేలిచుట్టూ దారపుపోగుకు మల్లే తిప్పుకున్న రాధ! లక్ష్మిముఖంమీద ప్రయత్నపూర్వకం గానే కావిర్లు కమ్మించిన రాధ!

రాధ ఎంత తియ్యని స్మృతి! జన్మ కంతా సరిపడే ఆరాధనా భావాన్ని తనలో నింపి, తనది కావడానికి వీల్లే కుండా పోయిన రాధ!

"నీళ్ళు తోడానయ్యా!" పనిమనిషి కేకతో బయటి ప్రపంచంలోకి వచ్చాడు మూర్తి. బక్కెట్లో నీళ్ళు చాలా వేడిగా ఉన్నాయ్. వెచ్చటి ఆవిర్లు ఆ చిన్న బాత్రూము నిండా చుట్టుకుని, తన్నేదో కలల్లోకి గిరవాటు పెడ్తున్నట్లుగా అయి పోతున్నాడు. చేతిలో సబ్బు బిళ్ళ ఆరుగుతోంది. తన మనస్సు కూడా ఆలోచనల్తో అట్లాగే కరిగిపోతూ అలిసి పోయిన జంతువులా నురుగులు కక్కు తోంది. చిత్రమైన ఆ బాధ వెగటుగా తోచి 'రాధా' అంటూ అసహనంగా మనసులోనే గట్టిగా అరుచుకున్నాడు. మూర్తి ఆ కేకలో రాధమీది కోపంకంటే ఆ పేరు పెదాల మధ్య నిలవడంలో ఉన్న తియ్యదనం మనస్సుమీద వింత అనుభవాన్ని చిలుకుతోంది.

"లక్ష్మి, ఉత్త పసిపిల్ల రాధా! దాని మనస్సు పరిపక్వం కాలేదు. కాని నువ్వు మాత్రం చిన్నప్పటి రాధవు కావు. నీ ఆకర్షణ చిత్రంగా నాలో నిలిచిపోయే టట్లు చేశావు. ప్రయత్న పూర్వకంగానే నన్ను సుడిగుండంలోకి లాగేశావు. ఇలా ఎందుకు చేశావు రాధా? ఎందుకు?—". మూర్తి మనస్సు ఆక్రో శిస్తూనే ఉంది. బక్కెట్లో నీళ్ళన్నీ అయి పోయినయ్. నీళ్ళోడుతున్న తలా ఒళ్లూ తుడుచుకున్నాడు. చేతిలో ఉన్న టర్కీ టవల్ ఒంటితడిని సాంతం పీల్చక పోవడంమాట అటుంచి, మనస్సుకు

పట్టిన తడిఅలాగే ఉంది. అది ఇప్పట్లో ఇంకిపోయే దారి కనిపించడంలేదు.

బల్లమీద శుభ్రంగా తోమి తళతళ లాడుతున్న ఇత్తడి క్యారేజి తెచ్చిపెట్టింది పనిమనిషి. ఆ తళతళలకు మల్లే లక్ష్మి రకరకాల వేషాలు వేసుకుని మనస్సులో అడపాదడపా కదలాడుతోంది. పరిణత హస్తుడైన శిల్పి మలచిన బొమ్మలాంటి లక్ష్మి, పువ్వులు విరిసి గాలికి అందంగా ఊగే సన్నజాజి తీగలాంటి లక్ష్మి! అందమనే మాటకే సృష్టికర్త రాసిన మహాభాష్యం లాంటి తన లక్ష్మి! ఆవిడ కూడా తన మనస్సు నింతగా రంపపు కోత కోసేంత సమర్థురాలెలా అయింది? మంచంమీదికి చేరి బాధగా కళ్లు రెండూ మూసుకున్నాడు మూర్తి. మనస్సును విశృంఖలంగా విహరించ మన్నట్లు వది లేశాడు. మనస్సు చకచకా గతం తవ్వు కుంటూ కలుగులోపలికి చొచ్చుకుపోయే చిట్టెలుకలా కదలాడుతోంది. గతంలో ఎన్నో బొమ్మలు! ఎన్నో నీడలు! అన్ని ట్లోనూ విరగబడి నవ్వుతూ రాధే కనిపి స్తోంది. రాధ వెనక లీలగా, నీడలాగా దిగులు కళ్ళతో లక్ష్మి! పసిపాప లాంటి తన లక్ష్మి!

ఆ వేళ రాధ తన ఇంటికి వచ్చింది. మూర్తి పెళ్ళయిన రెండేళ్ళలో ఇదే మొదటిసారి రాధ రావడం. అయిదేళ్ళ నుండీ నేర్చుకుంటున్న వైద్య విద్య ఆవిడకు హుందాతనాన్ని నేర్పింది. నిలకడను సమకూర్చింది. రాధ మాటల్లో ఎక్కడా తొట్రుపాటుతనం లేదు. కంటి పాపల్లో చురుకుదనపు ఛాయలు లేవు. ఒదులుగా వేసుకున్న బారెడు జడ, పచ్చగా మెరిసే బుగ్గలు, చకచకలాడే కళ్ళు, కొసతేలిన ముక్కు, ఆ అందాన్ని చూస్తూ చూస్తూ మూర్తి అయోమ యంలో పడిపోయాడు. అందం ఒకటే కాదు. అంతకుమించి ఆవిడ సమకూర్చు కున్న విద్య, సంస్కారం, తనలో నిద్రాణంగా ఉన్న ఆరాధనాభావాన్ని మేల్కొలిపింది. అయిదేళ్ళకిందట ఈ రాధనే చేసుకోమని అడిగాడు తన మేన మామ. అప్పుడు నచ్చని రాధ ఇప్పు డెంత హుందాగా ఉంది? ఒక్కక్షణంలో సగంసేపుమాత్రం ఈ రాధనేనా నేను కాదన్నది అన్నభావం మెరుపులా కొట్టింది. కాని ఇన్నాళ్లూ తన ప్రాణంగా భావించిన లక్ష్మి మాటేమిటి? ఆవిడకు తప్ప మరో ఆడదానికి తన మనస్సులో చోటు ఉండడానికి వీలేలేదు.

"ఏం బావా! చూపుల్తో తినేయ దలచుకున్నావేమిటి?" రాధ నవ్వుతూ పలకరించింది.

"మీ ఆయన్ని దయదలచి ఒదిలేశాను లక్ష్మీ! నేనే తల్చుకునుంటే నీ కితనితో పెళ్ళయ్యేదా! నన్ను చేసుకోమని మా నాన్న అడిగితే వద్దన్నాడట మనుడు. పోనీలే తగిన భార్య దొరికింది. అంత

వరకూ మా బావ అదృష్టమే," అన్నది, నవ్వుతూ మరోసారి.

"నిజమే. మేం పుట్టినప్పటినుంచీ మొగుడు పెళ్ళాలనే పిలిచేవాళ్లు. ఆవిడ పుణ్యమా అని ఒదిలిపెట్టింది గాని, లేక పోతే వేగలేక చచ్చేవాణ్ణి:" తానూ ఆ నవ్వుతో శ్రుతి కలిపాడు.

ఆవేళ ఒంటరిగా దొరికించుకుని దులిపిపోసింది లక్ష్మి.

"ఏమిటండీ మీ ఇద్దరి వరసా! అది చదువుకున్న వాళ్ళమన్న అహమా! లేక ఎట్లాకూట్లాడినా చెల్లుతుందన్న ధీమానా" అని మాటల్ని బాణాలుచేసి విసిరింది. ఆ ఎగరడంలో తనమీద కోపం కంటే రాధమీది అసూయా, సందేహం, ఎక్కువగా కనిపించి తన్ను చకితుణ్ణి చేశాయి. లక్ష్మిని రాధ ఆధిక్యం అంతగా రెచ్చగొట్టింది.

అప్పటినుండీ తను లక్ష్మి ముఖంలో నవ్వు చూడలేదు. తుమ్మల్లో పొద్దుకూకినట్లు మలినంగా చిటపటలాడుతూ అంటీ పట్టనట్టు తిరిగే లక్ష్మి తనలో కోపాన్నే పెంచింది.

మరీ అంతగా మాలకాకిలా ఉండ మంటుందేమిటి? ఏం? మేనమరదల్తో పరాచికాలాడితే తప్పా! నన్నేంగుంజకు కట్టేసే పశువనుకుంటుందా! అని మనస్సులోనే ఎగిరిపడ్డాడు. ఈ రాధనే ఆధారంగా చేసుకుని ఉడుకుబోతు లక్ష్మికి గట్టిపాఠం చెబుదామనుకున్నాడు.

కాని జరిగిందేమిటి? పాఠం రాధే! చెప్పింది తనకు. నిలుచున్నా, కూచున్నా ఏ పనిచేస్తున్నా, కన్నెత్తి తనవైపుకు చూడకుండానే రాధ చిత్రంగా అయస్కాంతంలా తన్ను ఆకర్షించ సాగింది! ఆవిడ మాట, నవ్వు, నడక చివరకు కొనవేలి చిరుకదలికయినా తన గుండెల్ని చిత్రంగా స్పందింపజేసే సామర్థ్యాన్ని సంతరించుకున్నాయి. రాధ ఎదుట లేక పోయినా చుట్టూ ఉన్న గాలి, గాలిలో తేలే శబ్దమూ, నిలువెల్లా రాధనే నింపు కొని, తనకు అందిస్తున్నట్లుగా అనుభూతి చెందేవాడు. రాత్రివేళ పక్కనున్న లక్ష్మిని తాకకుండానే ఇది రాధే, ముమ్మాటికీ రాధే అయితే, అన్న ఊహకు ఊపిరిపోసేవాడు.

"అవును తప్పా? నేను రాధను ప్రేమిస్తున్నాను. అందమైన ప్రతి వస్తువునూ ఆరాధించే హక్కు అందరికీ ఉండాలి. ఆలయంలో ప్రతిమలాంటిదే రాధ. ఆవిడ శరీరంమీద నాకు మోజు లేదు ఆవిడ్ని చేత్తో తాకడానికయినా నేను సాహసించలేను. ఇది నా లక్ష్మికి ద్రోహం చెయ్యడం ఎంతమాత్రంకాదు" అని మనస్సును జోకొట్టే ప్రయత్నం చేసేవాడు.

అనుక్షణమూ తన మనస్సునిండా మెరుపులు మెరిపిస్తూ, ఓడిపోతున్న శత్రువునుచూచి విజయ గర్వంతో విర్రవీగే నాయకురాలిలా రాధ! తన ఆకర్ష




జను సుడులుతిప్పి, సన్నని జలతారు వలలా, తనమీదికి ప్రయత్నపూర్వకం గానే విసిరేసిన రాధ! తను గిలగిల్లాడి పోయాడు. లక్ష్మి పుట్టింటికి ప్రయాణ సన్నాహం చేయసాగింది.

"ఏమిటి లక్ష్మి నీ మూర్ఖం! నన్ను సాధిద్దామనా?" మందలించబోయాడు. కాని ఆ మందలింపులో బలం లేదని తనకు బాగా తెలుసు. తన మనస్సులో చకచకా మెరిసే రాధ బొమ్మ ముందు ఒకప్పుడు తాను మెచ్చి మురిసిపోయిన భార్య కేవలం పిండిబొమ్మలాగా పేలవంగా కనిపిస్తోంది. ఆ విషయాన్ని అంతులేని బాధతోనే గుర్తించాడు తను.

"మరేమీ చెప్పకండి నాకు! మరో స్త్రీ నీడయినా మీమీద సోకడం నేను సహించలేనని మీకు తెలుసు. అటువంటప్పుడు, దాన్ని మీరే ప్రోత్సహిస్తుంటే అది నా కవమానం కాదా! మీకు కష్టంగా ఉన్నాసరే, జరుగుతున్న ఈ నాటకం చూడకుండా పారిపోకపోతే నిజంగా నాకు పిచ్చెక్కుతుంది." తీవ్రంగా పడగ విప్పిన నాగుబాములా బుసలుకొట్టింది లక్ష్మి. ఉగ్ర సుందరమైన ఆ రూపాన్ని నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయాడు మూర్తి.

లక్ష్మి వెళ్ళిపోయింది. రాధకూడా వెంటనే ప్రయాణం కట్టింది. తాను

అగ్నిసాక్షిగా పెళ్ళిచేసుకున్న లక్ష్మి తన బలహీనతను సానుభూతితో అర్థం చేసుకోలేకపోయింది. ఒకప్పుడు ఎటు వంటి ఆకర్షణనూ తనలో పెంచలేని రాధ తన్ను పిచ్చివాణ్ణి చేయగలనని నిరూపించింది. ఎందుకిలా చేసింది రాధ! ఏవో కసి పెట్టుకున్నట్లు ఎందు కీ చెల గాటం ఆడింది? తనను పొందే దారేలేని బ్రతుకంతా నిస్సారమనే భావాన్ని బలంగా తనలో ఎందుకు సృష్టించింది? ఏనాటికైనా తా నా భావాన్ని అధిగమించ లేకపోతే ఈ జీవితాన్ని ఎలా కడతేర్చ గలడని!

అయోమయంగా కళ్ళు తెరిచాడు మూర్తి! టేబిల్ మీద పనిమనిషి పెట్టి పోయిన కారియర్ వెక్కిరిస్తోంది. గిన్నెలు విప్పుకున్నాడు. అన్నం చల్లగా బిగంలా తగిలింది. ఏలాంటి వెచ్చ దనమూ లేక గడ్డకట్టుకుపోయిన తన బ్రతుకులాగే! కళ్ళవెంట నీళ్ళు తిరి గాయి మూర్తికి. రాధ ఆకర్షణనుండి బయటపడడం ఎట్లా? లక్ష్మిని ప్రసన్ను రాలిని చేసుకోవడం ఎట్లా? ఈ బాధను ఎవరికి చెప్పుకోవడం? ఒక్కచోట తిని ఒక్కచోట పెరిగిన రాధకే చెప్పుకుంటే ఈ బాధ తీరుతుందా? అంతులేని ఆకర్ష ణను తనలో పెంచగలిగిన ఆవిడకే తన్ను అర్థంచేసుకోగల శక్తికూడా ఉండి ఉండాలి తప్పదు.

తినదమైందనిపించి గబగబా చేతులు కడుక్కున్నాడు. మనస్సును పట్టి విడ వని దిగులుకుమల్లే చేతినిండా జిడ్డు. అట్లా ఓ కాగితమూ కలమూ అందు కున్నాడు మూర్తి.

"రాధా!

ఆశీస్సులు. నువ్వు నాలో సృష్టిం చిన సంఘర్షణకు తట్టుకోలేకే నీ కీ ఉత్తరం వ్రాస్తున్నాను. నువ్వంటే మొదటినుండీ నాకు చాలా యిష్టం. ఇష్ట మంటే ప్రేమ అనికూడా అర్థమా? మనుషుల్ని అంటిపెట్టుకునున్న అనుబంధ వలయంలో ఇష్టమూ ప్రేమా అనే రెండు బిందువులూ ఏ పరిస్థితుల్లో ఒక్కటై, కేంద్రంగా భాసిస్తాయో గుర్తుపట్టే స్తోమత నాకు లేదు రాధా! నిన్ను నా కిస్తానని మామయ్య అన్నప్పుడు నిజంగానే తిరస్కరించాను నేను. ఒకే కంచంలో తిని ఒకచోట తిరిగినవాళ్ళం అవడమే ఆ తిరస్కారానికి కారణమై ఉండవచ్చు. లేదా మరీ కటిక నిజం చెప్పాలంటే, రోజూ కళ్ళముందు మెసిలే నీకంటే అందమైందీ, అధికురాలూ భార్యగా రావచ్చుననే ఆశవల్ల కావచ్చు. ఇంతకూ ఆనాడు నా తిరస్కారం నిన్నేమీ బాధ పెట్టలేదని నాకు తెలుసు. కాని ఆనాడు నాలో పెరిగిన దృఢమైన అభిప్రాయాలు ఇప్పుడు మంచులా కరిగిపోవడానికి ఏమిటి కారణం? నీ మీద చిన్నప్పటి నుండీ ఉన్న ఇష్టం, కేవలం ఇష్టంగానే ఉండిపోకుండా, ఈనాటికి వేరువిధంగా

తిరిగిపోవడం ఎందువల్ల? ఇందుకు కేవలం నాదేకాక నీ బాధ్యతకూడా ఎంత ఉంది రాధా! ఇలా సాహసించి నీకు వ్రాస్తున్నందుకు నన్ను మన్నించు. చిన్నానాడు నీతో కలిసి బతికిన చెలిమి బలిమి నన్నిలా రాయడానికి ప్రోత్సహిస్తున్నది. తప్పుచేసిననాడు మొట్టికాయలు మొట్టి, పెద్దవాళ్ళతో చెప్పి, తన్పించిన కరుకుదనంతోనే ఈ ఉత్తరాన్ని విమర్శించు. నన్ను శిక్షించు. కాని నా హృదయం నీ ముందు విప్పకుండా మాత్రం ఉండలేను.

లక్ష్మి ఎంత అందమైందో, అంత తొందరపాటు మనిషి. ఆవిడ ప్రేమ ఒకప్పుడు ముగ్ధమోహనంగా ఉన్నా మరొకప్పుడు ప్రాణాంతకంగా ఉంటుంది. నా వైపు మరో స్త్రీ కన్నెత్తి చూచినా నేను మరో ఆడమనిషిని వాంఛతో చూచినా ఆవిడ సహించలేదనుకుంటాను. నీవు మర్నాడు వస్తావనగా నాకూ లక్ష్మికీ మధ్య నో వాగ్వాదం రేగింది. ఆ రోజేదో తెలుగు సినిమా చూచి వచ్చాం

'ఉత్త చెత్త సినిమా! హీరో సెంట్ పర్సంటూ దద్దమ్మ' అని అడగకుండానే అభిప్రాయం అందించింది. నేను నిజానికి ఆ సినిమా ఎంతో బాగుందనుకుంటున్నాను. 'అదేం? హీరో కారక్టరైజేషన్ చాలా బాగుందనుకుంటున్నానే!' అన్నాను.

'ఉండదు మరి! మీరూ ఆ హీరో ఒక మూసలో పోసిన వాళ్ళయితే!' అన్నది నవ్వుతూనే. ఆ నవ్వెందుకో నాకసలు అర్థం కాలేదు.

'మాట్లాడరేం? కోపమా! లేకపోతే ఏమిటండీ! భార్యమీద అపోహ కలిగిన మగవాడు ఆ అపోహలో ఉన్న నిజానిజాల్ని తెలుసుకునే ప్రయత్నమన్నా చెయ్యాలి, లేదా దాన్ని నిజంగానే స్వీకరించి అసూయతో మండిపోతూ ఆవిణ్ణి దండించనైనా దండించాలి. అంతేకాని, పోనీలెమ్మని ఆవిడ మానానికి ఆవిణ్ణి వదిలేసి, 'నీ సుఖమే నే కోరుతున్నా!' అని పాడుకుంటూ అడవులూ అఘంతరాలూ తిరుగుతాడా!" అన్నది.

నేనేం మాట్లాడేది?

'మరేమీ అనుకోకుండా ఉంటే నేనో మాట అడుగుతాను. బహుశా ఆ సినిమా హీరోయిన్‌ను నేనే అయితే తర్వాత కథ హీరోగా మీ రెట్లా నడుపుతారు!' అన్నది.

"ఏవిటా దొంకతిరుగుడు ప్రశ్న. నీకసలా కథలో ఉన్న మౌలిక తత్త్వం అర్థంకాలేదు. అందులో హీరో అపోహ పడడమన్న ప్రశ్నేలేదు. వాళ్ళిద్దరూ ఒకరి ప్రాణం ఒకరుగా మెలిగేవాళ్ళు. తాను ప్రేమించిన స్త్రీ, తాను పెళ్ళాడిన స్త్రీ, తానంటే ప్రేమపోయి మరో మగాణ్ణి కోరుకుంటుంటే ప్రేమించిన మగవాడు స్వార్థాన్ని అవతలకు నెట్టి అడ్డు తొలగి

పోవడం దోషమా! అంతమాత్రాన ప్రేమ నశించిపోతుందా! అది కేవలం రెండో మనిషి అభిప్రాయం మారినందు వల్ల రంగులు మార్చుకోదు. ఆ పనే చేశాడు సినిమాలో హీరో," అన్నాను నేను.

"చాల్లెండి! అవతల మనిషి ప్రేమ కూడా తన ప్రేమలా గాఢమైందయితే తప్ప ఇద్దరిమధ్యా ఒకేరకమైన ఆరాధన ఉండదు. తాను ఆరాధిస్తున్న మనిషి మరో మనిషిమీద మోజు నిలిపితే ఇక ఆ ప్రేమకు అర్థం ఏమిటి? అది అక్కడికి నశించిపోవలసిందే. లేదా దానికి ఆశ్రయభూతులైన ఇద్దర్నీ మండించి మసిచెయ్యవలసిందే. ప్రతీకార వాంఛలేని ప్రేమ, ప్రేమ ఎట్లా అనిపించుకుంటుంది? మీరు నిజంగా చెప్పండి. తప్పించుకోవద్దు. మీరే ఆ హీరో అయితే ఏంచేస్తారు?" రెట్టించి అడిగింది.

నేను బెదిరిపోయాను రాధా! భయం భయంగానే తగ్గుస్థాయిలో, "నిజం చెప్పనా! నువ్వు నన్నుకాదని మరొకర్ని కోరుకుంటే నిన్ను నిందించను. దండించను. నా దురదృష్టాన్ని తిట్టుకుంటూ నీ దారికే అడ్డులేకుండా పోతాను"— అన్నాను. 'ఛీ' అన్నంత తీవ్రంగా చూచింది లక్ష్మి. "అయితే నా అభిప్రాయంకూడా వినండి. నన్ను కాదని మీరు మరో వనిత నీడ తొక్కినా నేను సహించలేను. అది మీకు కష్టాన్ని కలిగించినా చలించను. అటువంటి పరిస్థితుల్లో నేను మిమ్మల్ని తిరిగి సంపాదించుకోలేకపోతే నేనే ఉండను," అంటూ విసురుగా సమాధానం చెప్పింది.

ఇది జరిగిన మర్నాడే నువ్వు వచ్చావు రాధా! బహుశా లక్ష్మి మాటల్లోని తీవ్రత ఆవిడ చేతల్లోకూడా ఉంటుందా లేదా అని నిన్ను ఆధారంగా చేసుకుని పరీక్షించాలనుకుని ఉంటాను. కాని ఆ పరీక్ష నాకే వికటించింది. నా చేష్టలకు నీ వైపు నుండి ప్రోద్బలం ఎందుకు వచ్చిందో నేను ఇప్పటికీ ఊహించలేకపోతున్నాను. నిజంగా నా మీద నీకు మమత ఉందని నమ్మమంటావా రాధా! అదే నిజమైతే, ఈ క్షణాన, నేనేం పోగొట్టుకుని దౌర్భాగ్యుణ్ణయ్యానో నీ కెట్లా స్పష్టం చెయ్యగలను? ఒద్దు, అది నిజంకాదని చెప్పు నన్ను క్షమించు. మొన్నటి నా ప్రవర్తనవల్ల నీ మనస్సు కల్లోలపడితే నిజంగానే నన్ను క్షమించు రాధా!

అసలీ ఉత్తరం నీ కెందుకు వ్రాస్తున్నానో నాకే తెలీదు. బహుశా లక్ష్మి అంటే నాకు గాఢమైన ప్రేమ అనే సంగతి నీకు స్పష్టం చేయదలచుకుని ఈ ఉత్తరం మొదలుపెట్టి ఉంటాను. మొన్న నాలుగు రోజులూ నీ పట్ల నా ప్రవర్తన తెచ్చిపెట్టుకున్నదనీ, అందుకో బలమైన కారణం వెనక ఉందని తెలియజేయాలనికూడా ఇలా వ్రాస్తున్నానేమో,




నా కం రాధా! నా జీవన ం. ఆవిడ ఎడబాటును సహించ లేక, ఉపశమనం కోరి నీ కీ ఉత్తరం వ్రాస్తున్నానా? లేక నీ పట్ల ఈ తీవ్రమైన ఆరాధన ఎట్లా పెరిగిందో అర్థంకాక, జవాబు కోరి ఇలా వ్రాస్తున్నానా? అంతా అయోమయంలో పడిపోతున్నాను నేను. నన్ను మన్నించు.

నీ చిన్ననాటి స్నేహితుడు
శ్రీధర్."

మళ్ళీ ఒకసారి చదువుకున్నాడు. ఏమిటీ ఉత్తరం? గుండె ఎవరికోసం అనుక్షణమూ స్పందిస్తూందో, వాళ్ళకు వ్రాయవలసిన పద్ధతి ఇదేనా! కాదు. అయినా ఇంతకంటే ఏం వ్రాయడాని కైనా స్వేచ్ఛలేదన్న విషయం తనకు పూర్తిగా తెలుసు. ఉత్తరం తాపీగా కవరులో పెట్టి మడత అంచుల్ని నాలికతో తడిపి అంటించాడు. ఈ ఉత్తరం లక్ష్మి చూస్తే ఏమంటుంది? ఇల్లు నాలుగు వైపులా బెదురుగా పరకాయించాడు. లక్ష్మి ప్రతిచోటా నిలుచుని ఎర్రబారిన కళ్ళతో, అదురుతున్న పెదాలతో తన్ను జంకిస్తూనే ఉంది. రకరకాలుగా కనిపించే లక్ష్మి రూపాలతో నిండి ఇల్లంతా ఇరుకుగా ఊపిరి పీల్చడానికయినా వీలు లేనట్లుగా అనిపించింది. ఒళ్ళంతా చెమట పట్టి, ఇక భరించలేక చకచకా బయటికి నడిచాడు శ్రీధరమూర్తి.

## 2

ఉత్తరం ఆసాంతం చదువుకుంది రాధ. కళ్ళు నిండి రెప్పల్ని ముంచిన తడి లోపలి పాపల్ని మరీ మిలమిల లాడిస్తోంది. ఈ మూర్తి ఈ నాటికి తన హృదయంలో ఎంత చిత్రంగా చోటు చేసుకున్నాడు. తాను మొదటే ఇతణ్ణి గుర్తించిఉంటే! అప్పుడీ లక్ష్మి ఎవరో! చేతిలో కాగితాలు రెపరెపలాడుతున్నట్లు

మనస్సు అస్థిరంగా ఆలోచనల్తో సత మతమైపోసాగింది. కోపంగా, బిగించిన పెదాలతో, విసురుగా పుట్టింటికి ప్రయాణంకట్టిన లక్ష్మి రూపమే తన్ను వెంటాడసాగింది. బుద్ధిపూర్వకంగా తా నాడే నాటకంయొక్క ప్రధానమే లక్ష్మి ప్రవర్తనకు కారణమని తెలుసు. అయినా తాను లక్ష్మిమీద దయదలచలేక పోయింది. మూర్తిని కనికరించలేక పోయింది. తాను పన్నిన ఆకర్షణ వలయంలోకి గత్యంతరంలేక చేరిన ఈగలా మూర్తి కొట్టుకుంటుంటే తాను తమాషా చూచింది. ఎందుకని? అతను చిన్ననాడు తన్ను కాదన్నాడన్న కించ తన అంతరాంతరాల్లో ఎక్కడో దాగి ఉందా? అయినా తన భ్రమకాని ఈ మూర్తి ఏమవుతాడు తనకు! అతన్ని తను ప్రేమిస్తుందా! ఎందుకంత పట్టు దలతో అతన్ని వెంటాడింది? చిన్న నాటి చెలిమి నెపంతో కళ్ళతో కవ్వించింది. మాటలు పెదవిదాటి రానీయకుండానే భారతమంత అర్థాన్ని మూగ భాషలో స్పష్టంగా చాటింది. తన ఆకర్షణకు ఏ దారీ దొరకకుండా లొంగిపోయే మూర్తిని, తా నెందుకు జాలిదలచలేక పోయింది? ఏం చేస్తే మాత్రం తనవాడవుతాడా ఈ మూర్తి! ఆ మాత్రం ఇంగితం లేకపోయింది తనకు. ఇంత చేసినా చివరకు జరిగిందేమిటి? లక్ష్మిని పరీక్షించాలన్న అతని ఊహకు, తాను కేవలం ఒక సాధనం మాత్రమే కాగలిగింది.

రాధ గుండెనిండా అశాంతి పెరిగి కన్నీరు, మూసిన రెప్పలనుండి ముత్యాల్లా కిందికి జారసాగింది. వెచ్చగా బుగ్గలమీదికి జారుతున్న ఆ స్పర్శ ప్రియుడి హస్త స్పర్శలా ఉప శమనం కలిగిస్తోంది. ఇది ఆరకుండా అలానే ఉండిపోతే!

ఒక్క క్షణంపాటు ఊగిసలాడిన హృదయాన్ని చిక్కబట్టుకుంది. మూర్తి కేవలం తన మేనబావ మాత్రమే. తమ యిద్దరికీ మధ్య మిగలవలసింది కేవలం చిన్ననాటి స్నేహం మాత్రమే. మనస్సును ఇష్టం వచ్చినట్లు ఆడనిచ్చి, సాంసారిక బంధాలను శిథిలం చేయడం తాను చేయవలసిన పనికాదు. దృఢమైన నిశ్చయంతో, భర్తమీద అలిగి పుట్టింటికి పారిపోయిన లక్ష్మికి ఉత్తరం రాయడానికి పూనుకున్నది.

## 3

అప్పుడే వరండాలోకి వచ్చింది లక్ష్మి. ఆ వేళకు అక్కడ కనీసం ఒక అరగంటసేపన్నా నిలబడడం దిన చర్యలో భాగంగా మారిపోయింది. తాను వచ్చి మూడు నెలలు దాటినా మూర్తి నుండి ఉత్తరంలేదు. రాధ ఊరికి వెళ్ళి పోయి ఉండవచ్చు. తన కాపురంలో చిచ్చుపెట్టిన రాధ! అంత అందమైన అమ్మాయి ఆంతర్యంలో అల్పత్వం ఎలా

చోటుచేసుకుందో! స్వపర భేదం లేకుండా, అన్నీ మనవే అనుకునేవారికి ఎవరేం చెప్పగలరని! మానవత్వపు కనీస ధర్మాలనన్నా పాటించనివారికి సలహాలు పనికిరావు. లక్ష్మికి రాధమీద కంటే మూర్తిమీద కక్ష పెరిగిపో సాగింది. ఈ సకల సృష్టిలో తనదీ అని చెప్పుకోగల సజీవ వస్తువు మూర్తి ఒక్కడే. ప్రసిద్ధిచెందిన దేవాలయం లోని దైవంకంటే అతడు తనకు ఎక్కువ. తన ఒక్కదానికే సొంత మనుకున్న పెన్నిధిమీద మరొకరికి ఎటువంటి హక్కయినా ఉండడాన్ని తా నెలా సహించగలదు? ఈ అభిప్రా యాన్ని మూర్తికి తాను రకరకాలుగా వ్యక్తంచేసింది. కాని వాటికి ఏ విలువా ఇవ్వకుండా, రాధవైపుకు తిరిగిపోయిన ఆయన్ని ఏమనాలో, ఎలా సాధించాలో తనకు తెలియడంలేదు. ఆవేశంతో, కక్షతో, ప్రతీకార వాంఛతో, ఎదుట నిలిచి ఏమీ చెయ్యలేనన్న నిస్సహాయ తతో, ఇక్కడికి వచ్చేసిందిగాని, అందు వల్ల ఏం తీరినట్లు? ఒక్క విషయం మాత్రం పూర్తిగా తన అనుభవంలోకి వస్తున్నది. మూర్తిని, తన అభిమానం దెబ్బతికుండా, తనవైపుకు మళ్ళించు కునే దారి కనబడడంలేదు. ఆలోచించిన కొద్దీ తా నెంత చేతగానిదో తెలిసి వస్తు న్నది. తెలిసినకొద్దీ చెప్పలేని నీరసం తన్ను చుట్టుకుంటూ తన బ్రతుకు సార్థ క్యాన్నే ప్రశ్నిస్తూంది.

ఎదురు చూస్తున్నందుకు ఫలితంగా పోస్టువాడు ఓ ఉత్తరం అందించాడు. పైనరాత మూర్తిదికాదు. ఎవరిదీ ఉత్తరం! "ప్రియమైన లక్ష్మి!"

దెబ్బతిన్నట్లైంది. రాధ ఉత్తరం! తన జీవితంలో చిచ్చుపెట్టిన రాధ! అసహ్యం మనస్సును కుదిపేసింది. ఏం వ్రాస్తుంది? నీ మొగుణ్ణి నీక్కాకుండా చేశాను చూశావా అంటూ విజయగర్వం వలక బోస్తుందా? కాస్సేపు ఆ ఉత్తరం చదవ కూడదనే అనుకుంది లక్ష్మి. కాని ఎలా? మూర్తిని గురించి ఏం వ్రాస్తుందో! అయినా చేతికొచ్చిన ఉత్తరాన్ని ఎంత కసిఉంటే మాత్రం చదవకుండా ఎవరు ముక్కలు చేస్తారు?

ప్రియమైన లక్ష్మి!

కొన్నాళ్ళపాటు నీ మనస్సును క్షోభ పెట్టిన రాధనే ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. మొదటినుండీ నీ భర్తమీద నాకు మోజు లేదు. ఉంటే, అతడు నీ జీవితంలో ప్రవేశించే వీలుండేదంటావా? అతడు నాకు బాల్య స్నేహితుడు. నా మేనబావ. మా యిద్దరిమధ్యా ఉన్న అనుబంధం ఆ హద్దుల్ని ఎప్పుడైనా దాటుతుందని ఎందుకనుకున్నావో నువ్వు.

నీకు అతడే లోకం. నిజమే. అతని క్కూడా నువ్వే నాదీ అనిపించుకోగల సజీవ వస్తువువు. ఈ అనుబంధం ఏ ఆలు మగల మధ్యనైనా ఉండవలసిందే. కాని నీకు తెలీకుండానే నీ భర్తకు చిరాకు

తెప్పించే స్వార్థబుద్ధిని పెంచుకుంటు న్నావు. పిచ్చిదానా! ఆత్మార్పణవల్ల, అనల్పమైన ఆకర్షణ వల్ల, మగవాడిని నీ చుట్టూ తిప్పుకోగలగాలిగాని అరిచీ పోట్లాడీ కాదు. ఆ విష యాన్ని నీకు రుజువుచెయ్యాలనే నీపట్ల నిష్కారుణంగా ప్రవర్తించవలసి వచ్చింది. నీ మీద చిరాకు తెచ్చుకుని, తిరుగుబాటు చెయ్యాలనుకున్న మూర్తి, నన్ను సాధ నంగా వాడుకుందామనుకుని నా చేతుల్లో పూర్తిగా ఓడిపోయాడనుకున్నాను. కాని నిన్న అతనిదగ్గరనుండి వచ్చిన ఉత్తరం చూశాక అతని ఓటమి తాత్కా లికమైందేనని గ్రహించగలిగాను. లక్ష్మీ! నువ్వతని జీవితానివీ, జీవిత ధ్యేయానివిన్నీ. ఇప్పటికీ ఎప్పటికీ అతనికి నీపట్ల ఉన్న ఈ భావం మారకుండా ఉండడానికి ప్రయత్నించు. నీ స్వార్థాన్ని కొంత తగ్గించుకో. ఇలా చెప్తున్నందుకు నామీద కోపం తెచ్చు కోకు. మీ ఇద్దరి మధ్యా అనుబంధం దృఢంగా ఉండాలని సర్వదా కాంక్షించే నీ సోదరి,

రాధ."

ఉత్తరం పూర్తిచేశాక కూడా, లక్ష్మికి రాధమీద ఇదివరకేర్పడ్డ భావాలలో పెద్దగా ఏ మార్పూ కలగలేదు. ఆవిడ ఊహల్లో ఎక్కడా రాధకు చెప్పుకోదగ్గ ఎటువంటి స్థానమూ కనిపించలేదు. అవన్నీ కేవలం మూర్తి చుట్టూ సాలె గూడుకుమల్లే అల్లుకుపోసాగినయ్. మూర్తి అందరికి మల్లే ఉత్త మగవాడు పురుష సహజమైన బలహీనతలకు లొంగిపోవడం, పెద్ద అపరాధం కాదు కాబోలు. తానే తన దృక్పథం మార్చు కోవాలి. లేకపోతే ఈ వివాదాలు, వియో గాలూ తానింక ఏ మాత్రమూ భరించే స్థితిలో లేదు. ఏ జీవితానికయినా రాజీ పడవలసిన అవసరం రావచ్చు. తనవా డనుకున్న మూర్తితో రాజీపడడంలో చిన్నతన మేముంది? ఇక వెయ్యిమంది రాధలు వచ్చినా తమ ఇద్దరి మధ్యా కలతలు సృష్టించలేరని తాను నిరూ పిస్తుంది. ఇక ఒక్కనాటికీ తాను మూర్తిని విడిచిపెట్టి అభిమానంతో ఎక్కడికీ పరిగెత్తిపోదు – ఈ ఊహతో లక్ష్మి మనస్సు తేలికపడింది. ఇన్నా ళ్ళుగా అణచిపెట్టబడ్డ ప్రేమ పొంగి మనసంతా పరవశింప సాగింది. కాగి తమూ కలమూ వెతుక్కోడానికి, ఇంట్లోకి ఇంచుమించు పరుగులు పెడుతున్నట్లే నడిచింది లక్ష్మి.

## 4

మరీ వారం రోజులనుండీ రాధను తలచుకోకుండా, ఒక్కక్షణం గడవడం లేదు మూర్తికి. మంచంమీద వెల్లికిలా పడుకుని ఇంటికప్పువేపు నిరాసక్తంగా చూస్తున్నాడు. రాధకు తను ఉత్తరం వ్రాసి వారం రోజులైంది. అయినా ఆవిడ జవాబెందుకు వ్రాస్తుంది? అసలే




మని వ్రాస్తుందని: సరిగ్గా నీలాగే నేనూ నీ ధ్యాసతో కాలాన్ని నిర్దాక్షిణ్యంగా చంపుతున్నానని వ్రాస్తుందా: నిజంగానే ఆ ఒక్కమాట రాధ రాయగలిగితే, ఇక నీ ప్రపంచంలో తాను కోరదగ్గ దేముందని: వెర్రితనం: రాధను మనసారా తనతో మాట్లాడించగల శక్తి ఏదీ తనకున్నట్లు లేదు. అట్లాగే లక్ష్మిపట్టుదల విడగొట్టే సాధనం కూడా తనదగ్గర లేదు. ఉందేమోనని సమాధానపడబోయేంతలోగా గుండెలో పీటవెట్టుకుని కూర్చున్న రాధ బొమ్మ పగలబడి నవ్వుతున్నట్లు అనుభూతి కలుగుతోంది. అది ప్రాణాల్ని కడబట్టించే నవ్వు: తన జీవితంతో నిర్దాక్షిణ్యంగా ఆడుకునే నవ్వు: ఆ రాధను కొనవేలితో తాకనైనా తాకే ధైర్యం లేదు తనకు, జీవితమనే పెద్ద కలలో చిక్కుకుని, తన్నుకుంటున్న చేపలాంటి వాడు తను. తన చేతగానితనం నరనరాల్లోనూ అనుక్షణమూ నీరసాన్ని నింపుతోంది.

మనస్సులో దిగులు సన్నగా కురుస్తున్నట్లు బయట వాన మొదలైంది. తన మంచం పక్కనున్న కిటికీనుంచి గాలి, చినుకుల్ని తెరలు తెరలుగా మోసుకొచ్చి మీద చిలకరిస్తోంది. మంచం మీదనుండి లేవాలనిగానీ, కిటికీ ముయ్యాలనిగానీ అనిపించడం లేదు. అట్లాగే తడుస్తూ, తడిసిన మనస్సు బరువుకు కుంగిపోతూ, కళ్ళు గట్టిగా మూసుకున్నాడు మూర్తి. రెండు కళ్ళ మధ్యా రెండు బొమ్మలు మార్చి మార్చి చండప్రచండంగా కదను తొక్కుతున్నయ్ ఈ రెంటిలో ఏది బల

మైందో, దేనికి ఆ క్షణాన ఆకర్షణ ఎక్కువగా ఉందో మూర్తికి తెలుసు. తన దేహంలోనూ, ప్రాణంలోనూ అంతర్గతంగా ఉన్న లయ ఏ పేరుతో సరి నడకలు నడుస్తున్నదో ఖచ్చితంగా తెలుసు.

పోస్ట్ అన్న కేకతోపాటు, ఓ ఉత్తరం మంచం దగ్గరికి విసురుగా వచ్చి పడ్డది. మూర్తి గుండె ఆ చప్పుడుతో జత కలుపుతూ, ఒక్కసారిగా ఉవ్వెత్తుగా లేచిన కెరటానికిమల్లే మిడిసిపడ్డట్లయింది. గుండె నిండా ధ్వనించే రాధ, రాధ అనే శబ్దం తన చెవులకే వింతగా వినిపించసాగింది. రాధ మీద ఇంత ఆరాధనేమిటి? అయినా దీనికి ఫలితమేమిటి? ఈ జన్మలో తీరడానికి వీలులేని కాంక్ష పేరుకుని అశాంతిని కలిగించడం తప్ప!— ఉత్తరాన్ని ప్రియురాల్ని తీసుకున్నంత మెత్తగా చేతుల్లోకి తీసుకున్నాడు. ఎన్నాళ్ళనుండో ఎదురుచూస్తున్నాడు దీనికోసం! ఏమని రాస్తుంది రాధ!

కాని, కాని, పైన దస్తూరీ రాధది కాదు. లక్ష్మిది. తన లక్ష్మిదే! చిత్రంగా గుండెలో వెనకటి ఆరాటం క్రమంగా తగ్గిపోనారంభించింది. మనస్సులో ఇంతవరకూ ఎగసిపడే మంటలు ఆరిపోతూ, క్రమంగా చల్లదనం చోటుచేసుకోసాగింది గాలివాన వెలిశాక తేరుకునే పెద్ద చెరువుకు మల్లే హృదయమంతా క్రమంగా, శాంతంగా మారిపోసాగింది. ఈ ప్రశాంతి మూర్తికి రుచించకపోయినా చెయ్యదగ్గ దేమీలేదు తీరని కోరికవల్ల తపనతో ఎంత ఆరాటపడినా తాను ఒక్క సత్యాన్ని కాదనడానికి వీలు లేదు. రాధకూ తనకూ మధ్యనున్న దూరం మరో జన్మ. ఈజన్మలో ఇద్దరూ ఎన్నటికీ కలవలేని రైలుపట్టాలు. నిప్పులాంటి ఈ నిజం మనస్సును కాలుస్తుండగా గుండె చిక్కబట్టుకుని, పెదవులు బిగించి, ఏ విధమైన చాంచల్యమూ చేరకుండా ఉండేట్లు విశ్వప్రయత్నం చేస్తూ ఉత్తరం విప్పాడు మూర్తి.

అక్షరాల వెంబడి చూపులు వేగంగా పరిగెత్తుతున్నకొద్దీ మూడు నెల్లనుండీ పేరుకున్న దిగులు పొరలు విరిసి మూర్తి కళ్ళు స్వచ్ఛంగా మెరవసాగాయి.





షెహరజాద్ ఒక రాత్రి షారియార్ రాజుకు కొత్త కథ ప్రారంభించి చెప్పసాగింది.

పురాతనకాలంలో దానియెల్ అనే గ్రీకు విజ్ఞాని ఉండేవాడు. ఆయనవద్ద అనేకమంది శిష్యులు చదువుకుని జ్ఞాన సంపన్నులయారు. ఆయనవద్ద అసంఖ్యాకమైన జ్ఞానగ్రంథాలుండేవి. అయితే వాటిని అందిపుచ్చుకోవటానికి ఆయనకు పిల్లలు లేరు. సంతానప్రాప్తికి మరొక మార్గమేమీ కనిపించక ఆయన సర్వేశ్వరుణ్ణి ప్రార్థించాడు. సర్వేశ్వరుడు ఆయన మొర ఆలకించి ఆయన భార్య గర్భవతి అయేటట్టు అనుగ్రహించాడు.

తన భార్యకు నెలలు నిండుతూ ఉండగా, అప్పటికే వార్థక్యం పైనబడిన ఆ మహాజ్ఞాని తనకు మరణం ఆసన్నమయిందని గ్రహించి, తనకు కొడుకే కలిగినప్పటికీ, వాడికి తన గ్రంథాలతో అవసరం కలిగేనాటికి అవి వాడికి దక్కుతాయని నమ్మలేకపోయాడు. అందుచేత ఆయన తాను సంపాదించిన విజ్ఞానాన్నంతా కుదించి, అయిదువేల గ్రంథాల సారాన్ని అయిదు కాగితాలమీదికి ఎక్కించాడు. తాను రాసినది చదివి చూచుకున్నమీదట ఆయనకు అదికూడా ఎక్కువే ననిపించింది. ఆయన ఒక నెలపాటు దీర్ఘంగా ఆలోచించి, అవసరమైనది ఒక చిన్న కాగితంమీదరాసి, తనవద్దఉన్న గ్రంథాలన్నిటినీ, ఇతరులకు దొరకకుండా, సముద్రంలో పారేసి, ఆ చిన్నకాగితం మాత్రం ఉంచుకున్నాడు.

తన ఆఖరు ఘడియ సమీపించినట్టు గ్రహించి, ఆ మహాజ్ఞాని గర్భిణిగాఉన్న

తన భార్యతో, "నాకు కాలం తీరి పోయింది. దేవుడు మనకు ప్రసాదించిన బిడ్డను చూసుకునే యోగం నాకు లేదు. వాడికి నేనిచ్చే ఆస్తి ఈ కాగితం మాత్రమే. తన తండ్రి ఆస్తిని వాడు కోరినప్పుడు మాత్రమే దీన్ని వాడికి ఇయ్యి. వాడికి చదవటమూ, చదివినది గ్రహించటమూ చేతనయే పక్షంలో మహా జ్ఞాని అవుతాడు. వాడికి హాసిబ్ అని పేరు పెట్టాలని నా కోరిక," అని చెప్పి ప్రాణాలు వదిలాడు.

ఆయన శవాన్ని కాటికి చేర్చేటప్పుడు ఆయన శిష్యులూ, నగర పౌరులూ వెంట వెళ్ళారు. ఆయనకోసం విరివిగా అశ్రు తర్పణ జరిగింది.

ఇది జరిగిన కొద్దిరోజులకు దానియెల్ భార్యకు మగపిల్లవాడు కలిగాడు. తండ్రి కోరికను అనుసరించి వాడికి హాసిబ్ అని నామకరణం చేశారు. వాడి తల్లి జ్యోతిష్కులను పిలిపించి, వాడి జాతకం చెప్పమన్నది. వాళ్ళు గ్రహగతులను గుణించి, "అమ్మా, నీ కొడుక్కు యౌవనదశలో గండం ఉన్నది. దాన్ని తప్పించుకుంటే దీర్ఘాయువౌతాడు; గొప్ప జ్ఞానమూ, ఐశ్వర్యమూ సంపాదిస్తాడు," అని చెప్పారు.

వాడికి అయిదేళ్ళు నిండగానే వాడి తల్లి వాణ్ణి చదువులో పెట్టింది. కాని వాడికి చదువంటలేదు. ఆమె వాణ్ణి బడి మాన్పించి, ఏదన్నా వృత్తిలో పెట్టాలని చూసింది. అయితే వాడికి ఏ పనీ చెయ్యా బుద్ధిపుట్టలేదు. ఒక్క అక్షరంముక్క రాకుండా, ఒక్క చిల్లిగవ్వ ఆర్జించకుండా హాసిబ్ పదిహేనేళ్ళ వాడయాడు. వాడి తల్లి ఏడ్చింది.

"పెళ్ళాం గుదిబండ మెడకు కట్టితేనే గాని వాడికి పని చెయ్యాలనిపించదు. పెళ్ళాంకోసం చచ్చినట్టు ఏదో ఒకటి చేస్తాడు," అని ఇరుగు పొరుగువాళ్ళు చెప్పారు.

ఆమె తనకు తెలిసినవాళ్ళ పిల్లల్లో తగినదాన్ని చూసి హాసిబ్‌కు ముడిపెట్టింది. జోడు బాగానే కుదిరింది. వాడు భార్యను ఉపేక్ష చెయ్యలేదు, కాని పని కూడా చెయ్యలేదు.

వాళ్ళ ఇరుగు పొరుగుల కొందరు కట్టెలుకొట్టేవాళ్ళుండేవాళ్లు. వాళ్లు ఒకనాడు హాసిబ్ తల్లితో, "ఏమమ్మా, నీ కొడుక్కు ఒక గాడిదా, తాళ్ళూ, గొడ్డలీ కొని ఇయ్యి. అతను మా వెంట కొండమీదికి వచ్చి, మాతోపాటు కట్టెలు కొడతాడు. మాకు వచ్చే డబ్బులో అతనికూడా భాగం ఇస్తాం. దానితో కొంతవరకు ఇల్లూ, సంసారమూ జరిగిపోతుంది," అన్నారు.

హాసిబ్ తల్లి సంతోషించి, తన కొడుకుకోసం ఒక గాడిదా, కొన్ని తాళ్ళూ, ఒక గొడ్డలీ కొని, తన కొడుకును భద్రంగా చూడమని కట్టెలుకొట్టే వాళ్ళతో చెప్పింది.

''నువేమీ బెంగపెట్టుకోకు. మా దాని యెల్‌గా రబ్బాయికాడా? వెయ్యి కళ్లతో కనిపెట్టి ఉంటాం,'' అన్నారు వాళ్ళు.

వాళ్ళు హాసిబ్‌ను తమ వెంట కొండకు తీసుకుపోయి, అతనికి కట్టెలు ఎలా కొట్టాలో, వాటిని గాడిదమీద ఎలా ఎక్కించాలో నేర్పారు. త్వరలోనే హాసిబ్‌కు ఈ పని అంటే చాలా ఇష్టం పుట్టుకొచ్చింది. ఎందుకంటే, ఈ పనిలో తిప్పతిరుగుడున్నది, తల్లినీ, పెళ్ళాన్నీ పోషించే సదుపాయమూ ఉన్నది.

ఒకరోజు అందరూ కలిసి కొండ చరియలో కట్టెలు కొట్టుతూండగా అకస్మాత్తుగా ఉరుములతోసహా గాలివాన వచ్చింది అందరూ వెళ్ళి, దగ్గరలో ఉన్న ఒక గుహలో దూరారు. అక్కడ వాళ్లు నిప్పుచేసి చలిమంటచేసి, అందరికన్న కుర్రవాడైన హాసిబ్‌ను చితుకులు కొట్టమన్నారు.

హాసిబ్ గుహ లోపలిభాగంలోచేరి కట్టెలు పేళ్లు చేస్తూండగా, అతని గొడ్డలికి ఏదో తగిలి ఖంగుమని చప్పుడయింది. అక్కడ అతను తవ్వి చూసేసరికి ఒక పురాతనపు చలవరాతిపలక కనబడింది. హాసిబ్ తన అనుచరులను పిలిచాడు. వాళ్ళంతా వచ్చి, చూసి, అందరూ పట్టి ఆ పలకను పైకి తీశారు.

రాతిపలక దిగువన లోతైన గుంట ఉన్నది. విశాలంగా ఉన్న ఆ గోతిలో అనేకమైన జాడీలు పేర్చిఉన్నాయి. వెంటనే వాళ్ళు హాసిబ్‌ను తాళ్ళ సహాయంతో ఆ గోతిలోకి దింపారు. హాసిబ్ కిందికిదిగి, ఆ జాడీలలో ఏమున్నదీ తెలుసుకోవటానికి, ఒక జాడీ పైభాగాన్ని తన గొడ్డలితో కొట్టాడు. కూజాలోనుంచి తేనె బయటికి కారటం మొదలుపెట్టింది.

జాడీలలో ఉన్నది తేనె అని హాసిబ్ చెప్పేసరికి మిగిలిన కట్టెలుకొట్టేవాళ్ళకు కొంచెం ఆశాభంగమయింది. అందులో ఏవో నిధులుంటాయని వాళ్ళు ఆశపడ్డారు. అయినా, ఆ తేనెజాడీలన్నీ అమ్మితే చాలా డబ్బు వస్తుంది. అందుచేత, హాసిబ్‌చేత ఒక్కొక్క జాడీకి తాడు కట్టించి, జాడీ లన్నిటినీ వాళ్ళు పైకి లాగేశారు. హాసిబ్‌కు రాబడిలో వాటా ఇయ్యవలసి వస్తుందని, వాళ్లు అతన్ని ఆ గోతిలోనే వదిలి, జాడీలను తమ గాడిదలమీద ఎక్కించుకుని, నగరానికి తిరిగిపోతూ, "ఎందుకూ పనికిరాని వెధవ! వాణ్ణి ఆ గుంటలోనే చావనీ!'' అనుకున్నారు.

వాళ్ళు గాడిదలను అంగళ్ళకు తోలుకుపోయి, తమలో ఒకణ్ణి హాసిబ్ తల్లివద్దకు పంపారు. వాడు ఆమెతో, "మేం కొండమీద ఉండగా గాలివానకు మీవాడి గాడిద బెదిరి పారిపోయింది. మేమందరమూ గుహలో తలదాచుకుంటే, మీ అబ్బాయి గాడిదవెంట పరిగెత్తాడు. దురదృష్టవశాన ఒక తోడేలు వాడిమీద దూకి చంపేసింది. మాకు

కనిపించినవి కొద్ది రక్తపు మరకలూ, కొన్ని ఎముకలూ మాత్రమే," అని చెప్పాడు.

హాసిబ్ తల్లీ, పెళ్ళామూ పెద్దపెట్టున శోకాలు పెట్టారు

కట్టెలుకొట్టేవాళ్లు తేనె అంతా మంచి ధరకు అమ్మి, డబ్బు పంచుకుని, తలా ఒక దుకాణమూ పెట్టుకుని సుఖంగా తింటూ, తాగుతూ కాలక్షేపం చేయ సాగారు.

ఈ లోపల, గోతిలో చిక్కుకు పోయిన హాసిబ్, తన అనుచరులు తనని పైకిలాగే ఉద్దేశంతో లేరని గ్రహించి, వాళ్ళను గట్టిగా పిలిచాడు, వేడు కున్నాడు; పైకి ఎక్కిరావటానికి పట్టు దొరుకుతుందేమోనని, గోతిచుట్టూ ఉన్న గోడలలో గొడ్డలితో గుంటలు కొట్టటానికి ప్రయత్నించాడు. కాని చుట్టూ ఉన్నది గట్టి రాయి కావటంచేత ఆ పని సాధ్యం కాలేదు అతడు హతాశుడైపోయి తనకు ఆ గోతిలో చావు తప్పదనుకుంటూండగా, ఒక రాతినెర్రెలోనుంచి పెద్ద మండ్ర గబ్బ అతనికేసి వచ్చింది. అతను దాన్ని గొడ్డలితో ఒక పెట్టుపెట్టి చంపేశాడు.

అతను ఆ నెర్రెను పరీక్షించి చూసే సరికి అవతలనుంచి వెలుగు కనిపించింది. అతను ఆ నెర్రెలో గొడ్డలిదూర్చి బలంగా పైకి గుంజేసరికి, రాతి తలుపు పైకి లేవ నారంభించింది. తాను దూరేపాటి కంత ఏర్పడినదాకా అతను ఆ రాతి తలుపును పైకి ఎత్తి, సంకోచించకుండా దూరి అవతలికి చేరాడు.

అతనిప్పుడు చేరినది భూగర్భంలో ఉన్న సొరంగం. అతను దాని వెంబడి ఒక గంటసేపు నడిచినమీదట ఒక పెద్ద ఇనుపతలుపు గల ద్వారమూ, దానికి వేసిఉన్న వెండి తాళమూ, బంగారు తాళ కనిపించాయి. ఆ తలుపులు తెరిచి అతను ఆరుబయలులోకి వచ్చాడు

ఒకపక్క పచ్చలకొండ ఉన్నది. దాని దిగువన ఒక కోనేరున్నది. కోనేరు గట్టున ఒక బంగారు సింహాసనం ఉన్నది. దానిలోని రత్నాలు ధగధగా మెరుస్తున్నాయి. దాని చుట్టూ పన్నెండు వేల ఆసనాలున్నాయి. అవి బంగారం తోనూ, వెండితోనూ, స్ఫటికంతోనూ, పచ్చలతోనూ, దంతంతోనూ, చందనపు కర్రతోనూ చేసినవి అతను వెళ్ళి సింహాసనంలో కూర్చుని కోనేరు అందమూ, పచ్చలకొండ అందమూ తిలకించసాగాడు.

కొద్దిసేపటికి అతనికి మేళతాళాలతో సంగీతం వినిపించింది. పచ్చలకొండ పార్శ్వం చుట్టి కొందరు వస్తూండటం కనిపించింది వాళ్ళు నడుస్తున్నట్టు అత నికి అనిపించలేదు. జారుతూ వస్తున్నట్టు కనిపించారు. చాలా దూరంగా ఉండటం చేత వాళ్ళ ఆకారాలు అతనికి సరిగా తెలియరాలేదు కాని వాళ్ళు దగ్గిరికి వచ్చినాక, వాళ్ళందరూ అపురూప



సౌందర్యంగల స్త్రీలనీ, అయితే వాళ్ళ దిగువ భాగాలు పాముల్లాగున్నాయనీ అతను తెలుసుకున్నాడు. వారి కంఠ స్వరాలు చాలా మధురంగా ఉన్నాయి. వాళ్ళు గ్రీకుభాషలో ఎవరో రాణికి సంకీర్తనలు పాడుతున్నారు. ఆ రాణిమాత్రం కనిపించలేదు.

ఇంతలో కొండ పార్శ్వం వెనకనుంచి నలుగురు స్త్రీలు ఒక విశాలమైన బంగారు పళ్ళాన్ని తమ చేతులమీద ఎత్తి పట్టుకుని వచ్చారు. ఆ పళ్లెంమీద రాణి చిరునవ్వులు నవ్వుతూ కూర్చుని ఉన్నది. వాళ్ళు సింహాసనంకేసి వస్తూండటం చూసి హాసిబ్ చప్పున లేచాడు. నాగ స్త్రీలు తమ రాణిని ఆ సింహాసనంమీద కూర్చోబెట్టి, ఆమె దుస్తులు చక్కదిద్ది, ఆమె వెనకగా నిలబడ్డారు. మిగిలిన నాగస్త్రీలందరూ తలా ఒక ఆసనాన్ని అలంకరించారు. రాణి అతి శ్రావ్యమైన కంఠంతో గ్రీకుభాషలో ప్రసంగించింది. తరవాత అందరూ కలిసి ఆమెకు స్తోత్ర గీతంపాడి, తిరిగి తమ ఆసనాలలో కూర్చున్నారు.

ఈ తంతు ముగిసినాక రాణి హాసిబ్ కేసి చూసి, అతన్ని దగ్గిరికి రమ్మని సైగ చేసింది. కొంచెం తొట్రుపడుతూ అతడు సింహాసనాన్ని సమీపించాడు.

రాణి అతన్ని కూర్చోమని, "పాతాళానికివచ్చిన నీకు స్వాగతం. నీ అదృష్టం కొద్దీ నువు ఇక్కడికి రాగలిగావు. నీకేమీ భయంలేదు. నీ పేరేమిటి? నను రాణీ యమ్లికను. ఈ నాగస్త్రీలందరూ నా ప్రజ. నువు ఎవరో, ఇక్కడికి ఎలా వచ్చావో చెప్పు. ఇది చలికాలం నేనుండే చోటు. నా వేసవి నివాసం కాఫ్ పర్వతం," అన్నది.

హాసిబ్ ఆమెకు ప్రణామంచేసి ఆమెకు కుడిపక్కన ఉన్న పచ్చల

కుర్చీలో కూర్చున్నాడు. అతను ఆమెతో ఇలా అన్నాడు :

"నా పేరు హాసిబ్. దానియెల్‌గారి కుమారుణ్ణి. ఆ మహాజ్ఞాని గతించారు. నాకు గొప్ప వ్యాపారిని కావటానికీ, మహా పండితుణ్ణి కావటానికీ అవకాశం ఉండికూడా, కట్టెలుకొట్టి జీవించటంతో సంతృప్తిచెందాను. ఎందుకంటే, ఆ వృత్తిలో కొండలలోనూ, అడవులలోనూ తిరుగుతూ స్వచ్ఛమైన గాలి పీల్చవచ్చు. నా మతం ఏమిటంటే, చచ్చినాక ఎలాగూ మూసిపెడతారు బతికుండగా నాలుగు గోడలమధ్య కుమలటం దేనికని?"

తరవాత అతను తన ఆఖరు అనుభవమూ, తాను ఆ ప్రాంతానికి ఎలా వచ్చినదీ రాణికి వివరంగా తెలిపాడు.

అతని కథ విని రాణీ యమ్లిక చాలా సంతోషించి, "హాసిబ్, నువు ఎప్పుడనగా భోజనంచేశావో, నీకు బాగా ఆకలవుతూండాలి." అని తన స్త్రీలలో ఒకతెకు సంజ్ఞచేసింది. ఆ స్త్రీ ఒక బంగారుపాత్రలో ద్రాక్షపళ్ళూ, దానిమ్మపళ్ళూ, ఆపిల్‌పళ్లూ, రకరకాల పప్పులూ, తాజా అత్తిపళ్ళూ, అరటిపళ్లూ తెచ్చింది.

వాటిని అతను కడుపునిండా తిని తృప్తిచెందిన తరవాత రాణి అతనితో, "హాసిబ్, నువు మా లోకంలో ఉన్నంత కాలమూ నీకు ఎలాటి హానీ కలగదని నమ్ము. నువు మా వెంట ఒక వారం, పదిరోజులు ఉండగోరేటట్టుంటే నీకు కాలక్షేపం కలగటానికి ఒక కథ చెబుతాను. నువు మీ లోకానికి తిరిగి వెళ్ళినప్పుడు నీ కది ఉపకరిస్తుంది," అన్నది.

ఇలా అని ఆమె హాసిబ్‌కూ, తన పన్నెండువేలమంది నాగస్త్రీలకూ ఈ విధంగా చెప్పింది.

## బులూకియ కథ

ఒకప్పుడు బనూ ఇస్రాయిల్ దేశంలో జ్ఞాని అయిన రాజు ఉండేవాడు. ఆయన మరణశయ్యపై ఉండి, యువరాజైన తన కుమారుణ్ణి పిలిచి, "నాయనా, బులూకియా, నా స్థానంలో నువు రాజువు కాగానే రాజభవనంలోని ప్రతి వస్తువూ జాబితా వేసి, ఎంత స్వల్ప విషయాన్నికూడా ఉపేక్షించకుండా చూచుకో," అన్నాడు.

యువకుడైన బులూకియ తాను రాజు కాగానే తన తండ్రితాలూకు సమస్త వస్తువులూ, సంపదలూ తణిఖీ చేశాడు. రాజభవనంలోని గదులన్నీ తిరిగి, అందులో చేర్చిఉంచిన సంపదనంతా పరీక్షించాడు. ఇలా గదులన్నీ తిరుగుతూ అతను ఒక మారుమూల గదికి వచ్చాడు. అది రహస్యమైన గది. ఆ గది మధ్య ఒక చిన్న స్తంభం ఉన్నది. దానిపైన నల్లకర్రతో చేసిన పెట్టె ఒకటి ఉన్నది. దాన్ని తెరిస్తే, లోపల ఒక బంగారుపెట్టె ఉన్నది. అందులో ఒక కాగితంచుట్ట



ఉన్నది. అందులో గ్రీకుభాషలో ఇలా రాసి ఉన్నది.

"సప్త సముద్రద్వీపంలో జననం పొందిఉన్న ప్రవక్త సులేమాన్ ధరించిన ఉంగరం సంపాదించినవాడు మనుషులకూ, భూతాలకూ, పశుపక్షులకూ అధిపతి కాగలడు. ఆ ఉంగరాన్ని మానవ జాతికి తండ్రిఅయిన ఆదం స్వర్గచ్యుతికి పూర్వం ధరించి ఉండెను. దేవదూత గేబ్రియెల్ దానిని ఆదంనుంచి తీసుకుని మహాత్ముడైన సులేమాన్‌కు ఇచ్చెను. అయితే, అన్ని సముద్రములనూ దాటి, వాటికి ఆవల ఉన్న ద్వీపాన్ని చేరుటకు ఏ నావకూ సాధ్యపడదు. ఒక మంత్రపు మొక్కను కనిపెట్టి దాని ఆకుల పసరును పాదాలకు పూసుకున్నవారు మాత్రమే నీటిపై నడవగలరు ఆ మొక్క రాణీ యమ్లిక పరిపాలించే పాతాళంలో మాత్రమే దొరుకును. అది ఆమెకు మాత్రమే తెలియును. ఆమెకు సమస్త ఓషధుల, పుష్పముల భాషలు తెలియును. వాటి గుణములు తెలియును. అందువలన, ఉంగరమును కోరువాడు మొదట రాణీ యమ్లిక పరిపాలించే అధో

లోకము చేరవలెను. ఉంగరమును సాధించగలవాడు సకల జీవరాసుల భాషలు తెలుసుకొనుట మాత్రమేగాక, అంధకార లోకానికికూడా వెళ్ళి, జీవజలము సేవించి, అందమూ, యౌవనమూ జ్ఞానమూ పెంపొందించుకొని, అమరత్వం సాధించగలడు." -

ఇది చదివినమీదట రాజకుమారుడు బులూకియ, బనూ ఇస్రాయీల్‌లోగల పురోహితులనూ, మాంత్రికులనూ, పండితులనూ అందరినీ రావించి, రాణీ యమ్లిక పాలించే అధోలోకానికి దారి ఎవరన్నా చెప్పగలరా అని అడిగాడు. అందరూ అఫ్ఫాన్ అనే విజ్ఞానిని చూపారు. ఆ వృద్ధుడికి మంత్రశాస్త్రంలోనూ, జ్యోతిశ్శాస్త్రంలోనూ, రేఖాగణితంలోనూ, తంత్రశాస్త్రంలోనూ తెలియనిది లేదు. అఫ్ఫాన్ లేచి రాజుకు ఎదురుగా నిలబడ్డాడు.

"అఫ్ఫాన్, మీరు నిశ్చయంగా నాకు అధోలోకానికి దారి చెప్పగలరా ?" అని బులూకియ అడిగాడు.

"చెప్పగలను," అన్నాడు అఫ్ఫాన్.

బులూకియ పరిపాలన అంతా తన వజీరుకు అప్పగించి, తన రాజలాంఛనాలన్నీ తీసేసి, యాత్రికుడి వేషం ధరించి, అఫ్ఫాన్‌ను వెంటబెట్టుకుని, ఎడారి మార్గాన బయలుదేరాడు.

వాళ్ళు కొంతదూరం వెళ్ళినాక అఫ్ఫాన్ బులూకియతో, "మనం ఇక్కడ కొంత తంత్రం చేస్తేనేగాని మన ముందు మార్గం దొరకదు," అన్నాడు.

వాళ్లు అక్కడ ఆగారు. అఫ్ఫాన్ ఇసుకతో తనచుట్టూ ఒక మంత్రవలయం గీశాడు. ఆయన కొంత కర్మకాండ జరిపినమీదట ఇక్కడకి వచ్చేదారి గుర్తు దొరికింది. ఆయన మరికొంత తంతు జరిపినమీదట భూమి విచ్చుకుని వా రిద్దరికీ దారి ఇచ్చింది. ఆ మార్గాన వాళ్ళు ఈ సరస్సు దగ్గిరికి చేరారు.

నేను వాళ్ళకు సముచిత మర్యాదలు చేశాను. ఇక్కడికి వచ్చేవా రందరికీ అలాటి మర్యాదలు జరుగుతాయి. వాళ్లు వచ్చినపవి తెలుసుకోగానే నేను నా బంగారు పళ్ళెంలో ఎక్కి, వారిని ఈ పచ్చలకొండపైకి నా వెంట తీసుకుపోయాను. దారి పొడుగునా అటూ, ఇటూ ఉండే పూలు నాకు తమ శక్తులు తెలిపాయి. ఒక ఎర్రపూల గుత్తులుగల పొద తన పూల ముఖాలగుండా, "నా రసం పాదాలకు రాచుకున్నవాళ్లు అన్ని సముద్రాలమీదుగానూ అవలీలగా నడిచి పోవచ్చు," అనటం నాకు వినిపించింది.

"మీకు కావలసిన మొక్క ఇదే," అని నేను నా అతిథులకు చెప్పాను.

వెంటనే అఫ్ఫాన్ తనకు కావలసినన్ని ఎర్రపూలను కోసి, వాటి రసం నే నిచ్చిన పాత్రలోకి పిండాడు.

"అయ్యా, మీరు సముద్రాన్ని

ఎందుకు దాటాలనుకుంటున్నారో నేను తెలుసుకోవచ్చునా ?" అని అఫ్ఫాన్‌ను అడిగాను.

"మహారాణీ మేం సప్తసముద్ర ద్వీపానికి వెళ్ళి, సులేమాన్‌గారి మంత్రపు ఉంగరాన్ని సంపాదించా లనుకుంటున్నాం." అన్నాడు అఫ్ఫాన్.

"సులేమాన్ అనంతరం ఆ ఉంగరాన్ని మరొకరు ధరించటం అసంభవమని తెలియదా ? నా మాట నమ్మండి, అఫ్ఫాన్, బులూకియరాజా, నేను చెప్పేది విను. ఈ సాహస యత్నం, ఈ వెర్రి ఆలోచన కట్టిపెట్టండి. ఇక్కడ మరొక ఓషధి ఉన్నది. దాన్ని తిని శాశ్వత యౌవనం పొందండి," అన్నాను.

కాని వాళ్ళు నా మాట వినిపించుకో లేదు. నా వద్ద సెలవుపుచ్చుకుని, వచ్చిన దారినే వెళ్ళిపోయారు. వాళ్ళు సప్త సముద్రాల అవతల, సులేమాన్‌ను పాతిపెట్టిన ద్వీపానికి అలా ప్రయాణమైపోతూ మొదటి సముద్రాన్ని చేరుకున్నారు. అక్కడ వాళ్లు కూర్చుని, తమ పాదాలకు పాత్రలోని రసం పట్టించారు. తరవాత వాళ్ళు అనుమానిస్తూ సముద్రంమీదికి అడుగుపెట్టారు. అయితే, తాము నేలమీదకంటె కూడా సముద్రం మీద మరింత తేలికగా నడవగలమని వారికి త్వరలోనే తెలిసిపోయింది. మునిగిపోతామన్న భయంపోయి, ధైర్యం వచ్చి, వాళ్ళు వేగంగా నడుస్తూ, నాలుగో రోజు ఉదయానికి ఒక ద్వీపం చేరారు. అది ఎంత మనోహరంగా ఉన్నదంటే, వాళ్ళు దాన్నిచూసి స్వర్గం అయిఉంటుం దనుకున్నారు.

అక్కడి ఇసుక బంగారు పూతగల కుంకంపువ్వు రంగులో ఉన్నది. శిలలు చంద్రకాంత శిలలూ, కెంపులూనూ. మైదానంనిండా కాంతివంతమైన రంగులు గల పుష్పాలతో నిండిన చెట్లున్నాయి. అక్కడి గాలి ఆ పుష్పాల సువాసనతో బరువెక్కి ఉన్నది. అక్కడ సెలయేళ్లు పారుతున్నాయి. వాటి ఒడ్డున తుంగకు బదులు చెరుకు మొలిచిఉన్నది. అక్కడి ప్రదేశంనిండా వసంతశోభ వెల్లివిరుస్తున్నది.

బులూకియా, అఫ్ఫాన్ ఆ మనోహర దృశ్యాలకుండా, చెట్ల నీడల వెంబడి, మహదానందం అనుభవిస్తూ సాయంకాలందాకా నడిచారు. చీకటిపడింది. వాళ్ళు ఒక చెట్టు ఎక్కి, దానిమీద నిద్రపోదామని కళ్ళు మూసుకోబోతూండగా, ఒక పెద్ద రంకె ద్వీపమంతటా మారుమోగింది. ద్వీపమంతా ఆ ధ్వనికి కంపించింది. సముద్ర జలాలనుంచి ఒక రాక్షసి జంతువు పైకి వచ్చింది. దాని నోట ఒక మణి దీపంలాగా ప్రకాశిస్తున్నది.

ఈ రాక్షసి జంతువు వెనకాలగా మరి కొన్ని రాక్షస జంతువులు సముద్రంలో నుంచి పైకి వచ్చాయి. ప్రతి జంతువు

కోటా ఒక్కొక్క మణి వెలుగుతున్నది. ఈ అన్నిటి వెలుగులతో ద్వీపమంతా పట్ట పగలయిపోయింది ఈ వెలుగులో అనేక సింహాలూ, పులులూ, చిరుతపులులూ తమ రహస్య స్థావరాలనుంచి బయటికి వచ్చాయి. వాటి సంఖ్య దేవుడికే తెలియాలి.

సముద్ర జంతువులూ, భూమిమీది జంతువులూ సముద్రతీరాన కలుసుకుని తెల్లవారినదాకా మాట్లాడుకుని, తూర్పు తెల్లవారుతుండగా సముద్ర ప్రాణులు సముద్రానికీ, వన్యమృగాలు వనాల లోకీ తిరిగి వెళ్ళిపోయాయి.

భయంతో తెల్లవార్లూ కన్నుమూయని బులూకియా, అఫ్ఫాన్ చెట్టుదిగి, సముద్ర తీరానికి పరిగెత్తి గబగబా కాళ్ళకు రసం పూసుకుని? రెండో సముద్రం దాట నారంభించారు. వాళ్ళు అహోరాత్రాలు ప్రయాణంచేసి రెండో సముద్రాన్ని దాటి ఒక పర్వతపంక్తిని చేరుకున్నారు. వాటి మధ్య ఒక అద్భుతమైన లోయ ఉన్నది. అక్కడ ప్రతి చిన్నరాయీ అయస్కాంతపు రాయే. అక్కడ వన్యమృగాల జాడా, క్రూరమృగాల జాడా కొంచెం కూడా లేదు.

వాళ్ళు రోజల్లా ఎండు చేపలు తింటూ ఆ లోయకు అడ్డంపడి నడిచి, సూర్యుడు అస్తమించుతుండగా సముద్రతీరాన్ని చేరుకున్నారు. ఇంతలో వాళ్ళకు ఒక పెద్ద గాండ్రింపు వినిపించింది. వాళ్ళు చప్పున అటు తిరిగి చూసేసరికి ఒక పెద్దపులి వారికేసి దూకుతూ వస్తున్నది. అది తమను సమీపించేలోపుగా వాళ్ళు తమ పాదాలకు రసంపూసుకొని, పులికి అందకుండా సముద్రంమీదికి పరుగుతీశారు. అది మూడో సముద్రం.

కటిక చీకటి. సముద్రంలో తరంగాలు ఉవ్వెత్తుగా లేస్తున్నాయి. అసలే నిద్ర లేక డస్సి ఉన్న వారికి అలాంటి సముద్రంమీద నడవటం మహా కష్టమనిపించింది. అదృష్టం బాగుండి తెల్లవారు జామున వాళ్ళు ఒక లంక చేరి, దాని తీరాన పండుకొని నిద్రపోయారు.

తిరిగి నిద్రలేచి వాళ్లు లంకలోకి వెళ్ళారు. అక్కడ అనేక ఫలవృక్షాలున్నాయి. వాటి పళ్లు మామూలు పళ్లలాగ కాక, చక్కెర చేర్చిన రుచి కలిగి ఉన్నాయి. వాళ్ళకు ఈ దీవి చాలా తృప్తికరంగా ఉన్నది. ముఖ్యంగా బులూకియాకు చక్కెరలో మాగిన పళ్ళంటే తగని ఇష్టం. అతను ఆ పగలలా పళ్లు తినటమేగాక, పరోదిజులపాటు ఆ లంకలోనే గడపటానికి అఫ్ఫాన్ ఒప్పించాడు.

పదకొండో రోజున వాళ్లు మళ్ళీ ప్రయాణమై, నాలుగో సముద్రాన్ని దాట నారంభించారు. వాళ్లు నాలుగు పగళ్లూ, నాలుగు రాత్రులూ ప్రయాణంచేసి మరొక దీవి చేరారు. అది చాలా నన్నని ఇసుక మేటమాత్రమే. అక్కడి ఇసుక తెల్లగా ఉన్నది. దీనిమీద ఎక్కడా గడ్డిపరక



అయినా లేదు. రకరకాల సరీసృపాలు తమ గుడ్లను ఎండలో పెట్టి, తాము ఇసుకలో దూరి ఉంటాయి. ప్రయాణీకులు అక్కడ పాదాలకు పసరు పూసుకునేటందుకు మాత్రమే ఆగి తిరిగి సముద్రం దారి పట్టారు.

అయిదో సముద్రం దాటటానికి వాళ్ళకు ఒక పగలూ, ఒక రాత్రీ పట్టింది తెల్లవారుతుండగా వాళ్లు ఒక చిన్నదీవిని చేరుకున్నారు, ఆ దీవిలో స్ఫటికపు కొండలున్నాయి. ఆ స్ఫటికంలో బంగారు జాడలున్నాయి. అక్కడ వింత చెట్ల మీద కళ్ళుచెదిరే పసుపుపచ్చ పూలున్నాయి. రాత్రివేళ అవి నక్షత్రాల్లాగా మెరుస్తాయి. వాటికాంతి స్ఫటికశిలల మీద ప్రతిఫలించటంచేత ఆ దీవి పగటి కన్నకూడా రాత్రివేళ మరింత ప్రకాశవంతంగా కనబడుతుంది.

అఫ్ఘాన్ బులూకియతో, "ఇది సువర్ణ పుష్పాల దీవి. ఈ పూలు చెట్ల నుంచి రాలి, ఎండి, పొడి అయినప్పుడు బంగారం అవుతాయి. ఒకానొకప్పుడు సూర్యుడినుంచి ఒక ఖండం భూమిపైన పడింది. అదే ఈ దీవి '' అన్నాడు.

వాళ్ళు ఒక అద్భుతమైన రాత్రి ఆ దీవిమీద గడిపి, కాళ్ళకు రసం పూసుకుని ఆరో సముద్రంమీద అడుగు పెట్టారు.

ఆరో సముద్రాన్ని దాటటానికి చాలా కాలం పట్టింది. చివరకు వారు ఒక దీవి చేరేసరికి వాళ్ళకు ప్రాణం లేచివచ్చింది. శ్రమతీరినదాకా వాళ్లు తీరానే విశ్రాంతి తీసుకున్నారు. దీవి అంతటా దట్టంగా చెట్లున్నాయి. వాళ్ళు ఆ చెట్లమధ్యకు వచ్చేసరికి, ఆ చెట్లమీద కాయలకు బదులుగా జుట్టుకు వేళ్ళాడే మనిషి తలలుండటంచూసి గగుర్పాటు కలిగింది. ఆ 'తలకాయలు" ఒక్కొక్కటీ

ఒక్కొక్క రకంగా ఉన్నవి. కొన్ని చిరునవ్వు నవ్వుతున్నాయి. మరికొన్ని నవ్వటమో, ఏడవటమో చేస్తున్నాయి. అవి చెట్లనుండి రాలిపడి, నేలమీద దొర్లి అగ్నిగోళాలలాగా అవుతున్నాయి. వాటి వెలుగుతో అరణ్యమంతా ప్రకాశిస్తున్నది. ఆ వెలుగుముందు సూర్యకాంతి వెలవెల పోతున్నది.

ఆ అరణ్యం చూస్తుంటే వాళ్ళకి ఆ పళ్ళకు దగ్గిరిగా వెళ్ళి చూడబుద్ధికాలేదు. వాళ్లు తీరానికి తిరిగివచ్చి, ఒక కొండ రాయి వెనక చేరారు. సాయంకాలంవేళ, ఆకస్మాత్తుగా పన్నెండుగురు జల కన్యలు, అద్భుత సౌందర్యవతులు, మెడలలో ముత్యాలపేర్లు ధరించి, నీటి నుంచి పైకివచ్చి, ఒక గంటసేపు ఇసుకలో గెంతుతూ, రకరకాల ఆటలాడుతూ గడిపారు. తరవాత వెన్నెలలో పాటలు పాడి, ఈదుకుంటూ సముద్రంలోకి వెళ్ళిపోయారు.

బులూకియకూ, అఫ్ఫాన్‌కూ సముద్ర కన్యల అందచందాలూ, ఆటపాటలూ అహ్లాదకరంగానే ఉన్నప్పటికీ, చెట్లమీద కాసే భయంకరమైన కాయలు కారణంగా ఆ దీవిపై నిలువ బుద్ధిపుట్టలేదు. అందుచేత వాళ్లు పాత్రలోని రసం పాదాలకు పూసుకుని, ఏదో సముద్రంమీద ప్రయాణమయారు.

ఇది చాలా దీర్ఘ ప్రయాణం. రెండు నెలలపాటు రాత్రీ, పగలూ నడిచినా వారికి భూమి జాడ కనిపించలేదు. ఆకలితో మాడి చావకుండా ఉండగలందులకు వాళ్లు సముద్రంమీద పైకివచ్చిన చేపలు పట్టుకుని, పచ్చిగానే తినేశారు. త్వరలోనే వాళ్ళకు నేను చెప్పిన సలహా ఎంత వివేకంతో కూడినదో తెలిసివచ్చి, దాన్ని పాటించినట్టయితే బాగుండే దనిపించింది.

అయినప్పటికీ వాళ్ళు ఒక ద్వీపానికి రానేవచ్చారు. అది సప్తసముద్ర ద్వీపమని వాళ్లు గ్రహించారు. అక్కడే సులేమాన్ శవాన్ని వేలి ఉంగరంతోబాటు పాతిపెట్టారు.

సప్తసముద్ర ద్వీపంమీద అనేక ఫల వృక్షాలున్నాయి. అనేక సెలయేళ్ళున్నాయి. పచ్చి చేపలు తినీ, తినీ గొంతులు పిడచగట్టి ఉండటంచేత వాళ్లు, ఆపిల్‌పళ్ళు దండిగాగల ఒక పెద్ద వృక్షాన్ని సమీపించారు. బులూకియ చెయ్యిచాచి ఒక పండు కొయ్యబొయ్యే సరికి చెట్టునుంచి ఒక భయంకరమైన కంఠం, "పండును తాకావంటే రెండు ఖండాలవుతావు!'' అనటం వినపడింది.

అదే క్షణంలో నలభై మూరల ఎత్తున్న ఒక మహాకాయుడు వాళ్ళముందు ప్రత్యక్షమయాడు.

బులూకియ భయపడుతూ, "రాక్షసేశ్వరా, మేం ఆకలితో చచ్చిపోతున్నాం. ఈ ఆపిల్‌పళ్ళు తాకవద్దని



ఎందుకంటున్నావో తెలియడం లేదు," అన్నాడు.

"తెలియనట్టు నటిస్తావేం? మీ జాతికి తండ్రిఅయిన ఆదం అల్లామీద తిరుగు బాటుచేసి, తినరాని పళ్ళు తిన్నసంగతి తెలీదా? అది మొదలు నేను ఈ చెట్టుకు కాపలా ఉండి, పళ్ళగుత్తులు తాకినవాళ్ళ నల్లా చంపేస్తున్నాను. వెళ్ళ, మీ ఆహారం మరెక్కడైనా వెతుక్కోండి," అన్నాడు మహాకాయుడు.

బులూకియా, అఫ్ఫాన్‌లు అక్కడి నుంచి వెంటనే కదిలివెళ్ళి, ద్వీపంలోపల ఇతర ఫలాలు తిని ఆకలి తీర్చుకొని, సులేమాన్‌ను పాతేసిన స్థలంకోసం వెతక సాగారు.

ఒక పగలూ, ఒక రాత్రీ ఆ ద్వీప మంతా చెడతిరిగిన అనంతరం వారికి ఒక కొండ కనిపించింది. దాని శిలలు కస్తూరీ, పచ్చకర్పూరమూనూ. అందులో ఒక విశాలమైన గుహ ఉన్నది. దాని గోడలూ, పైకప్పూ అచ్చమైన వజ్రం. ఎండను మించిన కాంతితో వెలిగే ఆ గుహలోకి వాళ్ళు ప్రవేశించారు. ముందుకు పోయినకొద్దీ గుహ మరింత విశాలమయింది. దాని వెలుగు హెచ్చింది. కప్పు మరింత ఎత్తుకు పోయింది. వాళ్ళు ఆశ్చర్యపడుతూ ఇంకా, ఇంకా ముందుకు పోయి, ఈ గుహకు చివర అంటూ లేదా అనుకుంటూ ఒక మలుపుతిరిగి, ఒక విశాలమైన హాలులోకి ప్రవేశించారు. అది ఒకే ఒక వజ్రంతో తొలచబడింది. ఆ హాలు మధ్యలో ఒక విశాలమైన పడకమీద సులేమాన్ పడుకుని ఉన్నాడు. ఆయన పడుకునిఉన్న మంచం బంగారంతో చేసినది. ఆయన తాను జీవించి ఉండినప్పుడు ధరించిన ఆకుపచ్చ అంగీయే ధరించి ఉన్నాడు. ఆయన కుడిచేతి వేలికిఉన్న మంత్రపు

ఉంగరంనుంచి వచ్చే కాంతులు వజ్రపు కాంతులను మించిఉన్నాయి. ఉంగరం గల చెయ్యి రొమ్ముమీద ఉన్నది. చాచి ఉన్న రెండవ చేతిలో బంగారు రాజ దండం ఉన్నది. దానికి పచ్చల కళ్ళున్నాయి.

చనిపోయిన మహనీయుడిపై గల గౌరవంకొద్దీ బులూకియా, అఫ్ఫాన్‌లు కొంతసేపు ముందడుగు వెయ్యలేక పోయారు. చివరకు అఫ్ఫాన్ బులూకియతో, "అష్టకష్టాలూపడి ఇంత దీర్ఘ ప్రయాణంచేసి, గమ్యం చేరుకున్నాక మనం వెనక్కు తగ్గరాదు. నేను ఆయ నను సమీపిస్తాను. ఉంగరం ఆయన వేలినుంచి సులువుగా రాగలందులకు నువు నేను నేర్పిన మంత్రాలు చదువు'' అన్నాడు.

బులూకియ మంత్రం చదువుతూంటే అఫ్ఫాన్ సులేమాన్‌ను సమీపించి, ఉంగరం తీయటానికి ప్రయత్నించాడు. అయితే, బులూకియ కంగారులో మంత్రాన్ని తారుమారుగా చదివేసరికి ఉంగరంనుంచి వజ్రద్రవం ఒక చుక్క అఫ్ఫాన్‌మీదపడి, మరుక్షణమే ఆయన పిడికెడు బూడిద అయిపోయాడు.

తాను చేయబూనిన అత్యాచారానికి అఫ్ఫాన్ శిక్షపొందటం చూడగానే, బులూకియా గుహలోనుంచి వేగంగా పారిపోయి,తిన్నగా సముద్ర తీరాన్ని చేరాడు. అక్కడ అతను తన పాదాలకు రసంపూసుకుని సముద్రంమీదికివెళ్ళిఉండే వాడే, కాని దురదృష్టవశాన రసంగల పాత్ర అఫ్ఫాన్‌వద్ద ఉండిపోవటంచేత, అదికూడా దగ్ధమైపోయింది.

అతను తలపెట్టిన కార్యం ప్రమాద కరమని నేను ఎందుకు అన్నానో అతని కిప్పుడు తెలిసివచ్చింది. అత నిప్పుడు ఒంటరిగాడై పోయి, కర్తవ్యంచెప్పేవాడు లేక, గమ్యం తెలియక, ఆ ద్వీపమంతా కలయ తిరిగాడు.

ఇంతలో అతనికొక ధూళిమేఘం కనిపించింది. అందులోనుంచి మేఘ గర్జనలనుమించిన ధ్వనులు - కత్తులు కొట్టుకున్నట్టూ, ఈటెలు ఘర్షణ పడి నట్టూ, గుర్రాలు పరిగెత్తినట్టూ, పిశా చాలు కేకలు పెట్టినట్టూ - వినిపించాయి. అకస్మాత్తుగా ధూళి విచ్చిపోయింది; భూతాలూ, పిశాచాలూ మొదలైన అలౌకిక ప్రాణుల సేన ఒకటి కని పించింది.

ఇంతలో తెల్లవారేసరికి షాహర్‌జాద్ కథ చెప్పటం నిలిపేసింది.

( సశేషం )




ముందు పెరట్లో ఎర్రగన్నేరు గోడ మీంచి ఒరిగి పచ్చని ఆకులతో ఎర్రగా చూస్తూంది.

ఎండ చురుగ్గా వుంది.

గుమ్మంవారాగా, చల్లని పంచతో వెచ్చగా కూర్చుని పత్రిక తిరగవేస్తూ లోపలి మాటలు వింటూంది శకుంతల.

పొయ్యిముందు ఎర్రని మంట ఎదురుగ్గా కూర్చున్న తల్లితో గోపాలం చెబుతున్నాడు.

“వాళ్ళు చెల్లాయి శకుంతలని చూడ్డానికి వస్తామన్నారు.

శకుంతల మనస్సు ఎర్రగన్నేరు పూలగుత్తిలా ఊగిపోయింది.

“ఇది గనక కుదిరిందా ఇక నాకు దిగులులేదు. దాని ఈడు వాళ్ళందరూ పెళ్ళిళ్ళయి పిల్లాపాపాతో కాపరాలు చేసుకుంటున్నారు,” అంది తల్లి.

“అలా వాళ్ళు కొండెక్కి కూర్చుంటే మటుకు కష్టం: కాస్తన్నా దిగితే పెళ్ళి ఖర్చుకు సరిపడుతుంది,” అన్నాడు గోపాలం.

“కాదూ కూడదంటే కాస్తకి

లోభిత్వంచేసి సంబంధం ఒదులు కుంటామా," అంది తల్లి

"మరీ పట్టుబడితే చేసేది లేదనుకో. నువ్వు మాత్రం వాళ్ళదగ్గర తొందర పడకు," అన్నాడు గోపాలం

తల్లి సంబరపడిపోయింది.

గోపాలం పంచలోకి వచ్చి చెల్లితో పరాచికమాడాడు. "పోస్టుమాన్ పెళ్ళి కొడుకు రేపు వచ్చి చూస్తాడు. ఇవ్వాళే కంటబడేవ్" అంటూ.

శకుంతల చేతిలో పుస్తకం ముఖం మీదికంటూ లాక్కుని మనస్సులో ఉవ్వెత్తుగా లేచిన ఆనందాన్ని పెదాల మీదికి, కళ్ళల్లోకి తెచ్చుకుని మురిసి పోయింది.

వీధి మొగలో సైకిలు బెల్లు మోగింది! ఆమె శరీరం ఆపాదమస్తకం విద్యుత్తు పాకినట్టుగా ఝల్లుమంది. ముఖంమీంచి పుస్తకం తప్పించి గుమ్మం లోంచి వీధిలోకి చూసింది. ఆ సైకిలు ఇటు రాలేదు. 'ఎవరిదో' అనుకుంది.

"అమ్మాయ్... ఇలా వచ్చి అన్న య్యకు పీటవేసి కంచం పెట్టు. వాడికి వేళవుతూంది," అంటూ తల్లి పిల్చింది.

శకుంతలకు ఆ మాటలు ఎక్కడో దూరాన్నించి వినపడ్డట్టుగా వినిపించాయి.

"అమ్మ పిలుస్తూంది. అప్పుడే ధ్యాస ఎక్కడికో పోయినట్టుంది" అన్నాడు గోపాలం మళ్ళీ.

పుస్తకం మూసి లోపలికి వెళ్ళింది శకుంతల. పీట వేసి కంచం పెట్టి మంచి నీళ్ళ గ్లాసుని పీటవారగా వుంచింది. తల్లి వడ్డించింది. గోపాలంవచ్చి కూర్చున్నాడు.

శకుంతల అక్కడ వుండకుండా ఇవత లకు వచ్చేసింది. మళ్ళీ పుస్తకం చేతిలోకి తీసుకుంది. పంచలోకి వచ్చి కూర్చుంది. తీరా వచ్చి కూర్చున్న తర్వాత సిగ్గుతో వాళ్ళకు దూరంగా తప్పుకున్నా అతగాడి ఎదట ఇప్పుడే పడాల్సి వస్తుందేమోనని అనిపించి ఆమె ముడుచుకుపోయింది. అతడు ఇటుగానే వెళ్తాడు ఉత్తరాలంటూ వుంటే లోపలికి వస్తాడు. లేకుంటే అలాగే వెళ్ళిపోతాడు. ఉత్తరాలు రోజూ ఏమి వుంటాయి? అతని గొంతు విని పిస్తే ఉత్సాహంగా పంచలోకి పరుగెత్తుకు వచ్చేది. ఈ సంవత్సరం పొడుగూతా అతనెన్నో ఉత్తరాలు తెచ్చి ఇచ్చాడు. సంతోషాన్ని మోసుకొచ్చాడు. విచా రాన్నీ మోసుకొచ్చాడు. అసలు అతనే ఒక ఆకర్షణ. అతను వచ్చే వేళ కోసరం ఎందరు ఎదురు చూస్తారు! ఎన్నెన్నో ఆశలు! ఎన్నెన్నో శుభవార్తలు!! ఉద్యోగాల కోసరం... కలలు పండే పెళ్ళి వార్తల కోసరం!! అయిన వాళ్ళ క్షేమం కోసరం...!!

పద్మ ఓసారి "ఉత్తరం వచ్చింది" అంది ఎంతో సంబరంగా. ఆ ఉత్తరం ఏం మోసుకొచ్చిందో ఆమెకు ఏ మిచ్చిందో పద్మ చూపుల్లోనే గ్రహించింది శకుంతల.




అయినా తెలియనట్టుగానే అడిగింది "ఎక్కడ్నించే," అని

"మావయ్య రాసారు... తర్వలో వస్తారుట."

"ఎందుకు ?"

"పోవే ... ఏమీ తెలియనట్టు ... ఎందుకొస్తారు ?"

"ఏమో...నాకేం తెలుసు ?"

ఆ సంవత్సరమే పద్మజకు బావతో పెళ్ళయిపోయింది.

కొన్నాళ్ళకి ఓనాడు...

"ఇవాళ ఉత్తరం వచ్చింది" అంది పద్మ.

"ఎవరి దగ్గర్నించి?"

"అక్కడ్నించే"

"అక్కడ్నించీ ఇక్కడ్నించీ అంటే నాకు అర్థంకావటంలేదు. ఎక్కడ్నించో స్పష్టంగా చెప్పాలి."

"నన్ను తీసుకు వెళ్తారుట."

"మీ బావవచ్చి ఎత్తుకుపోతాడంటావ్. పోతే పోవే...నువ్వెటుపోతేనాకెందుకు."

ఆ నెలలోనే పద్మ అత్తవారింటికి వెళ్ళిపోయింది.

పిచుకలు పంచలోనూ, గోడమీదా, చెట్లమీదా రెక్కలల్లారుస్తూ, కిచకిచ మంటూ చిట్టి చిట్టి గంతులు వేస్తూ తిరుగుతున్నాయి. ఓ జంట వసారాలో గూడు అల్లుకుంటున్నాయి, పంచంతా వాటి తాలూకు గడ్డిపరకలూ, ఈకలు, దూది, గుడ్డపీలికలతో ఎన్నిసార్లు ఊడ్చి శుభ్రంచేసినా ఎప్పటికప్పుడు గత్తర బిత్తరగానే వుంటుంది.

ఓ రోజు పద్మతల్లి అమ్మతో అనడం విన్నది. "ఇవాళ అమ్మాయి దగ్గర్నించి ఉత్తరం వచ్చింది... ఒంట్లో బాగో లేదట... అనుమానం..." అంటూను

గబగబా తను వాళ్ళ మధ్యకు వెళ్ళి కూర్చుంది.

ఆవిడ అదృష్టానికి తల్లి సంతోషి స్తూంటే ఆవిడ ముఖంమీద ఆ సంతోషం ఎంతోసేపు నిలవలేదు. అంతట్లో ధోరణి మార్చేసింది. "గంపెడు సంసారం.ఇంటినిండా పది తలకాయలు. అబ్బాయి మంచివాడయినా అమ్మాయి కష్టం తెలుసుకోలేక పోయాడు. చాకిరీతో పిల్ల నలిగిపోతూంది. అల్లరి పడకుండా తెలివిగా బయటపడమంటే అతగాడికి అర్థం కావటంలేదు. తనకి మాలిన ధర్మం ఎక్కడా వుండకూడదు. తన సంసారం ఎప్పుడూ ఇలాగే వుంటుందా? ఇవాళ ఒకరు రేపు ఇద్ద రవుతారు... ఈ పిల్లల గతేంకావాలి? తమ మంచి తాము చూసుకోవాలిగా? ఆడపిల్లలు పుడితే ఇట్టే ఎదిగి కూచుం టారు...పెళ్ళిళ్ళు చెయ్యాలి. పేరం టాలు చెయ్యాలి. వచ్చిందంతా ఈ మందిని మేపటానికే చాలకపోతే అప్ప టికి మిగిలేది అప్పులు, నెత్తికి చేతులు" అంటూను.

పద్మజ పురిటికి వచ్చింది. వచ్చిన రెండు నెలలకు బంగారంలాంటి కొడు కును కన్నది. వెళ్ళేముందు అన్నది "ఇన్నాళ్ళకు తెరిపిన పడ్డాను" అని.

"ఏం జరిగింది?"

"హాయిగా, స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకుందుకు అవకాశం చిక్కింది. ఇవాళ ఆయన దగ్గర్నించి ఉత్తరం వచ్చింది."

"అయితే ఇక్కడ కష్టాలు పడి పోతున్నావా?"

"అదికాదు... ఇకమీదట నేను... నా పాప... మా శ్రీవారూ వేరుగా ఆ లొగ్గిడిలోంచి బయటపడి వేరే కాపరం వుంటాం అన్నమాట," అంది పద్మ.

పద్మజ కలలు అలా విరగ బూసాయి.

ఓనాడు– గోపాలం, విసుగ్గా చిరాగ్గా వున్న ఓ రోజు – నిప్పులు చెరిగే ఓ వేసవి రోజు–

రాజు చేతిలో ఉత్తరాల కట్టతో పంచలోకి వచ్చి పిలిచాడు. తాను

ఉత్తరంకోసరం అతృతగా బయటకి వచ్చింది. ఉత్తరం చేతికిచ్చి, "ఇన్ని మంచి నీళ్లు ఇస్తారా?" అని అడిగాడు. తనకు జాలివేసింది. ఎండనిబడి తిరిగి తిరిగి బాగా అలసిపోయాడు. తెల్లని ఒళ్ళు కందిపోయింది. చెంబుతో నీళ్ళు తెచ్చి ఇచ్చింది. అవి ఆత్రంగా గుటగుటా త్రాగేసి "ఇంకో చెంబుడు నీళ్లు ఇవ్వండి" అని అడిగాడు. ఆ నీళ్ళతో ముఖం కడుక్కుని, చేతులు తడుపుకుని ఒళ్ళంతా జేబురుమాలుతో తుడుచుకుని ''ఇప్పుడు ప్రాణం హాయిగా వుంది. థాంక్స్.'' అని మళ్ళీ సెగలూ పొగలూ కక్కే ఎండలోకి వెళ్ళిపోయాడు,.. ఆ ఉత్తరం అలాంటి ఇలాంటి ఉత్తరంకాదు. అది అన్నయ్యకు తమ పేద సంసారానికి ఎంతో సంతుష్టి, పుష్టి ఇచ్చిన ఉత్తరం. అన్నయ్యకు ఉద్యోగం దొరికింది.

* * *

బైట మళ్ళీ సైకిలుగంట మోగింది. పుస్తకం పక్కకు వత్తిగించింది. సైకిలు ముందుచక్రం గుమ్మం ముందు కనిపించింది. చప్పున లేచి లోపలికి వచ్చేసింది శకుంతల.

రాజు లోపలికి వస్తున్నాడు.

శకుంతల కాళ్ళు దడదడ లాడాయి.

రాజు గుమ్మంలో నిలబడే "లోపలికి రావచ్చా?" అన్నాడు.

ఆ గొంతు విని గోపాలం వెనక్కి తిరిగాడు. "ఓహో మీరా...రండి . . . రండి,'' అని కుర్చీమీద తువ్వాలు తీసి దాన్ని గదిమధ్యనించి గోడవారకుచేర్చి ఆహ్వానించాడు.

తల్లి ఇవతలకు వచ్చి "ను వ్వా నాయనా" అంటూ పలకరించింది.

గోపాలం మంచం వాల్చుకుని కూర్చున్నాడు

శకుంతల వంటగదిలో తలుపు వెనక్కి జేరింది

"మీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలని చొరవచేసి వచ్చాను" అన్నాడు రాజు.

"చెప్పండి," అన్నాడు గోపాలం.

"నిన్న మీరు నాన్నగారితో మాట్లాడుతూంటే విన్నాను. నా మీద మీకు ఆశ ఉన్నట్టుంది. అది సాధ్యపడదని చెప్పటానికి వచ్చాను."

"అంటే? మీ నాన్నగారు ఇష్టం లేదని చెప్పమన్నారా?" ఇంతలో ఏం ముంచుకువచ్చింది," అన్నాడు గోపాలం పరిస్థితి అర్థంకాక.

"నాన్నగారికి ఇష్టమే. మీరు ఆయన కోరినంత కట్నం ఇస్తామంటే ఆయన కేమీ అభ్యంతరం లేదు. అభ్యంతరం నాదే... నాకే ఇష్టం లేదు. నేను మేనరికమే చేసుకోవాలని అనుకుంటున్నాను. ఆ అమ్మాయిని తప్ప ఇంకేవర్నీ చేసుకోదల్చుకోలేదు. వాళ్ళు పేదవాళ్ళు. పెళ్ళి కూడా చెయ్యలేని స్థితిలో వున్నారు. నాన్నగారికి ఇష్టంలేదు. ఆయన సంగతి మీకు తెలిసిందేగదా...ఆయనకు

డబ్బు ప్రధానం. దయవుంచి అడ్డు రాకుండా వుంటే కొన్నాళ్ళవరకూ నా మీద వత్తిడి తగ్గుతుంది," అన్నాడు రాజు.

శకుంతలకు కలలు అలలుగా విరిగి పోయినట్టయింది. ఇది ఎన్నాళ్ళనించో పెంచుకున్న ఆశ! ఆ విరిగిపోయినకలలు ఆమెను అక్కడ స్థిమితంగా నిలవనివ్వ లేదు పెరటిలోకివెళ్ళిపోయింది ఆమెకళ్లు చెమ్మగిల్లాయి. పైటచెరగుతో కళ్ళు వత్తుకుంది. ఏమీ ఆలోచించకుండానే, అపేక్షించకుండానే ఉత్తరాల మనిషిని మనస్సులో నింపుకుంది. కేవలం వర్తమానాలు అందించే ఆకర్షణకు, వయస్సు అందం జోడయి ఆ విత్తు అన్నయ్య ఈ సంబంధం గురించి తన మనస్సులోమాట ఎవరో చెప్పినట్టుగా అమ్మతో ప్రస్తావించినప్పుడు అది మొలకెత్తి చివురు తొడిగింది. అన్నయ్య వాళ్లు కోరిన కట్నం ఇవ్వటానికి సిద్ధపడ్డప్పుడు ఆ చెట్టు విరగబూసి తన మనస్సు పరవశించింది. ఆ పూత పండుతుందని అనుకోవటంలో ఆమె కేమీ అపశృతి తోచ లేదు.

"ఇక వస్తాను. ఏమీ అనుకోకండి," అని రాజు వెళ్లిపోయాడు. ఆ సైకిలు బెల్లు దూరంగా వినబడింది.

అమ్మ నిస్పృహగా నిట్టూర్చింది. గోపాలం, "ఇదిపోతే పోనీ, మరో సంబంధం చూద్దాం. మావయ్యకు ఇంకో ఉత్తరం రాస్తాను," అంటున్నాడు.

ఆ తర్వాత తల్లి, అన్నయ్య ఆ తండ్రి మనస్తత్వం గురించీ అతని ధన దాహం గురించీ చెప్పుకున్నారు.

ఇంతకు ముందు నిర్లిప్తంగా. నలుగురితో బాటే ఎన్నో సంబంధాలు చూసింది. ఏ ఒక్కరూ ఆమె అంతర్యంలోకి ప్రవేశించలేదు. అందులో ఏ ఒక్కటి ఫలించినా ఆమె ఊహలు, అనుభవాలు ఎలావుండేవో!... ఈ జీవితం ఎలా వుండేదో. ఈ ఉత్తరాల మనిషి మాత్రం తన మనస్సులో విరగ బూసిన చెట్టులా అల్లుకుపోయాడు. ఆ తర్వాత తప్పిపోయిన సంబంధాల తాలూకు వర్తమానం అతనే మోసు కొచ్చాడు చాలాసార్లు. అత నల్లాంటి వర్తమానాలే తేవాలని అనిపించేది. ఇంకోలా జరగకూడదని, అతని చేతుల మీదుగా 'నువ్వు ఇంకొకరి సొత్తువి కాబోతావు, అనే వార్త అందివ్వకూడదని అనిపించేది. ఇంటింటికి తిరిగి ఇంటింటా అభిమానపాత్రుడై ఆశల హరివిల్లయి ఆకర్షింపబడిన ఈ రాజు తన స్వచ్ఛమయిన మనస్సులో తియ్యని ఊహలు కదిపిన ఈ రంగుల యువకుడు, తన నుంచి దూరంగా వెళ్ళిపోయాడు. ఎందరి ఆశలో ఎందరి సంతోషాలో మూర్తీభవించిన తానై అతని ఎదుట నిలవాలని అనిపించి ప్రతిరోజూ అతనికోసరం

గుమ్మంలో ఎర్రగన్నేరు నీడని నిలబడి పోయేది.

కాని ఇవాళ ఆతని నోటిమీదుగానే అందుకు విరుద్ధమైన మాటలు వింది.

ఇప్పుడలా ఊహించటంకాని, ఆశించటంగాని అర్థంలేని పనిగా అని పించింది శకుంతలకు. ఆమె ఇప్పుడు ఆ కలలనించి ఆ విరుపులనించి తేరు కుంది. ఆ మరదలికి ఇతగానిమీద అభిమానం, ఇతనికి ఆమెమీద ప్రేమాతిశయం! ఈ వస్తువు తనదికాదు. పద్మజ గుర్తుకు వచ్చింది.

ఆ మర్నాడు వీధిలో సైకిలుబెల్లు మోగినప్పుడు వీధినిపోయే బాటసారిగానే అనిపించింది. అతనలాగే ఇటువైపయినా చూడకుండా సైకిలు తొక్కుకుంటూనే వెళ్ళిపోయాడు. పక్క గుమ్మంలో నిలబడి పిలుస్తున్నాడు 'ఉత్తరం' అంటూ. ఆ పిలుపు కొంతసేపు ఆ చుట్టుపక్కలే వినిపించింది.

ఓనాడు మధ్యాహ్నం పంచలో కూర్చుని శకుంతల పద్మతో కబుర్లు చెబుతూంది.

శకుంతల వున్నట్టుండి ఒళ్లో పడిన ఉత్తరంతో తలెత్తి చూసింది.

రాజు ఉత్తరంవిసిరేసి గుమ్మం దాటు తున్నాడు.

"ఏదో పసందయిన వార్త వచ్చి వుంటుందేవ్. చింపు...చింపు..."

"ఏమిటే నీ వేళాకోళం? అన్నయ్యకు వచ్చిన ఉత్తరం. ఎక్కడిన్నించో"

"నేను చెబుతున్నా విను. అది నీ గురించి వచ్చిన ఉత్తరం," అంది పద్మ.

కవరు ఓ మూల మావయ్య పేరు నామా చూసింది శకుంతల.

పక్కింటినించి రాజు పిలుపు విని పించింది.

ఇంతలో తల్లి ఇవతలకు వచ్చి "ఏవిటే" అంది.

"మావయ్య దగ్గర్నించి ఉత్తరం వచ్చింది."

"ఫర్వాలేదు. చింపి చదువు" అంది తల్లి.

"చదువు... చదువు..." అంటూ తొందర చేసింది పద్మ.

"ఏవిటే నీ తొందర. ఆ తర్వాత దెప్పటానికా," అని శకుంతల కవరు చింపి ఉత్తరం పద్మమీదకు విసిరి "నువ్వే చదువు" అంది.

చి॥ గోపాలరావుని ఆశీర్వదించి వ్రాయునది...

ఇక్కడో సంబంధం చూసాను. పిల్లవాడు రూపసి. ఉద్యోగం రైల్వేలో. ఫర్వాలేదు... చేతిలో పనితనం ఉన్న వర్కర్. పెద్దగా ఆస్తిపాస్తులేవీ లేవు. ముందు ముందు పైకి వస్తాడు.

మాట్లాడాను. పిల్లని చూడ్డానికి వస్తా మన్నారు. వచ్చే ఆదివారంనాడు వస్తా.

పద్మ ఉత్తరం చదివి 'నే చెప్పాలా' అంటూ శకుంతల భుజాలు పట్టుకుని అటూ ఇటూ ఊపేసింది.

శకుంతల తలవంచుకుని నేలమీద సున్నాలు చుడుతూంది.

"ఈ సంబంధం తప్పకుండా కుదురుతుంది చూడండి. శకుంతల ఝుమ్మంటూ రైల్లో దేశమంతా తిరిగొస్తుంది," అంది పద్మ.

అనుకున్నట్టే ఆ వచ్చే ఆదివారంనాడు వాళ్లు వచ్చారు. పెళ్ళిచూపులయాయి. పిల్ల నచ్చిందన్నారు. అన్నిటికి ఒప్పందలయింది. ముహూర్తం కూడా పెట్టించి అవతల వాళ్ళ దగ్గర్నించి ఉత్తరం వచ్చింది. ఇక పెళ్ళి నెలరోజులుంది.

ఓనాడు శకుంతల మంచంమీద పడుకుని పుస్తకం చదువుకుంటూంది. తల్లి గుమ్మంలో ఎవరితోనో మాట్లాడుతూంది.

"ఏం నాయనా ఆ అమ్మాయిని పెళ్లి చేసుకున్నావా?"

"లేదండి. నాన్నను నేను తిప్పుకునే ప్రయత్నంలోనే ఆమెకు మరో సంబధం చూసారు. ముహూర్తాలు పెట్టుకున్నారు. తొందర పడ్డారు," అంటూంది అవతల గొంతు.

పుస్తకం పక్కన పడేసి ఇవతలకు వచ్చింది శకుంతల.

రాజు గుమ్మందగ్గర తల్లితో మాట్లాడుతున్నాడు.

"అయ్యో పాపం' ఎంతో మనసు పడ్డావు" అంది తల్లి సానుభూతిగా.

మనసు పడ్డవన్నీ లభిస్తే ఇది జీవితమే కాదు. ఇంకేదో అనిపించింది శకుంతలకు. ఒకనాడు శూన్యంలోంచి అభిమానం అనే చిన్నవిత్తు పువ్వుల వృక్షంగా తన శరీరమంతా పరుచుకున్న అనుభవం మనస్సులో మెదిలింది. మోడయిపోయిన ఈ చెట్టు మళ్ళీ చివుళ్ళు తొడిగింది పువ్వులు పూస్తుంది కాయలు కాస్తుంది. పూసిన ఆ చెట్టు కాయకుండానే మోడయిపోయింది. మళ్ళీ ఆ చెట్టు చిగురుస్తుంది. పువ్వులు పూస్తుంది. తప్పదు... ఇది ప్రకృతి.

అయినా ఆమె కేదోటో వెలితిగానే అనిపించింది.

ఆ చుట్టుపక్కలనించి రాజుగొంతు 'ఉత్తరం' అంటూ పదే పదే వినిపిస్తూనే వుంది.

పుస్తకం గుండెలమీద పర్చుకుని కళ్ళుమూసుకుంది శకుంతల.






# దేవుడిపై కోపం

ఆకుండి

నాం

గుర్నాధానికి మహా కోపమొచ్చింది ఆవాళ!

పెళ్ళికెదిగి కూర్చున్న తన పుత్రికా త్రయంమీద కాదు.

కనీసం పెద్ద కుమార్తె పెళ్ళయినా చెయ్యలేని తన అప్రయోజకత్వాన్ని అదే పనిగా అవహేళనచేస్తున్న పెళ్లాం మీద కాదు.

తను చేస్తూన్న దరిద్రగొట్టు ఉద్యోగంమీద కాదు!

తను, తనవాళ్ళూ రోజూ తింటూన్న దరిద్రగొట్టు తిండిమీద కాదు.

ఉంటూంన్న దిక్కుమాలిన అద్దె కొంపమీద కాదు.

అతని కవాళ అంతటి మహాకోప మొచ్చింది; ఎవ్వరికీ అగుపించకుండా అంతటావున్నాడనే దేవుడిమీద!

గుర్నాధంవంటి మహాభక్తుడికి దేవుడి మీద అంతటి మహాకోపం రావడమనేది చాలా ఆశ్చర్యకరమైన విషయం! ఎంచేతంటే! ఏదో ఆపదసమయాలలో మాత్రమే దేవుణ్ణి స్మరించే టటువంటి అల్పస్థాయి భక్తుల కోవలోకి రాడు గుర్నాధం!

అతను రామాయణం చదివేడు. భారతం చదివేడు. భాగవతం చదివేడు. ఇకపోతే భగవద్గీత సంగతి సరేసరి! అది అతని నిత్యపారాయణగ్రంథం!... ఒక ఉత్తరం వ్రాసినా, చాకలి పద్దు వ్రాసినా, అసలు ఏది వ్రాసినాసరే ముందుగా కాగితంమీద 'శ్రీరామ' అని వ్రాయడం అతని కలవాటు!...రాత్రి పడుకోబోయేముందు, ఉదయం నిద్ర లేచేముందు అరచేతిపై 'శ్రీరామ' అని వ్రేలితో వ్రాసి, దండంపెట్టి, రామనామాన్ని జపించడం అతని భగవదారాధనలో ఒక భాగం!

శని, ఆదివారాలు ఒంటిపూట-సోమవారంనాడు పూర్తిగాను ఉపవాసాలు చెయ్యడం అతని ఆస్తికతకు నిదర్శనాలు!

ఇంచుమించు పదిహేనేళ్ళవుతోంది అతను రామకోటి వ్రాయడం ప్రారంభించి!...బహుశా మరికొద్ది రోజులలో పూర్తవవచ్చు!

ఇంతట్లోనే యీ వైపరీత్యం!

కోపాన్ని అదుపులో పెట్టుకోలేక దేవుడిపై తిరగబడ్డాడు గుర్నాధం!...

మొట్టమొదట రాముడి విగ్రహాంతీసి నేలకేసి కొట్టేడు. అది రాతి విగ్రహమయున్నట్లయితే అంత సులభంగా అన్ని ముక్కలు కాకపోయుండేది!... సీతకి, లక్ష్మణుడికి, హనుమంతుడికి అదే గతి పట్టింది!...ఆ తరువాత పార్వతీ పరమేశ్వరుల విగ్రహాలను నేలకేసి కొట్టేడు!...

గదంతా మట్టిబెడ్డలు!

వైపు దగ్గరనుంచి బిందెతో నీళ్లపట్టు కొచ్చిన గుర్నాధం భార్య అన్నపూర్ణ, యీ దృశ్యాన్ని చూసి నిర్ఘాంతపోయింది!

"ఏవండీ!...ఎవరీ విగ్రహాల నిలా పగులగొట్టేరు?" అని భర్తనడిగింది.

"నేనే!" అని సమాధాన మిచ్చేడు గుర్నాధం.

"మీరా?!...మీకేం పిచ్చెత్తిందా ఏవిటి?...ఏవిటీ పని?" అని నేలమీద ముక్కముక్కలుగా పడివున్న విగ్రహాల కేసి బితుకుబితుకుగా చూస్తూ అడిగింది అన్నపూర్ణ.

"పిచ్చెత్తడంకాదే!...పిచ్చివదిలింది.. ఇన్నాళ్ళయి నన్ను పట్టుకున్న దేవుడి పిచ్చి యీనాటితో వదిలిపోయింది!"

"ఏవిటండీ యీ మాటలు?...మీ మాటలు వింటూంటే నాకేదో భయంగా వుంది!''

"దేనికే భయం?...ఈ దేవుళ్ళపై తిరుగుబాటు చేస్తున్నందుకుగాను యీ దేవుళ్ళు నన్నేమయినా చేస్తారనా నీ భయం?...మరేం భయంలేదు!...అంత పాటి శక్తి మనం దేవుళ్లుగా భావించి ఆరాధిస్తున్న వాళ్లెవరికీ లేదని నాకు తెలిసిపోయింది. అట్టి శక్తే వాళ్ళకున్నట్లయితే యిలా నేను నేలకేసి బాదినప్పుడు ప్రతిఘటించి ఉండేవాళ్లు!...

నిర్జీవమైన మట్టి ముద్దల్లోను, కఠినపాషాణాలలోను ఏదో మహత్తు ఉన్నాదనే భ్రమతో యిన్నాళ్ళయి యీ నిర్జీవ పదార్థాలను ఆరాధించేటందుకై ఎంతో అమూల్యమైన కాలాన్ని వృధాచేసుకున్నాను. ఇటుపైన యిట్లాంటి తెలివి తక్కువ పని చెయ్యను."

"ఇక చాలించండీ మాటలు!... తీవ్రమైన నిరాశా నిస్పృహలకు లోనై మతి స్థిమితాన్ని పోగొట్టుకున్నవారు తప్పితే మరెవ్వరూ యిలాగ మాట్లాడరు!" నీళ్లబిందెను కుదురుమీద దించుతూ అంది అన్నపూర్ణ.

"ఇప్పుడు నా మతి సక్రమమైన పద్ధతిలో కుదటపడింది. ఇంతకాలమై నా మనస్సులో పేరుకుపోయున్న కుళ్లును సంపూర్ణంగా యీనాడు కడిగివేశాను. ఇప్పుడు నా మనస్సు నిష్కల్మషంగా ఉంది!"

"మీ రేమంటున్నది నాకు బోధపడలేదు!"

"ఇంత స్పష్టంగా చెప్తున్నా నీకు బోధపడలేదా?...మనబోటివాళ్ళు తరతరాలనుంచీ ఆరాధిస్తున్న దేవుడు—డబ్బూ, అధికారంగల స్వార్థపరులు సృష్టించిన ఒక జడ పదార్థం!...అంతా దైవేచ్ఛ అనే నమ్మకంతో—ఏ పనీచెయ్యకుండా—అంతా దేవుడిపై భారం వేసి సోమరిపోతుల్లాగ కూర్చొనేవాళ్ళ సంఖ్య ఏ దేశంలో అధికంగా వుంటుందో, ఆ దేశం ప్రగతిపథంలో ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేదు. ఇప్పు డర్థమయిందా," అంటూ భార్యముఖంలోకి అదోలాగ చూసేడు గుర్నాథం.

ఏఁవీ అర్థంకాలేదు అన్నపూర్ణకు;

తన భర్త ఎన్నడూ యీ తీరులో మాట్లాడలేదు!...ఇంతకీ ఏంజరిగింది?.. ఈ వైపరీత్యానికి హేతు వేఁవిటి?...రామకోటి వ్రాసేటప్పుడు ఏదయిదా దోషం జరిగితే బెడిసికొడుతుం దంటారు!... కొంపతీసి బెడిసికొట్టలేదు కదా!... ఏమో! దాని ఫలితమే యీ వాగుడేమో!...

అన్నపూర్ణకు భయమేసింది!...ఎవరినైనా పిలవాలనుకుంది!...వీధిలోకెళదామని బయలుదేరబోసరికి పెద్ద కూతురు సీత ఎదురయింది.

"సీతా!...మీ నాన్నగారికి పిచ్చెత్తినట్లుందే!...దేఁవుళ్ళ విగ్రహాలన్నీ నేలకేసి చితక్కొట్టేరు...దైవదూషణ చేస్తున్నారు,...పరమ ఆస్తికులయిన మీ నాన్నగారు యిలా ఆకస్మాత్తుగా నాస్తికులుగా మారిపోడం చూస్తే నాకేదో భయంగా వుంది. వారి మతి చలించిందేమోనని నా కనుమానంగావుంది!" అని చెప్పింది అన్నపూర్ణ.

సీత, గాభరాగా తండ్రిదగ్గరకొచ్చి, "నాన్నగారూ!...ఏఁవిటిదంతా?" అనడిగింది; నేలపై చెల్లాచెదురుగా పడివున్న

దేవతావిగ్రహాల ముక్కలకేసి ఆందోళనతో చూస్తూ.

''ఇవన్నీ ఎత్తిపారేయి పెంటకుప్ప మీద!'' అని అన్నాడు పాదాలతో చితికిన విగ్రహాలముక్కలను ఒక దగ్గరకు కూడదీస్తూ.

''ఇంతకీ ఏమయింది నాన్నగారూ? ...ఇవాళ దేవుడిపై మీ కింత కసి ఎందుకేర్పడింది?'' అనడిగింది సీత.

''ఇంతకాలమయి ఈ ప్రపంచంలో ఒక్క దేవుడే సత్యమని అనుకున్నాను. కాని దేవుడే అసత్యమని, ప్రకృతే సత్యమని యిప్పుడు తెలుసుకున్నాను!...''

"నాన్నగారూ!...మీ మనస్సుపై ఏదో గట్టిదెబ్బే తగిలినట్లుంది! లేకపోతే మీరిలా మాట్లాడరు. ఏం జరిగిందో చెప్పండి;..." అని తండ్రిముఖంలోకి పరిశీలనగా చూస్తూ అడిగింది.

గుర్నాథం అదోలాగ నవ్వి, "చెప్పమంటావా?...చెపితే మీ అమ్మ పిచ్చెత్తిపోతుంది!...లేదా ఆత్మహత్య చేసుకుంటుంది!" అని అన్నాడు.

ఏమీ అర్థంకాక ఆ తల్లీకూతుళ్ళిద్దరూ ఒకరి ముఖా లొకరు అయోమయంగా చూసుకున్నారు.

అన్నపూర్ణ ఎంతో ఆందోళనతో, "ఇంతకీ ఏంజరిగిందండి! చెప్పండి?'' అనడిగింది.

"చెపితే నువ్వు భరించలేవు!'' అనన్నాడు గుర్నాథం.

"భరిస్తాను. ఎంతటి విషాదాన్నయినా భరిస్తాను. వేగంగా చెప్పండి." అని తొందరచేసింది.

"చెప్తాను. చెప్పేముందు నీ రెండో కూతురు లక్ష్మిని ఓసారి యిలా పిలువు!" అని అన్నాడు.

"అది యింట్లోలేదు!'' అని సమాధాన మిచ్చింది అన్నపూర్ణ.

''ఇంట్లోనేకాదు; ఊళ్లోకూడాలేదు!" అని నెమ్మదిగా అన్నాడు గుర్నాథం.

ఆ మాట వినగానే అన్నపూర్ణగుండె వేగంగా కొట్టుకో సాగింది!...సీత మనస్సు ఆందోళనతో ఆరాట పడసాగింది!

"లక్ష్మి ఎక్కడికి వెళ్ళింది నాన్నగారూ?" అని ఎంతో ఆందోళనతో అడిగింది సీత.

"ఏమో?...తెలీదు!...అది వ్రాసిన యీ ఉత్తరంలో వివరాలేమీ లేవు!" అని ఓ ఉత్తరాన్ని సీతచేతికి అందించి, ''మీ అమ్మకు చదివి వినిపించు!'' అని అన్నాడు.

సీత ఆత్రంగా ఉత్తరం మడతవిప్పి, ఓ సారి మనస్సులో చదువుకొని బాధగా నిట్టూర్చింది!...

"ఏమని వ్రాసిందే?...బయటకు చదువే!" అని గుండె బిగబట్టుకొని అడిగింది అన్నపూర్ణ.




'చదువుతాను విను!..."ప్రియమైన నాన్నగారికి నమస్కారములు!... మీ భగవదారాధన వెనకాల మీ పిల్లలంతా గౌరవప్రదంగా, ఆనందంగా జీవించేటట్లు వరమివ్వమనే ప్రార్థన ఉన్నదని నాకు తెలుసు!...అందుకని మీరు ఓ వ్యక్తిత్వంగల పురుషుడుగా చెయ్యవలసినదేఁవీ చెయ్యకుండా-యింతకాలమయి కర్తవ్యశూన్యులై భగవదారాధన అనే పేరుతో ఓ సోమరిపోతులా కాలం గడిపేరు!...సంప్రదాయమనే ఉక్కుచట్రంలో యిరుక్కుపోయి-మూఢాచారాల ఇనుప చక్రాలక్రింద నలిగిపోతూ చావలేక, చావురాక బ్రతుకుతున్నాం మనం!...మన యీ దౌర్భాగ్యస్థితికి ఓ ముగింపు నివ్వాలనే సంకల్పం కల్గింది నాకు!...అందుకనే నేను మీకు దూరమవాల్సొచ్చింది! నన్ను మన్నించండి!...మీ లక్ష్మి."......విన్నావా అమ్మా!...మన దౌర్భాగ్యస్థితికి లక్ష్మి యిచ్చిన ముగింపు!..." అనంది సీత అశ్రుపూరిత నయనాలతో.

తన పాదాలక్రింద వున్న భూమి ఒక్కసారి విచ్చిపోయిన ట్లనుభూతి నొందింది అన్నపూర్ణ. ఆమె గుండె గొంతుకలో కొట్టాడసాగింది. ఏదో అడగాలనుకుంది. కాని ఆమె గొంతుకలోంచి ఏమాటా వెలువడలేదు.

"నాన్నగారూ!...లక్ష్మి ఎక్కడికి వెళ్ళుంటుంది?" అనడిగింది సీత; పొంగి వస్తున్న దుఃఖాన్ని బలవంతంగా అణచుకుంటూ.

"బహుశా చావడానికి వెళ్ళుంటుంది!" నిర్లిప్తంగా చూస్తూ సమాధానమిచ్చేడు గుర్నాధం.

"అయ్యయో! ... ఏఁవిటండీ యీ మాటలు?...తక్షణం పోలీసు రిపోర్టివ్వండి!...వెతికించండి!" అనంది అన్నపూర్ణ రుద్ధకంఠంతో.

గుర్నాధం బాధగా నిట్టూర్చి, "ఏఁవని

రిపోర్టిస్తుంటావు?...ఏ సీమడితో నైనా లేచిపోయిందనా?—లేక ఏ దౌర్భాగ్యు డైనా దానిని వంచించి లేవదీసుకుపోయే దనా?—ఏంవ నిమ్మంటావు రిపోర్టు?— ఇంతకీ అది ఎంతో మంచి పని చేసింది. దాని బాధ మన కొదిలిపోయింది!'' అని అన్నాను.

''ఏంవిటీ?—దాని బాధ మన కొదిలి పోయిందా?—కన్న తండ్రిగా మీ రన వలసిన మాటేనా యిది?'' దుఃఖమిశిత మైన కోపంతో భర్తముఖంలోకి అస హ్యంగా చూస్తూ అడిగింది అన్నపూర్ణ.

''ఇంకేం వనమంటావే'—ఓ కన్న తండ్రిగా కన్నపిల్లలకు నేనేం చేశాను?... ఏంవీ చెయ్యలేదు!—ఆ భగవంతుడే ఏదో చేస్తాడనే నమ్మకంతో నే నింతకాల మయి భగవదారాధన అనే ముసుగులో ఒదిగి కూర్చున్నాను. నా చేతకాని తనాన్ని, అప్రయోజకత్వాన్ని, అయో గ్యతను భగవద్విలాసమనే తెరమరు గున మరుగుపరచేను! అంతా కర్మబద్ధు లనే నమ్మకంతో కర్తవ్యాన్ని విస్మ రించేను నేను! నా రక్తాన్ని పంచుకు పుట్టిన నా కన్న కూతురు లక్ష్మి నాకీ నాడు కర్తవ్యాన్ని బోధించింది. అందుకు దానికి నే నెంతయినా ఋణపడి వుంటాను!'' గుర్నాధం గొంతుక బొంగురుపోయింది! — ఊపిరి ఆడ నివ్వని జుగుప్సాకరమైన కఫంలాగ అతని గొంతుకలో అవ్యక్తమయిన బాధ కొట్లాడసాగింది!—

సీత ఆందోళనలో, ''నాన్న గారూ!—మీ మాటలు వింటూంటే నా కేదో భయంగావుంది!'' అనంది.

''ప్రతి దానికీ భయపడేవాళ్ళీ లోకంలో ఏ పనీ చెయ్యలేరు.'' అని కొంచెంసేపాగి-గొంతుక సవరించుకొని, ''పిరికివాళ్ళీ వ్యవస్థలో సుఖపడలేరు. సుఖపడాలంటే పిరికితనాన్ని త్యజిం చాలి. తమ స్వశక్తిపై నమ్మకంలేనివాళ్ళే పిరికివాళ్ళవుతారు. పిరికివాళ్ళే పూర్తిగా భగవంతుడిపై భారంవేసి - పురుష ప్రయత్నం మానేసి సోమరిపోతులాగ జీవిస్తారు! ఇకపోతే——'' గుర్నాధం యింకా ఏదో చెప్పబోతూండగా మధ్యలో అన్నపూర్ణ అడ్డుతగిలింది.

''ఇక చాలించండి మీ ఉన్యాసం! — మీ ఉపన్యాసాన్ని తీరిగ్గా వినగలిగే సహనం, స్థైర్యం మా కిప్పుడు లేవు. ముందు కర్తవ్యాన్ని ఆలోచించండి.'' అనంది చిరాగ్గా.

''ఇహ ఆలోచించడానికేముంది?— అది వెళ్ళిపోయింది! చావడానికే వెళ్ళి పోయిందో, సుఖంగా బ్రతకడానికే వెళ్ళి పోయిందో మనకి తెలీదు! — ఇంతకీ అది చిన్నపిల్లేం కాదు. నాకే కర్తవ్యాన్ని బోధించిన లక్ష్మి-తన కర్తవ్యాన్ని తాను ఎన్నడూ విస్మరించదు. నా కిప్పుడు దానిగురించి ఏ విచారం లేదు! నా కిప్పు డున్న విచారమల్లా సీత గురించే!'' అని భార్యముఖంలోకి బాధగా చూస్తూ అన్నాడు.

తండ్రి అలా అనేసరికి సీత తెల్లబోయింది. ..."నా గురించి మీ కెందుకు విచారం నాన్నగారూ?" అనడిగింది.

"ఇప్పుడు నీ వయస్సెంతో తెలుసా?...ముప్పైఏళ్ళు!...నీకు నేనింత వరకూ పెళ్ళిచెయ్యలేకపోయేను. ఎందువల్లో తెలుసా? దారిద్ర్యంవల్ల!...నేటి మన యీ సమాజాన్ని ధనం శాసిస్తోంది. ధనానికున్న విలువ నేటి యీ సమాజంలో మరి దేనికీలేదు. ధనం యిమ్మనమని భగవంతుడిని ప్రార్థించడంకోసం వినియోగించిన కాలాన్ని, ఏదో ఒక విధంగా ధనాన్ని సంపాదించడం కోసం కాని-ధనానికి అట్టే విలువలేని సమ సమాజ స్థాపనకోసం కృషిచేస్తున్నవారికి సహకరించడంకోసం గాని వినియోగించుంటే ఒక మంచిపని చేశాననే సంతృప్తయినా నాకు మిగిలుండేది!...ఇప్పుడు..."

"నాన్నగారూ!...మీరు మళ్ళీ ఉద్రిక్తులవు తున్నారు. ఈ సమయంలో మీరీ రకంగా ఉద్రిక్తులవడం మంచిదికాదు!... లక్ష్మి ఎక్కడున్నదీ నేను భోగట్టా చేస్తాను. మీరు నిర్విచారంగా వుండండి!" తండ్రిని శాంత పరచేటందుకు పూనుకుంది సీత.

అదే సమయంలో సీత రెండో చెల్లెలు ఉమ కాలేజీనుంచి వచ్చింది.

ఉమ ముఖంలోకి గుర్నాధం ఓ పిచ్చి వాడిలాగ చూస్తూ, "ఆ మధ్య నువ్వు ఎవరితోనో తిరగడంచూసి — వాడితో ఎప్పుడూ తిరగొద్దని నిన్ను మందలించేను ...నిన్ను అనాడలా మందలించినందుకు యిప్పుడు నేనెంతో విచారిస్తున్నాను!...నీ యిష్టమొచ్చినట్లు నీ యిష్టమొచ్చిన వాడితో తిరుగు, నేనేమీఅనను. బాగా డబ్బు సంపాదించడంకోసం యిటుపైని నువ్వేంచేసినా నే నానందిస్తాను. బోధపడుతోందా నేను చెప్తున్నది!... నేను చాలా స్పష్టంగానే చెప్తున్నాను. ఎంతటి అవివేకులకయినా బోధపడేటంత తేటతెల్లంగా చెప్తున్నాను!...మన ధ్యేయం ఏదో విధంగా డబ్బు సంపాదించడం!...తెలిసిందా?" అన్నాడు.

ఉమ కేమీ అవగతమవలేదు. తల్లికేసీ, అక్కయ్యకేసీ అయోమయంగా చూడసాగింది!...

సీత తండ్రి దగ్గర కెళ్ళి దీనంగా అతని ముఖంలోకి చూస్తూ "ఊరుకోండి నాన్నగారూ!...మీ ధోరణి చూస్తూంటే మా కందరికీ మతిపోతోంది. లక్ష్మి ఏమయిందా అనే బెంగతో యిప్పటికే అమ్మ సగం కృంగిపోయింది. మీరీ తీరులో యింకా మాట్లాడి నట్లయితే అమ్మ ఏమయిపోతోందోనని నాకు బెంగగా వుంది," అని అంది.

"అవునే!...నీకు బెంగగానే ఉంటుంది!...ఓ ఎద్దులాగ పని చేస్తున్న మీ యీ నాన్న యీ కుటుంబాన్ని పోషించలేడనే బెంగతోనేగా నువ్వు ఉద్యోగం వెలగబెడుతున్నావు!— ఎవడినో ఒకడిని పెళ్ళిచేసుకొని అత్తా

రింటికి పోతే-నీ ఈదరిద్రగొట్టు నాన్నొక్కడూ యీ కుటుంబాన్ని పోషించలేడనేగా ప్రకృతి సహజమైన వాంఛల్ని చంపుకొని మరీ నువ్వీ ఉద్యోగం చేస్తున్నావు?...నాకు తెలుసే నీ సంగతి?... నీ కోసం నువ్వు బ్రతకడం లేదే!... నువ్వు మా కోసం బ్రతుకున్నావు!... సుఖమంటే ఏమిటో నీకు తెలుసా?... నీ కిప్పుడు ముప్పైఏళ్ళు. నీకు పెళ్ళి... నీకు పెళ్ళి..." గుర్నాధం నోట్లోంచి యింకేమాటా వెలువడలేదు. కుప్పలా కూలిపోయేడు.

అన్నపూర్ణ కెవ్వుమని కేకేసి భర్త దగ్గరకెళ్ళి అతని ముఖాన్ని చేతులతో తడువుతూ, "ఏవండీ!...ఏమయిందండీ?...మాట్లాడరే మండీ?" అని ఏడవసాగింది.

సీత ఎంతో ఆందోళనతో, "ఒసేయి ఉమా!...అర్జంటుగా వెళ్ళి డాక్టర్ని తీసుకురా!" అని అంది. ఉమ డాక్టర్ని తీసుకొచ్చేటందుకై పరుగెట్టింది.

సీత తండ్రి ముక్కుదగ్గర చెయ్యి పెట్టి చూసింది. ఊపిరి ఆడుతోంది. ఆమె గుండె కాస్త కుదటపడింది!

తన తండ్రిలాగే యీనాడు చాలా మంది భగవంతుడిని కోర్కెల నీడేర్చే మహామహిమాన్వితుడైన ఓ అపురూప వ్యక్తిగా భావించి ఆరాధిస్తున్నారు!... అందుకనే యీ రకమైన నిరాశానిస్పృహలకు లోనవుతూ కుమిలిపోతున్నా రనుకుంది సీత.

దైవాన్ని సమాజరూపంలో దర్శించి సేవించమని మన ప్రాచీన భారతీయ సంస్కృతి చెపుతోంది!...దేహధారణ కొరకు ఎంత అవసరమో అంత మాత్రమే స్వీకరించమని, అంతకన్నా ఎక్కువ స్వీకరించడం దొంగతనమవుతుందని-అట్లా కనీసావసరాలకు మించి అధికంగా సంపాదించేవారంతా దండనార్హులని 'మనువు' స్పష్టంగా చెప్పేడు!...సమాజ సేవే దైవసేవనే ప్రాచీన హిందూ ధర్మాన్ని మనం ఖచ్చితంగా ఆచరించున్నట్లయితే ఈనాడీ కరమైన వికృతపరిస్థితు లీ సమాజంలో తలెత్తి వుండేవికావని సీత అభిప్రాయం.

కష్టసుఖాలనేవి మనిషియొక్క మానసిక పరిపక్వతపైన, విచక్షణా జ్ఞానంపైన ఆధారపడుండే అనుభూతులు!...

తను సుఖపడలేదేమోనని తన తండ్రి బాధ!

తనకి తండ్రి ఆరకమైన బాధలేకుండా చెయ్యాలనుకుంది సీత!

తెలివొచ్చిన వెంటనే త నేరకంగా సుఖపడుతున్నదీ తండ్రికి వివరంగా తెలియజెయ్యా లనుకుంది సీత!

డాక్టరొచ్చేడు. చూసేడు. బహుశా మెదడులో రక్తనాళం చిట్లివుండవచ్చునన్నాడు. తక్షణం విశాఖపట్నం కింగ్ జార్జి ఆసుపత్రికి తీసుకుపొండన్నాడు!

కాని గుర్నాధాన్ని విశాఖపట్నం తీసుకెళ్ళాల్సిన అవసరం మరి లేకపోయింది!




దాదర్ ఎక్స్‌ప్రెస్ రేణిగుంటలో ఆగింది. గంగిరెడ్డి గొడుగురైల్లోనే వది లేసి పంచె పైకెత్తిపట్టుకొని ప్లాట్‌ఫారం ఒక్కఅంగలోదాటి ఆటోరిక్షా ఎక్కాడు

ఆటోరిక్షా ఎన్నిడొంకలు తిరిగిందో అన్ని మలుపులూ గంగిరెడ్డి మనస్సు తిరిగింది ఆ వేగంలో ఎన్ని గుంట మిట్టల్లో ఆటోచక్రాలు దొర్లాయో అన్ని నిమ్నోన్నతాలనూ అతని ఆలోచనలు పయనించాయి.

ఆటోరిక్షా తిరుపతి బాలాజీ కాలనీలో రాజారెడ్డి ఇంటిముందు ఆగింది

గంగిరెడ్డి రాజారెడ్డిని వరండాలోనే చూచాడు. చిల్లర లెక్కపెట్టుతూనే అరి చాడు, "చిన్నగా దొచ్చాడా బావా!"

రాజారెడ్డినుండి వెంటనే సమాధానం లేదు. గంగిరెడ్డి వరండాలో చెప్పులు వది లాడు. కండువాతో ముఖంమీది చెమట తుడుచుకున్నాడు.

"ఏమైంది బావా! చాలా కంగారుగా ఉన్నావు. ఏమైందేమిటి!" అన్నాడు రాజారెడ్డి.

"చిన్నా మూడురోజులనుంచి కని పించడంలేదు. అవతల మీ చెల్లెలు నన్ను సాధిస్తూంది, ఎక్కడా ఆమాకీ దొరక

లేదు. నీకు ఫోన్ చెయ్యిద్దామంటే లైన్లు దొరకలేదు ఇక్కడేమన్నా చేరాడేమో నని..."

"లేదే! రాలేదే! ఒక్కడే ప్రయాణాలుగూడా చెయ్యగలిగేటంత ప్రయోజకుడయ్యాడా వాడు."

"అదే నాకూ బోధపడడంలేదు. వాడెప్పుడూ ఒక్కడే ఎక్కడికీ వెళ్లలేదు."

"ఇంట్లో ఎవ్వరన్నా ఏమైనాఅన్నారా వాణ్ణి?"

"ఇంటర్ తప్పినందుకు నేనే నాలుగు చీవాట్లు పెట్టాను. వారం రోజులనుండి నన్ను తప్పుకొని తిరుగుతున్నాడు."

"ఏంపని జేశావయ్యా! ఈ కాలం పిల్లవాళ్లను తిట్టీ కొట్టీ లాభంలేదు. వాళ్ల భవిష్యత్తును వాళ్ల అదృష్టానికి, మన కర్మకీ వదిలెయ్యాలి."

"వాడు నాకు భయపడి పారిపోయుంటాడనుకోను. అలాగే నాలుగురోజులు గడిపాడు గదా! పారిపోయ్యేవాడైతే వెంటనే పారిపొయ్యుండాలి."

"ఇప్పుడు చూడు నీ కెన్ని పాట్లొచ్చాయో!" అన్నాడు రాజారెడ్డి.

"నాకేదో అనుమానంగా ఉంది బావా! బీరువాలోనుండి రెండువందలు డబ్బు కూడా తీసుకెళ్ళాడు" మంచినీళ్లతాగతూ అన్నాడు గంగిరెడ్డి

"మిలటరీలో చేరాలని పొయ్యాడేమో చూడు" అన్నాడు రాజారెడ్డి.

"ఆ పనిజేస్తే ఇంకేం! అంతధైర్యం ఎక్కడేడ్చింది నీ చెల్లెలి కొడుక్కి" లేచాడు గంగిరెడ్డి.

"నేను వస్తా బావా! బంగారుపాళెం వెళ్ళివస్తా ...... వాళ్లత్తింటికేమైనా చేరాడేమో."

గంగిరెడ్డి ఆతురతను రాజారెడ్డి ఆపలేక పొయ్యాడు.

* * *

బంగారుపాళెంనుంచి తిరిగి ఇల్లు చేరాడు గంగిరెడ్డి. శాంతమ్మ మంచం పట్టింది.

'చిన్నా' అందరికంటే చిన్న కొడుకు శాంతమ్మకు. అందరికంటే అపురూపంగా పెంచుకుంది వాణ్ణి.

"చిన్నా టిఫిన్‌కు లే" "చిన్నా! అన్నంవేళ తప్పిపోతుందిరా" "చిన్నా! ప్రొద్దుపోయింది ఇకపడుకో" అని అన్నివేళలా కనిపెట్టుకొని సాకింది. వాడి వయస్సుతోపాటు మమకారమూ పెంచుకొంది.

గంగిరెడ్డికేం. వాలు కుర్చీ మీద కూర్చుని వందిమాగదులను చేర్చుకొని దినమంతా కబుర్లతో గడపమన్నా గడపగలడు రోజులూ, వారాలూ, పట్నంలో రాచకార్యాలు వెలగబెట్టమన్నా పెట్టగలడు. కన్నతల్లి కడుపుతీపి పెద్దరికాలతో పెత్తనాలతో కాలం వెళ్లబుచ్చే మగ మహరాజుల కేంతెలుస్తుంది.

"వాడేం చిన్నవాడా శాంతా! ఎక్కడికి పోడు. రెండురోజుల్లో తిరిగి ఇల్లు



చేరకపోతే చూడు. నివ్వేమీ దిగులు పెట్టుకోకు," ప్రక్కనేకూర్చుని అన్నాడు గంగిరెడ్డి. అంత ఆప్యాయతతో శాంతమ్మతో గంగిరెడ్డి ఈ పదేళ్లలో ఎప్పుడూ పలకరించలేదు .

"మీ మూలాన్నే అంతా వచ్చింది. పిల్లలన్న తర్వాత పరీక్షలు తప్పుతారు. పాసవుతారు. అంతదానికే మీరువాడిమీద నోరు జేసుకోవాలా!" గట్టిగా అంది శాంతమ్మ.

"అంతమాత్రం గూడా అదుపు ఆజ్ఞల్లో పెట్టకపోతే వాడు బరితెగించి పోడూ?" గొంతు పెంచి అన్నాడు గంగిరెడ్డి.

"ఆఁ! మీరు చదివిన చదువుకంటే వాడేమీ తక్కువ చదవలేదు. మీ రాజకీయాలు వాడికేం రానక్కర్లేదు." ఇంతమాత్రం ధైర్యంగా శాంతమ్మ గంగిరెడ్డితో ఈ పదేళ్లలో ఎప్పుడూ మాట్లాడలేదు.

శాంతమ్మ వినయ విధేయతలను అంచనా వేయడానికి గంగిరెడ్డికి ఇది సమయంకాదు

"నన్నేమి చెయ్యమంటావు శాంతా! కాలికి బలపం గట్టుకొని నాలుగు రోజుల్నుండీ తిరుగుతూనే ఉన్నా! వాడి జాడే తెలియలేదు "

"వాడు ఎక్కడికీ పోడండీ! పోలేదండీ! చిన్నా మనసు నాకుతెలుసు వాణ్ణి ఎవరో ఎత్తుకపోయి ఉంటారండీ."

గంగిరెడ్డికి ఎలక్ట్రిక్ షాక్ తిన్నంత పనైంది. మనస్సులో కొత్త అనుమానం

తెచ్చిపెట్టింది శాంత. షాక్‌నుండి తేరు కోవడానికి కొంచెంసేపు పట్టింది, గంగి రెడ్డికి వీడేమి చిన్నపిల్లవాడా ఎత్తుక పోవడానికి. వీణ్ణి ఎత్తుకుపోయి ఏం జేస్తారు. వీడికి తిండిఖర్చు తప్పిస్తే '' మాటలైతే గట్టిగా అనగలిగాడు గానీ గంగిరెడ్డి మనస్సులో మాత్రం అనుమానం లోతుజేసుకోసాగింది.

''ఏమిజేసుకుంటా రంటారేమిటండీ! వాణ్ణేమీ అమ్ముకో నవసరంలేదు. ఇదే ఆసరాగా తీసుకొని మన దగ్గర డబ్బు లాగుతారు ముఠావాళ్ళు.'' శాంతమ్మ మంచంమీదినుంచి లేచి కూర్చుంది.

గంగిరెడ్డి లేచి వసారాలో వాలు కుర్చీలో వాలాడు. ఆలోచనలు ముసురు కున్నాయి.

నక్సలైట్లు కాదుగదా ఈ పనిజేసింది. ఆ! వాళ్ళచూపుల్లో పడ్డానికి తనేమంత కోటీశ్వరుడా! లేదు. నక్సలైట్లు అలాంటి పనులు చేయరు. ముందుగా కాచుకో మంటారు. దొమ్మీలు చేస్తారు. వాణ్ణి ఎత్తుకపోయి వాళ్ళ ముఠాలో చేర్చుకోరు గదా!

దొంగల ముఠాలు బాగా తిరుగు తున్నాయీ మధ్య. సూటూబూటూ వేసు కొని వ్యాన్‌లలో దిగుతున్నారట. ఆమధ్య పేపర్లో చూశాడు. మెడికల్ స్టూడెంటుని మధ్యపరగణాలలో అడవుల్లో దాచిపెట్టి లక్షరూపాయలకు బేరంపెట్టి వాళ్ళ తల్లి దండ్రుల దగ్గర డబ్బు గుంజారని విన్నాడు. చిన్నాను గూడా అలా ఎత్తుక పోలేదు గదా!

"టెలిగ్రాం." ఆలోచనలను చెరి చేశాడు పోస్టుమేన్.

'అదిగో తప్పక ఇదే! డబ్బు సమ కూర్చుకొని తెచ్చి ఇచ్చి పిల్లవాణ్ణి విడి పించుకొని పొమ్మని ఆ ముఠావాళ్ళే టెలి గ్రామ్ ఇచ్చినట్టున్నారు. ఇది తప్పక వాళ్ళ పనే' వొణికేచేతుల్తో టెలిగ్రాం కవరు చించాడు.

"ఎరైవింగ్ బై బొంబే మెయిల్.... చిన్నా"

"శాంతా" గట్టిగా అరిచాడు. ''చిన్నా వస్తున్నాడు. ఈ రాత్రి మెయిల్ కే వస్తు న్నాడు మీ అన్న చెప్పిందే నిజమేమో! వాడు మిలిటరీ ఇంటర్వ్యూకు పోయిన ట్టున్నాడు." శాంతమ్మ హృదయం తేలిక పడింది.

* * *

తెల్లవారుఝాము నాలుగుగంటలకు చిన్నా అనబడే సుధాకర్ మాసినగుడ్డల్తో, పెరిగిన జుట్టుతో, నీరసించిన కండ్లతో ఇల్లుచేరాడు. శాంతమ్మ కంట్లో ఒత్తులు వేసుకొని కాచుక్కూర్చుంది ఆవేళదాకా.

''చిన్నా" కౌగలించుకొని ఏడ్చింది శాంతమ్మ. సుధాకర్ కళ్ళు నులుపు కున్నాడు

"వాడి కేమైనా తినడానికి పెట్టు ముందు. వాడిపొయ్యి వచ్చాడు" చలి కప్పు వదిలిస్తూ అన్నాడు గంగిరెడ్డి.






సుధాకర్ గుండెలమీద బరువంతా దిగిపోయింది. తండ్రి రేసుకుక్కలా దూకుతాడనుకొన్న సుధాకర్‌కు గంగిరెడ్డి ప్రవర్తన లేని ఉత్సాహాన్నిచ్చింది.

శాంతమ్మ కాఫీ చేసి ఇచ్చింది. సుధాకర్ త్రాగుతున్నాడు.

"నిన్నుగురించి మీ నాయన వెతకని చోటు లేదురా! వారంరోజులైంది నేను ఎంగిలిపడి'' కండ్లనీళ్లు తుడుచుకుంటూ అంది శాంతమ్మ.

"వాడి మానాన వాడు పోతే దిగులు పడనవసరం లేదు. ఏ దొంగలముఠా వాళ్లైనా డబ్బుకోసం ఎత్తుకపొయ్యుంటారనే భయమంతా" అన్నాడు గంగిరెడ్డి

"అదే జరిగిందమ్మా......అదే జరిగింది'' ఆవేశంతో అన్నాడు సుధాకర్.

నిర్ఘాంతపోయాడు గంగిరెడ్డి.

''చూశారా! చూశారా! నేనన్నంతపనీ జరిగింది. అమ్మో! అమ్మో! నా బిడ్డ ప్రాణాలతో తిరిగి వచ్చాడు. అంతా దేవుడిదయ." గుండెమీద చెయ్యివేసి అంది శాంతమ్మ.

సుధాకర్ తలవంచుకొని కూర్చున్నాడు.

''వాళ్లు డబ్బుకోసం ప్రాణాలు తీయడానికి గూడా తెగిస్తారట. అలా జరిగితే ఇంకేమైనా ఉందా" అంది శాంతమ్మ సుధాకర్ నుదుటు ముద్దుపెట్టుకుంది.

"అసలేమిజరిగిందిరా! డబ్బుకోసం ఎత్తుకపొయ్యుంటే మరి వదలేశారే" అనుమానంగా అడిగాడు గంగిరెడ్డి.

''మీ కోర్టు ప్రశ్నలు మాని వినండి అసలేమి జరిగిందో!'' విదిలింపుగా అంది శాంతమ్మ.

"అంతా చెపుతా వినమ్మా! ఆ రోజు నేను నందిమండలం పోవడానికి బస్ కోసం రోడ్డుమీద కాచుకొని కూర్చు

న్నానా.... చెప్పటానికి ఉపక్ర
మించాడు సుధాకర్.

"నందిమండలం ఎందుకూ!'' అందుకున్నాడు గంగిరెడ్డి.

"మార్కులు తెచ్చుకుందామని పోతున్నాను. రోడ్డుమీద నే నొక్కణ్ణే ఒక వ్యానువచ్చి ఆగింది. దానిలో డ్రైవరు కాక ఇంకా నలుగురు మనుషులున్నారు. అంతా రౌడీల్లాగా ఉన్నారు నల్ల గళ్ల కోట్లూ, జీన్సు, మెడకురుమాళ్లూ, తలకు టోపీలూ, పొగపైపులు అంతా సినిమారో ఉన్నట్టే ఉన్నారు.''

శాంతమ్మకు గుండె ఝల్లు మన్నది. చిన్నవాళ్లను చూచి ఝడుసుకొని ఉంటాడు తెల్లవారితే దిష్టితియ్యాలి అనుకొంది.

''వ్యాను నిలిపి నా జుబ్బా పట్టుకొని లాగి వ్యానులో తోశారు. జేబులన్నీ వెతికారు. డబ్బు తియ్యమన్నారు. బస్‌చార్జికి తప్ప నాదగ్గర డబ్బెక్కడిదీ."

"మరి ఇక్కడ బీరువాలో రెండు వందలు పోయాయి ఏమైనట్టూ?" అనుమానంగా అడిగాడు గంగిరెడ్డి.

''వాటి విషయం నాకేమి తెలియదమ్మా! అవి నాదగ్గరుండి ఉంటే అవి తీసుకొని నన్నిక్కడే వదిలేసి ఉండేవాళ్లు" ఏడ్చాడు సుధాకర్.

"అబ్బా! మీ రుండండీ! వాడసలే భయపడి పొయ్యుంటేనూ. అదేదో మీరే తీసి మరచిపొయ్యుంటారు.''

''రోడ్డుమీద అరవకపొయ్యాడావీడు" గంగిరెడ్డి అన్నాడు.

"ఆ! అరచిఉంటే మీరు పరుగెత్తుకెళ్ళి రక్షించేవారే'' శాంతమ్మ ఠక్కున అనేసింది.

''వ్యానులోతోసి తలుపులు బిగించారు. నా కేదో మత్తుపదార్థం లాంటిది వాసన జూపించారు. స్పృహతప్పి పడిపొయ్యాను."

శాంతమ్మకు గుండెదడ ఎక్కువైంది. గంగిరెడ్డి మనస్సులో నొచ్చుకున్నాడు. రక్తసంబంధం ఆలాంటిది. ఊహించుకుంటేనే భయమేస్తుంది.

''అలాగ ఎంతదూరం వెళ్లారో వాళ్లు! నాకు రాత్రికిగానీ మెలుకువ రాలేదు."

"వాళ్లు తెలుగోళ్లు కాదా!" అన్నాడు గంగిరెడ్డి.

లేదు! అంతా హిందీ మాట్లాడుతున్నారు. నాకు మెలుకువ వచ్చేటప్పటికి ఒక భూత్‌బంగళాలో ఉన్నాను. చుట్టూ ఎక్కడా ఇళ్లు ఉన్నట్లు కనిపించలేదు.''

గంగిరెడ్డి ఆసక్తిగా వింటున్నాడు.

"ఆ రాత్రంతా నాకు జాగరణే. తినడానికి ఏమీ ఇవ్వలేదు వాళ్లు."

శాంతమ్మకు కడుపుకోతలాగుంది.

"ప్రొద్దున్నే మళ్లీ తయారయ్యారు వాళ్లు నలుగురూ. నన్ను నాన్నకు జాబు వ్రాయమన్నారు. యాభైవేలు రూపాయలు తీసికొని వాళ్ళిచ్చిన అడ్రసుకు వచ్చి కలుసుకొని ఆ డబ్బిచ్చి, నన్ను



మన పెళ్లెప్పుడో స్వర్గంలో జరిగె
ఇప్పుడు మరో పెళ్లెందుకంటావ్ – డార్లింగ్!!

తీసుకపోమ్మని వ్రాయమన్నారు. వారం రోజుల్లో డబ్బు చేర్చకపోతే నా ప్రాణాలు తీస్తామని వ్రాయమన్నారు."

శాంతమ్మకు చివరిమాటతో పిడుగు పడ్డట్టయింది.

"నిన్ను రాయమనడ మెందుకూ! వాళ్ళే రాయొచ్చుగా" అనుమానంగా అడిగాడు గంగిరెడ్డి.

"వాళ్లదస్తూరీ బయటపడుతుందని. పైగా నాదస్తూరీ ఉంటే మీరు తప్పక నమ్ముతారనీ" తడుముకోకుండా జవాబు చెప్పాడు సుధాకర్.

"జాబు మాసి పోలీసు రిపోర్టులాంటిది ఇచ్చే పక్షంలో అక్కడ నా ప్రాణాలకు ముప్పనిగూడా వ్రాయమన్నారు. నేను వాళ్ల మాటలకు లొంగలేదు. నన్నెన్ని బాధలు పెట్టినా నా మనస్సు మార్చు కోలేదు"

"నా నాయనే! నా నాయనే!" బుగ్గలు నొక్కింది శాంతమ్మ.

"వాళ్లుపెట్టిన హింసలు ఈ జన్మంతా మరుపురాదమ్మా."

"సుధాకర్‌ను కొరడాలతో కొట్టి నట్టూ, సలసలకాగే నూనెలో చేతులు ముంచమన్నట్లు, ఎలక్ట్రిక్ కుర్చీలో కూర్చోబెట్టి స్విచ్ నొక్కినట్టూ, కత్తుల పంజరంలో బంధించినట్టూ వివిధరకా లైన బాధలు పెట్టినట్టు శాంతమ్మ కళ్ల ముందు రీలు తిరిగింది, సొమ్మసిల్లి తేరు కుంది.

గంగిరెడ్డి హృదయం బరువెక్కింది.

"నేను వాళ్లకు లొంగకపోయ్యే టప్పటికి నాలుగు రోజుల్లో అక్కడి నుంచి వాళ్ళు మకాం ఎత్తివేయాల్సి వచ్చిందేమో! మళ్లీ వ్యానులో ఎక్కించి తలుపులు బిగించి రోడ్డుమీద పడ్డారు."

"ఓవరికి ఎలా తప్పించుకొని రాగలి గావురా!" ఆదుర్దాగా అడిగాడు గంగి రెడ్డి.

"వ్యానులో అంతా తాగి పడి పోయారు. డ్రైవరు మధ్యలో వ్యాను నిలిపి కాలు మడుచుకోవడానికి వెళ్ళాడు. వ్యాను వెనక తలుపు మెల్లగా తెరిచాను. అలికిడి లేకుండా తిన్నగా వ్యానుదిగి పొదలమాటున నక్కాను. డ్రైవరువ్యాను ఎక్కాడు నా కళ్ళముందే వ్యాను దూసుక పోయింది.''

చాలా తేలికగా తప్పించుకొన్నందుకు సంతోషపడ్డాడు. గంగిరెడ్డి యాభై వేలు బరువూ తనకు తొలగిపోయినందుకు వెయ్యి దేవుళ్లకు నమస్కరించాడు మనస్సులో.

"వెంటనే ఎదురొస్తున్న బస్‌పట్టుకొని పట్నంచేరాను తీరాచూస్తే అది మద్రాసు. అక్కడనుండి మీకు టెలిగ్రాం ఇచ్చాను." పెద్దగా ఊపిరి పీల్చాడు సుధాకర్.

"అంతా ఆ ఏడుకొండలవాడి దయ. నా ఉపవాసాల ఫలితం. ఏమండీ పై వారమే తిరుపతికి వెళ్ళి మొక్కు చెల్లించి వద్దామండీ!" శాంతమ్మ స్వరంలో ఎంతో నిబ్బరం ఉంది.

కథ సుఖాంతమైనందుకు గంగిరెడ్డి కుటుంబం దేవుడికి ఋణపడింది.

బ్యాంకులోపని పూర్తి జేసుకొని బయటికి వచ్చిన గంగిరెడ్డికి వకీలు సుబ్బారావు కనిపించాడు. సుబ్బారావుకు గంగిరెడ్డి క్లయింటు. "ఏం గంగిరెడ్డీ! బాగు న్నావా? మీ చిన్నవాడు సుధాకర్ మద్రాసులో చదువుతున్నాడా," అడిగాడు సుబ్బారావు.

"లేదు స్వామీ! ఏం అలా అడిగారు" అన్నాడు గంగిరెడ్డి

"పోయినవారం నేను మద్రాసులో టూరిస్టు హోంలో ఉన్నాను. మీవా డక్కడే కొంతమంది పిల్లవాండ్లతో కని పించాడు. రెండురోజుల తర్వాత మళ్లీ సినిమాలో కనిపించాడు," మామూలుగానే అన్నాడు సుబ్బారావు.

"నిజంగానా!" ఆశ్చర్యంగా అడి గాడు గంగిరెడ్డి.

"నిజంగానేనయ్యా! నేను పలక రించాను గూడా. అక్కడేం జేస్తున్నా వన్నాను. అక్కడేఉంటున్నానన్నాడు." వెళ్ళిపొయ్యాడు సుబ్బారావు.

గంగిరెడ్డికి బీరువాలోంచి పోయిన రెండువందల రూపాయలకు ఖర్చు తెలిసి పోయింది. సుధాకర్ విషవలయంలో నుండి తప్పించుకొని రాలేదు మాటల వలయంలో తననూ,శాంతనూ త్రోశాడు. కధను బలమైన కాళ్లమీద నడిపించాడు.

సుధాకర్ దృష్టిలో వాడి తండ్రి గంగిరెడ్డి కాదు..........గంగిరెద్దు.




మొదట గర్వమేమో అనుకున్నాను.

కానీ కాలం గడిచినకొద్దీ యీ అభిప్రాయం నాకు దూరం కాసాగింది. ఆ బిగించిన పెదవుల వెనుక ఏవో కొన్ని మూగవేదనలు, మనలోకి చూసే ఆ కళ్ల వెనుక ఎన్నో బడబాగ్నులు వున్నాయనిపించింది.

అతడు చాలా పొడవుగా వుంటాడు. అతని మాట తీరు, నడక వేగమూ అతన్నొక మూర్తీభవించిన అలసత్వం గానూ, అసాంఘిక జీవిగానూ మనకు తోపింపజేస్తాయి. అతని వయస్సు సుమారు ముప్పై ఏళ్లు వుండవచ్చు. కానీ మాంస విహీనమైన దవడలు, కాంతి విహీనమైన గాజుకళ్లు అతని వయస్సు పదేళ్లు ఎక్కువ చేస్తున్నాయి.

నేను ఆ హైస్కూల్లో వుద్యోగంతో చేరిన రెండవ దినమనుకుంటాను. అలా తోటలోనికి వెళ్ళాను. అక్కడ ఒక చెట్టు క్రిందకూచొని ఎదుట కనిపిస్తున్న పొలాలకేసి చూస్తున్నాడతడు. భూమాత కట్టుకున్న తలిరాకు చీరలా కొండదాకా వరిపొలాలు కనిపిస్తున్నాయి కొండ క్రింద మాత్రము చీర అంచులా చెఱుకు తోటలు కన్పిస్తున్నాయి. ఇంతలో మెరసి, అంతలో అదృశ్యమయ్యే అదృష్టంలా పొలాల మధ్యనుండి బయలు దేరే బాట కొండమీద దేవాలయంవద్ద అంతమౌతుంది.

"మీకి పీరియడ్ లీజరాండి?" అన్నాను.

"కాసంతే" అన్నాడతను లేస్తూ.

"ఇంకా గంట కొట్టలేదండి."

జవాబు చెప్పకుండా వెళ్లిపోయా డతను. నాకు చిత్రమనిపించింది. అతని ఏకాంతాన్ని భంగపరచానేమోనని సమాధానపడ్డాను. కానీ అతని యీ వింత ప్రవర్తనకు ఆశ్చర్యపోయాను ఆ రోజు రాత్రి పడుకోబోయే ముందు మధుసూదనానికి యీ వుదంతం చెప్పాను.

"ఆ శనిగాడి సంగతి నీకెందుకోయ్? వాడెప్పుడూ అంతే!" అనేశాడు మధుసూదనం.

మధుసూదనం నాకు బాల్యస్నేహితుడు. ఈ వూళ్ళో నాకున్న ఒకే ఒక స్నేహితుడు. అసలు వాడిక్కడున్నాడని తెలిసే నేనీ వూరికి వచ్చాను. వాడి భార్య పుట్టింటికి వెళ్లింది కాబట్టి, నేనూ కుటుంబాన్ని పిలుచుకొని వచ్చేదాకా వాడి ఇంట్లోనే నా మకాం. వాడిదొక ప్రత్యేకవ్యక్తిత్వం! కొండ మీదపడితే గోటితో మీటేయగలనన్న విశ్వాసం వుంది వాడికి కానీ ఒకటిమాత్రం నిజం. వాడు పరిస్థితులకు లొంగడు. వాటి నతితేలిగ్గా వ్యాఖ్యానిస్తూ తన కనుకూలంగా త్రిప్పుకోవడంలో సమర్థుడు.

"అది గాదోయ్ ఆతగాడికేమైనా గర్వమా?" "మరేమిటనుకున్నావ్! ఎవరితో మాట్లాడడు. కనీసం నాతో గూడా మాట్లాడడు! సాయంకాలం ఆటలకు కూడా రాడు. అలా అందరితోనూ కలిసి తిరిగితే ఆయనగారి డిగ్రీకి నామర్దా అనుకుంటున్నాడు గాబోలు" అన్నాడు మధుసూదనం.

"నిజమే! కాకుంటే అతనేదో నిర్వికల్ప సమాధిలో వున్నట్టు కూర్చోవడమేమిటి? నేను వెళ్లి పలకరించగానే ధ్యానభంగమయినట్లు లేచి వెళ్లడమేమిటి"...... రోజులు గడుస్తున్నాయి. అతనలాగే వేళకు బడికి రావడం, గంటకొట్టగానే వెళ్లడం, విశ్రాంతి సమయాలలో తోటలో కూర్చొని దూరదూరాల నుండివచ్చి, ఒకచోట చేరి, ఒక ఆకృతి ధరించి, అంతలోనే విడిపోతూ, జీవితాన్ని వ్యాఖ్యానిస్తున్న మేఘాలనో, లేక బడి వద్దనుండి కొండదాకా పరచుకొని, కొండ అడుగులోకి అదృశ్యమయ్యే వరిపొలాలనో చూస్తూ గడుపుతున్నాడు రోజుల్ని.

మధుసూదనం మాటల్ని ఆనాడు విశ్వసించాను. కానీ ఆలోచించేసరికి వాడి నిర్వచనం నిలబడలేక పోయింది. గర్వం వున్నవారిలో నలుగురితోనూ కలసిమెలసి వుండనివారు చాలా తక్కువ. అలాంటివారు ఇతరులతో మాట్లాడినంతసేపూ తమగొప్పదనాన్ని ప్రతి కదలికలోనూ వ్యక్తంచేస్తారు. కానీ యితనిలో అలాంటి ప్రవర్తన కనబడదు. అసలు ఇతరులతో మాట్లాడనే



PRABHANJAN

మాట్లాడడు. మనమై మాట్లాడిస్తే "ప్రశ్నకు జవాబు"గా తప్పుకుంటాడు. తన గొప్పదనాన్ని ప్రకటించుకోడు. అందువల్ల 'అతను గర్వి' అన్న అభి ప్రాయం నాలోనుంచి తప్పుకొంది.

ఒకరోజు హెడ్మాష్టరుగారు అతని కోసం వెదుకుతున్నారు. "తోటలో వుంటారేమోనండి." అన్నాను. "ఓ... అవును. మునాఫ్! తోటలో ప్రభాకరం గారుంటారు. కాస్తపిలు," అన్నారు జవానుతో. "ఆయన తిడ్తారూ సాబ్" అన్నాడు మునాఫ్ జంకుతూ. నేనటే వెళ్తున్నాను. పిలుస్తానులెండి," అన్నాను. 'థ్యాంక్స్' అన్నారు హెడ్మాస్టరు.

తోటలోకెళ్లాను. ప్రభాకరం తన మామూలుచోటే కూర్చొని వరిపొలాల కేసి చూస్తున్నాడు. "ప్రభాకరం గారూ!" పిలిచాను. "ఎవరు?......? ఓ... మీరా కేవహొయ్యారు. "కూర్చోండి. లీజరేగా...!"

అయిష్టంగా కూచున్నాడు. అతని కళ్లు నన్ను చూడటంలేదు. నాలోకి చూస్తున్నాయి. "ఏమిటలా చూస్తు న్నారు?" ప్రభాకరం కాస్త కలవర పడ్డాడు. "అబ్బే...ఏమీ లేదు. ఆ పొలాలకేసి..." వెదుకబోయిన తీగ కాలికే తగిలింది! అవి మామూలు వరిపొలాలే గదండీ!" అన్నాను కాస్త చనువు సంపాదించాలనే ఉద్దేశంతో.

ప్రభాకరం ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి చెప్పడం ప్రారంభించాడు. "అవును...కానీ అవి కోత కొచ్చాయి. మరి నాలుగు రోజుల్లో కోసేస్తారు... అప్పుడు యిక్కడినుండి కొండదాకా భూమి నగ్నంగా కనిపిస్తుంది. విచారంగా వుంటుంది."

ఎవర్నో ఆప్తుల్ని పోగొట్టుకోబోతూ

న్నట్లుగా అతని ముఖం, విచారంగా వుంది.

''పొలం అన్నతర్వాత కోతకు రాకుండా వుంటుందా ? కొయ్యకుండా ఉంటారా...? అసలు పొలాల కోతలు సంతోష జనకాలు గదండీ !'' ''మని షన్న తర్వాత చావటం తథ్యమేగదా. అలాంటప్పుడు యెందుకేడవాలి ? ''వారు ఆప్తులు కనుక.'' ''మీకు మీ బంధువులు ఆప్తులు. నాకీ పొలాలు ఆప్తులకన్నా అధికమైనవి,'' అన్నాడు ప్రభాకరం.

ఈ మాటల్లో అతని జీవితానికి సంబంధించిన రహస్యమేదో ధ్వనించింది. ఈ మాటే అతన్ని గూర్చి నేను ఆలో చించడానికి కారణమైంది. కానీ ఆ మాట వెనుక ధ్వనించిన అతని జీవిత రహస్య మేదో కాగితంమీద రాతలా కాకుండా, నీటిమీద గీతలా అస్పష్టంగా వుంది.

మునాఫ్ వచ్చి హెడ్మాష్టరుగారు పిలుస్తున్నారని హెచ్చరించాడు. ప్రభాకరం వెళ్లిపోయాడు. ''అతనలా మాట్లాడతాడేమోయ్ ఆ రాత్రి మధు సూదనాన్ని అడిగాను.

''ఔను. అతని దీ ప్రాంతంగాదు. కాస్త యాసగా మాట్లాడతాడు'' అన్నాడు మధుసూదనం చదువుతున్న సినిమా పత్రికమీదనుంచి దృష్టి మరల్చకుండానే. కంట్లో పుల్లపెట్టి నట్టున్న వాడి జవాబుకు నాకు ఒళ్లు మండుకొచ్చింది. కానీ వాడి సమాధానం నాలో ఒక ప్రశ్నను రేపింది. ''మరే వూరు ?'' ఈ లోకంలో ఈ ప్రశ్నకు జవాబు తెలిసిన మానవుడొక్కడే వున్నాడు. అతణ్ణడుగు.'' ''ఎవరతను?'' ''ప్రభాకరం'' ! పకపక నవ్వాడు మధుసూదనం.

ఈసారి వాడి నిర్లక్ష్యం చూస్తే గూబ పేల్చెయ్యాలన్నంత కోపం వచ్చింది. వాడి చేతిలోని పత్రిక లాగి విసిరేసి ప్రశ్నించాను. ''ఆ విషయం యెందు కంత రహస్యంగా వుంచాడు ?'' ''అదే మిటి మహానుభావా, అన్నీ రహస్యాలే ! అతగాడు అందరితో కలిసి తిరిగితే గదా యివి తెలియడానికి...వాడూ...వాడి గర్వం...ఛ !''

రాత్రంతా ఆలోచించాను.

ఒక వ్యక్తి సంఘానికి దూరంగా వుండాలని వుంటున్నాడంటే అతని జీవితంలో ఏదో యితరులకు తెలియ గూడని రహస్యం వుండాలి. అతడు ఏకాంతంలోతప్ప జీవింపలేకపోవాలి. నలుగురితో కలిసి తిరిగితే తన నైచ్యం బయటపడుతుందేమోనని అతను భయ పడాలి...

ప్రభాకరానికిది సమన్వయించడానికి ప్రయత్నించాను. కానీ కుదరలేదు. ఆలోచనల్లోనే నిద్రపట్టింది......

ఈ ఆలోచనల్లో ఎనిమిదిరోజులు గడిచిపొయ్యాయి. ఎవ్వరు మాట్లాడిం

చినా బదులుచెప్పని ప్రభాకరం నేను కనిపించగానే చిరునవ్వులాంటిది నవ్వుతూ పలకరించడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

*   *   *

ఆ రోజు బడి వదలిన తర్వాత టీచర్లందరూ ఇళ్లకు వెళ్లిపోయారు. కానీ నేనూ, ప్రభాకరం కాస్త వెనుకబడిపోయాము. "మీరింకా వెళ్లలేదూ?" ప్రశ్నించాడు ప్రభాకరం. "లేదు కాస్త పనుండి ఆగిపోయాను" అన్నాను వెంటనడుస్తూ.

దారి వెంబడి యేవో నిస్సారమైన విషయాలను గూర్చి మాట్లాడుకుంటూ నడుస్తున్నాము. నేనూ, ప్రభాకరం విడిపోవలసిన వీధి మలుపు వచ్చింది. మా మాటలు మాత్రం తెగలేదు. అలా రూముకెళ్లి మాట్లాడుకుందాం రండి" అన్నాడు ప్రభాకరం ఇష్టంలేనిపని చేస్తున్నవాడిలా. "అలాగే" అని వెంట నడిచాను.

గదినిండా సిగరెట్ పీకలు, పుస్తకాలు చిందరవందరగా పడివున్నాయి. నిరంతరం పరచివుండే ఒక పరుపు దుమ్ముకొట్టుకొని పడివుంది. మధ్యలో సగానికి పగిలిన అద్దం కిటికీలో భర్త వదిలిన భార్యలా వుంది. పగిలిన అద్దం ముందు నిల్చొనిముఖం తుడుచుకున్నాడు ప్రభాకరం. అద్దంలో యిద్దరు ప్రభాకరాలు కనిపించారు. ఏదో స్ఫురించి నవ్వుకున్నాను. నా నవ్వు అద్దంలో ప్రతిఫలించిందేమో ప్రభాకరం ప్రశ్నించాడు. "ఎందుకు నవ్వుతున్నారు?" "ఏమీలే...దు." "అలా కూర్చోండి." పరుపుమీద దుమ్ము దులిపాడు. కూర్చున్నాను. అక్కడ పడివున్న పుస్తకమేదో పరుపు ప్రక్కనే పడివుంది. తీసి చూసాను. అదేదో చవకబారు 'సెక్సు' పుస్తకం. "ఈ గదికి బాడుగెంతండీ?"

"పాతిక. స్నానానికి ఆ పొలాల మధ్యవున్న బావికి వెళ్తాను." '...' 'మీకు భోజనం ఎలాగండి?' ప్రభాకరం ప్రశ్నించాడు. "నేను కుటుంబంతో వుంటున్నాను."

ప్రభాకరం 'అలాగా...!' అని కూడా అనలేదు. నానుండి రాబోతున్న ప్రశ్నను వూహించాడు గాబోలు కిటికీ పద్దకెళ్లి నిలబడ్డాడు. కాని నా ప్రశ్న నాలోనే యింకిపోలేదు. "మీరింకా బ్రహ్మచారులేనా?"

ప్రభాకరం గిఱ్ఱున నావేపు తిరిగాడు. గతజీవితంలోని యేదో విషాదాను భూతి రేగినట్లుగా, మారిపోయిందతని ముఖం. "లేదు." అన్నాడు కల్లోలాన్ని తనలోనే అణచుకుంటూ. "అలాగైతే వివాహితులన్నమాట!" "కాదు" అన్నాడు. ఎన్నాళ్ళండీ యీ అయ్యరు కూడు, హాయిగా పెళ్లిచేసుకో కూడదటండీ?" అన్నాను నవ్వుతూ.

ప్రభాకరం ముఖంలో మెరపులా

మార్పు వచ్చింది. అతని పెదవులమీద చిరునవ్వుల ఛవి ప్రాకపోయింది. "చేసుకుందాం. అన్నీ కలిసిరావాలి గదండీ : ఐనా స్త్రీలమీద నాకు నమ్మకం లేదు. పెళ్ళాడ్డం అంటే స్త్రీనేగదా అని భయంగా వుంది," అంటూ నవ్వాడు. అతని హృదయంలోని భావం ఇదిగాదు. బహుశా ఆ భావానికి తొడిగిన చమత్కారం "ప్రభాకరం గారూ! భగవంతుడు చేసిన ఒకే ఒక మంచిపని స్త్రీని సృష్టించడం. స్త్రీ లేకుంటే పురుషుని జీవితం ఒక ఎడారి." "ఇది మీ వ్యక్తిగతాభిప్రాయం. నేను చచ్చినా స్త్రీని నమ్మను." "ఎందుకు" ?—ప్రభాకరం జవాబు చెప్పలేదు.

"ప్రభాకరం గారూ : స్త్రీని దూషించకండి. స్త్రీ అమృతమూర్తి. నేను కూడా ఒక స్త్రీని ప్రేమించాను. ఆవిడ కూడా నాకు మనసిచ్చింది. కానీ మా కిద్దరికీ మధ్యవున్న అగాధం నేను దాటలేనిది. అందువల్ల వాళ్ళనాన్న మా పెళ్ళికి ఒప్పుకోలేదు. అందువల్ల ఆ అఘాతాన్ని ఆవిడే దాటి నన్ను చేరుకుంది. నేడావిడ నా ప్రేమలో తన కష్టాలు మరచిపోతూంది." నావల్ల సాధ్యమయినంత పారవశ్యాన్ని నటిస్తూ అన్నాను.

ప్రభాకరం ముఖం అదోరకంగా ముడుచుకుంది. బహుశా నా కథను గూర్చి అతను ఆలోచిస్తుండాలి...కాస్సేపటి తర్వాత అన్నాడు. 'మీరు చెప్పే స్త్రీ స్త్రీకాదు. ఎవరో దేవత. నేను చెప్పేది స్త్రీల సంగతి'... 'తర్వాత' "నేను కూడా ఒక స్త్రీని...కాదు... నన్ను కూడా ఒక స్త్రీ ప్రేమించింది. అవి కాలేజి రోజులు. ఆవిడ ప్రతిదినం నాకు ఉత్తరాలు రాసేది. నేను తన ప్రేమనంగీకరించకపోతే ఆత్మహత్య చేసుకుంటాననేది. కానీ నేనావిడను ప్రేమించలేకపోయాను. ఆ విషయం ఆవిడకు తెలిపాను...ఆవిడకు తర్వాత వివాహం నిశ్చయమైంది. వివాహానికి ముందు నాకొక ఉత్తరం రాసింది, తాను ఆత్మహత్య చేసుకోబోతున్నానని, అందుకు కారణం నేనేనని. ఆ వుత్తరాన్ని చించిపారేశాను. స్త్రీ ప్రేమకోసం త్యాగం చేస్తుందంటే నమ్మలేకపోయాను...కానీ తర్వాత ఆవిడ నిజంగానే ఆత్మహత్య చేసుకుంది."

ప్రభాకరం చెప్పిన కథ అంతా నిజం అనడానికి వీలులేదు. అందులో పరస్పర విరుద్ధమైన విషయాలు చాలా వున్నాయి...కానీ ప్రభాకరం ముఖం అదోరకంగా మారిపోయింది. తనవద్ద దాచుకున్న ఏ అమూల్యనిధినో నేను దోచుకున్నట్లుగా ఆ గాజుకళ్లు నాలోకి చూస్తున్నాయి. హఠాత్తుగా ప్రభాకరం నా చేతులు పుచ్చుకొని బతిమాలాడు. "దయచేసి ఈ విషయాలు ఎవరితోనూ అనకండి"... మింగుడుపడని దుఃఖం గొంతులో గుడ గుడ లాడింది.



ఎదురుగా నిల్చున్న ఒక మహా వృక్షం ఒక క్షణంలో మాయమైనట్లుగా వుంది, ప్రభాకరంలో కలిగిన ఈ హఠాత్పరిణామం. నేను దిగ్భ్రాంతుణ్ణయి పోయాను. దిగ్భ్రాంతినుండి తేరుకునేసరికి నా గదిలో వున్నాను.

ప్రభాకరాన్నొక స్త్రీ ప్రేమించింది. అతను తిరస్కరించాడు. ఆవిడ ఆత్మహత్య చేసుకుంది. అందువల్ల ప్రభాకరం స్త్రీని నమ్మడు...ఈ సంఘటనలు హేతుబద్ధంగా లేవు. ప్రభాకరాన్ని ఆవిడ నిందించాలిగానీ ప్రభాకరం నిందలో అర్థంలేదు. ఈ విషయాన్నే మధుసూదనంతో అన్నాను.

నా వూహకు మధుసూదనం యిచ్చిన తేలిక వ్యాఖ్యానంలో నాకో విషయం స్ఫురించింది. ప్రభాకరం తనకు తెలియకుండానే ఆవిడను ప్రేమించి వుంటాడు. ఆవిడ చనిపోయిన తర్వాతగానీ ఆ విషయం అతనికి తెలిసి వుండదు. బహుశా అదే సంఘానికి దూరంచేసిన 'నేరం' కావచ్చు.

మరునటి రోజునుంచీ ప్రభాకరం తప్పుకొని తిరగటం ప్రారంభించాడు. నా దర్శనమే అతనికి కంటకప్రాయమైంది. అతను నాకేసి చూసిన ప్రతి చూపులోనూ భయం కనిపించింది.

నాలుగు దినాలు గడిచాయి. ఒక రోజున ప్రభాకరాని కొక ఉత్తరం వచ్చింది. ప్రభాకరానికంటె ముందు 'లెటర్ బోర్డు' లో నేనే చూసాను. ప్రభాకరానికి ఉత్తరాలు ఎక్కువగా రావు. అందువల్ల ఈ వుత్తరంలో అతని జీవితానికి సంబంధించిన రహస్యమేదో తెలియవచ్చు. ఆ వుత్తరాన్ని తీసి చూడాలన్న నీచమైన, అనాగరికమైన కోరిక నాలో కలిగింది. అలా ఉత్తరాలు చూడడం తప్పని ఆ క్షణంలో నాకని

పించలేదు. ఆ వుత్తరాన్ని ఎవరూ చూడకుండా జేబులో వుంచుకున్నాను. రాత్రి పడుకోబోయేముందు వుత్తరాన్ని చించి చదివాను.

చిరంజీవి కుమారునికి,

మీ నాన్న ఆశీర్వాదాలు—

నీకు యిదివరకు చాలా ఉత్తరాలు వ్రాశాను. ఒక్కదానికి గూడా నువ్వు జవాబు వ్రాయలేదు. నీ కోసం మీ అమ్మ బెంగపెట్టుకుంది. చెల్లి నీ గుర్తే మరచిపోయింది. ఇంత శిక్షకు మేము చేసిన ద్రోహ మేమిటి ?... ఆ జరిగిన ద్రోహం దైవమే చేశాడు...చివరిసారిగా రాస్తున్నా, ఈ సెలవుల్లోనైనా యింటికిరా..." ఉత్తరం ఎక్కడినుంచి వచ్చిందో చూసాను. విజయనగరం.

ఉత్తరం ఒక సమస్యను పరిష్కరించినా అనేక అనుమానాలు రేపింది. ప్రభాకరానికి కన్నవారు, తోబుట్టిన వారుకూడా వున్నారు ; కానీ అతడు వారిమీదవున్న మమకారాన్ని తెంచుకొని వారికి దూరంగా జీవిస్తున్నాడు. తల్లి దండ్రులమీద ప్రేమ, మమకారం కూడా ప్రభాకరంలో ఎందువల్ల నశించాయి ? అలాంటి అపరాధం వారేం చేశారు ?...సమాధానాలు రాని ప్రశ్నలు కుప్పతెప్పలుగా ఉద్భవిస్తున్నాయిగానీ ప్రభాకరం సమగ్రరూపం మాత్రం పొడగట్టలేదు.

రాత్రల్లా నిద్రను దూరంచేసి ఆలోచించాను. పరస్పర విరుద్ధభావాల సంఘర్షణ తప్ప ఒక నిర్ణయానికి గూడా రాలేకపోయాను...ముఖ్యంగా రెండే రెండు ప్రశ్నలు నా ఆలోచనా మార్గానికడ్డు నిలిచాయి— అతణ్ణి ప్రేమించిన స్త్రీ ఆత్మహత్యవల్ల తన వారికెందుకు దూరమయ్యాడు? ప్రభాకరానికి "దైవం చేసిన ద్రోహం" యేమిటి ?

రెండవ రోజు ఆ ఉత్తరాన్ని యథాతథంగా అతికించి 'లెటర్ బోర్డు' లోనే వుంచాను. ఆ ఉత్తరాన్ని అందుకొన్న ప్రభాకరంలో కలిగే మార్పును పరిశీలించాలనుకున్నాను...'మీకేదో ఉత్తరం వచ్చినట్లుంది. తీసుకున్నారా ?' ప్రశ్నించాను-ఆ రోజు సాయంకాలం. 'ఆఁ... తీసుకున్నాను,' అన్నాడు ప్రభాకరం మామూలుగానే. నేను పరిశీలించాలనుకున్న పరిణామం ప్రభాకరంలో కలుగలేదు. ఇలాంటి ఉత్తరాలు రావటం అతనికొక మామూలు విషయంలాగుంది......"ఒరేవ్! నీకొక రంజైన విషయం చెప్పనా ?" అన్నాడు మధుసూదనం ఆ దినం రాత్రి పడుకోబోయే ముందు.

"ఏమిటోయ్ ?" అన్నాను చిరాగ్గా. "అంత చిరాకెందుకోయ్ ! అసలు నేను చెప్పాలనుకున్న విషయం చెప్పనంటే అమాంతం మదీయ చరణ పంకజాలు పట్టుకొని బ్రతిమాలి హోటల్‌కి తీసుకెళ్ళి జాంగ్రీ వగైరాలు నైవేద్యం పెట్టి మరీ బ్రతిమాలుకుంటావ్, ఆ విషయం చెప్పమని." "ఏమిట్రా అంతలావాటి

సంగతి." "శ్రీ ప్రభాకరంగారి ప్రేమ లీల."

నన్ను ఆశ్చర్యం తల మున్కలు చేసింది. ప్రభాకరం జీవితంలో యింకా శృంగారానికి చోటు వుంటుందని నేను అనుకోలేదు. నాకు కలిగిన ఆశ్చర్యం విచిత్రమైంది. నేను నిర్ణయించుకొన్న రేఖల్ని, జరిగిన విషయాలు చెరిపేస్తే కలిగిన ఆశ్చర్యమది! 'అసలు సంగతేమిటోయ్!' ఆ...అలారా దారికి! నిన్నరాత్రి రాజశ్రీ ప్రభాకరంగారి రాజనగరులో ఒకానొక స్త్రీ రత్నం వున్న అనుమానం కలిగిందొక నవయువకునికి. ఆ రహస్యమేమిటో తేల్చుకోవడానికి గదిబైట గొళ్ళెం పెట్టాడట, ఆ నవయువకుడు...బయట కూర్చొని కాపలాకూడా కాశాడట. తీరా చూస్తే ఆ నవయువకుడిగారి చెల్లెలేనట, ఆ స్త్రీ రత్నం! అందువల్ల ఆ రహస్యం అంతటితో గప్ చిప్!"

మధుసూదనం మాటలు క్రాస్ వర్డు పజిల్స్ లాగున్నాయి. అందులో నేను వూహించి పూర్తిచేసుకోవలసినవి కొల్లలుగా వున్నాయి. శ్రమించి పూర్తిచేసుకున్న తర్వాత అవి నా నిర్ణయాలకు వ్యతిరేకంగా వుండటం ఖాయం. అందువల్ల ఆలోచించడం మానుకున్నాను.

"పోనివ్వు మధుసూదనం! ఎవరే ఏటి వెంట కొట్టుకపోతే మనకేం! ఐనా అతనలాంటి వాడంటే నేను నమ్మను" అన్నాను. మధుసూదనం బిగ్గరగా నవ్వాడు. "ఒరేయ్ నాన్నా! నేను చిన్నపిల్లాణ్ణి కానురా నీ మాటలకు పొంగిపోవడానికి...అయినా విను, మీ ప్రభాకరం గారికి స్త్రీలమీద ఎంత ద్వేషం వుందో అంతకు రెండింతలు వారి అవసరం కూడా వుంది.

"చాల్లేవోయ్" నేను కోపంగా, "అందుకేరా నాలాంటి గొప్పవాళ్ళన్నారు ప్రేమలో నమ్మకం వున్నవాడికి ప్రేమలోని విషాదం తెలుసు. ప్రేమలో నమ్మకం లేనివాడికి ప్రేమలోని మాధుర్యం తెలుసు అని." బిగ్గరగా నవ్వి. దుప్పటి కప్పుకున్నాడు మధుసూదనం.

రోజులు గడుస్తున్నాయి ... ఒక రోజున హఠాత్తుగా మా అక్కయ్య దిగింది. ఆవిడ తిరుపతి కాలేజీలో లెక్చరర్. నన్ను చూడాలనిపించిందట. వచ్చేసిందట. ఆ రోజు రాత్రి యిద్దరం సినిమా కెళ్ళాము, ఆ వూళ్లో ఒక చిరుగుల "టెంటు" వుంది. అందులో నేను ఏడవ తరగతి చదివే రోజుల్లో చూచిన సినిమాలు ఆడుతుంటాయి. చరిత్ర చదువుకున్న అక్కయ్యకు పాత వస్తువులన్నా, అందరూ మరచిపోయిన సంఘటనలన్నా చాలా యిష్టం! మా అక్కయ్య ఆ చెత్త సినిమా చూచితీరాలంది! వెళ్ళాము...సినిమా ప్రారంభమైన కాస్సేపటికి ప్రభాకరం వచ్చి మా పక్కనే కూర్చున్నాడు. నేను పలకరించాను.

"ఓహో... ఆఁ... అలాగా సినిమా కొస్తారా!" అన్నాడు అక్కయ్యకేసి చూస్తూ. సినిమా చాలా అసభ్యంగా వుంది. మధ్య మధ్య బూతులాంటి నాటు రకం చలోక్తులు, అర్ధనగ్న నాట్యాలు విసుగెత్తించాయి. కాని ప్రభాకరం చాలా ఉత్సాహంగా చూస్తున్నాడు. ఎల్లప్పుడూ బిగించబడి వుండే అతని పెదవులు కొద్దిగా విచ్చుకున్నాయి. మాంసం లేని బుగ్గలమీద చర్మం ముడుతలు పడివుంది.

'ఇంటర్వెల్'లో ప్రభాకరానికి అక్కయ్యను పరిచయంచేసాను. "నమస్కారమండీ!" అన్నాడు ప్రభాకరం వుత్సాహంగా. మళ్లీ సినిమా ప్రారంభమైంది. సినిమా వదిలేవరకూ యిద్దరూ మాటల్లోపడ్డారు. అక్కయ్య ఒక గచ్చకాయల కుండ! మాట్లాడకుండా క్షణం వుండలేదు. కానీ ప్రభాకరం కూడా అక్కతో సమానంగా మాట్లాడుతున్నాడు. పరస్పర అభినందనలు, ఖండనలూ నవ్వుతో కలసి నా కర్ణపుటాలను చేరుతున్నాయి... సినిమా వదిలారు. సెలవు తీసుకొని ప్రభాకరం వెళ్లిపొయ్యాడు.

"ఎవర్రా ఈ ద్విపాద జంతువు?" అంది అక్కయ్య. "ఏం?" "అలా చూస్తాడేం? ఎప్పుడూ ఆడదాన్ని చూడలేదా ఏం?" "ఎలా చూస్తాడేమిటి?" "వికృతంగా నమిలి మింగెయ్యాలన్నంత ఆశగా!" "పాపం! అవివాహితుడు. అందుకు కారణం వుంది. అతణ్ణో అమ్మాయి ప్రేమించింది. అతను తిరస్కరించాడు. ఆవిడ ఆత్మహత్య చేసుకుంది. ఆనాటినుండి అతను స్త్రీ అంటే మండిపడతాడు." "అదిగాదురా చవటా! అందుకు ఆవిడ యితణ్ణి నిందించాలి గాని యితనెందుకు ఆవిడను నిందించాలి? నే చెప్పనా అసలు విషయం! ఏ ఆడదీ యితగాణ్ణి ప్రేమించదు. స్త్రీకి నచ్చేగుణా లితనిలో లేవు." "ఇది నాలుగైదేళ్ళనాటి సంగతి" అన్నాను. "నాలుగైదేళ్ళుగానీ, నలభైయేళ్ళుగానీ నే చెప్పింది నిజం. వాడి ముఖం చూస్తే తెలీడంలేదూ! శుద్ధ దగాకోరు ముఖం! పాపం. ఆ అమ్మాయికి అన్యాయం చేసుంటాడు. అందువల్ల ఆ అమ్మాయియే బావిలోనో దూకుంటుంది! ఆఁ... వీడుమాత్రం అలా చావకుండా పోతాడేమిటి!"

నేను జవాబుచెప్పడానికి ప్రయత్నం చెయ్యలేదు. ఎందుకంటే మధుసూదనం అన్న మాటల్ని ఆవిడ ధృవపరిచింది. ప్రభాకరానికి స్త్రీయొక్క అవసరం వుంది. అది బహిర్గతం కాకుండా వుండటానికి అతను తగిలించుకున్న ముసుగు స్త్రీ ద్వేషం. కొన్ని యదార్థాలు తర్కానికి నిలబడకపోవడంతో ఆశ్చర్యం లేదు. అంతమాత్రంచేత వాటిని నమ్మకపోవడానికి వీల్లేదు.

...ఇలా దినానికొక క్రొత్త సంఘటన



చూచి దినానికొక క్రొత్తవార్తవిని విభ్రాంతుణ్ణయ్యేవాణ్ణి. ఈ సంఘటనలు, వార్తలు, నన్ను మరింత కలవర పెట్టాయే గానీ ప్రభాకరాన్ని అర్థంచేసుకోవడానికేవిధంగానూ ఉపకరించలేదు. మరికొన్ని రోజులకు ప్రభాకరానికొక ఉత్తరం వచ్చింది. నా అలవాటుప్రకారం ఆ ఉత్తరాన్ని దొంగతనంగా చించి చదివాను. ఆ ఉత్తరం నాలో అంతకు ముందున్న కరుడుకట్టిన ఆలోచనల్ని చెరిపేసింది. ప్రభాకరంలాంటి మిశ్రమ మనస్తత్వంగల వ్యక్తిని పరిశీలించడం సులభంకాదని నిరూపించింది. ఉత్తరం రాసిన ఆవిడపేరు సీత!...ఆవిడ ప్రభాకరం భార్య – తను చేసిన 'అపరాధాలు' క్షమించమని ప్రార్థిస్తూ తను ఫలానా రోజున బయలుదేరి వస్తున్నానని రాసింది.

మామూలు ప్రకారం ఉత్తరాన్ని ప్రభాకరం అందుకున్నాడు. ఆ పూట నుండి నాలుగు రోజులు సెలవుపెట్టాడు. ఒకమాటలో చెప్పాలంటే ఆ ఉత్తరం అతణ్ణొక పిచ్చివాణ్ణి చేసింది.

ఇంతలో బెజవాడనుండి మా తాతగారు ప్రమాదావస్థలో వున్నారన్న వార్త అందింది. నేను ఆ రోజే బయలు దేరాను. అదృష్టవశాత్తు నాలుగు దినాల్లో తాతగారి ఆరోగ్యం కాస్త కుదుట బడింది. నేను మళ్లీ తిరుగు ప్రయాణం ప్రారంభించాను. ఈ నాలుగుదినాల నుండి సరిగా నిద్రలేనందున బడలికగా వుంది. అందువల్ల కాస్త మేను వాలుద్దామనిపించింది. రైల్లో జనం అంతగా లేరు. ఉన్నవారందరూ జోగుతున్నారు. రైలువేగం తగ్గింది. ఏదో స్టేషన్ వచ్చేలాగుంది. బహుశా ఈ స్టేషన్‌లో జనం ఎగబడతారు. అందువల్ల పడక పరచసాగాను. అంతలోనే

రైలు ఆగింది. అదృష్టవశాత్తు ఎవరో ఒకావిడ మాత్రమే ఎక్కింది. చేతిసంచి మినహా మరేమీ సామాను కూడాలేదు.

ఆవిడ అందక త్తె అనడానికి వివర్శనాలు లేవు. లోపలికి అడుగుపెట్టగానే కనుబొమ్మల విల్లులో సమ్మోహనాస్త్రం లాంటి చూపును సంధించి విసరింది... ఆ చూపే ఆవిడ అందం ! ఆ చూపే ఆవిడ జీవనాధారం కూడా కావచ్చు !... ఎందుకైనా మంచిదని నిద్ర నటించటానికి ప్రయత్నించాను......

నాకు మెలకువ వచ్చేసరికి రైలు ఏదో స్టేషన్‌లో ఆగివుంది. మెలకువ వచ్చినా యింకా మగత వదల్లేదు. అలాగే మత్తుగా వాచికేసి చూసుకున్నాను. రాత్రి మూడున్నర ! ఉన్నట్లుండి ఆవిడ జ్ఞాపకం వచ్చింది. చుట్టూరా చూశాను. అవలివైపు కిటికీలోనుండి ఆవిడ ఎవరితోనో మాట్లాడుతోంది. పెట్టెలో ఎవరూ లేరు ! ప్లాటుఫారంమీద దీపాలు అతనిమీద వెలుగును ప్రసరింపజేస్తున్నాయి. అల్లిన బనీను ప్రస్ఫుటంగా కనిపించే తెల్లని మల్లులాల్చి, మధ్య పాపిటి తీసి యిరువైపులకూ ఎగదువ్విన క్రాపింగు, కావురేసి పోయిన రెప్పల మధ్య నిప్పు కణికల్లాంటి కళ్లు ! నల్లబారిపోయిన పెదవులు ! ఒకసారితణ్ణి చూస్తే జన్మలో మరువలేము.

"ఈడనే దిగు !" అంటున్నాడతను. 'ఊహూ' అందావిడ. "అట్లాయే పతివ్రత వయ్యావేంటి !" చెట్లు విరిగి పడినట్లుగా నవ్వాడతను. ఆవిడ కళ్ళు తుడుచుకుంది. "దిగమంటే ఏంటీ వరస !" "క్షమించు ! నేను దిగను ! ...మరచిపో."

జవాబుగా అతను లోపలికొచ్చాడు. నేను నిద్రనటిస్తూ గమనించాను. అతను ఆవిడ చేయిపట్టుకొని బలవంతంగా దింపబోయ్యాడు. "నా మాట విను..." ఆవిడేమో చెప్పబోయింది. "రేపెల్లు గానీలే !''

చెయ్యిపట్టుకొని బలవంతంగా దింపాడతడు. ఆవిడ విసుక్కుంటూ దిగింది ! తృప్తిగా వూపిరి పీల్చుకున్నాను...

అందుకోవలసిన బస్సు తప్పిపోవడం వల్ల ఆలస్యంగా ఇల్లు చేరాను. బడికి ఆలస్యమౌతుందేమోనని బడివద్దనే బస్సు ఆపి దిగాను.

బడి బజారులా వుంది. ఒకటే అరుపులు, కేకలు ! ప్రతి చెట్టుక్రిందా జనం గుంపులు గుంపులుగా చేరి ఏదో విషయాన్ని తీవ్రంగా చర్చించుకుంటున్నారు !

మధుసూదనం ఎదురయ్యాడు. "ఏమిటోయ్ ఈ సంత" ఆత్రంగా ప్రశ్నించాను. "సంతకాదు భయ్యా వింత ! నీకు బ్రహ్మాండమైన విషాద వార్త." "ఏమిటి ?" "మీ డియర్ ప్రభాకరం బాల్చీని తన్నేశాడు." ''అంటే ?" "అంటే నిన్నటి ఉదయం

జలక్రీడలకని సరోవరాని కెళ్ళిన శ్రీ ప్రభాకరం మహారాజులుంగారు ప్రమాద వశాత్తు ఆ జలకన్యల కౌగిలిలో శాశ్వతంగా కన్నుమూశాడు."

నా మెదడులోని రక్తనాళాలన్నీ ఒక్కసారిగా బ్రద్దలయినట్లయింది. నా తలలో వెయ్యి అగ్నిపర్వతాలు ఒక్కసారిగా విచ్చుకున్నాయి. ఆ రోజు బడికి సెలవు వదిలారు. అందరం బావి దగ్గరికి వెళ్లాము. అప్పటికే పోలీసులు శవాన్ని బయటికి తీశారు. అందరిలోకీ చూచే ఆ కళ్లు యింకా తెరుచుకునే వున్నాయి. కానీ జలచరాలు వాటిని తూట్లు పొడిచేశాయి. నిరంతరం బిగించి వుండే ఆ పెదవులింకా బిగించబడే వున్నాయి. అవి విచ్చుకుంటే ప్రభాకరం అర్థం అవుతాడేమో ?

అప్రియత్నంగా నా కళ్ళలో రెండు కన్నీటి బిందువులు నిలిచాయి. కళ్ళు తుడుచుకునేందుకు జేబురుమాలు కోసం జేబులో చెయ్యిపెట్టబొయ్యాను. "ఇదిగో ... " అందిచ్చాడు మధుసూదనం నవ్వుతూ.

* * *

మరుసటిదినం నేనూ మధుసూదనం బస్‌స్టాండ్‌వద్ద నిలబడి వున్నాము.

"ఏమండీ !" ఒక స్త్రీ కంఠం పిలిచింది. వెనుదిరిగి చూశాను. కాళ్ళు భూమిలో కూరుకుపోయాయి. కనుబొమల విల్లులో సమ్మోహనాస్త్రంలాంటి చూపును సంధించి వదిలిందావిడ ! "ఏమిటండీ ?" అన్నాడు మరొకర్కడు నేను గాకపోయినా. "ప్రభాకరం మేష్టారుగారిల్లు తెలుసా" ... "మీ రెవరండీ ?" సభ్యతను జయించి దూసుకొని వచ్చింది నా ప్రశ్న. "వారు ... మా వారే !"

అంతమాత్రమే నాకు వినిపించింది ... ఆ శైలు ... ఆ చూపు ... ప్రభాకరానికి వచ్చిన ఉత్తరం. పెదవులు బిగించి రహస్యాలు దాచుకున్న ప్రభాకరం భౌతికదేహం — అన్నీ నా మనస్సులో గిర్రున తిరిగాయి.

"మధుసూదనం !" "ఏం ?" అన్నాడు మధుసూదనం ఆవిడకేసి ఆశ్చర్యంగా, కోరగా చూస్తూ. "ప్రభాకరం పొరబాటున బావిలో మునిగిపోలేదు ... ఆత్మహత్య చేసుకున్నాడు."

ఏ నాడూ ఒక విషయాన్ని గూర్చి రెండు నిమిషాలు ఆలోచించి యెరుగని మధుసూదనం ఆలోచనలో పడ్డాడు.



# సావిత్రి

### చండీదాస



సావిత్రి యింటి గుమ్మంలో కొచ్చి నుంచుంది. వొస్తాడన్న నమ్మకంలేని భర్త, వొస్తాడన్నట్లుగా చూసింది.

దుమ్ములోపడి నలిగిపోయిన తమల పాకులా ముఖం-విషాదంతో వాడిలింది. బాగా మాసిపోవటంవల్ల, నెయ్యటమే చిరుగుల్తో నేసినట్లనిపించే వాయిల్‌చీర, నలిగిందని అనటానికి వీల్లేనంతగా నలిగి వుంది. గూటి దగ్గిర పిగిలిన బ్లౌజు లోపల—ఆ తినే అర్థాకలి తిండీ మరే అవయవానికీ దక్కకుండా గుంజేసి నట్లుగా అనిపించే గుండ్రటి స్తనాలు; తేరగా వొస్తే తినిబలిసిన ఆడపడుచుల్లా వున్నాయి. ఏ ఆడదైనా అందంగానే కనిపించే చిత్రకార్తికళ్ళకి తప్ప, సావిత్రి అందంగా వుంటుందని మరెవరికీ స్ఫురించదు. అలా వున్నపళంగా రోడ్డువెంట వెడుతోంటే; యే మగచూపులూ ఆమె మీద ప్రత్యేకంగా వాలవు. డబ్బునే సబ్బుతో స్నానంగానీ చేయిస్తే, సీరి యళ్ళు రాసేవాళ్ళకి కతికినంత మేతవుతుంది.

సావిత్రి దరిద్రంగావుంది. దరిద్రం వల్ల దరిద్రంగా వుంది. దరిద్రం యెలా వుంటుందంటే-దరిద్రం మరి దేన్లాగానూ వుండదు. దరిద్రం దరిద్రంలాగానే వుంటుంది. దరిద్రం నెత్తిన అలంకారాల కుచ్చుతురాలూలు పెట్టినా దరిద్రం

అంటే తెలియనివాడికి దరిద్రం అంటే తెలియదు. అది అనుభవైకవేద్యం. అందేత అది మీకనుభవంలోకి వొచ్చి వుండకపోతే, చెప్పి లాభంలేదు; వొచ్చి వుంటే, చెప్పాల్సిన అవసరంలేదు. మరి దేవిఁటంటే, తిరిగేకాలూ, తిట్టేనోరూ లాగా రాసే చెయ్యిన్నూ—

చూడనట్టుగా చూసి; చూసినట్టుగా చూడకుండా, లోపలికి వెళ్ళింది. మళ్ళీ వొచ్చింది. మళ్ళీ వెళ్ళింది. మళ్ళీ వచ్చి మళ్ళీ వెళ్ళింది, వెళ్ళి చూసింది —

వూచబొవికల గూట్లో బిరబిగిసిన యేణ్నర్థం పిల్లణ్ని పట్టుకుని అంట కాగిపోతోంది, జ్వరం. చూట్టానికి యేణ్నర్థం పిల్లడిలాగే వున్నాడుగానీ, వాణ్ని మూడేళ్ళ క్రితమే కనింది, సావిత్రి. వారంరోజులుగా వేకతప్పకుండా, ధర్మాసుపత్రి వాళ్ళిచ్చిన రంగునీళ్ళు వాడికి తాగిస్తూనే వుందిగానీ, ఆ నీళ్లకి చల్లబడిపోయే వేడికాదది. అక్కడకీ, దొరికిన మేరకి అప్పుచేసి తెల్లటి మందుబిళ్ళలు వాడింది. రంగుల ముచ్చిక మాత్రలూ, యింజక్షన్లూ వాడితే తప్ప లాభంలేదని పొద్దుటనగా కసురుకున్నాడు, ఆ వీధి మొగనవున్న డాక్టరుబాబు. ఏభయ్ రూపాయలన్నా లేంది అవి రావు. మధ్యాన్నం కూటికొచ్చినప్పుడు మొగుడితో అంటే, యాభయ్యే గదా గంటలో పట్టుకొస్తానని వెళ్లాడు. ఆ మొగుడి కోసం అన్నట్టుగా, ఆ గూట్లో యిందాకట్నుంచి అటూ యిటూ తిరిగింది.

వొంగి పిల్లాడి వొంటిమీద చెయ్యి వేసింది. ఆమె కంట్లోంచి నీటిబొట్లు రాలింది. కాలుతున్న వొంటిమీద పడేందేమో; పడుతూనే ఆవిరైపోయింది. బాబా అని పిలిచింది. ఎద్దరికి మువ్వ కంచుగోడలా జ్వరం అడ్డుకుంటటం వల్ల వాడికి వినిపించలేదు. వేళ్లో కదిలింది. గుండె గొంతుకి చేసుకుని బాబా బాబా అని పిలిచింది. కళ్ళ రెప్పలు తెరుచుకోవటమైతే తెరుచుకున్నాయిగానీ, మూసుకోవటం యిష్టం లేనట్టుగా ఆగిపోయాయి. వాడి ముఖానికి అరచేతులు చుట్టి బాబా బాబా, అంటె. వినిపించిందిలే-అన్నట్టుగా రెప్పలు ముడుచుకున్నాయి. కాసేపు మెక్కడిగాలి చాలనంతగా పీలుస్తున్నట్టూ, మరి కాసేపు పిసరంత గాలికూడా పోనివ్వకుండా అడ్డుకున్నట్టూ - కదుల్తూ, బిగదీసుకుంటూ-సావిత్రిని కాల్చేస్తున్నాడు.

లేచి నుంచుని, మళ్ళీ గుమ్మంలోకి వెళ్ళింది. తన భర్త రాడు, వేళకి వచ్చేవాడే ఐతే, మందులకి డబ్బులు తెచ్చేవాడే ఐతే; అతను తనకి భర్త అయ్యేవాడే కాదు—అన్నట్టుగా తల కదిపి, లోపలికి వొచ్చింది. కింద చతికిలబడి పిల్లాడి మీద చెయ్యివేసింది. ఆ ఆదుర్దాలో భయంలో బలహీనంగా కొట్టుకుంటున్న నాడి, అసలు కొట్టుకోనట్టుగా అనిపించింది, ఆమెకి. భయంతో కంపించింది—

అనంతంలోకి నిశ్చలంగా చూసింది.

లేచి నిలుచుంది. కనురెప్పలు వాల్చి శ్వాస గట్టిగా పీల్చింది.

గబగబా ముఖమూ, కాళ్ళూ చేతులూ కడుక్కుంది. రేకుపెట్టె అడుగునవున్న కొత్తమాయని పాతచీర తీసి కట్టింది.

వీధిలోకొచ్చింది. వడివడిగా నడుస్తోంది. మసకమసకగావున్న బొమ్మల్లా ఆలోచనలు జరిగిపోతున్నాయి, వెనక్కి — ఆమె శేషావతారం యింట్లో వంటమనిషిగా వుంటున్నప్పటి దాకా.

వంటమనిషిగా వుండతగనిదే ఐనా; అప్పట్లో శేషావతారం యింట్లో వంట మనిషిగా వుండేది, సావిత్రి. ఎందుకుండేదంటే; ఆఫీసర్లుగా వున్నవాళ్లలో చాలామంది గుమస్తాలుగా వుండాల్సినట్లూ గుమాస్తాలుగా వున్నవాళ్ళలో చాలామంది ఆఫీసర్లుగా వుండాల్సినట్లూ వుండాల్సివచ్చినందుకు వుండేది.

శేషావతారం యెంతో దయగాచూసేవాడు. ఆయన భార్య నోటి గట్టితనమే గానీ, మనసు మెత్తన. పిల్లలు యే విషయమూ పట్టించుకునే వాళ్ళుకాదు. సావిత్రి తొమ్మిదో తరగతిదాకా చదివినట్లు తెలిసిపోయాక; తీరికసమయంలో చదువుకుంటూ మెట్రిక్ పరీక్షకు కట్టమన్నాడు. పుస్తకాలు కొనితెచ్చాడు. అప్పటికింకా సావిత్రికి మొగుడవని సావిత్రి మొగుడు, అప్పట్లో శేషావతారం యింటికి అడపాదడపా వొచ్చి పోతుండేవాడు. అతను, శేషావతారానికి దూరపుచుట్టం రూపాయీ రెండూ అడిగి పుచ్చుకుపోతూవుండేవాడు. పనీపాటాలేదు. జులాయి తిరుగుడు. కిళ్ళీబడ్డీపెట్టుకుని కుదురుగా చేసుకునేట్లయితే డబ్బు సర్దుతారా వెధవా బాగుపడు—అని శేషావతారం వోరోజున అంటే; సరేనని బడ్డీ తెరిచాడు.

మాటలపోగేమో; బాగానే నడిపాడు. అప్పుడప్పుడూ చాటుగా తాగేవాడు. వందా యాభయ్ శేషావతారం దగ్గరే దాచుకుంటూ వుండేవాడు. సావిత్రి కంటపడితే నిలువుగుడ్లేసుకుని చూస్తూ వుండిపోయేవాడు. ఏణ్నర్థం అలా గడిచింది. అంతలో సావిత్రి మెట్రిక్ పాసయింది. మంచి కుదురూ అదీ అబ్బిందని మెచ్చుకుని, అతనికీ సావిత్రికీ పెళ్ళిచేశాడు శేషావతారం. ఆ తరవాత కిళ్ళీబడ్డీలోనే బ్రాకెట్టూ అదీ మొదలెట్టి ఐదారువేలు సంపాదించాడు. ఆ మీదట, బడ్డీ యెత్తేసి, లారీలనీ యివనీ అవనీ దిగి; రాజమండ్రి నుంచి కాకినాడకి మకాం ఎత్తేశాడు. కాకినాడ వచ్చాక సావిత్రి పిల్లణ్ని కనింది. ఆ వ్యాపారమనీ యీ వ్యాపారమనీ ఆ డబ్బు హరించింది. యెందులోనన్నా నాలుగురాళ్లు గిడితే తాగుడూ గట్రా అనుపానాలతో గడుపుతాడు.

ఇల్లు గడవక సావిత్రి, ఎలిమెంటరీ స్కూల్లో టీచరుగా చేరింది. పక్కవీధిలోనే స్కూలు. దాంతోటే సంసారం

గడవటం. అందులోంచి కూడా యెప్పు డన్నా ఐదూ పదీ గుంజుకుపోతూ వుంటాడు. సావిత్రి అప్పుడప్పుడూ అను కుంటూ వుంటుంది—తను, యీ పెళ్ళికి సిద్ధపడకపోతే బాగుండేదని. తనంటే యిష్టపడినవాడు, కుదురుగా వ్యాపారం చేస్తున్నవాడు భర్త అవటం; అందునా, తనని కూతుర్లా ఆప్యాయంగా చూసే శేషావతారం సూచించటంవల్లా, అందుకు యిష్టపడింది. కిళ్ళీబడ్డీ ఎత్తేసి యేవేవో వ్యాపారాలంటూ మొదలెట్టి నప్పుడు, శేషావతారం చాలా నొచ్చు కున్నాడు; చివాట్లేశాడు.

శేషావతారం కళ్ళముందు మెదిలే సరికి ఆమె కళ్ళు తడిబారాయి.

* * *

"వో టీ యిచ్చుకో గురూ" అని పోలి శెట్టికి ఆర్డరేసి కొయ్యబెంచీమీద కూచు న్నాడు సింహాచలం. అంతలో దూరాన కోదండం కనిపించడంతో లేచి నుంచుని గ్లాసు అందుకుని గబగబా తాగేశాడు. రిక్షా జోరుగా తొక్కుతూ కోదండం దగ్గరికి వెళ్ళి, ఆపి దిగుతూ, 'యేటి గురూ నాన్నచ్చిపోనాననేటి, నడిసిపోతం డావ్!' అన్నాడు.

'నువ్ చచ్చిడానికి ముందు యీ వూరు సావాల్రా, సింహాచలం!' అని, బొరబొరా నవ్వాడు, కోదండం.

'యియ్యాల ఆటలో కూచోలేదేటి గురూ!'

'కూచుంటే యాభయ్ రూపాయల్దొబ్బి నయ్. కైలాసంగాడికి నలభయ్ అప్పు డ్డాను యిచ్చి కదలమన్నాడు. చిరాకెక్కి తుకొచ్చి ఆణ్ణి నాలుగుతికి యిలా పైకొ చ్చీను'

'యెక్కు గురో పోదాం.'

'యేటి గిరాకి, నోట్లేవన్నా రాలి నయ్యేటిరా!' అంటూ, రిక్షా యెక్కాడు, కోదండం.

యెగిరి సీటుమీద కూచుని రిక్షా తొక్కుతూ, 'కోడి పులావ్ తిందారేటి గురో!' అన్నాడు సింహాచలం.

'టీ నీళ్ళకి డబ్బుల్లేక నేనేడుస్తోంటే, పులావంట, పులావ్!' బొరబొరా నవ్వాడు.

'పారం కోడనుకుంతనానేటి గురో? యింటి పెట్ట మొకమీదకి పయిటికొంగే సుకుని; వోజిశ్రీ నాగుందంటే నమ్మ గురో! మీసాల బావు నాడ్జిలో యెట్టొ చ్చీను.'

'యింటి పెట్టాలేదు. స-త పెట్టాలేదు; వల్లకుండరా. ఐనా యీ రోజుల్లో సాని ముండలు సంసారుల్లాగా వేషాలేసు కునీ స్తన్నారు?'

'లేదు గురూ; కొత్త సరుకు. యెలట్రీ స్తంబం అవతడ సెట్టు పక్కన నిలబడి పిలిసింది. యెక్కి కూకుని, యేదన్నా లాడ్జికి తీసికెలమంది. నానామాత్రరం కానుకో లేనేటి! సందేహంనేదు; కొత్త సరుకే. ఐదు రూపాయల్నాకి

డాసికి అచ్చుకునింది. మీసాల బావుకి పది. మరైతే రేపు తగనంపి. సరైమ్మ. యేడో నెంబరు గదిలో కూర్చోబెట్టి జగ్గారావు కాడికెళ్లాను. అదునేదు. వుంటే అడ్ని తీసికెళ్లి దింపేసి, ఐదు రూపాయల్నోటుతో సీపు సరుకుచ్చుకుందామను కున్నాను. యేటి సెయ్యటవా అని ఆలో చిస్తా టీ నీళ్ళు తాగుతాంటే; నువ్వగు పిచ్చీవు గురూ. నీ జన్మలో అనాటి సరుకు సూసుండవు. యెదవ డబ్బయ్ రూపాయిలు, యియాల తగలేత్తాం, రేపు సంపాయిత్తాం - పోదారేటి గురో ?'

కోదండం మనసు పీకసాగింది. సాలోచనగా బుర్ర కదుపుతూ, 'జేబులో డబ్బులుంటే నువ్వడగాలంటరా నన్ను !' అన్నాడు.

'నీకేటి గురో, యెవడ్నడిగితే యియ్యడంట ! గుర్రాజు సారాకేసులో సాచ్చికం యిచ్చీవుగా ; అడ్నడుగు.'

'సాక్షిం పేరుమీద అప్పుడే నూట యాభయ్ దాకా గుంజా నాడిదగ్గిర. కాగా ఆడూళ్కోలేడు.'

'మరేటి సెయ్యటం-బేరం దొరక్క పోతే, మీసాల బావుగాడు, పది రూపా యిలు నన్ను కక్కమంటాడు-'

'సివంచలం - వోటి చేద్దాం-ముందు నన్నో దెబ్బేసుకో నిచ్చీ. జగ్గారావు యెక్కడుందీ చెప్తా. ఆలోగా అన్నొట్టు కొచ్చి తగిలించీద్దువు.'

'దొంగ సాచ్చికాలిచ్చిచ్చి నీది కోర్టు బుర్రై గ్రి పోనాది గురో-సరే, వొప్పేసు కుంతాగానీ-నాకో రూపాయిచ్చీ, వొంటో సత్తువుగా లేదు. ముందో గళాసడితేగానీ కదల్లేను.'

'నోటులుంటే యింకా లేన్దేంటి !' అని జేబులోంచి చిల్లర డబ్బులు తీసి, సింహాచలం చేతులో పోసి - జగ్గారావు యెక్కడ మరం వేసిందీ చెప్పాడు, కోదండం.

లాడ్జి దగ్గిర రిక్షా ఆపి, 'తిన్నగా యెల్లి నీ పన్జేసుకొచ్చీ. కొత్త సరుకు. పైగా బెదురుగొడ్డునాగుంది. అదేటీ గొడవ సెయ్యనేదు. నేనొచ్చీదాకా యెల్లిపోమాక. కింద మీసాలబావుతో ముచ్చట్లెట్టుకూకునుండు' అని రిక్షా తిప్పుకు వెళ్ళిపోయాడు, సింహాచలం.

సన్నగా యీలవేస్తూ మెట్లెక్కి, తిన్నగా యేడో నంబరు గది దగ్గరికి వెళ్ళి తలుపులు నెట్టాడు, కోదండం. కాళ్ళు నేలమీదకి ఆన్చి, మంచం అంచు మీద ఆలోచిస్తూ కూచుని వున్న సావిత్రి; తల పైకెత్తి చూసింది. యెదురుగా గుమ్మంలో తన భర్త కోదండం !

# మధుర మీనాక్షి



ఆర్. ఎస్. సుదర్శనం

దక్షిణాదికి వెళ్లాలనిపించింది. ముఖ్యంగా మధురకు. మధుర అనే పేరూ, మధురలో అమ్మవారు మీనాక్షి పేరూ అంటే నాకేదో యిష్టం. ఇరవై ఏళ్ల క్రితం నేను మద్రాసులో చదువుకునేటప్పుడు మధురనుంచీ వచ్చిన స్నేహితుడు ఒకడుండేవాడు. అతడు నాతో తెలుగులో మాట్లాడటానికి ప్రయత్నించేవాడు. వాళ్ళింట్లో తెలుగు మాట్లాడుతారట. కాని ఆ తెలుగు స్వరూపం వింతగా ఉండేది. ఆ తెలుగుని నా ముందుతప్ప అందరి ఎదుటా ప్రదర్శించేందుకు బిడియపడేవాడు నా స్నేహితుడు. మా మధ్య చదువు ఎక్కువయ్యాక అతని మాతృభాష అయిన ఆ తెలుగు—కాని—తెలుగులోనే నాతో మాట్లాడేవాడు. అందువల్ల మా స్నేహం ఎంతో ప్రియమైనదిగా ఉండేది. కాలేజి వదిలాక మామధ్య రెండేళ్లపాటు ఉత్తర ప్రత్యుత్తరాలు

జరిగినా, తర్వాత అతడెక్కడున్నాడో నాకు తెలీదు. భాషా ప్రయుక్త రాష్ట్రాలు వచ్చాక ఎవరి ప్రపంచం వారిదై పోతూ వచ్చింది. ఇప్పుడు దక్షిణాదికి వెళ్ళా లనిపించగానే ఆనాటి ఆ మధుర స్నేహితుడు—అతనిపేరు గురుమూర్తి జ్ఞాపకంవచ్చి, స్నేహంకంటే తియ్యనిది జీవితంలో మరొకటిఉందా! అనిపించింది.

నేను వెళ్ళాలనుకున్నది యాత్రగాదు, పుణ్యం మూటకట్టుకుందామన్న ఉద్దేశం తోకాదు ఒక్కసారి నా పరిసరాల్ని, నాకు నిత్యమూ సంబంధంఉన్న మను ష్యుల్ని, నేను నిత్యమూ వింటూన్న భాషనీ వదలిపెట్టి కాస్త స్వేచ్ఛగా క్రొత్త వూపిరి పీల్చుకునేందుకు వీలుగా, నా కెవ్వరూ తెలీని ప్రదేశానికివెళ్ళి దపాలనే కోరికే నన్నుప్రయాణానికి పురికొల్పింది.

కాలేజీచదువు అయ్యేదాకా నా జీవి తంలో ఒక అధ్యాయం. అటుపైన గడ చిన ఇరవై ఏళ్లుగా మరొక అధ్యాయం. రెండేళ్ల క్రితం నా భార్యపోవటం, నా నలుగురు పిల్లలూ ప్రస్తుతానికి బోర్డింగు స్కూళ్ళల్లో నిక్షేపంగా చదువుకుంటూ ఉండటం, నాలో ఏర్పడిన ఒంటరితనం, క్రమంగా నాదృక్పథంలో ఒక పరివర్తన తీసుకుని వచ్చింది. వ్యాపారంతోనేమి, వ్యవహారాల్లోనేమి పూర్తిగా మునిగిపోయి ఉండటం, ఎప్పుడూ క్షణం తీరిక లేక పోవడంమూలాన ఈ నా 'ఒంటరితనాన్ని, సులువుగా నేను గుర్తింపలేదు. కాని మధ్య మధ్య ఒక్కొక్కసారి నాలో ఏదో పరధ్యానంలాంటి మనఃస్థితి కల్గి, నేను పరిసరాల్ని మరచిపోయి, కాస్సేప టికి మళ్లీ స్పృహ రావటంలాటి సన్ని వేశాలు కొన్ని కలిగాయి. ఒకసారి ఒక డాన్సు ప్రోగ్రాం చూడటానికి వెళ్లాను. స్నేహితుల్తో. నృత్యం మనస్సుకి పట్ట లేదు సరికదా. ఉన్నట్లుండి ఏదో దిగులు, శూన్యం, ప్రవేశించి సుమారు ఒక గంట కాలం నాకూ పరిసరాలకూ సంబంధం లేని స్థితి ఏర్పడ్డది. తర్వాత ఒకసారి స్నేహితుల్తో క్లబ్బుల్లో పేకాడుతూ ఉండగా ఉన్నట్లుండి విరకిలాంటిదేదో కల్గి ఆటలోంచి లేచి వెళ్లిపోయాను. అదృష్టవశాత్తు నేను అప్పటికి ఆటలో ప్లస్‌లోనే ఉన్నాను కాబట్టి మిత్రులు అపార్థం చేసుకోలేదు. అలావెళ్ళి బాతు రూమ్‌లో ముఖం కడుక్కునివచ్చి, వేరుగా కుర్చీ వేసుకుని కిటికీలోంచి ఆకాశాన్ని చూస్తూ కూర్చుండిపోయాను. అదెంతో హాయి అనిపించింది. ఇటువంటి 'మూడ్సు' తరచు వస్తూ వస్తూ, చివరకి నేనిందాకా చెప్పినట్లు, ఎక్కడికైనా సరే, ఎవరితోనూ చెప్పకుండా కొన్ని రోజులు వెళ్ళి తిరిగి రావాలన్న గాఢ మైనవాంఛ నాలో రూపొందింది.

కాని ఎవరితోనూ చెప్పకుండా వెళ్ల డంలో ఎన్నో చిక్కులున్నాయి. నిజంగా చూస్తే సన్యసించి వెళ్ళిపోదామనే ఉద్దేశం లాంటిది నాలో ఏ కోశానా లేదు! పిల్లల

మీద ప్రేమా, వాళ్ల భవిష్యత్తుమీద ఆసక్తి నాలో అధికంగా ఉన్నాయి. వ్యాపార విషయాల్లో నా ప్రమేయం లేనిదీ, నా జాగ్రత్తలేనిదీ అన్నీ సవ్యంగా జరుగుతూ ఉంటాయనే నమ్మకమూ నాకులేదు. అందువల్ల ఏదో మామూలు కారణం లాంటిది చూపిస్తూ ఎవరెవరికి ఏమి చెప్పాలో చెప్పి వెళ్ళడమే మంచి దని తోచింది. కాని నా 'మూడ్స్' విషయం, నా అసలు రహస్యంమాత్రం ఎవరికీ చెప్పే పరిస్థితిలోలేను. మిత్రులు గాని బంధువులుగాని నన్ను పిచ్చివాడి నిగా జమకట్టుతారని భయం! అందువల్ల నేను దక్షిణాదికి యాత్ర వెడుతున్నాననీ. ముఖ్యంగా నా భార్య అస్థికల్ని రామే శ్వరం తీసుకువెళ్ళాలన్న కోర్కె నాలో ఉన్నదనీ, తీరికలేక ఇంతకాలం వెళ్ల లేకపోయాననీ, అందరితో లోకరీత్యా చెప్పవలసి వచ్చింది.

"అయితే పెద్దబ్బాయినైనా తీసుకు వెళ్ళరాదా" అని కొందరు సలహా యివ్వకపోలేదు. "వాడికి సెలవులు వచ్చేదాకా ఆగితే నాకు తీరిక చిక్కదు కదా! ఇప్పుడనుకున్నాను. ఇప్పుడేవెళ్ళి రావటమే మంచిది" అని సమాధానం చెప్పాను. ఆలస్యంచేస్తే వాళ్లూ వీళ్ళూ వెంట బయలుదేరుతారేమోనని అనుకున్న మూడోరోజే రైలెక్కాను, ఒక చిన్న సూట్ కేసుతో.

రైల్లో కూర్చోగానే నాకో ప్రశ్న ఎదురైంది. ఏమిటి నేను చేస్తున్న ఈ పిచ్చిపని? ఈ అర్థంలేనిపని? నేనెందుకు మధుర వెళ్తున్నానో నాకే తెలీదుకదా! అనిపించింది. మామూలు వ్యవహారాల్లో మునిగి ఉన్నంతసేపూ, అందులోనుంచీ బయటపడాలనే ఏదో వత్తిడివల్లా, 'మధుర' అనే పదం అంటే ఏదో ఇష్టం ఉండటంవల్లా బయలుదేరానేకాని అలా బయటపడి మధుర చేరుకున్న తర్వాత ఏమి చెయ్యాలి? అనే విషయం మాత్రం నాకు స్పష్టంగాలేదు. రైల్లో కూర్చుని ఆలోచిస్తే అంతా బోధపడుతుందని కాబోలు అభిప్రాయపడ్డాను. కాని తీరా చూస్తే ఎంత ఆలోచించినా, ఏం చెయ్యాలో యిదమిద్ధమని తేలటంలేదు. పోనీ, ఎప్పుడు చూడని మధురనుచూచి, మీనాక్షి దేవాలయాన్నీ తిరుమలనాయకుని మహల్నీచూచి రెండు మూడురోజుల్లో వచ్చేద్దామనుకున్నాను. అందుకోసమైతే మిత్రులతోకలిసి వెళితే బాగుండేదికదా అన్న కొరత మనసుకు తట్టింది. మళ్ళీ మిత్రులా? అసలు తెలుగుభాషేవద్దు, తెలిసిన జీవితమే వద్దు, అన్నీ మరచి పోయి స్వేచ్ఛగా ఉండాలనికదా నా ఉద్దేశం! పోనీ గురుమూర్తి ఎక్క డున్నాడో అన్వేషిద్దామా? మధురవంటి పెద్ద పట్టణంలో పాత అడ్రస్ అయినా గుర్తులేని ఒకానొక గురుమూర్తిని ఎలా పట్టుకోవడం? పైగా విచిత్రం, గురు మూర్తికోసం కష్టపడి వెదకడంలోకూడా

నాకు ఆసక్తిలేదని తేలిపోయింది! యాదృచ్ఛికంగా గురుమూర్తి కనిపిస్తే అది వేరే సంగతి. అప్పుడు సంతోషమే! కాని అతణ్ణి వెదకటానికికాదుగా నేను మధుర వెళ్తూండటం! పోతే, భక్తి, పుణ్యము, తీర్థసేవ అంటే అటువంటి వాటిమీద నాకు అసలు నమ్మకంలేదని మొదటే చెప్పాను.

ఇలా ఆలోచిస్తూ, ఏమీ పాలుపోక, పూరికే ఎక్కి దిగే మనుష్యుల్నీ రైల్వే స్టేషన్లనీచూస్తూ కూర్చున్నాను. అలా చూడటంలో నాకు కొన్ని కొత్త సంగతులు తెలిసినవి. సాధారణంగా మనం మనుష్యుల్ని ఒక అర్థంతో చూస్తూ ఉంటాము. వీడు ఫలానా, వీడితో యీ పని, ఈమె ఫలానావారి తాలూకు, ఈమె గుణం యిలాంటిది అన్న దృష్టి వ్యక్తుల్ని గూర్చిన పరిచయంమూలాన, నిత్యమూ కొన్ని ప్రయోజనాల్ని అన్వేషిస్తూ వ్యవహారదృష్టితో చూస్తూండటం తప్ప, ఆయా వ్యక్తుల్లోఉన్న వింతలూ, చమత్కారాలు మనం గమనించము. అదీకాక మనిషి మామూలు మనిషి అన్న భావంతోగాక ఒక యంత్రము, ఒక బొమ్మ, ఒక వింత మృగము అనే దృష్టితో చూస్తే మరికొన్ని చమత్కారాలు కనిపిస్తాయి. రైల్లో నా ఎదురుగా ఒక కుటుంబం, అంటే భార్యాభర్తలూ వాళ్ల ఆరేళ్ళ కూతురూ కూర్చున్నారు. చూడగానే వాళ్ళ పరస్పర సంబంధం వగైరాలు అర్థమయినవి కాని నా మనస్సు ప్రస్తుతం అనుభవిస్తున్న వింత స్థితిలో వాళ్ళకు ఒకరితో ఒకరికి సంబంధం లేదనుకుంటూ వాళ్ళను గమనించాను. ఆ అవగాహన అద్భుతంగా ఉంది. ఎవరికివాళ్ళు ఒంటరివాళ్ళే, నాలాగ. పైన ఏవో శబ్దాలూ, చేష్టలూ, వాటికి ఏవో అర్థాలూ, ఆ అర్థాల మూలంగా మనస్సులో ఒక ఎడతెగని భ్రమ! అంతే! భర్త కొన్ని నిముషాలు మరుగుదొడ్డిలోకి వెళ్లాడు. వెంటనే భార్య హావభావాల్లో మార్పు కనిపించింది. నావైపు సిగ్గువిడిచి ఆసక్తిగా సాహసంగా, పరిశీలనగా చూచింది. అటూ, ఇటూ కదిలింది, వస్తువుల్ని సవరిస్తూ కూతురితో ఏదో అన్నది. నాకూ ఏదో వ్యక్తంచేసింది. భర్త తిరిగివచ్చి కూర్చున్నాడు. ఆమె మళ్ళీ పూర్వం ధోరణిలో 'అణకువ' గా స్తబ్దంగా మారింది. భర్త సాన్నిధ్యం ఆమె నిజస్వరూపాన్ని కప్పిపెడుతూ ఉన్నట్లు నాకు తోచింది. ఇందులో ఆమె భర్తను ఏదో మోసంచేస్తూ ఉన్నదనీ, కపటంగా ప్రవర్తిస్తున్నదనీ నా ఆరోపణకాదు! నైతిక వ్యతిక్రమణం ఏమీలేదు. ఆమె వ్యక్తిత్వంమాత్రం భర్త ఎదురుగుండా ఉండటంవల్ల ఒకానొక ధోరణిలోనూ, లేకపోయిన క్షణాలలో మరొక ధోరణిలో అంటే స్వేచ్ఛగానూ ఉంటుందనేది నాకు నిశ్చ

యంగా తెలిసింది. ఆమెలోని ఆ రెండవ ధోరణి, దాని సౌందర్యం ఆ భర్తకు ఎన్నడూ కనిపించదు. ఊహామాత్రంగా కూడా అంతు చిక్కదు. ఇదీ జీవితంలో వ్యక్తులమధ్య ఉండే సంబంధాల్లోని వైచిత్రి. కేవలం భార్యాభర్తల మధ్యేకాదు. ఒకానొక రామారావు నాకు చాల సౌమ్యుడుగా, ఓర్పు గలవాడుగా మాత్రమే తెలుసు. మరొకరికి రామారావు అంటే ముంగి, లోపలిమనిషి, నమ్మదగినవాడుకాడు. ఈ విభేదాలు ఎందువల్ల వస్తున్నాయి?

నా ఆలోచనలకు గమ్యంలేదు. నాకు తోచిన ప్రశ్నలకి నేను సమాధానం వెదకలేదు. చివరకు నిద్రపోయాను. తెల్లవారింది మధుర స్టేషనులో దిగాను. బండివాణ్ణి మంచి హోటలికి తీసుకువెళ్ళమన్నాను. 'రాయల్‌లాడ్జి' ట. ఎందుకో కృష్ణదేవరాయలు జ్ఞాపకం వచ్చాడు. రాయలవారికి అతిథిని,'పేయింగ్ గెస్ట్'ని అనుకున్నాను.

హోటలు మేడమీదికి మీనాక్షి దేవాలయ గోపురాలు కనిపిస్తున్నాయి. అక్కడికి దగ్గరే. సర్వరును అడిగాను. పూజ ప్రొద్దున ఎనిమిదింటికే ముగుస్తుందట. సాయంకాలం వెళ్ళమన్నాడు. దేవాలయ ప్రాకారానికి నాలుగు ద్వారాలు. ద్వారాల గోపురాలు అందంగా మెరుస్తూ కనిపిస్తున్నాయి. పునరుద్ధరణ యిటీవలే జరిగిందట. శివగంగరాజాగారు కాబోలు దబ్బిచ్చారట. తిరుమల నాయకుని మహల్ విషయం అడిగితేఅదిచాలదూరం, ఒక కొనను ఉందనీ, అక్కడికైతే యిప్పుడే వెళ్ళి రావచ్చుననీ సర్వరు సలహా యిచ్చాడు. బండీచేసుకుని అక్కడికి వెళ్ళాను. ఏవో గవర్నమెంటు ఆఫీసులు ఆక్రమింపచేశాయి ఆ మహల్ని. మేడమీదికివెళ్ళి తిరిగాను. మధురాపట్టణం చాలవరకు కనిపిస్తుంది. ఎందుకో నాకు తృప్తిగాలేదు. మధుర వచ్చింది యిందుకా? అనుకుంటూ హోటలికి తిరిగి వచ్చాను. భోజనంచేసి నిద్రపోయాను.

సాయంత్రం అయిదు గంటలకిగాని మెలకువ రాలేదు. కాఫీతాగి దేవాలయానికి బయలుదేరాను. ద్వారందగ్గర కొబ్బరికాయ, కుంకుమ వగైరా సామగ్రి కొని లోపలికి వెళ్ళాను. చక్కని సన్నాయి చెవినబడ్డది. లోపల పుష్కరిణి శిల్పాలుఎంతో అందంగా ఉన్నాయి. ఎవరో అమెరికను దంపతులు శిల్పాలని చూస్తున్నారు. ఒక పధ్నాలుగేళ్ళ కుర్రవాడు వాళ్ళకి "గైడు" గా వ్యవహరిస్తున్నాడు. అటుపైన అమ్మవారి గుడి. 'హిందువులకు మాత్రమేప్రవేశము'అన్న బోర్డు. అమెరికనులు ఆ హద్దుదాటి పోరాదు.

లోపల మరొక హద్దు. అమ్మవారిని దగ్గరిగా చూడటానికి వెళ్లాలంటే మొలకు గుడ్డతప్ప ఒంటిమీద గుడ్డ ఉండరాదు. చాలమంది అంగవస్త్రంతో వచ్చి, ఆ

వస్త్రాన్ని నడుముకు చుట్టుకొని లోపలికి వెళ్తున్నారు. స్త్రీలకు ఈ విధిలేదు. నేను చొక్కా, బనీను విప్పటానికి సిద్ధంగా ఉన్నా, అవి ఎక్కడ పెట్టాలో తెలీక, లోపలికి వెళ్ళడం మానుకున్నాను.

అర్చన జరిగినంతసేపూ వెలుపలే నిల్చుండిపోయాను. అమ్మవారు లీలగా తప్ప స్పష్టంగాదృష్టికిఆనలేదు. ఆలయం యొక్క గంభీర వాతావరణం నన్ను ఆకట్టుకున్నది. కాలం ఘనీభవించినట్లు, కాలసముద్రం లోతుల్లోకి మునిగినట్లూ చరిత్రలో ఏదో వెనక్కి వెనక్కి వెళ్ళి నట్లు ఒక విశేషమైనభావం మనస్సును ఆవరించింది.

మెల్లగా అడుగులువేసుకుంటూ తిరిగి వస్తూ ఉన్నాను. ఎందుకో వెనక్కి తిరిగి చూడాలనిపించింది చూశాను. ఒకఅంద మైన యువతి నా వెనుకే వస్తోంది. నేను తిరిగి చూచిన క్షణంలో మా చూపులు కలిసికొన్నాయి. నేనుముందుకు సాగాను. నడకవేగం తగ్గించాను. కాని నే నుద్దే శించినట్లు ఆమె నన్నుదాటి ముందుకు వెళ్ళలేదు! ఆమెకూడా మెల్లగా నడుస్తూ మా యిద్దరిమధ్యా ఒకే దూరాన్ని అట్టే పెట్టుతున్న తెలిసింది. ద్వారం దగ్గర అంగళ్ళున్నాయి. అక్కడ పూజాసామగ్రి కొన్నప్పుడు వాళ్ళిచ్చిన వెదురుపళ్ళెం వాళ్ళకిచ్చివెయ్యాలి. అక్కడే వదలిన నాచెప్పుల్ని తొడుక్కోవాలి. అందుకోసం ఆగాను. ఆగి వెనుక వస్తున్న ఆమెకోసం చూశాను. ఆమె సూటిగా నా కళ్ళల్లోకి చూచింది. ఏదో నవ్వీ నవ్వనట్లుగా అందులో ఒక చిరునవ్వుకూడా నాక్కని పించింది. నేను పళ్లెం యిచ్చివేసి తొందరగా చెప్పులకోసం వెదుక్కొ న్నాను.

నన్ను ఆకర్షించిన అందంగల ఆ యువతి నాతో మాట్లాడ్డానికి సుముఖంగా ఉన్నదన్నన్నమ్మకం నాలో కల్గినతర్వాత మరి నేను ఆగలేకపోయాను. చెప్పులు నావి నాకు కనిపించటంలో కొంతజాప్యం తప్పలేదు. పెద్దజాప్యం ఏమీకాదు. గబ గబా వీధిలోకి వచ్చాను. కాని ఆమె అంతలో ఎటు వెళ్ళిందో నాకు కనిపించ లేదు. ఇటూ అటూ వీధి తిన్నగా కని పిస్తూవుంది. ఆ కొద్ది నిముషాల్లో కను చూపుమేర దాటి మలుపు తిరిగి ఉండటం సాధ్యంకాదు! అయితే మరి ఆమె ఏమైనట్లు?

ఆ వీధి పొడవునా, పరిసరాలూ చీకటిపడేదాకా వెదుకుతూ తిరుగుతూనే ఉన్నాను ఆమె, నన్ను ఆకర్షించటమే కాదు, నాపట్లసుముఖంగాకూడా ఉన్నది. ఆ సౌందర్యమూర్తి మళ్ళీ నాకు కని పించదేమో అనిపించింది! వెధవ చెప్పుల కోసం ఆలస్యం చెయ్యకుండా అలానే ఆమెను వెంబడించిఉంటే, తర్వాత చెప్పుల సంగతి చూచి ఉండవచ్చుకదా! అవెక్కడికి పోతాయి? అంగడివాని పూచీ ఉండనే ఉంది వాటికి! కాని బుద్ధి

అలవాటు ప్రకారం దానికి తెలిసిన విలువని అది అన్వేషించింది! ఉవ్వెత్తుగా నాలో అసంతృప్తి, ఏదో పోగొట్టుకున్నట్లు ఆవేదనా కలిగాయి. రాత్రి చాలసేపు ఆమె జ్ఞాపకం వస్తూనే వున్నది. ఆ అపరిచిత వ్యక్తికి నామీద ఆసక్తిఏమిటి? నాలో ఏ ప్రత్యేకతాలేదే! కాని ఆ మె నా వెనుకనే నడవటంలో, నన్ను చూపులతో పలకరించడంలో తప్పకుండా ఆసక్తి ఉన్నది! ఏమైతేనేం, అవకాశం చేజారి పోయింది!

రెండవరోజు ప్రొద్దున మళ్ళీ ఆలయానికి వెళ్ళాను. ఈసారి చొక్కా బనీను ఏమీ వేసుకోకుండా పట్టు అంగవస్త్రం పైన కప్పుకుని, పంచె గోచీపోసి కాకుండా తమిళులలాగాఅడ్డపంచగా కట్టుకుని వెళ్ళాను. ప్రొద్దుటి అర్చనకు ఎంతో మంది ఆడవాళ్ళూ, మగవాళ్ళూ వచ్చారు. అర్చకునితో బాటు స్తోత్ర పాఠాలు, నామావళీ అందరు బిగ్గరగా గొంతు కలిపి చదివారు. ఇది క్రొత్తగా ఉంది. కాని ఎంతో బాగా ఉన్నట్లనిపించింది. నాకూ శ్లోకాలూ, నామాలురాకపోవటం కొరతగా ఉంది. వాళ్ళతో గొంతు కలపలేక పోయానే అనుకున్నాను. అర్చన ముగియగానే జనమంతా ఎక్కడి వాళ్ళక్కడ గబ గబ వెళ్ళిపోయారు. నాకు అర్థమైంది. వీళ్ళు రోజూ ఇలా ఒక్క అరగంట ఆలయంలోకి వచ్చి అర్చించి వెళ్ళిపోతూ ఉంటారు. దేవాలయానికీ చుట్టూ ఉన్నవారికీ ఇంతగా దేనికి సాన్నిహిత్యం ఏర్పడి ఉన్నదా అని ఆశ్చర్యపడ్డా! దూరంనుంచి వెళ్ళే మనకు ఎక్కడో ఉన్నట్లు అపురూపమేకాని. వాళ్ళకు మీనాక్షి ప్రత్యక్ష దేవతేకదా! అనుకున్నాను.

క్రిందటి సాయంత్రం చూసినయువతి కనిపిస్తుందేమోనని ఆశించి వెదికాను. కనిపించలేదు.

ఆలయంనుంచి హోటలు గదికి తిరిగివచ్చి మామూలు దుస్తులు వేసుకుని బజారువైపు వెళ్ళాను. నేను చదువుకునేందుకు ఉపయోగించే కళ్ళద్దాల ఫ్రేము విరిగింది. క్రొత్త ఫ్రేము వేయించాలని వెళ్ళాను.

ఒక కళ్ళద్దాల అంగడిలో ప్రవేశించాను. అంగడియజమానిఒకయువతికి కళ్ళద్దాల ఫ్రేములు చూపిస్తూ మాట్లాడుతున్నాడు. ఆమె అతనికి ఎదురుగుండా కుర్చీలో కూర్చుని టేబిల్‌మీద ఉన్న అద్దాల ఫ్రేములుచూస్తున్నది. నేను వెళ్ళి యజమానికి కుడివైపున ఉన్న కుర్చీలో కూర్చున్నాను. తలవంచుకుని ఫ్రేముల్ని పరీక్షిస్తున్న ఆ యువతి నా వైపు చూచింది. నేను చకితుణ్ణయ్యాను. ఆమే ఈమె! జారిపోయిందనుకున్న అవకాశం మళ్ళీ లభించింది!

ఇప్పుడు ఆమెనుగూర్చి మరికొన్ని సంగతులు నాకు తెలిశాయి. ఆమె యింగ్లీషు చదువుకున్నది. బహుశా

ఉద్యోగిని. ఆమె రెండు ఫ్రేములనుఎన్ను కొని, ఆ రెండింటిలో చివరకు ఏది తీసు కోవడం? అన్న మీమాంసలో పడ్డది. అంగడి యజమానిని సలహా అడిగింది. అతను రెండింటిని గూర్చి ధారాళంగా చెబుతున్నాడు గోడమీద పిల్లివాటంగా దేనికదే చక్కగా సరిపోతుందని అంటూ నిర్ణయాన్ని ఆమెకే వదిలే ప్రయత్నంలో ఉన్నాడు. నేను కల్పించుకుని అందులో ఒకదాన్ని గూర్చి, అదేబాగుందిఅన్నాను. ఆమె నా వైపు చూచి, అంగడివానితో, "అయితే దీనికే ఫిక్స్ చెయ్యండి. నాకు ఇప్పుడేకావాలి. తలనొప్పిగాస్ట్రెయిన్‌గా ఉంది" అన్నది 'కనీసం రెండుగంటలు వ్యవధి కావాలి. చూడండి మా అసి స్టెంటు ఇంత దాకా రాలేదు!' అన్నాడు అంగడివాడు.

నేను నా ఫ్రేముకోసం చూస్తు న్నాను. అంగడివాడు నా పాత ఫ్రేము తీసుకుని సైజునుబట్టి ఏవో రకాలు చూపిస్తున్నాడు.

'ఎట్లాగైనా చేసి ఒక గంటలో యివ్వండి. లేకపోతే నేను ఈ పూట కాలేజి మానేసుకోవాల్సి వస్తుంది' అన్న దామె.

'సరే' నన్నాడు అంగడివాడు.

ఆమె వెళ్లడానికి లేచింది.

నేను కూడా చప్పున లేచి 'అయాం సారీ, నేను యిప్పుడే మళ్లీ వస్తాను. నా పాత ఫ్రేము మీ దగ్గరే ఉంచండి. ఒక అరగంటలో వచ్చి సెలక్ట్ చేసు కుంటాను' అన్నాను అంగడివానితో. అతను ఆశ్చర్యంగా చూస్తూ 'సరే' అన్నాడు.

ఆమె వెనకాలే నేను బయటికి వచ్చాను.

ఆమె కొంతదూరం నడిచి ఒక అంగడిలోకి ప్రవేశించి రెండు పెన్సిళ్లు కొన్నది. నేను వెంబడి వెళ్లి బ్లేడ్లు ఒక ప్యాకెట్ కొన్నాను. అక్కడినుంచీ మళ్లీ బయటికి వచ్చాము ఒక్కసారే. వస్తూండగా నా వైపు చూచి ఆమె అన్నది ఇంగ్లీషులో–

'మీ రిక్కడివారు కారు?'

'అవును. నెల్లూరు.'

'ఏం పనిమీద వచ్చారు?'

'ఊ రి క నే...అనాలోచితంగా... ఒంటరిగా'

'నా వెంట వస్తున్నా రెందుకూ?

'నిన్న ఆలయంతో చూచాను మిమ్మల్ని.'

'చూస్తే?'

'మిమ్మల్ని ప ల క రి ం చా ల ని పించింది.'

ఆమె మౌనంగా నడుస్తూ ఉంది.

'మీరు కాలేజిలో లెక్చరరా?' అని ప్రశ్నించాను. సమాధానం లేదు.

'క్షమించండి. మీ కభ్యంతరం లేక పోతే, ఇక్కడ ఆగి నాతో కాఫీ త్రాగి వెళ్లండి' అంటూ కనిపించిన రెస్టోరెంట్



వైపు దారితీశాను. ఆమె అభ్యంతరం చెప్పకుండా నాతో వచ్చింది. నా హృదయం ఉత్సాహంతో గంతులువేసింది.

కాఫీలు తెమ్మని సర్వరుతో చెప్పాను. ఆమె నిమ్మళంగా గంభీరంగా నా వైపు చూస్తూ ఎదురుగుండా కూర్చున్నది. చిరునవ్వులేదు, మాటలేదు. ఎటువంటి తొట్రుపాటు లేదు. నా కేదో క్రొత్తగా వింతగా ఉన్నది. ఆమె గాంభీర్యం ముందు నేను అల్పుణిగా తోచింది. ఏమీ మాట్లాడలేకపోయాను. కాఫీలు వచ్చాయి. కాఫీ త్రాగటం అయిపోతే ఆమె వెళ్లిపోతుంది. ఆమెతో ఏదో మాట్లాడాలి. ఏం మాట్లాడాలి?

ఆమె కాఫీవైపు దృష్టి మళ్లించింది. ఆమె వ్యక్తిత్వాన్ని పరివేష్టించి ఉన్న ప్రశాంతత నన్ను అధీరుణ్ణి చేస్తోంది.

పరస్త్రీల వెనుకబడని అమాయకుణ్ణి కాను. నా వయస్సు నలభై. నాకు కొన్ని అనుభవాలున్నాయి. కాని నా భార్య పోయిన తర్వాత, ఈ రెండేళ్లలో, స్త్రీని గూర్చి ఆలోచించలేదు. ఇప్పుడు ఎదురుగా ఉన్న ఈ యువతి నన్నాకర్షిస్తున్న తీరు విశిష్టంగా ఉన్నది. కేవలం స్త్రీ వాంఛగా పోల్చుకోడానికి వీల్లేదు.

"మీరు కాలేజిలో ఏ సబ్జెక్ట్ చెబుతారు?" అన్నాను.

'ఫిలాసఫీ.'

"మీకు సొంత ఫిలాసఫీ అంటూ ఏమైనా ఉన్నదా? మీది మెటీరియలిజమా, డైలెక్టికల్ మెటీరియలిజమా,

ఎగ్జిస్టెన్షలిజమా, వేదాంతమా, అద్వైతమా, ద్వైతమా ?'

'అద్వైతం'.

'నేనూ ఫిలాసఫీ గ్రాడ్యుయేటునే. ఇరవై ఏళ్ల క్రితం. ఈ మధ్య ఎప్పుడూ అనుకోలేదు దానిమాట. అన్నీ మరచిపోయి, కేవలం ఒంటరితనంలో గడపాలని యిక్కడికి వచ్చిన తర్వాత యిప్పుడు మళ్లీ ఆ ఫిలాసఫీ జ్ఞాపకం వస్తున్నది. ఏంతోచటంలేదు కాబట్టి ! నాకు ఏ ఫిలాసఫీలోనూ, వేదాంతంలోనూ నమ్మకం లేదు...మీరు నమ్మకం కల్గించగలరా ?'

సమాధానంలేదు. ఆమె కాఫీ పూర్తి చేసి, వాచీ చూచుకొన్నది. నా కాఫీ కూడా పూర్తయింది. ఇద్దరమూ బయటికి వచ్చాము.

'థాంక్స్' అంటూ ఆమె అటువచ్చిన రిక్షాలో ఎక్కింది.

నాలో ఆతురత. ఆమె వెళ్లిపోతూ వుంది.

'మీ పేరు ?' అన్నాను.

'మీనాక్షి'.

రిక్షా వెళ్లిపోయింది.

నేను వూరుకోలేదు. మళ్లీ ఆమెను వెంటనే కలుసుకోవాలన్న కాంక్ష ప్రబలంగా వుంది. కళ్లద్దాల షాపుకేసి నడిచాను.

నాకు కావలసిన ఫ్రేము సెలెక్ట్‌చేసి, వెంటనే ఫిక్స్ చెయ్యమనీ, ఎంతసేపైనా అక్కడే వేచి ఉంటాననీ చెప్పాను. ఒక గంట కూర్చున్నాను. అద్దాలులేవు. కాబట్టి న్యూస్ పేపరు చదవటానికీ వీలు లేదు. ఆలోచనలు, ఊహలు. మీనాక్షిని గూర్చి తలపోతలు. ఆమె ఏ క్షణమైనా తన కళ్లజోడుకోసం అక్కడికి వస్తుందని ఆశతో కూర్చున్నాను.

నా జోడు తయారైంది. గంట 11-30 అయింది. మీనాక్షి రాలేదు ! ఇక అక్కడ ఉండటానికి నాకు కారణమూలేదు !

"ఆ లెక్చెరరుగారి జోడు తయారైందా ?" అని అడిగాను.

"ఆ...ఏదీ ఆమె రాలేదే ! ఈ ఆడవాళ్లింతేనండీ ! ఏదో ముంచుకుపోయిన అర్జంటు అంటారు. తీరా రెడీ చేస్తే మూడురోజులకిగాని వచ్చి తీసుకోరు !" అన్నాడు అంగడి యజమాని.

నేను కాళ్లీడ్చుకుంటూ లాడ్జికి బయలుదేరాను.

సాయంకాలము దేవాలయానికి వెళ్లాను, అంగవస్త్రము, అడ్డపంచ ధరించి. అంగవస్త్రాన్ని నడుముకి చుట్టుకుని అర్ధనగ్నంగా లోపలికి వెళ్లాను. మీనాక్షీదేవి సౌందర్యమూర్తి. ఆమె నిలుచున్నతీరే విలాసంగా ఉంది. ముంజేతి చిలుక ఏ క్షణాన్నో ఎరిగిపోయేలా ఉన్నది. ఇంతటి శృంగారమూర్తి అయిన దేవీవిగ్రహాన్ని నే నెక్కడా చూడలేదు. స్త్రీ సౌందర్యానికే

ప్రతీక అనిపించింది. జన సమ్మర్ధంవల్ల చాలసేపు చూస్తూ ఉండిపోవడానికి వీల్లేక పోవడం ఒక దురదృష్టం ఆమె సాన్నిధ్యంనుంచీ బయటికివచ్చి ఏమీ తోచక ఇట్టట్టు తిరిగి పుష్కరిణి దగ్గరకు వచ్చి కూర్చున్నాను.

పరధ్యానంగా కాస్సేపు నీళ్లనూ, కాస్సేపు దేవాలయాన్నీ చూస్తూ కూర్చున్న నాకు కుడివైపు ఎదురుగా మెట్లమీద, దూరాన మీనాక్షి కనిపించింది. ఎప్పుడు వచ్చిందో, ఏమో! అద్దాలు పెట్టుకున్నది? కూర్చుని తదేకంగా ఏమిటో ఆలోచిస్తూ ఎటో చూస్తున్నది. నాలో ఆవేగం హెచ్చింది. లేచి ఆమె దగ్గరకు వెళ్లాను. ఒకవైపు "ఏమిటీ కుర్రతనపు వేషాలూ? ఆమె ఏమనుకుంటుందీ?" అన్న హెచ్చరిక విమర్శ నాలో తలెత్తినా, దాన్ని గమనించే స్థితిలో లేను.

వెళ్లి చొరవగా ఆమెకు కొంత ఎడంగానే అయినా, దగ్గరగానే కూర్చున్నాను. ఆమె నా వైపు చూచి, గుర్తింపుగా చిరునవ్వు నవ్వింది. చిరాకుపడ లేదుకదా అని సంతోషించాను.

"ఎలా ఉంది ఆలయం?" అని ఆమే పలకరించింది ఇంగ్లీషులో.

"బాగుంది. ఎంతో బాగుంది. ఈ పుష్కరిణి కూడా చక్కగా, ఎంతో నిర్మలంగా ఉంది."

"ఆలయానికి పుష్కరిణే ప్రాణం, మనిషికి హృదయంలాగ."

"మీరు మేధస్సుకంటె హృదయానికే, ఆలోచనకంటె ఆవేశానికే ప్రాధాన్యం ఇస్తారా?"

ఏదో ఒక విషయం ఎత్తుకుని మాటలు పెంచి తీరాలన్న కోరిక నాలో ప్రబలంగా ఉంది.

"అవును, లేకపోతే ఇక్కడికిరావటం ఎందుకు?"

ఆ మాట నాలో ఆలోచనని పురి కొల్పింది. ప్రొద్దున్న ఆమె తాను స్వయంగా 'అద్వైతి' నన్న విషయం గుర్తువచ్చింది. చదువుకున్నది. తెలివి గలది. చక్కని సంస్కారం. ఎటువంటి తొట్రుపాటూలేని నిర్దైన హావభావాలు, అన్నింటినీ మించిన-నన్ను ఆకట్టు కొన్న-సౌందర్యం. నాలో ఎన్నడూ కలుగని ఒక పరిపూర్ణమైన సంతృప్తి కలుగుతున్నది ఆమెను చూస్తే. ఇంతటి పరిపూర్ణమైన స్త్రీమూర్తి కనిపించడం నిజంగా అరుదే!

"అద్వైతంలో ఆవేశాని (Feeling) కంటె ఆలోచనకే ప్రాముఖ్యం అనుకుంటానే! భక్తి ప్రపత్తులకంటే జ్ఞానందే పై చేయికాదా?" అన్నాను.

"కాదు! మీనాక్షీదేవి ఎలా ఉంది?"

ఇక్కడ నేను కొంత చనవు తీసుకో దలిచాను.

"ఏ మీనాక్షిదేవి ?" అన్నాను కొంటెగా.

"ఏదైనా ఫరవాలేదు. రెండూ ఒకటే!" అని సమాధానం వచ్చింది.

ఆ గరువపు మాటకు క్షణంసేపు చకితుడనై మళ్లీ ముగ్ధుణ్ణయ్యాను. ఇక్కడ గరువమేగాదు, అద్వైతపరం గానూ సముచితంగానే ఉన్న దామాట అనుకున్నాను

"ఏమిటాలోచిస్తున్నారు ? రూపం లేనిది భావమూ, భావం లేనిది రూపమూ లేవు. నామంకూడా రూపంతోపాటే! నామం, రూపం మీలో కలిగించే భావమే ప్రధానం. అయినప్పుడు మీనాక్షి ఒకటే, రెండు కాదు!"

ఈ తర్కానికి నా బుర్ర తిరిగి పోయింది.

"అదెట్లాగంటారు ? అక్కడ విగ్రహం, ఇక్కడ మనిషి. సౌంద ర్యంలో సాదృశ్యం ఉందనుకున్నా, నాకు విగ్రహంకంటె మనిషే ప్రిఫెరెన్స్."

"అదే భ్రమ, మాయ, అజ్ఞానం. రెండు లేవు ఒకటే ఉంది. ప్రిఫెరెన్స్ లేకపోవడమే సమదృష్టి. అంటే సౌంద ర్యమూ, సౌందర్యరాహిత్యమూ అనే అనుభూతి విచక్షణ లేకపోవడంకాదు, అనుభూతిలో ఏకత్వాన్ని చూస్తూ భిన్నంగా కనిపించేసృష్టి మాయకు లోను గాకపోవడం."

"సృష్టి, జగత్తు, మాయ, వట్టిది అంటారు కదా! అలా అనుకుంటే అది కలిగించే భావాలూ, కల్పించే ఆశలూ, మాయేఅయి, వాటిని దాటి ఏదో అవా ఙ్మానసగోచరమైన ఆత్మ స్వరూపాన్ని పొందడం అద్వైతం అంటారు. మరి అద్వైతం లోకనిరాసం చెయ్యటంలేదా?"

"నామరూపాలూ, అవి కల్పించే భావాలూ, ఆశలూ వేరు వేరుగా లేవు. అవి అన్నీ ఒక్కటే, అదే సత్యం. వైవిధ్యమే మాయ. 'సృష్టిని మాయ' అంటే సృష్టి లేదనికాదు. సృష్టి అంటే ప్రకృతి, అనాదీ, అనంతరమే. పుట్టుక, చావు అనేవి ప్రతి జీవికీ ఉన్నా, సృష్టి మొత్తానికి మాత్రం ఒక్కసారి పుట్టుక, ఒక్కసారి చావు అనేవిలేవు! సృష్టి లక్షణం మార్పు. ఈ మార్పునుకాదని అనుభూతి ఏకత్వాన్ని పొందటమే 'అద్వైతం' చెబుతుంది. ఈ లోకం వట్టి దనీ, గట్టిది వేరే ఎక్కడో ఉంది వెదక మనీ చెప్పదు. ఈ సంగతి సరిగా అర్థం చేసుకోవడంలోనే కీలకం ఉన్నది. వైవిధ్యం వట్టిది, ఏకత్వం గట్టిది అంతే."

"అయితే వైరాగ్యం మాటేమిటి! జీవితానుభూతిపట్ల వైముఖ్యంకాదా వైరాగ్యం అంటే ?"

"కాదు. వైరాగ్యం అంటే ఇందాకా చెప్పినట్లు ప్రిఫెరెన్స్ లేకపోవడం. అదే సమదృష్టి."

"అయితే నాకు వైరాగ్యంలేదు! నేను విగ్రహానికంటె మనిషినే ప్రిఫెర్ చేస్తాను!" అన్నాను నవ్వుతూ. అంతటితో ఆగకుండా, "ఇలాంటి దేవాలయాలు కట్టేదానికంటె డాములూ, ప్రాజెక్ట్‌లూ కట్టితే ఎంత ప్రజోపయోగం! అదే ప్రాచీనులకూ మనకూ దృక్పథంలోగల భేదం! నెహ్రూ, ప్రాజెక్ట్‌లనే నేటి దేవాలయాలు, అన్నాడు. ఎంత గొప్ప మాట! నాకు ఆధ్యాత్మికతకంటె జీవితంమీదే ఎక్కువ అభిమానం!" అన్నాను.

"రెండింటికీ భేదంలేదు. ఆనాడు విగ్రహమూ మనిషీ ఒక్కటి. ఈనాడు యంత్రమూ మనిషీ ఒక్కటి. ఇది మనిషిలోకాదు మనుష్యుల ఊహలో నేడు వచ్చిన మార్పు. ప్రిఫెరెన్స్. ఇప్పటికీ వైయక్తికంగా మనిషి తనవంటి విగ్రహాన్నే ప్రిఫెర్ చేస్తాడు! గాంధీకి నెహ్రూకి ఊరూరా ఇన్ని విగ్రహాలెందుకూ? ఆ డబ్బుతో ప్రాజెక్ట్‌లు కట్టరేం? మీరు మధుర ఎందుకు వచ్చినట్లు?"

నేను సమాధానం చెప్పలేదు. ఆమె బుద్ధి నైశిత్యాన్ని మెచ్చుకుంటూ ఆమె మాటల్ని అవగాహన చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాను

అవును. నేను మధుర ఎందుకు వచ్చినట్లు? నన్ను నేనే ప్రశ్నించుకుంటున్నాను. సహేతుకంగా చెప్పదగిన సమాధానమేమీలేదు!

"నేను మధుర వచ్చింది మిమ్మల్ని కలుసుకోవటానికే" అన్నాను రొమాంటిక్‌గా.

"కావచ్చు" అన్నదామె గంభీరంగా, నాతో ఏకీభవిస్తూ. అలా అనడంలో నవ్వులేదు. హాస్యధోరణి అన్న సూచనే లేదు. ఆమె 'సీరియస్‌నెస్' నాలో కించిత్ భయాన్ని కూడా కలిగించింది. ఆమె మామూలు వ్యక్తికాదని తోచింది.

ఇంతలో ఎవరో ఒక అరవై ఏళ్ల ముత్తైదువ అక్కడికి రావటంచూచి మీనాక్షి లేచి ఆమె దగ్గరకు వెళ్లింది. "వెళ్తా" నని నాకు చెప్పనైనాలేదు. ఇద్దరూ వెళ్లిపోతున్నారు. మీనాక్షి నావైపు తిరిగైనా చూడలేదు! అలా నా మానాన నన్ను వదలి వెళ్లిపోవటం, అంతసేపూ మాట్లాడిన గుర్తైనా లేకుండా ప్రవర్తించడం నాకు బాధ కలిగించింది. నేను వాళ్ల వెనుకే నడిచాను.

ఎలాగైనా మీనాక్షి వెంబడే వెళ్లి ఆమె యిల్లు కనుక్కోవాలనుకున్నాను కాని నిన్నటి అనుభవం గుర్తుకు వచ్చింది. తీరా నా చెప్పుల్ని నేను వెదుక్కునేంతలో ఆమె మళ్లీ అంతర్ధానం కావచ్చు! అప్పుడు గతేమిటి? నాకు వెంటనే ఒక ఊహ తట్టింది. నేను గబగబా ముందుకు నడిచాను. మీనాక్షీ

ముసలావిడనీ దాటి వెళ్లిపోయాను. వెళ్లి నా చెప్పుల్ని తొడుక్కుని ద్వారం దగ్గర కాపలా వేశాను.

ద్వారం దగ్గరకు రాగానే, నా ఆత్రాన్ని గమనించినట్లుగా, మీనాక్షి నన్ను చూచి చిరునవ్వు నవ్వి తల పంకించింది. తన వెంట రమ్మన్నట్లుగా నాకు నేను అర్థం చెప్పుకుని వాళ్లతో పాటు వెనుక నడిచాను.

దేవాలయపు వీధికి అవతలివీధిలో ఒక చిన్న మేడదగ్గర వాళ్లు ఆగారు. నేను కూడా ఆగాను. ముసలావిడ తలుపు తాళం తీసింది.

ఆ కమ్ముల తలుపు దాటగానే నడవ, దాని కుడిప్రక్కన మేడపైకి మెట్లు ఉన్నాయి. ముసలావిడ నడవదాటి తలుపు మరో తాళం తీస్తున్నది. మీనాక్షి మేడపైకి దారితీస్తూ, నన్ను రమ్మన్నది.

పై భాగానికి మరోతాళం ఉన్నది. దాన్ని తీసే ప్రయత్నంలో ఉండగా–

''ఆమె మీ అమ్మగారనుకుంటాను" అన్నాను.

సమాధానం రాలేదు.

లోపలికి వెళ్లాము. పుస్తకాల బీరువా, కుర్చీలు నేనొక కుర్చీలో కూర్చున్నాను. మీనాక్షి లోపలి గదుల్లోకి వెళ్లి, కాస్సేపటిలో వచ్చింది.

"ఆమె ఎవరో చెప్పలేదు" అన్నాను.

''జ్ఞానాంబ. ఆమె యింటిలో నేను అద్దెకుంటున్నాను. ఒక విధంగా అత్తగారు."

"పంజరంలో చిలుకలాగ ? అబ్బ ! ఎన్ని తాళాలు" అన్నాను.

"శరీరంలో ఆత్మలాగ ! మూడు తాళాలు. ఆమె తీసినవి రెండూ, నేను తీసినది ఒకటి. వేదాంతంలో త్రిపుటి అంటే దృశ్యము, దృష్టి, ద్రష్ట."

ఆమె వేదాంతంలోకి దిగడం నాకు ఆసక్తి కలిగించలేదు. ఇంతదాక చేరుకున్నతర్వాత శుష్కమైన ఆ చర్య అనవసరం అనిపించింది. అంతకంటె గట్టిదేదో నన్ను పట్టుకొన్నది. అంతా స్వప్నంలా ఉన్నది

"ఇంకెవరూ లేరా ?" అన్నాను.

''ఎవరికి వాళ్లం ఒంటరివాళ్లం. ఎవరో ఉన్నారనుకోవడం భ్రమ.

"జ్ఞానాంబతో నన్ను గురించి ఎవరని చెప్పారు" అన్నాను కుతూహలంగా.

"వ్యాపారస్థులని. నాకోసం వచ్చారని."

నిజమే ! కాని నేను వ్యాపారమే చేస్తాననీ, ఉద్యోగినో, మరో వృత్తివాణ్ణో కానని ఈమె కెలా తెలిసింది ! నేను చెప్పినట్టు గుర్తులేదు. ఆమాటే అడిగాను.

"మిమ్మల్ని చూస్తే తెలీడం లేదా ?" అంటూ నవ్వింది.

ఆ సమాధానానికి కొంత అప్రతిభుడనయ్యాను. వ్యాపారం అనేది నా



మొహమ్మీద అంత స్పష్టంగా వ్రాసి ఉందా ! నేను చిన్నబుచ్చుకున్నాను.

ఆమె మళ్లీ లోపలికి వెళ్లింది.

ఏమీ తోచటంలేదు ! నా చుట్టూ పరిశీలనగా చూశాను. కొంతదూరంలో ఒక టేబిల్‌మీద రమణ మహర్షి ఫోటో కనిపించింది. దగ్గరకువెళ్లి చూశాను. నన్ను దయతో వాత్సల్యంతో చూస్తు న్నట్లున్నది ఆయన చూపు. నాలో ధైర్యం, ఉత్సాహం కలిగాయి. సాహసం యినుమడించింది.

ఆమె కాఫీ పట్టుకొచ్చింది. తలనిండా మల్లెలు తురుముకొన్నది. చీర మార్చి తెల్లని చీర కట్టుకొన్నది. దేవతలా మనోజ్ఞంగా ఉన్నది.

కాఫీ త్రాగుతున్నాను. అమృతంలా ఉన్నది. కాఫీ చెయ్యటంలో దక్షిణాది తమిళులకున్న అభినివేశం మరొకరికి లేదుకదా!

"మీరు మధురకు ఎందుకు వచ్చారు?" అని ప్రశ్నించింది.

నాకు హృదయం విప్పి చెప్పాలని పించింది. చెప్పాను. జీవితం అర్థంకాక, స్వేచ్ఛకోసం, శాంతికోసం, ఆనందం కోసం, అనుభూతికోసం, ఏమిటో తెలీని దానికోసం, వచ్చాను అని చెప్పాను. కాఫీ పూర్తి అయింది.

"మీ భార్య?"

"లేదు."

"అందే?"

"పోయింది. చనిపోయింది. రెండేళ్లయింది."

వ్యక్తి చనిపోవచ్చు. ఆ భావం మీలో పోలేదుగా."

"చెప్పలేను. రెండేళ్లుగా నాలో వాంఛ లేదు. నాలో ఏదో మార్పు వచ్చింది. చనిపోయిన నా భార్యనుగూర్చి కూడా వాంఛతో దుఃఖించలేదు. ఎన్నాళ్లనుంచో జీవితం గతానుగతికంగానే జరుగుతూ వచ్చింది. కాని సౌందర్యం, మీలో నేను చూస్తున్న సౌందర్యం, దాన్ని ఆరాధించకుండా ఉండలేను!"

"సౌందర్యం అంటే?"

"అంటే ఇష్టం పరమమైన యిష్టం"

"అంటే?" ఇష్టం అంటే? ఇంకా లోతుకు వెళ్లితే! ఆలోచించాను.

"నేను! ఆ యిష్టమే నేను! అంతకంటె ఏం చెప్పగలను?" అన్నాను

"చివరకు మిగిలేది ద్రష్ట అయితే మీరు మధురకు వచ్చింది మీకోసమేనా?" అన్నది నవ్వుతూ. వేదాంతం ఒక 'గేమ్' లా తయారైందే అనుకున్నాను.

"కాదు. మీనాక్షికోసం" అన్నాను.

"నిజంగా?"

"నిజంగా."

"అదేనా సత్యం?"

"ఆహా!"

"అయితే రండి."

తర్వాత ఏంజరిగిందో మాటల్లో చెప్పలేను. చెప్పటానికి మాటలులేవూ, చాలవూ కాబట్టి. అక్కడ ఎంతసేపున్నానో, గుర్తులేదు. ఒక మహదానందంతో తాదాత్మ్యంతప్ప మరొక స్పృహలేదు. గది తలుపు తట్టుతూ ఎవరో పిలుస్తూఉండగా నాకు మామూలు స్పృహ వచ్చింది. లాడ్జికి ఎప్పుడు తిరిగి వచ్చానో గుర్తులేదు. నా గదిలో మంచం మీద పడుకుని ఉన్నాను. లేచి తలుపు తీశాను.

"సార్ భోజనం తెమ్మంటారా?" అంటున్నాడు హోటలు కుర్రవాడు.

"వద్దు. ఇప్పుడు టైం ఎంతైంది?"

"మీ దగ్గర వాచీలేదా సార్?"

అవును. ఏమిటి నాప్రశ్న! చేతికి ఉన్న గడియారం చూస్తే ఎనిమిది గంటలైంది.

"ఇప్పుడు ఎనిమిదేనా టైం?" అన్నాను సందేహంతో.

"అవును సార్."

"సరే, నాకేమవసరంలేదు."

తలుపు వేశాను.

ఎప్పుడు నిద్రపోయానో, ప్రొద్దున లేచేప్పటికి ఏడు గంటలు దాటింది. ఆకలిలేదు. ఏమి చెయ్యాలనీలేదు. ఏదో నిండుదనం, ఎన్నడూ ఎరగని సంతృప్తి, నిశ్చలత్వం.

బలవంతాన లేచి స్నానం వగైరా ముగించాను. కాఫీ త్రాగాను. న్యూస్ పేపర్ వచ్చింది. కాని నా మనస్సు న్యూస్ పేపర్ మీదలేదు.

ఆమె ఎవరు? 'సెక్స్'లో యింతటి మైకం, ఇంతటి సుఖానుభూతి ఉంటాయని నే నెన్నడూ ఊహించలేదు రాత్రి అంతసేపు ఆమెతో మాట్లాడాను కాని ఆమెనుగురించిన వివరాలేమీనాకు తెలీవు

ఆమె ఉద్యోగం చేస్తూ వుంది ఒంటరిగానేవుంది. అవివాహితేకావచ్చు. ఆ విషయం కూడా నిర్ధారణగా నేను అడిగి తెలుసుకోలేదు. అయితే ఆమెకూ నాకూ ఏర్పడిన సంబంధం ఎటువంటిది? ఆమె నన్నేమీ కోరలేదు. ఎక్కడా కోరుతున్న సూచనకూడా లేదు! ధార్మికమైన విచికిత్స పొడసూపనేలేదు. సంఘం వ్యవస్థ, ముందు, వెనుక అనేవి ఉన్నాయా చచ్చాయా అనికూడా ఆలోచన రాలేదు! కోరగానే అంత అలవోకగా అంతటి ఆనందానుభూతి అలా ప్రసాదించిన ఆమె ఎవరు? ఆమె వ్యక్తిత్వం ఏమిటో పోల్చుకోలేక పోయాను!

ఆ సుఖానుభూతి స్మరించేకొద్దీ నా కళ్ళు చెమర్చి, నా హృదయం ఎన్నడూ ఎరుగని కృతజ్ఞతాభావంతో నిండి పోతున్నది.

తర్వాత, తర్వాత ... ఆమెను వివాహం చేసుకొంటే...అనే ఆలోచన ప్రారంభం అయింది. ఆమెను శాశ్వతంగా నాదాన్నిచేసి తీసికొనివెళ్లి పోవాలి అనే కోరిక కలిగింది. ఆమె ఎవరైనాసరే, ఆమెను గూర్చిన వివరాలేమైనాసరే, ఆమె నాకు కావాలి అనే దృఢ నిశ్చయానికి వచ్చాను. ఆ సాయంకాలం ఆమె యింటికివెళ్లి ఈ సంగతి తేల్చేసుకోవాలనుకున్నాను. అప్పటికి భోజనంవేళ దాటుతోంది. ప్రొద్దున త్రాగిన కాఫీ. కాని ఆకలి వెయ్యలేదు. హోటలు కుర్రవాడు, "భోజనం చేశారా సార్" అంటూ కనుక్కోవడానికి వచ్చాడు. భోజనం తీసుకురమ్మన్నాను

భోజనం తర్వాత మళ్లీ పడక, ఆలోచనలూ, నిద్రా. ఒక కల. అందులో నేను చచ్చిపోయాను. అంటే నా శవం నాకు కనిపిస్తూ వుంది. ఎవరెవరో నా శవం చుట్టూ మూగి వున్నారు. 'నేను' వేరై ఆ దృశ్యాన్ని చూస్తూఉన్నాను. నా కూతురు, చివరిది, ఏడేళ్ల గిరిజ ఏడుస్తూవుంది. దాన్ని ఓదార్చబోతూ, నేను చచ్చిపోలేదని నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తూఉన్నాను. కాని దానికి నే నగపడటంలేదు, వినబడటంలేదు. అది నా శవాన్నే చూస్తూ ఏడుస్తూవుంది. ఏంచెయ్యడం? అని తర్కిస్తూ ఉన్నాను. నేను కదిలాను. మెలకువ వచ్చింది.

సాయంకాలమయింది.అయిదున్నరకు దేవాలయానికి వెళ్లాను. ఆమెకోసం గాలించాను. ఆమె రాలేదు. బయలుదేరి ఆమె యింటివైపు వెళ్లాను.

కమ్ములతలుపు తెరిచి వుంది. మెట్లెక్కి పైకి వెళ్లాను. తాళం వేసి ఉంది. బహుశా కాలేజినుంచి రాలేదో, వచ్చి ఎక్కడికైనా వెళ్లిందో! క్రిందికి

వచ్చి ఇంట్లోకి తొంగిచూశాను. ఒక కుర్రాడు బయటికివస్తూ నన్ను చూచి ఆగాడు ప్రశ్నార్థకంగా.

"జ్ఞానాంబ?" అన్నాను

కుర్రాడు లోపలికి వెళ్లాడు. వృద్ధురాలు జ్ఞానాంబ వచ్చినది. ఆమె ముఖం మ్లానంగా ఉంది ఆమె ఏదో కష్టంతో పరధ్యానంగా ఉన్నది.

"ఎవరు?"

ఆమె నన్ను గుర్తిస్తుందనుకున్నాను. గుర్తించలేదు.

"మీనాక్షిగారు. లెక్చెరర్ అన్నాను.

గద్గదికతో చేయి ఊపుతూ "ఇంకెక్కడి మీనాక్షి...పోయింది... పోయింది..." అన్నదామె

నా కర్థంకాలేదు. అప్పుడు కుర్రాడు చెప్పాడు. రాత్రి తొమ్మిదిగంటలవేళ మీనాక్షి స్టవ్ వెలిగిస్తూ, చీర కొంగు అంటుకుని, దగ్ధమైపోయిందని. హాస్పిటల్లో పదకొండు పండ్రెండు గంటల మధ్య ప్రాణం పోయిందట!

నాకు నోటమాట రాలేదు! అంతా మాయగా ఆశ్చర్యంగా తోచింది.

ఆమె దగ్గ శరీరాన్ని బంధువులు— అన్న, తల్లి ఊరినుంచి వచ్చి ప్రొద్దున టాక్సీలో తీసుకు వెళ్లిపోయారట!

నాకు తమిళం బాగా రాకపోవటం, ఇంగ్లీషులో కుర్రాడితో మాట్లాడటం గమనించి, జ్ఞానాంబ చివరకు అడిగింది, కన్నీళ్లు తుడుచుకుంటూ

"మీరెవరు? మీకు ఆమె ఎలా తెలుసు?"

"నిన్న దేవాలయం దగ్గర కలుసు కున్నాను. మీరు చూడలేదా?" అని ఎదురు ప్రశ్నించాను.

"లేదే! మీనాక్షీ నేను దేవాలయానికి వెళ్లి ఇంచుమించు నిన్న ఈవేళకు తిరిగి వచ్చాము. కాని మిమ్మల్ని చూడలేదే!" అన్నదామె! చిత్రంగా లేదూ!"

నాది నెల్లూరని చెప్పాను. కాని అలా చెప్పిన తర్వాత నాకూ మీనాక్షికీ గల సంబంధాన్ని గూర్చి ఏదో చెప్పక తప్పలేదు! ఆమె మా అమ్మాయికి లెక్చరరనీ, అలా పనివుండి వచ్చాననీ కల్పించి చెప్పాను.

"మీనాక్షికి భర్త, పిల్లలు లేరా?" అని ప్రశ్నించాను.

భర్త నాలుగేళ్లుగా అమెరికాలో ఉన్నాడట. పిల్లలు లేరు. ఈమెను రమ్మని వ్రాసినా ఈమె వెళ్లలేదట...

ఇక అంతకంటె వివరాలు లభించ లేదు. అడగడం కూడా భావ్యంగా తోచ లేదు. అడిగితే నా రహస్యం బయట పడుతుందేమోనని భయంవేసింది.

నేను మీనాక్షి ఫోటో సంపాయించా లనుకున్నాను. ఆమె పనిచేస్తున్న కాలేజి ఏదో ఎవరి నడగను? జ్ఞానాంబనుకాదు. నే నదివరకే మా అమ్మాయికి ఆమె లెక్చరరు అని చెప్పడంవల్ల, ఆ ప్రశ్న అక్కడ నిషిద్ధమైపోయింది.

తర్వాత మూడు రోజులపాటు ఆ ఊళ్లోని కాలేజీలు గాలించాను. వెళ్ళి ప్యూన్లను, స్టూడెంట్సునీ, ఫిలాసఫీడిపార్టు మెంటు సంగతీ, మీనాక్షి అనే లెక్చర

రును గురించీ వాకబుచేశాను. చివరకు యూనివర్సిటీ సెంటరులో నా కృషి ఫలించింది. ఫిలాసఫీ ప్రొఫెసర్ దగ్గరకు వెళ్ళి, నేను మీనాక్షి అన్నగారి తరఫున వచ్చాననీ, ఆమె మరణం దృష్ట్యా ఆమె తాలూకు ఫోటో ఒకటి కావల్సి ఉందని చెప్పాను. ఆయన క్రిందటి సంవత్సరం విద్యార్థులతో తీసుకున్న గ్రూప్ ఫోటో చూపించారు. అందులోనిమీనాక్షికి కళ్ళద్దాలూ, ఏవో కొన్ని పోలికలూ ఉన్నాయికాని, నాకు తెలిసిన సౌందర్యమూ, స్ఫూర్తీ లేవు! ఆ ఫోటో తీసిన స్టూడియో అడ్రసు తీసుకుని వచ్చేశాను.

గ్రూప్ ఫోటోలోని మీనాక్షిబొమ్మను ఎన్లార్జ్ చేయించాను. కాని నేను చూచిన సౌందర్యరాశికీ, ఫోటోలోని బొమ్మకూ ఎక్కడా అందికా పొందికా లేవు!

ఈ అన్వేషణంతా ఒకవైపు చేస్తూనే మీనాక్షిని గూర్చి నా అనుభూతినిగూర్చి తర్కిస్తూ ఉన్నాను. నాకు వివరంగా జ్ఞాపకం ఉన్నదల్లా పుష్కరిణివద్ద అద్వైతాన్ని గూర్చి ఆమె చెప్పినమాటలే ఆమె యింటిలో ఆమెకు నన్నుగూర్చి నేను చెప్పుకున్నదే ఎక్కువ. తర్వాత మిగిలినది అపూర్వమైన ఆనందానుభూతి, తాదాత్మ్యము, తప్ప మరొక వివరంకాని విశేషంకాని గుర్తులేదు. అటుతర్వాత ఆమె దగ్ధమై అంతర్థానమైపోవడం! జ్ఞానాంబ చెప్పిన వివరాలూ ఫోటో వగైరాల ద్వారా ఏర్పడుతున్న మీనాక్షికీ, నా అనుభూతిలో సత్యమై నిల్చిన మీనాక్షికీ ఎక్కడా పోలికలేదు!

వివాహవ్యవస్థనుగూర్చి, ధార్మిక ప్రవర్తననుగూర్చి మీనాక్షి అభిప్రాయం ఏమిటి? ఆ ప్రశ్నలు నే నామెకు వేయలేదు! కాని ప్రిఫెరెన్స్‌లేని విరాగిగానే ఆమె ప్రవర్తన నా కర్థమవుతున్నది. అనుభూతిలో ఏకత్వాన్ని చూడమనే ఆమె నాకిచ్చినసందేశం. సందేశమే కాదు. నేనూ, నేను ఆశించిన సౌందర్యమైన తానూ, దాని అనుభూతీ, మూడూ నాకు ఏకం చేసింది, తర్వాత దగ్ధమైపోవడంలో, అనశ్వరమైన దాన్ని నశ్వరమైనదాన్నీ వేరుచేసి చూపించినట్లుగా ఉన్నది. కాని నాలో హత్తుకుపోయిన విషయం మాత్రం ఒకటి ఉన్నది— అనశ్వరమైనది నశ్వరమై కనిపించే లోకం ద్వారానే మనుష్యునికి అందుతున్నది. అందుకు భిన్నంగా లేదు! అనే సూత్రం.

ఆలయంలోకి వెళ్ళి మీనాక్షీదేవి ముందు నిలుచున్నాను. ముంజేతిమీది చిలుక ఏ క్షణాన్నో ఎగిరిపోయేలా సుతారంగా అనిశ్చితంగా ఉన్నది. దేవి విలాసంగా, శృంగారాన్ని ఒలుకుతూ, ఆనందానుభూతికి ప్రతీకగా చిరునవ్వు నవ్వుతూ ఉన్నది.

మధురకు యిందుకా పిలిపించావు! అన్నాను, మనసులో ఆ దేవీమూర్తితో. ప్రత్యక్షమై, స్వయంగా అద్వైత బోధ చేసి, అద్వైతానుభూతి ప్రసాదించి, నన్ను నీదానుణ్ణి చేసుకున్నావు! అంత అవ్యాజమైన ప్రేమనీది! అంటూ ఏమిటో నివేదించుకున్నాను. ఆమె మాత్రం నవ్వుతూనే వుంది.



# ప్రాప్తి

### మధురాంతకం రాజారాం

తాశీల్దారు రామేశం పంతులుగారు జట్కాలోనుంచీ క్రిందికి దిగగానే మునసబు రాఘవరెడ్డి "నమస్కారాలు బాబూ!" అంటూ చేతులు జోడించాడు. కరణం కృష్ణశాస్త్రి తొందరగా అంగవస్త్రంతో తలపాగా చుట్టుకోవడం పూర్తి చేసి, అప్పుడే వేసుకున్న తాంబూలాన్ని ఒక గుక్కలో మ్రింగి చేతులు గట్టుకుని వినయం ఉట్టిపడే భంగిమలో నిల్చున్నాడు.

"చావడిలో నీళ్లు కాగుతున్నాయండీ! భోజనానికి కూడా ఏర్పాట్లుచేశాం. తమరు స్నానం కానిచ్చేసరికి అవతల భోజనం సిద్ధమైపోతుంది" అన్నాడు మునసబు.

తాశీల్దారుగారు చావడిలో ప్రవేశిస్తూ "స్నాన పానాలకు వేళం మించిపోలేదులేవోయ్! మొదట ఆ తగరారేదో దాన్ని కాస్తా పట్టిచూద్దాం. ఎక్కడ! ఆ ఆసాములిద్దరూ వున్నారా" అంటూ ఈజీచేర్ లోకి శరీరాన్ని చేరవేశారు.

"పిలవమంటారటండీ! ఎంతసేపు! వినగానే వురకలేస్తూ రారూ!" అంటూ మునసబు వాకిట్లోకి వెళ్ళి "ఒరే రామిగా! పరుగునవెళ్ళి నడిమింటి రామానాయుణ్ని, పందిరి మల్లయ్యనీ కేకేసుకరా! ఇక్కడున్నట్టు రావాలి" అని తలారివాడికి ఆనతిచ్చాడు.

"వాళ్లు వచ్చేలోపుగా ఆ వ్యవహార మేమిటో కాస్తా చెప్పవయ్యా వింటాను.

పాడు విలేజి పాలిటిక్సు! తల దిమ్మెక్కి పోతుంది" అన్నారు తాశీల్దారుగారు.

"ఇదేమంత గొప్ప విషయమండీ! మీరొక గీత వ్రాశారంటే మళ్ళీ దానికి తిరుగుంటుందే మన్నానా! ఆ చింతలేటి దాపున రామానాయుడి కొబ్బరితోట ప్రక్కన వుందండీ ఆ బీటినేల. నాలు గెకరాల యాభై సెంట్లని లెక్క. కొంచెం ఎక్కువగానే వుండొచ్చు. ఆ పొలానికి పడమరగా మల్లయ్య పుంజ భూము లున్నాయండీ! మొన్ననే బావి త్రవ్వించి మిషను పెట్టాడా, ఆ భూమిగూడా కాస్తా కలిసివస్తే సేద్యానికి అనువుగా వుంటుం దనుకుంటున్నాడు మల్లయ్య. మరిరామా నాయుడేమో ఆ పొలాన్ని తన తోటలో కలిపేసుకుంటే బాగుండు ననుకుంటు న్నాడు........"

"వాళ్ళనుకోడంలో ఏముందిలేవోయ్! మునసబుగారు అనుకోవాలిగదా!" అంటూ తాశీల్దారుగారు మెల్లగా నవ్వారు.

"అబ్బెబ్బే! దేవుడితోడండీ! నాకేం తెలియదు. తమరెవరికి పట్టాయిప్పించినా నాకిష్టమే!" అన్నాడు మునసబు.

"మనలో మన మాటనుకోవయ్యా! ఎలాగైనా ఈ వూరివాడివిగదా! మంచీ చెడ్డా నీలా నాకు తెలుస్తుంది గనకనా!" అంటూ తాశీల్దారుగారు మునసబును మెల్లగా బుజ్జగించారు.

"ఆలోచించి చూస్తే మల్లయ్యదే న్యాయంగా కనబడుతుందండీ! సముద్రం లాంటి బావి త్రవ్వించాడా! అప్పో సప్పోచేసి మిషను పెట్టించుకున్నాడా! పైగా ఆ పొలాన్ని తోటకు గీటకూ గాకుండా మొదటిరకం పుంజనేలగా వినియోగించుకోబోతున్నాడాయె! అందు వల్ల .... అంటు మునసబు గుణిశాడు.

"అంతా బాగానే వుంది. కానీ మొన్న రామానాయుడు వ్రాసుకున్న అర్జీపైన రెవెన్యూ ఇన్‌స్పెక్టరు వ్రాసిన సిఫార్సు బలంగా వుందే మరి! దానికేమంటావు" అన్నారు తాశీల్దారుగారు.

"దానికా అంటే! మరి...మరి..."

"చెప్పవయ్యా! ఫరవాలేదు."

"ఇటు చూస్తే నుయ్యి! అటు చూస్తే గొయ్యి, ఏంచెప్పమంటారు బాబూ! రెవెన్యూ ఇన్‌స్పెక్టరుగారి పైన పితూ రీలు చెబుతున్నాననుకో గూడదండీ! ఆయనకూ, కరణంగారికీ ఏదో దూరపు బంధుత్వం వుందట! వాళ్ళే చెప్పుకోగా విన్నాను. నాకేం తెలుసు! మరి కరణం గారేమో రామానాయుడి వైపు ......"

"సరేలే! ఇప్పుడు తెలిసింది. నువ్వేమో మల్లయ్యవైపు. మీ మధ్యలో మేము ఏంచేయడానికీ తోచక సత మతమైచావాలి! బాగుందయ్యా బాగుంది. అయ్యా రాఘవరెడ్డి! బాగుంది" అంటూ తాశీల్దారుగారు చిరాకు వ్యక్తపరిచారు.

"లేదండీ బాబూ! ఈ వ్యవహారంలో

నేనుతటస్థుణ్ణి.నాకేంతెలియదు" మునసబు తనను తనే సమర్థించుకోబోయాడు.

"నువ్వలాగనకుండా నేను మల్లయ్య వైపని నిక్కచ్చిగా చెప్పకుంటావా మునసబూ!లోకజ్ఞుడివి. వ్యవహారజ్ఞుడివి. అనువుగా మాట్లాడ్డం నీకుతెలియని విద్య గనకనా! అహాఁ, మాటవరసకన్నాను. ఏమంటావు?" అంటూ తాశీల్దారుగారు మునసబు ముంగాళ్ళకు బంధంవేసి పరుగెత్తవయ్యా పరుగెత్తు అన్నారు.

మునసబు నిరుత్తరుడై పైకి చూస్తూ పైకప్పు వాసాలు లెక్కించుకోసాగాడు.

"పోనీలే! నువ్వు భోజనమైందేమో చూడు. ఆలోపల నా పని కొంచెంవుంది. అన్నట్టు అక్కడ కరణంవుంటే లోపలికి రమ్మను......"

రాఘవరెడ్డి అలా బయటికి వెళ్ళగానే అలవాటుప్రకారం తాశీల్దారుగారి చెయ్యి కోటుజేబులోకి వెళ్ళింది.

ఏముంది జేబులో! సర్వశూన్యంగా వుందది!

కంగారుగా పైకిలేచి తాశీల్దారుగారు "ఒరే చక్రీ, చక్రీ" అని జవానును పిలిచారు.

" పిలిచారా బాబుగారూ!" అంటూ జవాను లోపలికి వచ్చాడు.

''నా పొడుం డబ్బీ ఏదీ?"

"బయల్దేరినప్పుడు తమచేతికిచ్చాను గదండీ! మళ్ళీ బస్సులో గూడా ఒకటి రెండు సార్లు వేసుకుంటుండగా చూశాను......"

"జట్కాలో కూచున్న తర్వాత గూడా అది నా చేతిలోనేవుంది. ఇప్పుడు చూచుకుంటే లేదే! ఏమైనట్టు?"

"జట్కాలోపడిపోయిందేమోనండీ!''

"పరుగెత్తుమరి! ఆ జట్కావాణ్ణి అడుగు!"

జవాను హుటా హుటిగా పరుగెత్తడానికి ఉపక్రమిస్తున్నాడేమో, ద్వారం దగ్గర లోపలికొస్తున్న కరణంగారికి ఢీకొని, ఆ తొందరలో అతణ్ణి గట్టిగా అబ్బళించుకున్నాడు. "ఏమిటీ, ఏమిటీ! ఏం జరిగింది" అంటూ కరణం కృష్ణశాస్త్రి బిత్తరపోయాడు.

" మరేం కొంపమునగలేదుగానీ నువ్వా చక్రిగాడి గాఢాలింగనంనుంచీ బయటపడి యిక్కడికి రావయ్యా కృష్ణశాస్త్రీ!" అన్నారు తాశీల్దారుగారు.

''వస్తున్నాను బాబయ్యా ! సెలవివ్వండి" అంటూ కరణం దగ్గరికి వచ్చాడు.

''ఆఁ, ఏంలేదు! ఆ రామానాయుడు ఎంత మాత్రం ముట్టజెబుతానన్నాడేమిటి?"

''ఎవరికండీ?" బోలెడు అమాయకత్వాన్ని ఒలకబోశాడు కృష్ణశాస్త్రి.

"ఆ సంగతలా వుండనీ! ఈ వూళ్ళో నశ్యం దొరుకుతుంది గదూ!"

"నశ్యమాండీ! అగ్గి......" కరణం ఆలోచింపసాగాడు.

"అదేనయ్యా! ఉండేదీ, లేనిదీ ఒక్క మాటలో చెప్పగూడదూ?"

"ఇది యాభై ఏడో దేశం కదండీ బాబుగారూ! ఏ వస్తువు కావలసివచ్చినా మాకా చిగురువాడే గతి! అదీ శుక్రవారమైతేనే. మిగిలినరోజుల్లో ఆ వూరు దీనికి నకలే!"

"ఏమిటదీ! కాస్తా అర్థమయ్యేటట్టు చెప్పవయ్యా కృష్ణశాస్త్రీ! శుక్రవారాలు తప్పా మిగిలిన రోజుల్లో మీరందరూ కడుపుపైన తడిగుడ్డ పరచుకొని పస్తు ఉంటారేమిటి?"

"శుక్రవారం సంత గదండీ! అన్ని వస్తువులూ దొరుకుతాయి......"

"బాగుందయ్యా బాగుంది" అంటూ తాశీల్దారుగారు బొటనవ్రేలితో చేర్చి చిటికెపట్టి ముక్కుదాకా తీసుకెళ్ళారు. కానీ వ్రేళ్ళమధ్య పొడుముంటేగదా అది ముక్కుపుటాల్లో దూరి మెదడుకు నూతనోత్తేజం కలిగించడానికి! తీరాఅందులో నశ్యం లేదన్న సంగతి తెలిసిన తర్వాత చేయి క్రిందికి జారిపోయింది. తల ఒక ప్రక్కకు సోలిపోయింది. "అయ్యా! శాస్త్రీ! పో, నా ఎదటుండకు" అని గద్దించారు తాశీల్దారుగారు.

అకారణమైన ఈ ఆగ్రహాన్ని చూచి కరణం నిలువునా నీరైపోతూ మెల్ల మెల్లగా బయటికి జారుకున్నాడు.

అదనుకోసం హజారం దగ్గర పొంచివున్న రామానాయుడు కరణం బయటికి రాగానే "ఏమయ్యా శాస్త్రిలూ! ఎలావుంది ధోరణి!" అంటూ ఆచూకీ తీయబోయాడు

"నారే భరించడానికి సిద్ధమంటా వుందయ్యా బాబూ! ఇక ప్రాణం ఖరీదు చేపు! వెళ్ళు, వెళ్ళు, ప్రొద్దువాటారిందా కైనా మనిషి పల్లకువాదేమో చూద్దాం" అంటూ కరణంగారు బెంచీపైన కూలబడ్డాడు.

* * *

మిట్ట మధ్యాహ్నం. భరణీకార్తెమో. బండలు పగిలిపోతున్నాయి. తిన్న శాస్త్రం ముగించుకుని పెద్దలు, పడుచు వాళ్ళూ రావిచెట్టు క్రింద రచ్చపైన సమావేశమయ్యారు. తాశీల్దారుగారి రాకను గురించి, ఆయన గుణగణాలను గురించీ ఊహాగానాలు కొనసాగుతుండగానే కిర్రుచెప్పులతోనూ, పెద్ద తలగుడ్డతోనూ, పంగనామాలతోనూ పందిరి మల్లయ్య రంగంలో ప్రత్యక్షమయ్యాడు.

"వేళగాని వేళ మల్లయ్యా! కూచో వెళ్దువుగానీ! తినీ గినీ బొజ్జ నిమురుకుంటూ కూచున్నప్పుడు అధికారుల దర్శనం చేసుకోవాలి. కార్యం సానుకూలం గావాలంటే సమయమూ, సందర్భమూ గూడా గమనించాలి" అంటూ ఒక వృద్ధుడు మల్లయ్యను రచ్చపైన కూచోబెట్టాడు.

"అదిగో అదిగో, అయినా అసాధ్యు డయ్యా రామానాయుడు! అప్పుడే చావిడికి హాజరైవస్తున్నాడే!" అంటూ ఒక ఆసామి పడుకున్నవాడు లేచి కూర్చున్నాడు.

రచ్చపైన మల్లయ్యను చూడగానే రామానాయుడి చేయి మీసాలపైకి పోయింది. జర్రలో ఒక ఆలోచన మెరిసింది. లేని నవ్వు పెదవిపైకి తెచ్చుకుంటూ అతడు రచ్చను సమీపించాడు.

"ఏమోయి రామానాయుడూ! ఎలా వున్నారు తాశీల్దారుగారు?" అని ఒకరు పలకరించారు.

"ఈ రావిచెట్టుకింద నిల్చుని చెప్పుకోవాలిరా భీమన్నా! ఏం శాంతం! ధర్మరాజనుకో! వెళ్ళానా, కూచోమన్నాడు. పేరూ గీరూ విచారించాడు. విషయం చెబుదామనుకున్నాను. చెప్పనిస్తేగా! 'ఏముంది లేవయ్యా రామానాయుడూ! పేరుకు పెద్ద ఉద్యోగమే గానీ, ఈ బాదరబందీ చెప్పతరమా! పైవాళ్ళకు జవాబు చెప్పుకోవాలి. క్రింది వాళ్ళ పనిమీద అజమాయిషీ చేసుకోవాలి. అప్పుడప్పుడూ ఇలా పల్లెటూళ్ళ పైన పడాలి. అబ్బబ్బ, ఏం గొడవలోలే! మతిపోతోందనుకో' అంటూ ఏదేదో ఏకరువు పెడుతూ కూచున్నాడు. మళ్ళీ వస్తాను బాబూ అని సెలవు తీసుకునేసరికి యింతసేపయింది" అంటూ రామానాయుడు ఓరకంటితో మల్లయ్య వైపోసారి చూచి మెల్లగా వీధంట ముందుకు సాగేడు.

రామానాయుడు రంగంనుండి నిష్క్రమించగానే మల్లయ్య రచ్చపైనుంచి క్రిందికి దిగి చావడివైపు వడివడిగా నడవసాగాడు.

* * *

తాశీల్దారుగారికి నిజంగానే మతిపోతోంది. అయిదు నిమిషాల వ్యవధిలో నాలుగైదుసార్లు అప్రయత్నంగా ఆయన చేయి జేబులోకి వెళ్ళి, వెళ్ళింది వెళ్ళినట్టుగానే బయటకు వచ్చింది. పొడుం డబ్బీ చేతిలో వుండగానైతే ఆయన కొంతసేపు పొడుం వేయకుండా కాలం గడపగలడు. కానీ అది చేతలేకపోతే మాత్రం అయిదు నిమిషాల కొకసారి నశ్యం వేయబుద్ధవుతుంది. వేయకపోతే పనిచేయడానికి మనస్కరించదు. దిక్కులుదోచదు అంతెందుకూ! అన్నం నహించదు. నిద్రపట్టదు!

"దండాలండీ బాబయ్యా!"

"ఎవరూ!'' అంటూ తాశీల్దారుగారు వచ్చిన మనిషివైపు విచిత్రంగా చూశారు.

"నా పేరు మల్లయ్యంటారండీ? తమరొచ్చారని వినగానే రెక్కలుగట్టుకుని పరుగెత్తొస్తున్నాను."

"చాలా శ్రమపడ్డావే పాపం! ఏం, కాస్త నెమ్మదిగా నడిచే రాగూడదూ?"



"ధర్మదొరలు! న్యాయం తమకు తెలీందేమీగాదు. నా విన్నపం చిత్తగించాలి" అని మల్లయ్య అంతకుముందే తను అల్లుకున్న ప్రకారం మాటలు ఒప్పగించాడు.

"ఏమిటయ్యా నీ న్యాయం! ఏదీ, చెప్పు చూద్దాం" లేచి నిటారుగా కూచుంటూ అడిగారు తాశీల్దారుగారు.

మల్లయ్య నివ్వెరపోయాడు. రామానాయుడు వర్ణనకీ, తాశీల్దారుగారి నిజ స్వరూపానికి ఎక్కడా పొత్తుకుదరడం లేదు. అయినా అతడు కాస్త తెప్పరిల్లుకుని "అదికాదండీ బాబయ్యా! ఆ భూమి నా ఆయకట్టుకు దగ్గరగా వుంది. కయ్యిలో కయ్య. గవర్మెంటు లోను తీసి కొత్త బావి త్రవ్వించాను. మిషను గూడా పెట్టించాను. అంతే బాబూ! ఆ పైన తమ దయ!" అన్నాడు.

"ఆ బావికింద ఏకిప్పు డెంత పొలం వుంది?"

"ఆరెకరాలకు పై ఓలుకేనండీ!" అంటూ వ్యవహారం తనకు సుముఖమవుతుందని లోలోపలే సంబరపడ్డాడు మల్లయ్య.

"ఐతే ఆ ఆరెకరాలూ చాలక ఈ అయిదెకరాలు గూడా నీ మడిలో కలుపుకో దలుచుకున్నా వన్నమాట! అంతే గదూ!"

అది నిగ్రహమో, అనుగ్రహమో తెలియక మల్లయ్య నిరుత్తరుడై నిల్చున్నాడు.

"మా బాగా చెప్పావులే! ఉన్నవాడికే మరింత దోచిపెట్టడం కాదు న్యాయమంటే! న్యాయ పరిష్కారం ఎలా చెయ్యాలో మాకూ కొంత తెలుసు. వెళ్ళు, వెళ్ళు."

"మరి ఆ రామానాయుడుమాత్రం బొత్తిగా లేనివాడటండీ!" అని మల్లయ్య మెల్లగా నసిగాడు.

"లేనివాడో, వున్నవాడో నాకు తెలియదు. కానీ అతడు నీలా ముందు ముందుగా పరిగెత్తుకొచ్చి నాపైన విరుచుక పడలేదు." అంటూ తాశీల్దారుగారు ముఖం మరోవైపుకు త్రిప్పుకున్నారు.

"తమరలా సెలవిస్తే నేనేం చెప్ప గలను బాబయ్యా! అతడిక్కడినుంచే వెళ్తున్నాడు. నేను తమ దర్శనంకోసం వచ్చాను."

"ఏమిటయ్యా నీ గొడవ?" అర్థం కాక, తెల్లబోతూ అడిగారు తాశీల్దారు గారు.

"రామానాయుడే వీధంట చెప్పు కుంటూ వెళ్తుండగా విన్నానండీ. అతడు రాగానే తమరు కూచోమని, పేరూ గీరూ విచారించారట! పైగా తమ సాధక బాధ కాలన్నీ వెళ్ళబోసుకున్నారట!"

తాశీల్దారుగారు నిర్ఘాంతపోయారు!

మునసబు రాఘవరెడ్డి గ్లాసులో వేడిపాలు తీసుకుని లోపలికి వచ్చి, అప్పుడే తాశీల్దారుగారితో బేటీ అవుతున్న మల్లయ్యను చూచి ఆశ్చర్య పడుతూ, గ్లాసు టేబిలుపైన వుంచాడు.

"నువ్వు పాలు తెచ్చినంత పుణ్య మయ్యా మునసబూ! మొదట ఈయన్ను వెళ్ళిపొమ్మని చెప్పు" అన్నారు తాశీల్దారు గారు.

* * *

ఆ రోజు సాయంకాలం తాశీల్దారు గారు సాగుబడి లెక్కల తనిఖీకి పొలాల పైకి బయల్దేరారు. ముందు తాశీల్దారు గారు, వెనుక మునసబు, కరణం, తోటి వాళ్ళు, తలారులూ ప్రొద్దుగూకేంత వరకూ పొలాల్లో చెడతిరిగారు. త్రోవ పొడుగునా కరణంగారైతే పొలాల్ని చూపిస్తూ, సాగుబడి వివరిస్తూ వచ్చారు. అయితే ఆ వివరాలు మాత్రం తాశీల్దారు గారి చెవులదాకా వెళ్ళీ వెళ్ళక ముందే గాలిలో కలిసిపోయాయి.

ప్రొద్దుపోయింది. సందె చీకట్లు క్రమక్రమంగా దట్టమౌతున్నాయి. నడుస్తూ వున్న తాశీల్దారుగారు వున్నట్టుండి ఆగి, చెరువు మరవ దగ్గర కోడెలకు నీళ్ళు దాపిస్తున్న ముసలా తణ్ణి కొంతసేపు పరకాయించి చూచి మునసబుతో "అతడి నిలా పిలువు" అన్నారు.

"ఒరే నారాయుడూ! ఇలారా. బాబు గారు పిలుస్తున్నారు" అని మునసబు కేకవేశాడు.

"దండాలు బాబయ్యా దండాలు" అంటూ నారాయుడు చేతులుగట్టుకుని తాశీల్దారుగారి ముందు నిలిచాడు.

"నీ చేతిలో వున్నదేమిటి?" అన్నారు తాశీల్దారుగారు.

"ఇదా బాబూ! మరి...మరి..."

"భయపడతా వెందుకూ! పొడుం




డబ్బీ కాదూ ! ఏదీ" అంటూ తాశీల్దారు గారు చేయిచాచారు.

నారాయుడు డబ్బీ తాశీల్దారుగారి చేత బెట్టాడు. మూతతీసి ఒక అంగుళం పొడుగునా వ్రేళ్లమధ్య పొడి బిగబట్టి ఒకసారి బిగ్గరగా లోపలికి పీలుస్తూ తాశీల్దారుగారు "నీ పేరేమిటన్నావు ?" అన్నారు.

"నా పేరా అండీ ! నారాయుడంటా రండీ !"

"కోడెలెవరివి ? నీవేనా ?"

"నావేనండీ! ఇంటి బుట్టిన దూడలు. పొలం పుట్రా లేనోడివి నీ కెందుకని రోజు కయిదారుగురు బేరగాళ్ళొచ్చి వెళ్తున్నారు."

"బిడ్డలు లేరూ ?"

"ఉన్నారండీ నలుగురు కొడుకులు."

తాశీల్దారుగారు కరణంవైపు తిరిగి "ఆ నాలుగెకరాల పొలంకోసం నారాయుడిచేత అర్జీ పెట్టించు. రేపు ఉదయం నేను బయల్దేరేలోగా అర్జీ నా చేతి కందాలి..." అన్నారు.

మునసబు ముఖం పాలిపోయింది. కరణం ముఖం తెల్లబోయింది. నారాయుడి ముఖం విప్పారింది.




వీరయ్య కొడుకు కోటయ్య. వీళ్ళిద్దరికీ స్పర్ధరావటం ఊళ్లో అందరికీ ఆశ్చర్యంగానే వుంది. చాలాకాలం వరకూ తండ్రీ కొడుకులు చాలా అన్యోన్యంగా వుండేవారు. అన్యోన్యము అంటే తండ్రి చెప్పినట్టు కొడుకు వినేవాడు ఇప్పుడా పరిస్థితి మారింది—ఈ మధ్య వీరయ్య భార్య చనిపోవటం, అతడు మళ్ళీ పెళ్ళి చేసుకోవటం జరిగింది. అంతకు ముందే కోటయ్య పెళ్ళి అయింది అప్పటినుంచీ తండ్రీకొడుకుల మధ్య స్పర్ధ పెరిగింది. ఉన్న పూరిగుడిసె చెరిసగం చేసుకొన్నారు. చెరొక ఏభై రూపాయిలూ పంచుకున్నారు. తన యాభై రూపాయిలూ పెట్టి వీరయ్య వెంటనే ఒక గేదెను కొన్నాడు. అతని భార్యపాలూ, పెరుగూ అమ్మటం మొదలుపెట్టింది. అది చూచి సహించలేక, కోటయ్య భార్య పోరిపోరి భర్తతో తమకొక గేదెను కొనిపించింది. అప్పటినుంచి మరీ స్పర్ధ ఎక్కువైంది. మేత వెయ్యటం మొదలుకొని, పాలు అమ్ముకొనటంవరకూ రోజూ తగాదాలు జరుగుతూనే ఉన్నాయి.

ఆనాడు అయిదు గంటలకు లేచి గేదెకు మేతవెయ్యటానికి దొడ్లోకి వెళ్ళాడు కోటయ్య. తమ గేదెకంటె మామగారి గేదె ఎక్కువ పాలిస్తూ వుందనీ, తమ గేదెకు పోషణ సరిగ్గా జరగటంలేదనీ, భార్య పోరితే కోటయ్య అప్పటినుంచి గేదెకు తనే మేత

వెయ్యటం, కుడితిపెట్టటం చేస్తున్నాడు. గేదెకు జనపకట్ట వేద్దామని వామి దగ్గరకు వెళ్ళాడు. వామి ప్రక్కనే తన తండ్రి వామి వుంది. తండ్రి వామిని చూచేటప్పటికి అతనికొక దురాలోచన కలిగింది. తన తండ్రి మంచి జనపకట్టలు పోగుజేశాడు. తన గేదెకు ఆ జనపకట్ట వేస్తే—యీ ఆలోచన తట్టీ తట్టటంతోనే అతి భయంకరంగా కనిపించింది కోటయ్యకి. నెమ్మదిగా అలవాటయినది. తన తండ్రి వామిదగ్గరకు వెళ్ళాడు. ఒక జనపకట్ట లాగాడు. రెండవసారి వేశాడు. ఎదురుగా తండ్రి కనిపించాడు. ఎందుకనో ఆ జనపకట్టతో తండ్రిని బాదుదామనిపించింది. జనపకట్ట చేత్తో పట్టుకొని రోషంగా చూశాడు. వీరయ్య ఏమనుకున్నాడో? అక్కడి నుంచి నెమ్మదిగా వెళ్ళిపోయాడు. గబగబా జనపకట్ట గేదెముందు దులిపి గుడిసెలోకి వచ్చి పడుకున్నాడు కోటయ్య

తెల్లవారేటప్పటికి ఈ సంగతి ఎట్లా తెలిసిందో వీరయ్య భార్యకు తెలిసింది. వీరయ్య యింట్లోలేడు, వీరయ్య భార్య ఈ సంగతి తెలిసీ తెలియటంతోనే దొడ్డిలోకి వెళ్ళి కోటయ్య వామిలోనుంచి నాలుగుకట్టలు లాగి తన గేదెకు వేసుకుంది. ఈ సంగతి కోటయ్య భార్యకు తెలిసి తగాదా పెట్టుకుంది.

"నీ చెయ్యి విరగా—"

"నీ మొగుడెందుకు చేశాడే?"

"నా మొగుడు చేశాడా?"

"మా జనపకట్ట లాగి..."

"పట్టుకొస్తే చెయ్యి.."

వీరయ్య భార్య ప్రక్కగుడిసెలో కాపురం వుంటున్న రత్తయ్య భార్యని పిలిచి రుజూచేసింది. అంతా చెప్పి, "రత్తయ్య మామకూడా చూశాడు" అని చెప్పింది. అక్కడితో మరి చేసేది కోటయ్య భార్య. ముప్పొద్దులూ ఇంట్లో వుండకుండా నెయ్యవాడికికాని ఈ పన్నాగం పన్నా పన్నుడు. వాడకట్టువాళ్ళంతా కూడ కట్టుకుంటున్నారన్నది. అంతా నీ పక్షం పలక్క, దిక్కులేని పక్షిని నా పక్షం ఎవరు పలుకుతారన్నది నాకేమి-అంటూ దండా అన్నది. అక్కడితో వీరయ్య భార్య వేసుకుంది. ఒక్క జుట్టూ జుట్టూ వేసుకున్నారు. వాడకట్టంతా పోగైంది. ఎవ్వరికి చెప్పేవి వారికిచెప్పి అప్పటికి సర్దారు.

కోటయ్య భార్యకు కోపం ఆగలేదు. ఇంట్లోకివచ్చి మొగుడిమీదపడి రేగింది. 'దీనికంతకూ నీ మెత్తదనమే కారణం' అని బిగ్గరగా ఏడ్చింది. దొంగతనాలు కట్టినా రంకుతనాలు కట్టినా నీకు పట్టనట్టు కూర్చుంటావు. ఒక్క ఆడదాన్ని నావల్ల ఏమవుతుంది? అని ఏడ్చింది. కాని కోటయ్య 'కిం' అనిలేదు. 'కమ్' అనలేదు. తలనిండా ముసుగుపెట్టుకొని పడుకున్నాడు. పడుకున్నట్టే వున్నాడు.

వీరయ్య ఎక్కడెక్కడ తిరిగాడో సాయంకాలం ఇంటికి వొచ్చాడు. వొచ్చి రావటంతోనే సంగతంతా పసి కట్టాడు. కోటయ్య భార్య అతనికి విన బడేటట్లు తిట్లు ప్రారంభించింది. ఆ తిట్లు విని వీరయ్య భార్య జుయ్యిన లేచింది తోకతొక్కిన పామల్లే. ఇద్దరూ మళ్ళీ లడాయి వేసుకున్నారు. పాతపాటే అయినా మళ్లీ వాడకట్టంతా చుట్టుము ట్టింది. వీరయ్యకు కోపం వచ్చింది. "నోరుమూసుకు లోపలకు వెళ్ళు" అని గదమాయించాడు భార్యని.

"దొంగతనం చేస్తుంటే!" అని అర చింది.

"ఎవరు దొంగతనం చేసింది?"

''నీ కొడుకు."

"ఎవరు చెప్పారు?"

"నువ్వు చెప్పకపోతే దాగుతుందను కున్నావా?" అన్నది భార్య.

"ఎవరు చెప్పారు?"

"రత్తయ్య."

"వాడిమాట ఎందుకు నమ్మావ్?''

"ఒకరు చెప్పేదేమిటి. ఇంతంత ఆకు వాళ్ళకాడ ఎక్కడిదీ?'' అని కోటయ్య గేదె ముందున్న జనపకాడ చూపించింది.

"వెళుతూ నేనే మన జనపకట్ట ఒకటి వేసి వెళ్లాను. దీనికింత గోలేమిటి" అన్నాడు వీరయ్య.

"చూచారా, చూచారా ... ఎంత పన్నాగం పన్నిందో...ఈ గుడిసెలో, మేముండటం ఇష్టంలేక ఇదొకటి వేయిం చింది—'' అని అక్కడ పోగయిన వారందరికీ యదార్థాన్ని తెలియజెప్పింది కోటయ్య భార్య...చెప్పి మొగుడు దగ్గరకు పరుగెత్తింది.

"చూశారా!" అన్నది. ముసుగు పెట్టుకొని పడుకున్న కోటయ్య మాటాడలేదు.

"మీ నాన్న వొచ్చాడు. వున్నది వున్నట్టు చెప్పాడు'' అన్నది.

''ఏం చెప్పాడు?" అంటూ మంచం మీదనుంచి ఉలికిపడి లేచాడు కోటయ్య.

"మన గేదెకు తన జనపకట్ట తనే వేసి వెళ్లాడట" అన్నది భార్య.

ఈ మాట వినగానే కోటయ్య మళ్ళీ గబుక్కున ముసుగుపెట్టుకుని పడు కున్నాడు. భార్య చిలవలు, పలవలు చేసి చెబుతూనేవుంది. అత్తను తిడు తూనే వుంది. అతనుమాత్రం వేసిన ముసుగు తియ్యలేదు.






**ఆ**ఫీసునించి బయటపడి రోడ్డుమీదికి మరలగానే వెంకట్రావు ఒకసారి స్వేచ్ఛగా తన చుట్టూ చూసి చేతులు దులుపుకున్నాడు. ఉదయాన్నించీ తాను రాసిన కాగితాలూ, తిన్న చీవాట్లూ, చేసిన పొరపాట్లూ లెక్కకి మించిపోయాయి. అయితే అనుదినమూ జరిగే విషయాలు అట్టే కాలం బాధపెట్టవు; నిత్యం చచ్చే వాడికి ఏడిచేవాడెవడూ?

అలాగే అనుకుంటూంటాడు వెంకట్రావు ప్రతీ రోజూ.

"ఏం వెంకట్రావ్?"

ఎవరో తనను పిలుస్తున్నారు. గిరుక్కున వెనక్కి తిరిగాడు. దూరాన తన పూర్వమిత్రుడు ఆచారి తనని పిలుస్తూ, తనవైపే నడిచి వస్తున్నాడు. తానూ, వాడూ పూర్వం గడిపిన చక్కటి రోజులూ, వాడి చేష్టలూ, తన కనేక విధాల వాడు చేసిన ఉపకారాలూ జ్ఞప్తికి వచ్చాయి వెంకట్రావుకి.

"ఎప్పుడొచ్చావురా?"

"ఇప్పుడే బస్సు దిగాను."

"అంతా కులాసాగా?"

"ఆఁ..."

వెంకట్రావుకి మంచి రోజులు కరువు. డబ్బు కరువు. స్నేహితులు కరువు—ఇప్పుడు మాటలూ కరువయ్యాయి.

"హెల్తు ఆఫీసులో ని మీద వచ్చాను."

"ఆహా..."

ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు.

కాఫీహోటలు దగ్గరికి వస్తున్నకొద్దీ వెంకట్రావు గుండెల్లో దడ పట్టుకుని ఎక్కువకాసాగింది. ఆవేళ ఒకటో తారీఖు. జీతం అందుకుని తెచ్చుకుంటున్నాడు వెంకట్రావు. ఆచారికి కాఫీ

ఇచ్చుకోవాలి. వాడిచేత డబ్బులు ఇప్పిస్తే ఏం బావుంటుంది?

ఈ ఆలోచనల మధ్య రానేవచ్చింది కాఫీహోటలు. ఆచారి ఏమీ ప్రయత్నం లేకుండానే హోటల్లోకి దారి తీశాడు. వెంకట్రావు గుండెలు చేతితో పట్టుకుని వెనక నడిచాడు.

ఇద్దరూ వెళ్ళి ఓమూల కూర్చున్నారు. సర్వర్ వచ్చి "ఏం కావాలి సార్?" అన్నాడు.

"రెండు స్వీట్—"

ఆచారి నిస్సందేహంగా ఆర్డర్ చేసే సరికి గతుక్కుమన్నాడు వెంకట్రావు- రెండు ఆర్లు పన్నెండణాలు...

"ఒకటే తీసుకురా..." అన్నాడు ఎంత తగ్గినా మంచిదేనని.

"అదేమిట్రా? కాశీలో వదలిపెట్టావేంటి?"

"అహఁ...స్వీటెందుకు అని—"

సర్వరు తెల్లబోయి చూసి, వెళ్ళి రెండు స్వీట్సు తెచ్చాడు. వెంకట్రావు కాల్తోన్న ఇనుములాగ నోట్లో పెట్టుకున్నాడు స్వీట్ని. స్వీట్ అరణాలూ. హాట్ ఓ పావలా, కాఫీ—వెధవది... స్పెషల్ హోటలు—ఎనిమిదణాలు... రెండుంపావలా...

వెంకట్రావు ఓసారి తన జేబులోని డబ్బువేపు చూసుకున్నాడు. అందులో ఒక్క రూపాయి తరిగితే రుక్మిణమ్మ చేసే రాద్ధాంతమూ, గోలా చెవిలో మారు మోగటం మొదలెట్టాయ్.

పోనీ, ఆచారిని బిల్లు పే చేయనిస్తే?

"ఛా'' అనుకున్నాడు వెంకట్రావు. తన కెన్నిసార్లు ఇచ్చుకోలేదు కాఫీ? తనూ ఎలా లేదన్నా ఆచారి చేస్తూన్న అయ్యవారి ఉద్యోగంకన్న ఎక్కువ ఉద్యోగమే చేస్తున్నాడు.

బూందీ—కాఫీ...సర్వర్ యిచ్చిన బిల్లూ తీసుకున్నాడు వెంకట్రావు. ఇంత సేపూ ఏంమాట్లాడుతున్నాడో తనకి తెలీదు. ఈ క్షణంకోసం తాను భయంగా ఎదురుచూశాడు. ఆచారి బిల్లు తీసుకునే ప్రయత్నం కూడా చెయ్యలేదు.

వెంకట్రావు బిల్లు ఇచ్చుకుని బయటికి నడిచాడు — సంతోషంతోనూ, విచారంతోనూ...వెనకాలే ఆచారి వస్తూ రెండు కిళ్లీలు కొని, ఒకటి వెంకట్రావుకిచ్చాడు.

"మరి నేను వెళ్తానూ?" అన్నాడు ఆచారి.

వెంకట్రావుకి తన పరువుప్రతిష్ఠలు త్రాసులో ఉన్నట్లు కనిపించాయి. కొంచెం ఆలోచించకుండా "రాత్రికి యింటికి వచ్చేయ్" అన్నాడు.

''చెప్పలేనురా. మూడొంతులు వస్తాన్లే"

ఆచారి అటువైపు నడిచాడు. వెంకట్రావు ఇంటివైపు నడిచాడు

* * *

గుమ్మం ఎక్కి, తలుపు తోసుకుని వెంకట్రావు గదిలోకి వెళ్ళాడు. చొక్కా తీసి పాగాకొయ్యకి తగిలించాడు.

రుక్మిణమ్మ వచ్చి, "ఏం ఆలస్యం ఐంది?" అన్నది.

"చిన్న పని ఉండి ఆలస్యం అయిందిలే—" అన్నాడు వెంకట్రావు.

అతని జేబు తడుముతూన్న రుక్మిణమ్మ ఓసారి డబ్బంతా లెక్క చూసి తెల్లబోయి, "డబ్బు తక్కువుందే!" అంది.

"ఆఁ-కొంచెం తక్కువుంటుందిలే" అన్నాడు వెంకట్రావు.

"ఏం?" అన్నది రుక్మిణి ఛర్రున.

"కొంచెం ఖర్చు చేసాను." దోషిగా, దీనంగా అన్నాడు వెంకట్రావు.

"ఎందుకనీ అడుగుతున్నాను?"

"స్నేహితు డొచ్చాడులేవే."

అనేశాడు వెంకట్రావు. మరి చేసేది లేక! రుక్మిణి దగ్గర ఈ ఆటలు సాగవు. రెండుం పావలా!

"ఇలా తగలేస్తారని తెలిసే నేను గోలపెడుతూంటాను. హయ్యో! ఎంత దూబరా! ఎవడో వస్తే, మూడు రూపాయిల ఖర్చా?"

"రెండుం పావలాయే!"

"అదంటే అంతే. అయినా మగాళ్ళకి బుద్ధి ఉండకపోతే ఇంతే" నన్నది రుక్మిణి.

అంతటితో ఆ పతివ్రత శాంతించి



పోలికలు

నందులకు చాలా సంతోషించాడు వెంకట్రావు. కాని, తరవాత విషయం ఇంకా అతన్ని భయపెడుతూనే ఉంది.

నెమ్మదిగా, "రాత్రికి వాడిని భోజనానికి రమ్మన్నాను" అన్నాడు వెంకట్రావు - ఇల్లంటుకుందన్నట్లు.

"ఎవరినీ?" అంది రుక్మిణి కోపంగా చూస్తూ.

"నా స్నేహితుణ్ని."

"ఎందుకూ?"

"భోజనానికి."

"ఇక్కడ సేవ చేసేందుకో మనిషుందని, అడ్డమైనవాళ్ళనీ నా పీకలమీదికి తెచ్చి ఎక్కిస్తే, నేనేంచెయ్యలేను" అంది

"అదికాదే-వాడు నాకు చాలా..."

"పిల్లేదు-అంటే పిల్లేదు'' రూలింగు ఇచ్చేసింది రుక్మిణి.

వెంకట్రావుకి కోపం రాదు. వచ్చినా లాభం లేదనే విషయం అతనికి తెలుసును. అతను రుక్మిణిని బ్రతిమాల సాగాడు. కొన్ని పడికట్టు మాటలున్నాయ్ ఆమెని అంగీకరింప జెయ్యడానికి. ఆమెనీ, ఆమె తల్లినీ, చెల్లెల్నీ పొగిడే మాటలవి. వెంకట్రావు వాటిని ఆపత్సమయాలలో మాత్రమే ఉపయోగిస్తూంటాడు.

ఇవాళ అవన్నీ వాడేశాడు. అవి పని చేశాయి. ఇంకెప్పుడూ ఎవరినీ ముందరగా తన అనుమతి తీసుకోకుండా భోజనానికి పిలవనని వెంకట్రావు దగ్గర మాట తీసుకుని, రాత్రికి మిత్రుణ్ణి పిలిచినందుకు క్షమించింది రుక్మిణమ్మ.

వీధి అరుగుమీద కూర్చుని మామూలు ప్రకారం వచ్చేపోయే వాళ్ళని చూస్తున్నాడు వెంకట్రావు. సాయంత్రాలు అతను బయట తిరిగేందుకు రూల్సు అంగీకరించవు.

ఎవడో - పిచ్చివాడల్లే ఉన్నాడు. వీధంతా ధూళిచేస్తూ వస్తున్నాడు. ఓ క్షణం వినోదంగా వాడివైపు చూశాడు వెంకట్రావు. కాని, వాడు దారినిపోతోన్న ప్రతీవాడి చెయ్యీ పట్టుకొని ఏదో అరుస్తున్నాడు. తరువాత వాడిని వదిలి ఇంకో చెయ్యి. తరువాత ఇంకోటి...

కొంచెం దగ్గిరికి వచ్చాడు పిచ్చివాడు. ఒకడి చెయ్యి పట్టుకుని, "నువ్వు పుట్టినందువల్ల ఏం ఉపకారం జరిగింది?" అని గట్టిగా అడిగాడు. చెయ్యి స్వంతదారు తెల్లబోయి చూస్తూంటే వికటంగా ఒక అట్టహాసంచేసి వాణ్ణి వదిలి మరో చెయ్యి తీసుకున్నాడు

వెంకట్రావు కొంచెం భయపడ్డాడు- వాడు తన జోలికి వస్తాడని.

లేవబోయాడు. కాని, పిచ్చివాడు గభీమని వచ్చి అతని చెయ్యి పట్టుకున్నాడు. ''నువ్వు పుట్టినందువల్ల లోకానికి ఏం ఉపకారం జరిగింది?" అని అరిచాడు.

వెంకట్రావు ఇంతసేపూ పిచ్చివాడికి భయపడ్డాడు—కాని, ఏదో కాంతితో వెలుగుతూన్న వాడి కళ్ళని చూశాక, అతనికి ఆ ప్రశ్న వెయ్యిరెట్ల బలంతో భయపెట్టసాగింది.

"చచ్చిపో- నీ వల్ల ఎవ్వరికీ ఉపకారం జరిగి ఉండకపోతే నువ్వెందుకూ? చచ్చిపో.''

పిచ్చివాడు నవ్వాడు. వెంకట్రావు చెవుల్లో ఆ మాటలు తిరిగి తిరిగి బలంగా మారుమోగుతున్నాయ్. పిచ్చివాడు వెళ్ళిపోయాడు.

వెంకట్రావు కూర్చున్న చోటునుంచి లేవలేకపోయాడు. తాను ఎవరి కుపకారం చేశాడు? అయితే ఎందుకు బ్రతికి ఉండాలి?

అన్నీ ఆలోచించుకుంటూ కూర్చున్నాడు

వెంకట్రావు. ఎనిమి దయింది. ఆచారి జాడలేదు. అప్పుడే రుక్మిణికి కోపం రాసాగింది. వేగంగా ఆచారి వస్తే బాగుండు ననుకున్నాడు.

ఎనిమిదిన్నర, తొమ్మిది. ఆచారి రాలేదు.

"ఈ మాత్రందానికి నన్ను చంపేరు. స్నేహితుడువస్తాననిఎందుకు చెప్పాడు?"

రుక్మిణి నోటికి హద్దులులేవు. ఇష్టం వచ్చినట్లు మొగుణ్ణీ, వాడి మిత్రుణ్ణీ తిట్టి తరువాత భోజనం చేసింది. కోపంలో వెంకట్రావుకి అన్నం పెట్టడం మరిచి పోయింది.

* * *

వీధి అరుగుమీద పడుకున్న వెంకట్రావు అర్ధరాత్రివేళ లేచాడు. వెన్నెల విరివిగా కాస్తోంది.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో అతనికి సాయంత్రంనించీ జరిగినదంతా జ్ఞాపకం వచ్చింది—ఆ పిచ్చివాడి మాటలన్నీ జ్ఞాపకం వచ్చాయి.

"నువ్వు పుట్టడంవల్ల లోకానికి ఏం ఉపకారం జరిగింది?"

ఏం జరిగింది? తాను చిన్నప్పుడు వారాలు చేసుకుని చదివి స్కూల్ఫైనల్ పాసయ్యాడు. తరువాత గుమాస్తాగా చేరాడు. నాటినుంచి నేటివరకూ అదే ఉద్యోగం. వచ్చిన కాగితానికల్లా నెంబరు వెయ్యడం, అది ఎవరికి వెందాలో వాళ్లకి పంపడం. వెళ్ళాల్సిన కాగితాలకి పోస్టేజి సరిగ్గా అతికించి చిరునామా జాగ్రత్తగా వ్రాసిపంపడం.

ఇందులో ఏం ఉపకారం జరిగింది? ఏమీలేదు. పోనీ గృహస్థుడుగానైనా తానెవరికైౖ ఉపకారం చేశాడా? అంత కన్నా లేదు. ఈ గయ్యాళి భార్యతో ఎవరికీ ఓ పూట అన్నం పెట్టడానికైనా తనకి స్వతంత్రం లేదు.

అయితే?

తాను చచ్చిపోవాలి. తనవల్ల ప్రయోజనం లేదు లోకానికి. పిచ్చివాడు చెప్పాడు – తను చచ్చిపోవాలి. వాడు పిచ్చివాడు కాదు—మహాజ్ఞాని.

ఒక్కసారి మరణం ద్వారా తాను పొందబోయే సుఖాలు వెంకట్రావు కళ్లకి కనబడసాగాయ్. తప్పు కాగితాలు పంపినందుకు గుమాస్తాలు తనని తిట్టరు. అర్థమృతుడిగా ఈ జీవితం గడపనక్కర లేదు. బాధ వదిలిపోతుంది.

నిజమే, చచ్చిపోవాలి.

వెంకట్రావు లేచాడు. ఎలా చచ్చిపోవాలనే సమస్య అతనికి ముఖ్యమైనది కాదు. ఊరుబయట నుయ్యి ఉంది. చావుల నుయ్యి తొందరగా నడవ సాగాడు. ఈకష్టాలకీ, ఈజీవితానికీ, ఈ నాటితో స్వస్తి. నడిచాడు, నుయ్యి కని పిస్తోంది వెన్నెట్లో. తనకోసమే అది అక్కడ ఉన్నట్లు కనిపిస్తోంది.

చిరునవ్వు నవ్వుదామనుకున్నాడు వెంకట్రావు. నవ్వలేకపోయాడు. కాళ్ళు

కొంచెం నెమ్మదిగా అడుగువెయ్యడం ప్రారంభించాయ్.

హఠాత్తుగా, ఆ ప్రశాంతతని చీల్చుకుంటూ ఓ వికటాట్టహాసం వినిపించింది. వెంకట్రావు అడుగుతీసి అడుగు పెట్టలేకపోయాడు...భూత ప్రేత పిశాచ...

ఎవరూ కాదు. పిచ్చివాడు ఆ నూతి పక్కనించి నడిచివచ్చి వెంకట్రావు చెయ్యి పట్టుకుని, "ఎందుకొచ్చావ్?" అన్నాడు.

"చచ్చిపోడానికి..."

"ఏం?"

నిశ్చింతగా చెప్పాడు వెంకట్రావు- "నేను ఎవరికీ ఉపకారం చెయ్యలేదు" అని.

ఈసారి తేలిగ్గా నవ్వాడు పిచ్చివాడు.

"మూర్ఖులు!... మూర్ఖుడివి!" అని అరిచాడు.

వెంకట్రావు తెల్లబోయాడు.

"నువ్వు చావొద్దు. పో" అన్నాడు.

వెంకట్రావుకి కొండంత ధైర్యం వచ్చింది.

"కాదు-నువ్వే చెప్పావ్ చావమని. నేను చచ్చిపోతాను" అన్నాడు.

"...లేదు. నువ్వు చాలా ఉపకారం చేశావ్. నీవల్ల ప్రపంచానికి గొప్ప ప్రమాదం తప్పించబడింది'' అన్నాడు పిచ్చివాడు.

వెంకట్రావు తెల్లబోయాడు.

"నావల్లనా?ఉపకారమా?"అన్నాడు.

"అఁ! నీ భార్య గయ్యాళి కదూ?"

''ఔను...మహా గయ్యాళి!"

"వెర్రివాడా! ఆమెని పెళ్ళాడి ఓ మనిషిని రక్షించావ్. ఆ బాధలన్నీ వాడికి బదులు అనుభవిస్తున్నావ్. ఇంతకన్న ఉపకారం ఏముంది? పో" అన్నాడు పిచ్చివాడు

వెంకట్రావు ఇక ముందడుగు వెయ్యలేకపోయాడు. వెనుదిరిగి వేగంగా నడవసాగాడు. తరువాత పరిగెట్టసాగాడు. ఉపకారం చేశాడు! తనవల్ల లోకానికి ప్రయోజనం ఉంది! పరుగు...వేగం... మహావేగం.

మర్నాడు ఉదయం వెంకట్రావుకి పెద్ద జ్వరం వచ్చింది. అలా జబ్బుపడ్డందుకు రుక్మిణి అతన్ని చెడతిట్టిపోసింది.






మనిషి మెత్తనైతే మొత్తబుద్ధేస్తుంది.

మురహరి మెత్తటివాడనడంలో ఏమీ సందేహంలేదు. పైగా సిగ్గరి. ఆడపిల్ల కనిపిస్తే–నిద్రగన్నేరాకులా ముడుచుకు పోతాడు. సిగ్గుపడి తప్పుకు తప్పుకు నడుస్తాడు. ఆడవాళ్ళు దార్లో తగిలితే వాళ్ళు దగ్గరయ్యేకొద్దీ ... పాతకాలపు పెళ్ళికూతుర్లా తలదించుకుని ఊపిరి బిగబట్టి వాళ్ళని ఎప్పుడు దాటుకుపోతానా, ఎప్పుడు గండం గడుస్తుందా అని ఉక్కిరిబిక్కిరవుతాడు. చాలామంది అమ్మాయిలకి మురహరి మొహంలో ఈ రసాయనిక మార్పుల్ని చూసి తరించడమంటే ఎంతో సరదా. అతను ఒంటరిగా కనిపిస్తే ఓ పట్టాన వదిలేవారుకారు. అల్లరి పెట్టి వినోదించేవారు. మురహరంటే కాలేజీ అమ్మాయికీ అలుసే. హైస్కూలు అమ్మాయిలకీ అలుసే — ఎలిమెంటరీ స్కూలువదలి అపుడే హైస్కూల్లో అడుగు పెట్టిన ఆరోక్లాసు పాపకీ అలుసే.

మురహరి ఒకనాటి సాయంత్రం— షైర్లు షికార్లు అమడదూరం గాబట్టి– బుద్ధిగా డాబామీద చదువుకుంటున్నాడు. గణగణ చదివే అలవాటేమో–వాయింపు ధోరణిలో సాగిపోతున్నాడు. కాస్సేపటికి మరో గణగణధ్వని–అడధ్వని వినిపించి అదిరిపడ్డాడు. ఎంతసేపట్నుంచి తనని గమనిస్తుందో ఉష వాళ్ళ మేడమీద బాల్కనీలోనుంచి తనవంక చూస్తూ - రెండు అరచేతుల్ని ఉత్తుత్తి పుస్తకంలా చేసుకొని లొడలొడ చదువుతున్నట్టు నటిస్తూంది. 'అంటే తన చదువుని గేలి చేస్తుందన్నమాట' అన్నభావం రాగానే మురహరి ఉడికిపోయి ఠక్కున పుస్తకం మూసేసాడు. ఉష పెద్ద చప్పుడుతో ఉత్పత్తి పుస్తకమనే చేతుల్ని మూసి పారేసింది. ఛి ఛి. అని మూలుక్కున్నాడు. ఆమె అచ్చం అలాగే విసు







క్కుంది. అతను చేతుల్లో మొహం దాచుకొని కణతలు నొక్కుకున్నాడు. ఓరగా చూస్తే—ఆమెకూడా మొహం చేతుల్లో యిరికించి కణతలు నొక్కుకుంది. మరోసారి...మరోసారి అయితే తల దించుకొనేవాడేగానీ మురహరికి ఆమె అభినయం...ఆ రకం ఆటపట్టింపుచూసి తల దించబుద్ధి కాలేదు. తను ఏం చేస్తే ఆమె అది చేస్తుంది. వట్టి కవ్వింపు. ఆకతాయితనం. విసిగిఉన్నాడేమో 'ఎన్నాళ్లీ ఆడపోరు. చివరికి యింటిపక్క ఉషకి కూడా లోకువా నా బ్రతుకు' అని వాపోయాడు. అతనిలో తిరుగుబాటుతనం తలెత్తింది.

ఊపిరితిత్తులనిండా గాలి పీల్చుకొని రొమ్ము విరుచుకు చూశాడు...ఉషవంక. ఆమెకూడా అలాగే చేసింది. అతను ఠీవిగా నడుంమీద చేతులుంచాడు. ఆమె అతని చర్యలకి విస్తుపోతూ...అలాగే నడుంమీద చేతులుంచింది. 'తను ఏం చేస్తే అది చేస్తుందా?' అనుకొని ఒక్కసారి "హాయ్ ఉషా" అని గాలిలో ఒక ముద్దు విసిరాడు.

అవతలినుంచి— మరి జవాబు లేదు ...మనిషి జాడా లేదు.



# ఏమో బాబూ

రాచకొండ రంగనాథశర్మ

ఇవాళ నా కళ్లముందు పదహారేళ్ల 'లలిత' లలితమనోహరంగా తిరుగుతున్నా ఎందుకో నా కా ఏడేళ్ళ లలితే గుర్తుకొస్తూంది.

చిన్నదీ - చింకిదీ అయిన గౌను. పౌడుం రంగుదీ-పొట్టిదీ అయిన ఆ లాగూ ... మా తాతయ్య పిలకలో ఓ పాయలా ఉండే ఆ పిలక జడా ... నిజాయితీ తగ్గినవాడి మనసులా ఉండే వెలిసిన రిబ్బనుముక్కా... మెడలో కాశీ తాడుతో కలిపి వేసుకున్న ఆంజనేయుడి బిళ్ళా ... చేతులకి నల్లి రబ్బరు గాజులూనూ.

'ఒరేయ్ శ్రీనూ! ఏమిట్రా అలా చూస్తావు దాన్ని. నీ పెళ్ళాం అది' అత్తయ్య అంటూంటే-

"ఛీ! యీ చీ(విడిముక్కు)ది నా పెళ్లా(మే)వేంటి?" అని పదకొండేళ్ల నేను చీదరించుకునేవాణ్ణి.

"ఛీ! నేను దీన్ని పెళ్ళిచేసుకోనసలు" అనేవాణ్ణి నేను.

"కుర్ర వెధవ్వి- యివన్నీ నీకెందుకులే" అని నవ్వేసేది అత్తయ్య.

నాన్నకున్న ఒకే ఒక చెల్లెలు మా అత్తయ్య. మావయ్యకు ఉద్యోగంలేదు. ఉద్యోగం సంపాదించడానికి వయస్సున్నంతకాలం తరగదనుకున్న ఆస్తిని పాడుచేసిన మావయ్య, ఆ తర్వాత ఉద్యోగం దొరక్క- పూలమ్మిన చోటనే కట్టెలమ్మవలిసి వచ్చింది. ప్రయివేట్లు చెప్పి ... కోమటి కొట్లలో పద్దులు వ్రాసి..కన్నతల్లినీ, తననూ పోషించుకునేవాడు.

మా మేనత్త మొండితనంవల్ల ఆవిడకు వయస్సులో జరగాల్సిన పెళ్ళి జరగలేదు. పదహారేళ్ళలోపునే ఆడపిల్లల్ని అత్తింటికి పంపే సాంప్రదాయం ఉన్న కుటుంబంలోని మా మేనత్తకు పాతికేళ్లు దాటితే కాని పెళ్ళికాలేదు.

అత్తయ్యను పెళ్ళాడాకే మావయ్య స్థితి గతుల్లో కొంత మార్పు వచ్చింది.

అందులో మా నాన్న ప్రచ్ఛన్న హస్తం చాలా ఉంది.

వాళ్లకు కలిగిన ఒకే ఒక సంతానం 'లలిత'.

గడిచిన జీవితానికీ — గడుస్తున్న బ్రతుక్కీ బేరీజు వేసుకుని ఓ రకం వేదాంతం అలవర్చుకున్నాడు మావయ్య.

అత్తయ్యదే ఆ యింట్లో పైచేయి.

మావయ్యంటే ఎందుకో నాకు మొదట్నుంచీ ఎంతో జాలి.

నాన్నకు చెల్లెలిమీదఉన్న అమితమైన అభిమానంవల్లనైతేనేమి... రక్త స్పర్శ కావటం మూలాన్నయితేనేమి...మొత్తం మీద లలితను నాకిచ్చి పెళ్ళిచేయటమే ఆయన అభిమతం...నిర్ణయంకూడా.

అమ్మకుకూడా లలితంటే మంచి అభిప్రాయమే ఉంది.

కాకపోయినా నాన్న నిర్ణయాల్నేనాడూ అమ్మ వ్యతిరేకించలేదు. అలాంటి స్వభావంకూడా కాదు అమ్మది.

అందరూ ఏకగ్రీవంగా ఆమోదించిన బంగారుబొమ్మ 'లలిత.'

నా నిర్ణయంతో పని లేనట్టుగా... నా ఆమోదముద్రతో అవసరం లేనట్టుగా ... వాళ్ళల్లో వాళ్ళే అన్ని నిర్ణయాలు తీసుకుంటున్నారు.

ఇరవై ఏళ్ళు నిండిన నాకూ ఓ వ్యక్తిత్వం ఉంటుందని వాళ్ళనుకోరేం? నాకూ ఆశలూ, ఆశయాలూ ఉంటాయనీ... కనీసం నన్ను సంప్రదించాలనీ వాళ్ళ ఊహకందకపోవటం నాకు ఆశ్చర్యాన్నే కలిగించింది.

నా ఊహలిలా సాగుతుండగానే...

నాన్నతో అంది అత్తయ్య "వాడిచేత కూడా 'ఊ' అనిపిస్తే పోలా" అని. ఎదురుగానే ఉన్నాడుగా, మనం అనుకున్నవన్నీ విన్నాడు కదా- అయినా పోనిద్దూ, కుర్రకుంక,వాడికివన్నీ యేం తెలుస్తాయ్" నాన్న తేలిగ్గా కొట్టిపారేశారు.

నాకు పుండుమీద కారం జల్లినట్టయింది.

అత్తయ్య ఆ మాటన్నప్పుడయినా నా అభిప్రాయం తెల్సుకోవాల్సిన బాధ్యత తను మరచి 'కుర్రకుంక' అని కొట్టిపారేస్తారా?

"అసలీ పెళ్ళికి నేనొప్పుకోనని ప్రతిఘటిస్తే?" ఆలోచన అయితే వచ్చింది గాని... మాటల్లో చెప్పగలనా నేను?

ఒకవేళ చెప్పగలిగినా అట్నుంచి చివాట్లు రాంభాణాల్లా నా మీదకు దాడి చేస్తాయ్...

లలితతోనే చెప్పేస్తే? ఆ అయిడియా నాకు నచ్చింది.

నాన్నంటే భయం ... అమ్మంటే గౌరవం ... అత్తయ్యంటే భక్తి ... మావయ్యంటే జాలి...

లలితతో చెప్పడానికివేం అడ్డురావనే నా ఉద్దేశ్యం...



అదీ లలితతో ఒంటరిగా ఉన్నప్పుడు చెప్పాలి.

ఎప్పుడు వీలవుతుంది? ఎలా వీలవుతుంది??

లలితతో అలా తోటలోకి వెళితే?

ఈ సంగతులన్నీ మాట్లాడవచ్చు

కాని లలితను ఒంటరిగా నాతో తోటలోకి పంపిస్తారా అని అత్తయ్య నడిగితే?

అత్తయ్య మనసులో, దేవుడున్నాడు కాబోలు. నా మనసులో ఉన్న మాట మనసులోనే ఉంది–

లలితా...నువ్వూ కలిసివెళ్ళి అలా తోటచూసి రాకూడదట్రా శ్రీనూ అంది. లలిత 'బోల్డు' సిగ్గు ఒలకబోసింది. ఒలకబోసిన ఆ సిగ్గుకళ్ళతోనే అలవోకగా నా వేపు చూసింది.

అలా లలిత చూసిన చూపులకు నాకూ వల్లమాలినసిగ్గు ముంచుకొచ్చింది. నాన్నగూడా అత్తయ్య మాటల్ని సపోర్ట్ చేయటంతో కొండంత బలం వచ్చింది నాకు.

వెళ్ళిరండిరా. పెందరాళే వచ్చేయండి దారిలో పురుగూ. పుట్రా ఉంటాయి అనటంతో యిద్దరం లేచాం.

యిదేం తనకు పట్టనట్టు పడక్కుర్చీలో కూర్చుని చుట్టపీలుస్తూ మహదానందంలో మునిగి తేల్తున్నాడు మావయ్య.

లలితతో కలిసి నడుస్తుంటే నా కెంత గర్వంగానో ఉంది.

నేనెంతో ఎత్తుకెదిగి పోయినట్టూ... నే నెంతో పెద్దవాణ్ణయి పోయినట్టూ.. అనిపించింది.

యిద్దరం తోటలోకి చేరుకున్నాం. దారి పొడుగునా ఏదో ఒకటి వాగుతూనే ఉంది లలిత. ఒట్టి వాగుడుకాయ.

తోటలో కెళ్ళినా తన వాగుడు కట్టిపెట్టలేదు.

నేను పరధ్యానంగా 'ఊ' - 'ఆ' ఓహో! అలాగా అంటున్నా నంతే

నా మనసులో విషయాన్నెలా బయట పెట్టాలా అని ఆలోచిస్తూన్న నేను లలిత మాట్లాడటం ఆపేసినా 'ఆ' అలాగా అంటూంటే పగలబడి నవ్వుతూన్న లలితకేసి కంగారుగా చూసాను.

నేను మాట్లాడటం ఆపేసి చాలా సేప యింది. అయినా నువ్వు...నువ్వు... నవ్వుతూంది.

నాకు అరికాలిమంట నెత్తికెక్కింది.

"ఛీ! యింత మూగదేవుడి వేంటి బావా నువ్వు- అస్సలేం మాట్లాడటం లేదు" అంది నవ్వటం ఆపేసి.

"ఏం...మాట్లాడను" రెండు మాట లకు మధ్య మూడుగుటకలు మ్రింగాను.

దాంతో విరగబడి నవ్వటం మొద లెట్టింది.

మరొకప్పుడయితే ఆ నవ్వుల్లోంచి నవరత్నాలేరుకునేవాణ్ణి.

ఆ నవ్వుల జల్లుల్లో హాయిగా తడిసి వణికిపోతూన్నట్లు నటిస్తూ లలితను గట్టిగా కౌగిల్లోకి తీసుకునేవాణ్ణి.

కాని నాకు వళ్ళు మండిపోతూంది. నా వ్యక్తిత్వాన్నెవరూ గుర్తించని వేళది. లలిత నవ్వుతూనేఉంది.

"అలా నవ్వకు" ఉక్రోషంగా అరి చాను.

"నవ్వితే," బుగ్గమీదవేలు చక్రాల్లా తిరిగిన కళ్ళు.

"నాకోకోపం వస్తుంది."

"వస్తే' త్రాచుపాములాంటి నల్లటి జడకొసల్ని సవరించుకుంటూంది.

"నిన్ను పెళ్లిచేసుకోను."

"ఎంత చక్కటి శుభవార్త చెప్పావు బావా" అన్నలలిత మాటలకు గజంవెత్తు తృళ్ళిపడ్డాను

నా వులికిపాటు చూసి మళ్ళీ నవ్వు మొదలుపెట్టింది.

"యిదిగో! నిజంవే చెబుతున్నా-ఇలా అయితే నిన్ను పెళ్ళిచేసుకోను" బెదిరి స్తున్నట్టుగా అన్నాను.

"మానెయ్" అంది లలిత మరో ప్రక్కగా తిరిగిపోయి

ఎంత గీర? పళ్లు కొరికాను.

"యీ పెళ్ళెలా తప్పిపోతుందా అని నేను ఆలోచిస్తున్నాను." అటు ఎటో చూస్తూ అంది.

"నిజం?"

"ఔను బావా! నిజంగానే - అసలు నీతోనే మాట్లాడాలనుకున్నాను. అవ కాశంకోసం యెదురుచూశాను. అవ కాశం వచ్చింది కనుక మనసులో మాట నీతో చెప్పాను."

నా ముఖం ముడుచుకుపోయింది.

"ఏంఎందుకని? నేను నీకు నచ్చలేదా లలితా?"

"నచ్చితే నిన్ను చేసుకోవటానికి నాకేం అభ్యంతరం ఉంటుంది?"

నా అహం దెబ్బతిన్నది.




ఏం నేను అందంగా లేనా?

ఎందుకు? కొరుక్కు తినడానికా?

నాలో ఉక్రోషం పెరుగుతోంది.

ఆస్థి...చదువు అన్నీ ఉన్నాయ్... ఒక్క తలకాయ తప్ప...

'ఇది కాదేంటి' అన్నాను నా తల చూపిస్తూ... నాకు ఉడుకుమోత్తనం వచ్చేస్తూంది.

' అందరికీ ఉంటుంది. అందరికీ తల కాయల్లో ఉండేదే నీకు తక్కువ" ఎందుకలా అందో అర్థంకాలేదు.

"ఎవర్నయినా ప్రేమించావా?" నేను ఓడిపోతున్నానేమో ననిపించింది.

"మ్రేం" అంది తిక్కగా.

"ఎవడా రాక్షసుడు" నాలో కసి రేగుతూంది.

"వడ్లగింజలో బియ్యపుగింజ"

సరిగ్గా అదే సమయంలో నాకో మంచి అయిడియా వచ్చింది.

పోన్లే! నిన్ను పెళ్ళి చేసుకోవటం నాకూ యిష్టంలేదు.

ఏం?

నేనొక అమ్మాయిని ప్రేమించాను. పెళ్ళిచేసుకుంటానని మాటిచ్చాను.

ఏం నేనందంగా లేనా?

ఎందుకూ? కొరుక్కు తినడానికా?

లలిత కళ్ళల్లో ఎర్రజీర.

"ఆ అమ్మాయి యెంతో అందంగా ఉంటుంది. నీకంటె..."గబుక్కున నాలిక్కర్చుకున్నాను ఎక్కడ కొరుక్కు తినడానికా అని అడిగేస్తుందేమోనని- మాటల్లో దొరికిపోకూడదు.

లలిత చటుక్కున లేచి నిలబడింది.

నేనూ లేచాను.

కట్నం క్రింద ఓ మారిస్ మైనర్ కారూ- ఓ బంగళా యిస్తానన్నారు వాళ్లు.

లలిత కదిలింది. నేనూ కదిలాను.

"అమ్మానాన్నా ఒప్పుకోకపోతే రిజిష్టర్డ్' పెళ్ళి చేసుకుంటాను.

లలిత అడుగులు జోరుగా పడుతున్నాయ్...

నేనూ నడకవేగం హెచ్చించాను- యిద్దరం యిల్లు చేరాం.

యింట్లో నాన్నా... మావయ్యా... యిద్దరూ లేరు.

లలిత విసవిసా నడుచుకుంటూ అత్తయ్యఉండే గదిలోకి వెళ్ళింది.

నేను వంటింట్లోఉన్న అమ్మదగ్గర కెళ్లాను.

"అమ్మా; లలితతో నాకిపెళ్ళియిష్టం లేదు" ఎలా చెప్పగల్గానో నాకేఆశ్చర్య మనిపించింది.

అమ్మ చటుక్కున నావేపు కోపంగా చూసింది.

"వెర్రి వెర్రిగా వాగకు" అని వార్నింగిచ్చేసింది.

''ఎవరయినా వింటే నవ్విపోతారు'' బుగ్గలు నొక్కుకుంది.

"వాళ్లు వింటే బాధపడతారు" రహస్యమంత నెమ్మదిగా అంది.

''నాన్నగారు వింటే చంపేస్తారు'' అంది.

"అదికాదమ్మా..."

"ఏదికాదు ! నోరు మూసుకుని పడుండు" అంటూ పొయ్యిమీద అన్నం గిన్నెను దింపి...చారుగిన్నె పెట్టింది.

"నేను చెప్పేదికూడా కొంచెం వినమ్మా''

వినుగ్గా నావేపు తిరిగింది అమ్మ.

"లలిత ఎవర్నో ప్రేమించిందట."

"ఏమిట్రా నువ్వు వాగేది" అమ్మ షాక్ తిన్న గొంతుతో అంది.

"ఔనమ్మా! లలితే చెప్పింది 'నేనెవర్నో ప్రేమించాను. యీ విషయం నీతో ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాను బావా. యివాళ ఆ అవకాశం వచ్చింది కనుక నీతో చెప్పేస్తున్నాను. నీతో పెళ్ళిజరగటం నా కిష్టమేలేదు బావా' అందమ్మా."

అమ్మముఖం వెలవెల బోయింది.

నమ్మలేనట్టుగా తలఅడ్డంగా ఊపింది. తనలో తనే ఏదో అనుకుంది.

అంతలోనే సర్దుకుని 'సరే. నాన్నగారు రానీ-అదేదో ఆయనే తేలుస్తారు. నువ్వెక్కడా......ఏమీ మాట్లాడకు'' అంది.

అమ్మయినా నా మాటలకింత కాలానికి విలువిచ్చిందని పొంగిపోయాను. పీట లాక్కుని కూర్చున్నాను వంటింట్లోనే.

లలిత... అత్తయ్యా... ఎవరూ గదిలోంచి బయటకు రాలేదు.

మరో ఐదునిమిషాలకు నాన్నా... మావయ్యా వచ్చారు.




' ఓసారి యిలావస్తారా" అంది అమ్మ వంటగదిలోనుండే నాన్నని ఉద్దేశిస్తూ..

నాన్న వచ్చాక అమ్మ నే చెప్పిన మాటలన్నీ తిరిగి చెప్పింది.

నాన్న నిశ్చేష్టుడైపోయాడు

కోపంతో ముఖం జేవురించింది.

అమ్మ అందించినగ్లాసుడు మంచినీళ్లు ఒక్క గుక్కలో త్రాగేశారు.

చిర చిరలాడుతూ బయటికెళ్తుంద గానే గదిలోంచి అత్తయ్య బయట కొచ్చింది.

"అన్నయ్యా! ఓసారిలా వస్తావా" అంది.

అత్తయ్యముఖం వాడిపోయి ఉంది.

నాన్న కోపంగానే అత్తయ్యగదిలోకి వెళ్లారు.

ఏమైనా గదిలోంచి కేకల్లాంటివి వినిపిస్తాయేమోనని చెవులు రిక్కించి వింటున్నాను.

నా గుండె దడదడలాడింది.

పదినిముషాల తర్వాత పెద్దగా నవ్వుకుంటూ అత్తయ్య గదిలోంచి వస్తున్న నాన్న కేసి అయోమయంగా చూస్తూ ఉండి పోయాం అమ్మా-నేనూ.

మావయ్య మామూలు ధోరణిలో పడక్కుర్చీలో పడుకుని చుట్ట కాల్చుకుంటూ మహదానందంలో మునిగి తేల్తున్నాడు.

"ఒరేయ్! యిలా రా"

నాన్న పిలుపుతో నా గుండెఆగినంత పనయింది.

దీనంగా అమ్మ వేపు చూసాను.

''రారా'' నాన్న మళ్ళీ గద్దించారు.

''నువ్వా రా అమ్మా'' అన్నట్టుగా అమ్మ వంక చూచి నాన్న దగ్గరకొచ్చాను.

నా వెనకే అమ్మ కూడా వచ్చింది.

"నీ కట్నం క్రింద వచ్చే కారూ - బంగళా లలితకు వ్రాసిచ్చేయ్." నాన్న కంఠం ఖంగుమంది.

చెమటతో తడిసిపోయాను.

''యేమిట్రా నువ్వు లలితతో అవాకులు...చెవాకులు వాగావట''

"అబ్బే... అది... అదేం" నసుగుతున్నాను. నోట్లోంచి తిన్నగా మాట రావటంలేదు. గొంతుతడి ఆరిపోతూంది.

"ఏమిటోయ్. అలా నీళ్ళు నవుల్తావ్. చెప్పు."

అమ్మ నా ముఖంలోకి అదోలా చూస్తూంది.

అంతవరకూ ఎలా దాచుకున్నారో గాని నాన్న తిరిగి పెద్దగా నవ్వటం మొదలుపెట్టారు. కాస్సేపటికి నవ్వాపి "ఇద్దరికిద్దరూ ఒక్కలాంటివాళ్లే-అదేదో వీణ్ణి ఆట పట్టించడానికి ఉన్నవీ.. లేనివీ చెబితే ముఖం కందదుంపలా చేసుకుని.. వీడి మట్టిబుర్రకు తోచింది వీడేదో వాగాడుట.

దాంతో... వీడు చెప్పిందంతా నిజంవే అనుకుని ఏడుస్తూ కూర్చుంది లలిత. ఏరా! యిదంతా నిజంవేనా?"

నాన్న ముఖంలోకి చూడలేక నేల చూపులు చూస్తూ ఉండిపోయాను.

''తిన్నదరక్కపోతే నాలుగుమైళ్ళు పరుగెత్తు. అంతేకాని అసలే అమాయకురాలు లలిత. దాన్ననవసరంగా హడల గొట్టకు'' అంటూ నాన్న పెరట్లోకి వెళ్ళిపోయారు.

అమ్మ ముసిముసిగా నవ్వుకుంటూ వంటగదిలోకి వెళ్ళిపోయింది.

నేనొక్కణ్ణి అలాగే నిల్చుండిపోయాను

"అంటే... నేను లలితతో పెళ్ళికి ఒప్పేసుకున్నట్టే నన్నమాట."

ఇరవైయేళ్లు నిండిన నాకూ ఓ వ్యక్తిత్వం, ఆశలూ; ఆశయాలూ ఉంటాయనీ...

కనీసం నన్ను (నా పెళ్ళివిషయంలో) సంప్రదించాలనీ ఒకళ్లూ అనుకోరేం?

లలితతో నీపెళ్ళి నిశ్చయం చేశామని మాటవరసకైనా నాతో యెవరూ అనరేం?

ఏమోబాబూ!






సీతారామయ్యగారింట్లో, వీధివేపు గదిలో ఓ చాకులాంటి కుఱ్ఱాడు అద్దెకు దిగాడన్న విషయం ఆ వీధంతా వ్యాపించిపోయింది. ఆ వార్త విని కండువా అయినా భుజాన వేసుకోకుండా నాలుగో ఇంటి శివనాథం పెద్ద పనున్నట్లు ఆ గది ముందునుంచి అటూ ఇటూ తిరిగి కుఱ్ఱాడిని ఎక్స్‌రే తీసినట్లు చూసి తబ్బిబ్బయిపోయాడు.

"అబ్బ! ఏ మందం? ఏ మందం? అచ్చం సినిమా యాక్టర్లా ఉన్నాడనుకో! యమ వర్సనాలిటీ!...అహోహో... ఓహోహో..." అన్నాడు పెళ్ళాంతో.

"ఉద్యోగం ఏమిటో?" ఆరాగా అడిగింది ఆయన భార్యారత్నం.

"ఏదో మంచి ఉద్యోగమే అయ్యుంటుంది. గదిలో చాలాఖరీదయినసామాన్లు కనిపించినయి. పెద్ద రేడియో, గదంతా హేంగర్లకి వేలాడుతున్న ఖరీదయిన బట్టలూ-ఓ టేబులూ, కుర్చీ-చాలా హడావుడిగానే ఉన్నాళ్ళే..."

"మరి అలాంటప్పుడు...కులమేమిటో కనుక్కొని...ఒకవేళ పెళ్లవకపోతే మన అమ్మాయికి చూడరాదుటండీ?..."

"అవన్నీ కూడా కనుక్కొన్నా

లేవోయ్-వీధి మొదట్లోఉన్న కిళ్లీకొట్లో, సిగిరెట్లు కొనేప్పుడు వాడికి చెప్పొట్ట-తన దసలు విశాఖపట్నం అనీ-ఇంకా వివాహం కాలేదనీ...ఇక కులమంటావూ మన కులం వాళ్ళకి తప్పితే మరొకరికి గది అద్దెకివ్వడుగా సీతారామయ్య..."

"మరింకేం త్వరగా మాట్లాడండి-లేకపోతే ఆ సీతారామయ్య గాలాం వేసేయగలడు,వాడి కూతురుకోసం..." రహస్యంగా అందావిడ.

"నాకు తెలుసులేవే బాబూ!...నేనూ ఆ ప్రయత్నంలోనే ఉన్నాగా! ఈలోగా మనమ్మాయికి మంచి చీరా అదీ కట్టి రెండు మూడు సార్లు, ఆ కుఱ్ఱాడున్న టైములో సీతారామయ్య ఇంటికి ఏదో వంకమీద పంపించు..."

"అవన్నీ మీరు చెపొల్టండి! మరీనూ..." నవ్వుతూ లోపలికి వెళ్ళిందావిడ. శివనాథం వారపత్రిక తీసి మరోసారి వారఫలాలు చూశాడు. అమ్మాయి నక్షత్రానికి ఖచ్చితంగా రాసి ఉంది. వివాహాది శుభకార్యాలు జరిగే సూచనలున్నాయి అని.

"ఈ సంబంధం కుదిరిపోతే నీ దగ్గర కొచ్చి తలనీలాలు సమర్పించుకొంటాను స్వామీ...' అని అర్జంటుగా ఎదురుగ్గా ఉన్న వెంకటేశ్వరస్వామి పటానికి రహస్యంగా మొక్కేశాడు.

ఆ రాత్రి భోజనాలయినాక వీధిలో కొచ్చి, అటూ ఇటూ పచార్లుచేస్తూ ఓ కన్ను గదివేపే వడేశాడు శివనాథం. ఆ కుఱ్ఱాడు గదిలో కూర్చుని రేడియో వింటూ ఏదో పత్రిక చదువుకొంటున్నాడు. కుఱ్ఱాడిని చూస్తున్నకొద్దీ ముచ్చట పుట్టుకొస్తోంది శివనాథానికి. తన కూతురు శారదకు సరైనజోడు చిలకా గోరింకల్లా ఉంటారు.

"గురువుగారు ఏదో ఆలోచిస్తున్నట్లున్నారు!..." నవ్వుతూ అన్నాడు ఎదురింటి లింగమూర్తి భుజాన్న తుండు వేసుకొని వీధిలోకొస్తూ.

"ఆ! ఏముంటుంది? భోజనాలయినాయా?" అడిగాడు శివనాథం.

"ఇప్పుడే ముగించాం! అది సరేగాని సీతారామయ్య ఇంట్లో ఓ కుఱ్ఱాడు అద్దెకు దిగాడు చూశావా?"

"ఎప్పుడు? నాకు తెలీదే?" ఏమీ ఎరగనట్లు అబద్ధ మాడేశాడు శివనాథం.

"ఎప్పుడో, ఏమో నాకు తెలీదుగానీ, ఇందాక ఆఫీసునుంచి వస్తూ చూశాను..."

"అలాగా..." చాలా మామూలుగా మాట్లాడాలని ప్రయత్నిస్తూ అన్నాడు శివనాథం. నాకు అనుమానమేమిటంటే-సీతారామయ్య ఏ ఉద్దేశ్యమూ లేకుండా ఆ కుఱ్ఱాడికి గది అద్దెకివ్వడని!...ఏమంటావ్?"

శివనాథం ఆశ్చర్యం నటిస్తూ లింగమూర్తివంక చూశాడు

"ఏమై ఉంటుందంటావ్ వాడి ప్లాను?"

"ఇంకే ముంటుందోయ్! ఎట్టిగా, బుట్టిగా వాడి కూతురు ఈకుఱ్ఱాడిముందు తిరుగుతూ కనబడితే, అమాంతం 'లవ్' చేసి, దమ్మిడీ కట్నంలేకుండా చేసుకొంటాడేమోనని..."

"అవునవును! వాడి కలాంటి ఆలోచనలు చాలా వున్నాయి. నీ అనుమానం నిజమే అయ్యుండొచ్చు..."

"నిజమేనేమిటి నా శ్రాద్ధం! నిజం న్నరా! రాసిస్తానలా అని! అయినా నాకు తెలీకడుగుతాను, వాడికదేం బుద్ధోయ్! చుట్టూ పెద్దమనుషుల ఇళ్లు పెట్టుకొని, మధ్యలో ఈ తందనాలు! ఆ కుఱ్ఱవెధవ, గదిలో దిగి ఎంత సేపైందంటావ్? మహా అయితే ఒక రోజు! అవునా? మరా సీతారామయ్యగాడి పెద్ద కూతురు, వాడితో మహా చనువున్నట్లు-వాడు ఇంట్లో మనిషయినట్లు, వసారాలో నిలబడి, వాడు చూస్తూండగా "నువ్వూ-నేనూ ఏకమైనాము..."అని సినిమా పాట పాడుతోంది..."

"అవ్వ..." నోరు నొక్కుకొన్నాడు శివనాధం.

లింగమూర్తి మరి కాసేపు సీతారామయ్య చేష్టల్ని తిట్టిపోసి, అమాయకుడయిన ఆ కుఱ్ఱాడిమీద జాలిపడి—నిద్రొస్తోందని ఇంట్లో కెళ్ళిపోయాడు.

అతనితో మాట్లాడింది చాలావరకూ నిరుపయోగమయినా, కొంతవరకు ముఖ్యమయిన సమాచారం శివనాధానికి దొరికిపోయింది. సీతారామయ్యే కాకుండా అతని కూతురు స్వయంగాకూడా ఆ కుఱ్ఱాడిని వలలో వేసుకోడానికి ప్రయత్నిస్తోంది. అంతేగాక అంతకంటె ముఖ్యమయిన విషయం ఏమిటంటే లింగమూర్తి కన్ను కూడా ఆ కుఱ్ఱాడి మీద పడింది. ఇక తను వాయువేగంతో పనులు పూర్తిచేసుకోపోతే ఆ అవకాశం కాస్తా వాళ్ళిద్దరిలో ఎవరో హాళ్ళుతన్నుకుపోతారు.

సీతారామయ్య కూతురు కొంతవరకు నయం "నువ్వూ-నేనూ ఏకమైనాము..." అన్న పాటల్తోనే సరిపుచ్చుకుంటోంది. లింగమూర్తి కూతురైతే ఏకంగా ఆకుఱ్ఱాడితో ఏకమయిపోతుంది-రెండో కంటికి తెలీకుండా! ఆ పిల్ల సంగతెవరకు తెలీదని? హైస్కూల్లో కొత్తగా చేరిన సైన్స్ టీచర్‌తో సరుగుడుతోటలోంచి బయటికొస్తూ కనిపించలేదూ? ఊరందరకూ తెలుసా హరికథ! సిగ్గులేని వెధవ! అక్కడికి వీడో పెద్ద పతివ్రతయినట్లు సీతారామయ్యను తిడుతున్నాడు; ఇద్దరికిద్దరే—కక్కుర్తి సన్యాసులు తిట్టుకొంటూ ఇంట్లోకి నడిచాడు శివనాధం.

ఆ రాత్రంతా నిద్రపోకుండా 'టీ' డికాషన్ తాగి మరీ ఆలోచించాడు శివనాధం. ఆ కుఱ్ఱాడితో మాట్లాడటం ఎలా? వాళ్ళిద్దరూ 'నీ చుట్టూ వల పన్నే

స్తున్నారా నాయినా!' అని తెలియ జెయ్యడం ఎలా? పరువు ప్రతిష్టలు గల కుటుంబం, ఈ వీధిలో మా దొఖ్ఖ బేరా బాబూ అని ఋజువుచేయడం ఎలా — ఇవే అలోచనలు! మరోమూల అతని భార్యారత్నం కూడా నిద్రలేకుండా ఇలాంటి ఆలోచనల్లోనే సతమతమయి పోతోంది. ఆ కుట్టాణ్ణి ఇంటికి, ఏదో నెపంమీద పిలవాలి. పిలిచి సీతారామయ్యమీదా, అతని కూతురుమీదా ఉన్నవీ-లేనివీ చెప్పాలి. ఆనక అతని భార్య గయ్యాళితనం గురించి నచ్చ జెప్పాలి.

భళ్లున తెల్లారిపోయింది.

శివనాథం బుర్రలోకూడా ఆలోచన మెరుపులా తళుక్కున మెరిసింది.

ఉదయం ఎనిమిదవుతోండగా శివ నాథం కూతురు హైమావతి బ్రహ్మాండ మయిన జపాన్ నైలాన్ ప్రింటెడ్ చీర కట్టుకొని, అదేరంగు జాకెట్ వేసుకొని, హంసలా నడుస్తూ సీతారామయ్య ఇల్లు చేరుకొంది వసారాలోనే నుంచుని గది లోని ఆ కుట్టాడివంక చూస్తూ 'నువ్వూ నేనూ ఏకమైనాము' అని పాడుతున్న సీతారామయ్య కూతురు వసంత, హైమా వతిని ఆ అలంకరణలో చూడగానే మొఖం మాడ్చేసుకొంది

"హలో వసంతా!" అంది హైమా వతి వసారాలోకి నడిచి తనూ ఆ గదిలో రేడియోవింటున్న కుట్టాడివంక క్రీగంట చూస్తూ.

"లోపలకు పద! ఆ గదిలో మగాళ్లు అద్దెకున్నారు..." అంది వసంత ఆమెను ఇంచుమించుగా లోపలకు లాక్కెళ్తూ.

"ఎందుకొచ్చావు ఇప్పుడు?" అంది మొఖం చిట్లించుకొంటూ.

"మరేంలేదు-మేమే, మీకో చెంచాడు కాఫీపొడి ఇవ్వాలట-ఇచ్చేసి రమ్మంది మా అమ్మ..." అంది కర్చీఫ్‌లోనుంచి ఓ చిన్న పొట్లాం తీస్తూ. లోపల్నుంచి హడావుడిగా అక్కడికొస్తున్న సీతారామయ్య భార్య ఆ మాటలు వింటూనే మండిపడింది.

"నే నెవ్వరికీ చెంచాడు కాఫీపొడి అప్పివ్వలేదు - వెళ్ళు - మీ అమ్మతో చెప్పు..." అంది కరుగ్గా.

"సరే...కాసేపు వసంత దగ్గరే ఉంటాను! ఇంట్లో ఏమీ తోచటం లేదు..." అంది అక్కడే కుర్చీలో కూలబడుతూ.

"వసంతా! పోనీ నువ్వే వెళ్ళి కాసేపు వాళ్ళింట్లోనే కూర్చుని మాట్లాడుకో గూడదూ?" అందామె తల్లి.

"నే నిప్పుడు వెళ్ళనే అమ్మా! నాకు చాలా పనుంది! నువ్వెళ్ళవే హైమా! నాకు తీరిక దొరికినప్పుడు నేనే వస్తాలే-నువ్వు రాకిక్కడకు..." అంది అప్యాయత నటిస్తూ.

'తప్పకుండా రావోయ్! మనం



మాట్లాకొని చాలా రోజులయింది..." అంది హైమావతి బయటకు నడవలేక నడుస్తూ.

వసంత ఆమెను సాగనంపటానికి గేటువరకూ వచ్చింది.

అక్కడ పూలుపూసిన చామంతి మొక్కను చూసేవంకతో నిలబడి ఆ గదిలో కుజ్జాడితో చూపులు కలిపి "ఈ మొక్క చాలా పూలుపూసిందే!" అంది హైమావతి.

"అదెప్పుడూ అంతే—" విసుగ్గా అంది వసంత.

"వస్తా! మళ్ళొస్తా..." అని సినిమా పాటలా అని వీలయినంత అందంగా నవ్వుతూ ఆ గదివేపు చూసి, ఆ కుజ్జాడికే కనిపించేట్లు చేయి ఊపుతూ 'టాటా' అని బయల్దేరింది హైమావతి.

వసంత ఉక్రోషంతో రగిలిపోయింది.

'వట్టి బేవార్స్ రకం!...' అనుకొని మొఖమంతా చిరునవ్వు పులుముకొని గేటుదగ్గరే నిలబడి గదిలో కుజ్జాడివంక చూపులు విసుర్తూ "నువ్వూ-నేనూ ఏకమైనాము..." అంటూ ట్యూన్‌తోసహా అందోంది ఉండుండి.

వదవుతోందగా శివనాధం వీధి చివరి కిళ్ళీకొట్టుదగ్గర నిలబడి, ఎప్పుడూ లేంది ఓ మిఠాయి కిళ్ళీని నమలసాగాడు.

అతని చూపులుమాత్రం సీతారామయ్య ఇంటివేపే ఉన్నాయి. సరిగ్గా పదయింతర్వాత ఆ గదిలోని కుఱ్ఱాడు టిప్ టాప్‌గా ముస్తాబయి చేతిలో ఓ లెదర్ బాగ్‌తో బయటి కొచ్చాడు. శివనాధం సర్దుకొని నిలబడ్డాడు 'ఎటెన్షన్' పొజిషన్‌లో.

అతను సరాసరి కిళ్ళీకొట్టు దగ్గర కొచ్చి 'ఓ పాకెట్ గోల్డ్‌ఫ్లాక్' అన్నాడు పదిరూపాయల నోటు విసిరేస్తూ.

'అబ్బో! అబ్బో! చాలా డబ్బున్నవాడిలానే ఉన్నాడు...' అనుకొన్నాడు లోపల్లోపల కిల్లీకొట్టువాడు పాకెట్-చిల్లరా అందించా డతనికి ఓ సిగరెట్ తీసి నోట్లో పెట్టుకొని జేబులోనుంచి లైటర్ తీసి వెలిగించి నెమ్మదిగా ముందుకి నడిచాడు.

"మీరు...సీతారామయ్య గారింట్లో అద్దెకుంటున్నట్లున్నారు..." అతన్తో పాటు అడుగులువేస్తూ అన్నాడు శివనాధం.

"అవునండీ." నమ్రతగా అన్నాడు కుఱ్ఱాడు.

''మరేంలేదు. ఈ వీధిలో కొత్తగా కనిపిస్తుంటేనూ-అనుమానం వచ్చింది. నా పేరు శివనాధం—మీ గదికి నాలుగిళ్ళవతలే మా ఇల్లు! మీ పేరేమిటన్నారూ?"

"చంద్రకాంత్...'' అన్నాడతను ముక్తసరిగా.

'అలాగా! చాలా సంతోషం!—స్వగ్రామం ఏది?"

''విశాఖపట్నం అనుకోండి! కాని మా వాళ్ళంతా హైద్రాబాద్‌లోనే స్థిరపడిపోయారు..."

"ఊహు!...ఇక్కడకు బదిలీమీద వచ్చారేమిటి?"

"అబ్బే! కాదండీ! మా కంపెనీవాళ్లు ఈ ఊళ్ళో ఒక బ్రాంచీ పెట్టాలనుకొన్నారు. అందుకని సర్వేచెయ్యడానికి నన్ను పంపించారన్నమాట. బహుశా ఇక్కడ నేనే మానేజరుగా ఉండాలి కొంతకాలంపాటు..."

'అబ్బా!' అనుకొన్నాడు శివనాధం "ఏం కంపెనీ అండీ మీది?"

'ఎ-టు-జెడ్ డీలర్స్' అనీ, మా కంపెనీ 'డీల్' చెయ్యని వస్తువంటూ లేదనుకోండి! ఉత్తర హిందూస్థానంలో ఇప్పుడు మా కంపెనీయే లీడింగ్‌లో ఉంది. గుండుసూది దగ్గరినుంచీ, ట్రాక్టర్లవరకూ అన్ని వస్తువులూ డీల్ చేస్తారు. మన ఆంధ్రప్రదేశ్‌లో కూడా బిజినెస్ విస్తరింపచేయాలని వాళ్ళ ప్రయత్నం. ఇంతకూ మీ రెక్కడ పని చేస్తున్నారు?..."

"తాలూకాఫీసులో గుమస్తాగా ఉంటున్నాను లెండి-ఏదోఒక ఉదోగ్యం-జీతం బత్తాలు సరిగ్గా లేకపోయినా ఉన్నా ఊళ్ళో ఉద్యోగం మంచిదని ఉండిపోయాను..."

"అవునవును...అదే మంచిదండీ బాబూ! నా పరిస్థితి చూడండి! నెలకు తొమ్మిదొందలు సంపాయిస్తున్నాను. ఏం లాభం! సొంతూళ్లో ఉన్న సుఖం వేరు..."

"అమ్మో! తొమ్మిదొందలే..." లోపల్లోపలే గుండెలు బాదుకొన్నంత పనిచేశాడు శివనాధం.

"అవునవును!" అన్నాడు పైకి.

ఇద్దరూ మాట్లాడుకొంటూనే మెయిన్ రోడ్ దగ్గర కొచ్చేశారు.

"సరే ఉంటాను!..." అన్నాడు చంద్రకాంత్.

"మంచిదండీ...రోజూ కల్సు కొంటూనే ఉంటాంగదా ఇక..." అన్నాడు శివనాధం నవ్వుతూ.

"అవునవును..." అన్నాడు చంద్ర కాంత్ కూడా నవ్వుతూ.

ఆ మర్నాడు చంద్రకాంత్ బయల్దేరే సమయానికి అదే కిళ్లీకొట్టుదగ్గర కలసు కొన్నాడు శివనాధం.

"ఇవాళ ఎటువేపు వెళ్తున్నా రేమిటి?" అడిగాడు శివనాధం నమ్రతగా

"ఇంకా డిసైడ్ చేసుకోలేదండి! మార్కెట్ ప్రాంతం సర్వే ఇంకా పూర్తి కాలేదు ... అదే వెళ్ళాలనుకొంటున్నాను..."

"మరింకేం-నేనూ అదే వస్తున్నాను పదండి..." అన్నాడు శివనాధం.

ఇద్దరూ నెమ్మదిగా నడిచి మెయిన్ రోడ్ మీదకు చేరుకొన్నారు. ఖాళీగా వెళ్తున్న రిక్షా పిలిచాడు చంద్రకాంత్.

"కూర్చోండి!" అన్నాడు శివ నాధాన్ని చూస్తూ.

"బేరమాడకుండానే?" ఆశ్చర్యంగా అడిగాడు శివనాధం.

"ఆ! ఎంతోకంత కంపెనీ మాకు జీతం కాకుండా ఇలాంటి తిరుగుడు కోసమని రోజుకి పద్దెనిమిది రూపాయ లిస్తుంది..."

"అబ్బా! లోలోపలే గుండెలు బాదు కొన్నాడు శివనాధం. తొమ్మిదొందలు జీతంకాక ఇంకా రోజుకి పద్దెనిమిది రూపాయలా! బాబోయ్ ఎంత సంపాదన! ఎంత సంపాదన.

రిక్షా నెమ్మదిగా పోతోంది.

"చూడండి! మిమ్మల్ని చూస్తూంటే ఎంచేతో ఆప్తుల్ని చూసినట్లుంది. పాపం అందరికీ దూరంగా-ఆ పాడుహోటల్ కూడు తింటూ-ఎలా వుంటున్నారో ఏమో! — మీ కేమీ అభ్యంతరం లేకపోతే రాత్రికి మా ఇంటికి భోజనానికి

"ఎందుకండీ - మీకు శ్రమ..." నవ్వుతూ అన్నాడతను.

"అహహా! అలా అనకండి! చెప్పానుకదా! ఒకో మనిషినిచూస్తే అలా అభిమానం కలుగుతుంది! మాది చాలా పెద్ద వంశం లెండి! ఎంతో పేరు

ప్రఖ్యాతులున్నయ్. అసలు మాకు సరి పడేవాళ్ళు మా వీధిలో ఎవ్వరూ లేరు. అయినాగాని, అంతకంటె మంచి ప్రాంతం దొరక్క అక్కడ ఉండి పోయాం!..."

"మీ ఇష్టం! మీ రంతగా పట్టుపడు తూంటే కాదనలేను. కాని ఓ చిన్న రిక్వెస్ట్! నా కోసం స్పెషల్‌గా ఏమీ చెయ్యకండి! మీతోపాటూ నేనూనూ! నన్ను ఓ చుట్టంలా కాకుండా మీ ఇంట్లో ఒకడిగా చూడండి. అంతే నేను కోరు కొనేది..."

"అమ్మమ్మమ్మ! ఎంత మాట! మిమ్మల్ని బయటివారిలా ఎలా చూస్తాము? అలా అనుకొంటే అసలు మీదగ్గరకే రాను!..."

మార్కెట్లో ఆగింది రిక్షా తను ముందుగా దిగి డబ్బులిచ్చేశాడు చంద్ర కాంత్.

"అరెరె! మీ రెందుకిస్తున్నారు? నేను ఇచ్చేవాడినిగదా!..." అన్నాడు ఇబ్బందిపడిపోయినట్లు నటిస్తూ.

"ఫరవాలేదు లెండి! ఎవరిస్తే ఏ ముంది? మనలో మనకి..."

"ఔనౌను...అది నిజమే నను కోండి...మరి నేను శెలవు తీసుకోనా?– సాయంత్రం ఏడుగంటలకల్లా మా ఇంటికి రాగలరా?"

"ఓ! వస్తాను..."

"మరో చిన్న విషయం..." అంటూ అతని చెవిదగ్గరగా జరిగాడు శివనాథం.

"ఏమిటి?"

"మీరిలా మా ఇంటికి భోజనాని కొస్తున్న సంగతి సీతారామయ్యా కేమాత్రం తెలీనీకండి! వాడసలే వట్టి బేవార్స్‌రకం...ఏవో లేనిపోనివి వాగు తాడు..."

"అలాగే...అలాగే..." నవ్వుతూ అన్నాడతను.

శివనాథం సరాసరి ఆఫీసుకెళ్ళి ఆ రోజు కాజువల్‌లీవ్ పెట్టేసి ఇంటికి చేరు కొన్నాడు.

"ఏమిటిప్పుడే వచ్చేశారు?" అందా యన భార్య.

"ఏముంది?—మన పంట పండబో తోంది. ఆ కుర్రాడు సాయంత్రం మ ఇంటికి భోజనానికి రావడానికి వప్పు కొన్నాడు..."

"నిజంగానేనా?"

"నూరుపాళ్లూనూ! మన మంచే. ఏమనుకొన్నావే!–నువ్వుమాత్రం ఓ పని చెయ్! అమ్మాయిని కొంచెం బాగా అలంకరించి మా ఇద్దరికీ అన్నం వడ్డించ డానికి నియోగించు! తెల్సిందా? నువ్వు కూడా అతివాగుడు వాక్కుండా–జాగ్ర త్తగా వళ్లు దగ్గరుంచుకొని మాట్లాడు!..."

"అవును–మాట్లాడ్డం ఇక ఇప్పుడు



నేర్చుకోవాలి-నేను...' కోపంగా అందామె.

''అబ్బబ్బ! అదికాదే-అలాకోప్పడకు మరి-అబ్బాయి కొంచెం మితభాషి లాగున్నాడు. అందుకనే నీకింత గట్టిగా నొక్కి చెప్త...'' సర్ది చెప్పుకొన్నాడు శివనాథం.

''సాయంత్రం ఆరింటికల్లా వంట పూర్తయింది. నాలుగురకాల స్వీట్లు, హాట్లు తయారయినయ్. శివనాథం ఆరున్నరనుంచే వీధిలో నుంచుని ఎదురు చూడసాగాడు. శివనాథం కూతురు హైమావతి ఝామ్మని అలంకరించుకొని ఇంకా ఏమేమో చూసుకొంటూ అద్దంముందు కూర్చుంది.

ఏడు గంటలకు లింగమూర్తి శివనాథం ఇంటివేపు వచ్చేడు. శివనాథానికి వళ్ళు మండిపోయింది.

ఈ వెధవ ఈ సమయానికే తగలడాలా? ఆ కుర్రాడు భోజనాని కొచ్చే సమయమయింది ఓ పక్క! ఈ సంగతి వీడికి తెలిసిందంటే ఊరంతా మార్మోగించేస్తాడు, అనుకొన్నాడు.

"ఏమిటి శివనాథంగారూ! ఎవరి కోసమో ఎదురుచూస్తున్నట్లున్నారు?''

"ఆ ఏముంది! తల నొప్పిగా ఉంటేనూ కాసేపలా తిరిగి ఇంట్లో కెళ్తన్నాను-ఇక వెళ్తాను."

"అబ్బ—అమ్మ—తలనొప్పి—ఛంపేస్తోంది..." అంటూ ఇంట్లోకి నడువబోయాడు.

'అరె! నా దగ్గర హోమియోపతి

మందుంది...తెమ్మంటావా?" అడిగాడు లింగమూర్తి

"అబ్బే! ఏమీ అవసరంలేదు కాసేపు నిద్రపోయిలేస్తే అదే సర్దుకొంటుంది... వస్తాను..." అంటూ లోనికి నడిచా డతను శివనాథం ప్రవర్తన ఎందుచేతో లింగమూర్తికి అనుమానం కలిగించింది. అందుకని ఓ కన్ను శివనాథం ఇంటి వేపే పడేసి వీధిలో కాపలా మొద లెట్టాడు.

సరిగ్గా ఏడున్నరకి చంద్రకాంత్ నెమ్మదిగా శివనాథం ఇంట్లోకి నడవడం-శివనాథం స్వయంగా బయటి కొచ్చి అతన్ని లోనికి ఆహ్వానించడం గమ నించాడు లింగమూర్తి

"అమ్మ రాస్కెల్-తల్నొప్పి అని వంకబెట్టి, తనను వదిలించుకొంది-ఇందుకా?'' అనుకొని మండిపడ్డాడు

''నా దగ్గర నా మాటలు చెప్పి-ఆ కుర్రాడిని తన కూతురికి కట్టెయ్యాలని ప్లానేస్తున్నాడు కాబోలు! నా కంఠంలో ప్రాణముండగా ఆ పెళ్ళి జరుగనీను-" అనుకొని భార్యతో రహస్య సమా వేశం వెంటనే జరిపాడు

శివనాథం ఇంట్లో చంద్రకాంత్‌కి హేమలత ప్రతి నిమిషానికి ఓసారి స్నో పౌడరూ అద్దుకుంటూ భోజనం వడ్డి స్తోంది. శివనాథం భార్య మెల్లగా చంద్ర కాంత్‌ని సంభాషణలోకి దించి వాళ్ళ వాళ్ళకీ-తమకీ - పదితరాలముందు చుట్ట రికం ఉన్నట్లు ఋజువులు చూపించింది.

"అయితే నువ్వింకా కుర్రాడివి, అంచేత ఆ విషయాలు నీ కంతగా తెలీ" దంది చంద్రకాంత్ వప్పుకొన్నాడు.

హేమలత ఆ కుర్రాడిని "ఇంకేం కావాలండీ?" అనడగడం చూసి "అండీ ఏమిటే పిచ్చిదానా! బావా అనలేవూ? ఆ మాత్రం వరుస తెలీదా." అంటూ కోప్పడిందామె.

దాంతో హేమలత సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ ఉండుండి అవసరమున్నా లేకపోయినా 'బావా' అనడం మొదలు పెట్టింది.

ఇది జరిగిన రెండుమూడు రోజులకు చంద్రకాంత్ లింగమూర్తి ఇంట్లో భోజనా నికి వెళ్ళడం సీతారామయ్య కంటబడింది ఇది ఆయన ఏమాత్రం సహించలేక పోయాడు.

మర్నాడే చంద్రకాంత్‌ని కలుసుకొని "ఆ చూడల్లుడూ! మీ అత్తయ్య ఒకటే గొడవచేస్తోంది. నువ్వలా అడ్డమైనచోటా తిని ఆరోగ్యం చెడగొట్టుకొంటున్నావట! అందుకని ఇవాళ్టినుంచీ మా ఇంట్లోనే భోజనం వగైరాలన్నీ చేయమని చెప్పింది. అంచేత నువ్వింక బయటెక్కడా తినకు! ఎంతా..స్యమైనాసరే తిన్నగా ఇంటికి ఇంటికి వచ్చేసెయ్" అన్నాడు.

"ఆ! ఎందుకండీ! మీకు శ్రమ!" అన్నాడు చంద్రకాంత్.

తలుపు వెనుకనుంచి సీతారామయ్య

భార్యగొంతు ఖంగునమోగింది. "శ్రమేమిటి నాయనా! అయినవాళ్ళకి ఆ మాత్రం చేసుకోలేమేమిటి? అయినా నువ్వేమయినా ఐ య టి వా డ వా ఏమన్నానా?"...

మూడు నెలలు గడిచిపోయినయ్. ఈలోగా చంద్రకాంత్ కంపెనీవాళ్ళు సమయానికి అతని జీతం పంపలేకపోవడంవల్ల సీతారామయ్య, లింగమూర్తి, శివనాధం తలో అయిదొందలూ ఒకరికి తెలీకుండా ఒకరు అతనికి అప్పుకూడా ఇచ్చారు.

"చెక్కు రాగానే...మీ డబ్బు మీకిచ్చేస్తాను..." అన్నాడు చంద్రకాంత్

"భలేవాడివేలే! పెద్ద మునిగిపోయిందేమిటింధులో!" అంటూ కోప్పడ్డారు వాళ్ళు. మరికొన్ని రోజులు గడిచినా చెక్కురాకపోయేసరికి "మా కంపెనీకి వెళ్ళి చెక్కు తెచ్చుకుంటా''నని చెప్పి ఉత్తరదేశం ప్రయాణం అయేడు చంద్రకాంత్. దారి ఖర్చులకని అందరూ తలో రెండొందలూ మళ్ళీఅప్పుగా ఇచ్చారతనికి.

"మీ ఋణం పెరిగిపోతోందే! - కంపెనీలో కాష్ తీసుకోగానే టెలిగ్రామ్ మనిఆర్డరుద్వారా మీ డబ్బు మీకు పంపించేస్తాను..." అన్నాడు బయల్దేరేముందు.

"ఆ దాన్దేముందిలేస్తూ! నువ్వు తిరిగి ఇవ్వాలేమిటి? రేపు మా అమ్మాయిని చేసుకొన్నా ఇలాగే ఇచ్చివుచ్చుకోడాలు ఉంటాయా ఏమిటి?" అన్నారుభలోక్తిగా వాళ్ళు.

అతను వెళ్ళిన నెల్రోజుల తర్వాత ముగ్గురికీ మూడు ఉత్తరాలొచ్చినయ్. మూడింటిలోనూ విషయం ఒక్కటే.

"శివనాధంగారు, లింగమూర్తిగారు, సీతారామయ్యగారు, మీ ముగ్గురి ఆదరణ నేను మరచిపోలేను. నన్ను మీ ఇంట్లో ఒకడిగా చూసుకొన్నారు. మీకు ఎప్పటికీ కృతజ్ఞుడిని! నాలాంటి వాడిని చూడటం బహుశా మీకు కొత్త అనుకుంటాను. కాని మీలాంటి 'ఆశపిల్లల' తండ్రుల్ని నేను చాలామందిని చూశాను. ఇంచుమించుగా వాళ్ళందర్నీ వాళ్ళ బలహీనతని కనిపెట్టి మోసం చేశాను. అలా మోసం చేయడం తప్పని నాకు తెలుసు. కాని ఏంచేయను? నిరుద్యోగం! తింటానికి తిండిలేని పరిస్థితి! ఈ పద్ధతిలో నాకు మంచి భోజనమూ, గౌరవమూ, డబ్బూ దక్కటమే కాకుండా, అందమయిన ఆడపిల్లలు 'బావా' అంటూ ప్రేమగా పిలుస్తున్నారు. అంచేత గడిచినన్నాళ్ళు ఇలాగే పొట్ట నింపుకోదలచుకొన్నాను. ప్రస్తుతం మరో చోట మీలాంటి ఆడపిల్లల తండ్రిదగ్గర ఉంటున్నాను. పోలీస్ రిపోర్టివ్వకండి! అందుమూలాన ఎక్కువ నష్టం కలిగేది మీ అమ్మాయిలకే! మీ రందరకూ మరోసారి కృతజ్ఞత లర్పిస్తూ మీ అల్లుడు చంద్రకాంత్." ఉత్తరం చదివి మంచి పడుతూ ఆ కుర్రాడి గదితలుపులు పగలగొట్టి చూశాడు సీతారామయ్య. గదంతా ఖాళీ!




త్రివేణిని త్రివేణీసంగమం దగ్గిర ఆనందమూర్తి చూసినప్పుడు ఎవరో ఉత్తరాది అమ్మాయి అనే అనుకున్నాడు. కాని, తెలుగు కళ్ళని తెలుగమ్మాయే ఆకర్షించింది. త్రివేణి తండ్రి గౌరీపతి మూర్తినిపోల్చి పలకరించి, ఇంటికి తీసు కెళ్ళినప్పుడు తెలిసింది, త్రివేణి తెలు గమ్మాయేనని. ఎప్పుడో తెలుగు యాత్రిక బృందాన్ని ఉత్తర దేశ యాత్రలుచేయిస్తూవచ్చినగౌరీపతి అలహా బాదులోనే ఉండిపోయాడు. తెలుగు యాత్రీకులకు సదుపాయాలు అవీ కుదు రుస్తూ ఉంటాడు. మూర్తి తండ్రికీ, గౌరీ పతికీ మంచి పరిచయమట. మూర్తిని బాల్యంలో బాగా ఎరుగునట.

త్రివేణి మూర్తికి టీ అందివ్వడంతో ప్రారంభమైన అనురాగం పెరిగి, ఇద్దరూ కలిసి తిరగడం చూసి గౌరీపతికూడా అమ్మాయికి వరుణ్ణి వెతకనవసరంలేదని సంతోషించడం జరిగింది.

ఒకనాడు ఎవరో తెలుగు యాత్రీ కుడిదగ్గిర తెలుగు దినపత్రికలో

మూర్తి తన పాతఫొటో చూసి పత్రిక తీసుకొని చదివాడు.

"నాయనా! ఆనందమూర్తీ! నీకోసం పెద్ద ఆస్తి ఉంచాను. నేనులేను అనుకో. ఆస్తి నీ యిష్టంవచ్చినట్టు అనుభవించు! మాధవీపురానికి వెంటనే వచ్చి అన్నీ తెలుసుకో. త్వరగా రా!" అదీ ఆ పత్రికా ముఖలేఖా ప్రకటన.

మూర్తి త్రివేణితో పదిరోజుల్లో తిరిగి వచ్చేస్తాను. లేకుంటే రమ్మని రాసిన వెంటనే తండ్రీకూతుళ్ళిద్దరూ బయలుదేరి రండని చెప్పివెళ్ళాడు.

* * *

...తన మేనల్లుడు ఆనందమూర్తి దాన విక్రయాధికారాలతో యావదాస్తినీ సంపూర్ణంగా ఖర్చుచేసుకొని అనుభ వించవచ్చు.కాని–పెళ్ళిపనికిరాదు!సాంప్రదాయకంగాగాని, రిజిస్టరీ పద్ధతిలోగాని పెళ్లి చేసుకొని ఉండరాదు; చేసుకోరాదు. అలా కానిపక్షంలో, మూర్తి సంవత్సరం లోపల రాని పక్షంలోనూ, ఆస్తిని హరి జనుల సౌకర్యాలకోసం కొంత, ఊళ్లో ఆస్పత్రి పెట్టడానికి కొంత, మిగతాది దేవాలయానికి చెందాలి. ఆ విధంగా జరపడానికి ఆ ఊళ్లో పెద్దమనుషులని పించుకొంటున్న భుజంగరావుకీ, ఆలయ ధర్మకర్త అనంతానికీ ట్రస్టీలుగా పెద్ద రికం యివ్వబడింది.— అదీ లక్షింపతి శాసనం.

లక్షింపతి వీలునామా రాసిన రెండో రోజునే పెద్ద వరదతో ఉన్న నదీప్రవాహంలో పడిపోయాడు. లాయరు అన్నీ విశదపర్చాడు మూర్తికి.

లక్షింపతికి ఆనందమహల్ పేరు గల పెద్ద భవంతి ఉన్నది. మూర్తికి చిరపరిచితమే. రెండురోజులు ఆలోచించి అలహాబాదుకి ఉత్తరం రాశాడు.

గౌరీపతీ, త్రివేణీ వచ్చాక అంతా చెప్పి, ఊరికే పైవాళ్ళకు వాదిలేకంటే కొన్నాళ్ళు చూద్దామని, అన్ని సదుపాయాలతో వేరే మంచిఇల్లు ఏర్పాటు చేసి అందులో వాళ్లిద్దర్నీ ఉండమన్నాడు మూర్తి తరచు అక్కడకు వెళ్ళివస్తూండే వాడు.

ఊళ్లో రగడ ప్రారంభమైంది. మూర్తికి పెళ్ళి అయింది వేరే ఉంటా డన్నారు. అటువంటి దేమీ జరగలేదని దైవసాక్షిగా ముగ్గురూ తెలియజేసు కున్నారు.

గౌరీపతికి త్రాగుడు అలవాటుంది. ఒకనాడు గుండెఆగి పరమపదించాడు. త్రివేణికి ఉన్న దిక్కంతా మూర్తే. త్రివేణి అందం మెరుపులాంటిది. విగేల్మని చీకట్లు కమ్మిస్తుంది. అలా కళ్ళు చీకట్లు కమ్మినవాళ్ళలో ముఖ్యులు ఆ యిద్దరు పెద్దలే–భుజంగ, అనంతులు. కాని, చందన తరువుమీదనే మూర్తి గారుడం ఉన్నది. పాములు దూరంనించే పడగలెత్తి చూస్తున్నవి.

పెళ్ళి పనికిరాదని, రాశాడేగాని అత

దాని సంబంధం ఉండకూడదని రాయవల సిందిఅని దేవాలయాభిమానులూ, బ్రహ్మ చర్యం అవలంబించాలనే దాని తాత్పర్యం అని భుజంగీయులూ చాటారు. మూర్తి దేన్నీ లక్ష్యపెట్టలేదు. త్రివేణి మాత్రం యీవలకొచ్చి తిరగలేకపోయింది. మూర్తి ఉంచిన వెలయాలిగా చూశారు. అసహ్యకరమైన వాదులు చెలరేగాయి. ఒకరాత్రి మూర్తి తలమీద ఎవడో కర్రతో బాది పారిపోయాడు మూర్తి మంచాన పడ్డాడు. త్రివేణి గాలిలో దీపం లాగున్నది, ఏక్షణాన ఏమైనా జరగ వచ్చు

ఒక సాయంత్రం మూర్తిని చూడ్డా నికి వెళ్ళి, ఇవతలకు వస్తున్న త్రివేణిని ఆనందమహల్ ముందు దడికట్టినిల్చున్న ప్రముఖులతో కూడిన పెద్దమూక "మూర్తి నీకేమౌతాడు?" అని ప్రశ్నలు కురిపించారు. మూర్తి నీరసంతోనే వచ్చి "ఆమెను వివాహం చేసుకోబో తున్నాను!" అని చెప్పగా "అలా దారి కిరా!" అంటూ మూక చెదిరిపోయింది. మూర్తి వివాహం చేసుకుంటే ఆస్తి అత నికి చెందదు. అన్నిటికీ పంచాలి, అందుకు పెద్దలు భుజంగం, అనంతం. ఇద్దరూ తోడు దొంగలే. బాగా కాజేయ వచ్చు.

ఆ ఊళ్లో ఒక పిచ్చివాడున్నాడు. మనుషుల్ని కరుస్తాడంటారు. వాడు త్రివేణి ఉన్న ఇంటి అరుగు ఆశ్రయించాడు. తోడుగా ఒక కుక్కను కూడా చేర దీశాడు. అదీ వెర్రికుక్కేనట. పిచ్చివాడు త్రివేణి దగ్గిర బుద్ధిమంతుడిలాగా మెసులు కుంటాడు త్రివేణికి వాడి భయంలేక పోయింది. అప్పుడప్పుడు తిండికూడా పెట్టించింది. పిచ్చివాడు ఒక్కొక్క ప్పుడు ఎవరూ లేనప్పుడు తమాషాగా "లోకానికీ మూలం పిచ్చే! పిచ్చికి పిచ్చే విరుగుడు! పిచ్చోడే పిచ్చిలేని మడిసి! ఒకటే రూపాయి - బొమ్మ దెయ్యం! బొరుసు దేముడు!'' ఇలాంటివే అంటూంటాడు.

ఒకరాత్రి తలుపుకొట్టడం త్రివేణి విన్నది. తర్వాత పెద్దకేక. మర్నాడు అనంతం ఆస్పత్రిలో ఉన్నాడని అను కుంటున్నారు పిచ్చాడి పనేనట.

మరొక కాళరాత్రి కుక్క అరుపులు మనిషి కేక వినిపించాయి. భుజంగం కొన్నాళ్ల ఊళ్లో కనిపించలేదు.

* * *

మూర్తి త్రివేణిని భార్యలాగే ఉంచా డని, ఆమె గర్భవతిఅనీ, ఆస్తి హక్కులు వొదులుకోవాలనీ దావా తెచ్చారు. పెళ్లి చేసుకోరాదనే ఉందిగాని, మరేమీ చెయ్య రాదని లేదనీ - ధర్మసందేహంగానే కోర్టుల్లో ఉండిపోయింది త్రివేణిని పెళ్ళి చేసుకున్నట్టుగానే ఒప్పుకొని వెళ్ళిపోదా మనుకున్న మూర్తి నిముషం వృధాకానీ యకుండా మాలగూడెంలో రెండు పెద్ద మంచినీటి బావులు, బడి, ఉచితంగా




మందులిచ్చే ఆస్పత్రి, లైబ్రరీ చిన్న చిన్న వ్యవసాయదారుల కుపయుక్తంగా చిన్న సమావేశమందిరం, నామమాత్ర వడ్డీకి అప్పులిచ్చే వసతిని ఇంచుమించు పూర్తి కానిచ్చాడు ఇలాంటివన్నీ ఖచ్చితంగా జరగడం పెద్దలకు కంటకంగా ఉంది. ఆ పనులు దగ్గిరుండి చేయిస్తుండగా మూర్తిమీద ఎక్కడ్నించో విసిరిన చేతి బాంబుపడి ప్రేలింది. మూర్తిని ఆస్పత్రికి తీసుకెళ్ళారు.

త్రివేణికి అక్కడ ఉండడం మంచిది కాదనిపించింది. ఏవిధంగా చూసినా వెళ్ళిపోవడం మంచిదనిపించింది. తన మూలంగా మూర్తి ఆస్తినీ సౌఖ్యాన్నీ పోగొట్టుకోవడంకంటే, మూర్తి సుఖంగా ఉంటూ మంచిపనులు చెయ్యడమే కావలిసింది అనుకుంది. తాను అలహాబాదు వెళ్ళిపోతున్నాననీ, తనకేం ఫర్వాలేదనీ, కర్తవ్యాల్ని విడిచిపెట్టవద్దనీ చీటీరాసి పిచ్చివాడి కిచ్చింది, మూర్తి వస్తే యిస్తాడని. మూర్తి త్రివేణికి పెట్టుకోమని ఒక వజ్రాలహారం ఇచ్చాడు, చాలినంత రొక్కం కూడా ఉంది. తోలుపెట్టెలో పెట్టుకొని రాత్రి ఎవరికంటా పడకుండా ఒంటరిగా స్టేషనుకి బయలుదేరింది. ఎవరో ఊరు వెలుపల చీకట్లో దొంగలాంటి మనుషులు అడ్డుకున్నారు. ఎలా వచ్చాడో పిచ్చాడు, వాళ్ళమీదకు ఉరికాడు. త్రివేణి తప్పించుకొని పారిపోతూండగా, వెనక కుక్క అరుపులు, మనుషుల అరుపులు. ఆ తర్వాత పిచ్చివాడి ఆర్తనాదం వినిపించాయి. స్టేషను చేరుకొంది.

* * *

మూర్తి వచ్చిచూస్తే త్రివేణి ఇంటికి తాళం వేసిఉంది. పిచ్చివాడు కనిపించ లేదు. కుక్క మూలుగుతూ ఒక మూల చివరిసారిగా తోక ఆడించబోయింది. పిచ్చివాడు స్టేషనుకెళ్ళే దారిపక్క దొంకల్లో చచ్చి పడిఉన్నాడట. ఎవరో కొట్టి చంపినట్టు తెలిసిందట.

తాను లేకుంటే యిన్నాళ్లు పడిన శ్రమ అంతా చివర్లో పాడవుతుంది. నాలుగు రోజుల్లో కొంత సర్దిపెట్టి త్రివేణి కోసం వెళ్దామనుకొన్నాడు మూర్తి.

* * *

ఉత్తరాదికెళ్ళే రైల్లో రాత్రి పెట్టె తలకింద పెట్టుకొని త్రివేణి నిద్రిస్తున్నది. ఒక ఘరానాదొంగ పెట్టె మెల్లగా లాక్కుపోబోతూంటే ఒక బైరాగి వాడి చేతిని అలాగే ఠల్లూకప్పట్టు పట్టుకున్నాడు. ప్రయాణీకులు కొందరు లేచి వాణ్ణి రైలాగ్గానే స్టేషను పోలీసులకి అప్పగించారు. బైరాగి త్రివేణిని ఎక్కడకు వెళ్తున్నదీ అడిగాడు. ప్రయాగకో, హరిద్వారానికో వెళ్తానని తన గతి యింకా తనకే తెలీదనీ అయోమయంగా చెప్పింది. తెలుగు మాట్లాడుతున్న బైరాగి ఎవరో ఆప్తుడులాగ తోచాడు త్రివేణికి.

అమ్మా నీ తండ్రిలాంటి వాడిననుకోమని చెప్పి బైరాగి తనతో ప్రయాగలో గంగఒడ్డున ఉన్న ఆశ్రమానికి తీసు కెళ్లాడు. ఆ ఆశ్రమంలో త్రివేణికి ఆదతోడు కూడా దొరికింది. జీవితంలో దగాపడినవాళ్ళు, విరక్తులు రకరకాల వాళ్ళు ప్రశాంతంగా అక్కడ గడుపుతున్నారు. అన్నిటికంటే త్రివేణికి ఆ ఆశ్రమంలో బైరాగి కుటీరంలోనే మసులుతూ ఉండే మురారిని చూసి మురిసిపోయింది. మురారి అక్కడ అందరికీ ముద్దుల బిడ్డ, మూడేళ్ళవాడు. బైరాగికి మురారిమీద చాలా శ్రద్ధా, ముద్దూను. అక్కడ ఆడవాళ్ళందరూ మురారి తల్లులే. మురారి త్రివేణికి బాగా చేరికయ్యాడు. మురారిని చూస్తున్నప్పుడు త్రివేణి పులకరించిపోయేది. తాను కూడా మాతృమూర్తి కాబోతూన్నది!

* * *

మూర్తి త్రివేణిని వెదుకుతూ అలహాబాదు, హరిద్వారం, కాశీ అన్నీ గాలించాడు. నిరాశతో మాధవీపురం చేరాడు. ఆనందమహల్ మీద, ఆస్తి మీద, సత్కార్యాలమీద విరక్తి పుట్టింది. వీటి కోసం త్రివేణిని పోగొట్టుకున్నాడు. కొద్దిరోజుల్లో అన్నీ తెల్లార్చుకొని త్రివేణితో ఒడ్డు చేరుకోవాలనుకుంటుంటే త్రివేణి ఎందుకు వెళ్ళిపోవాలి? తనమీద ఎందుకు విశ్వాసం లేకపోయింది? అని మూర్తి అశాంతితో ఉంటున్నప్పుడే కళ్యాణ కింకిణి వచ్చింది. కళ్యాణకింకిణి కళారాధికురాలు.-తన నృత్యబృందానికి తగిన వసతీ అదీ కూర్చుకోడానికి మూర్తి సహాయాన్ని అర్థించవచ్చింది.

* * *

బైరాగి కుటీరంలోనే త్రివేణి చక్కటి మగపిల్లవాణ్ణి ప్రసవించింది. బైరాగి వాడికి శౌరి అని పేరుపెట్టాడు. మురారికితోడు శౌరి. మురారి శౌరిని విడిచి పెట్టడు. తమ్ము! తమ్ము! అని ముద్దులాడతాడు.

శౌరి రెండేళ్ళవాడయినాడు. ఆశ్రమంలో మురారి, శౌరిలను బలరామకృష్ణులన్నారు. బైరాగి బైరాగి తాత

* * *

త్రివేణిని తాను చూసి ఉండకపోతే ఎంతో బాగుండిపోయేది. ప్రేమ-రస తృష్ణలు రెండూ దేనికదే గొప్పది సుమీ! అన్నాడు ఒకసారి మూర్తి కళ్యాణకింకిణితో, కింకిణి కళా రూపాన్ని చూస్తూ. కింకిణి మూర్తిమీద జాలి, సానుభూతితో మూర్తిని మరిపిద్దామని చూసింది. కాని మూర్తి "నేను త్రివేణిని మరిచిపోవడం న్యాయమే అని నీకు అనిపిస్తే నన్ను లాలసలో ముంచు!" అన్నాడు అప్పట్నించి కింకిణి మూర్తి దగ్గిర ఉత్తమ స్నేహితుడితో ఎలాగ మెసులుకోవాలో అలాగే మసిలింది, మనసులోని ప్రేమ మనుసులోనే దాచి.

దేశాటనంలో కొంత మేలుంటుందని కొద్దిమంది నృత్యబృందంతో, తనతో బాటు మూర్తినికూడా బయలుదేరదీసింది - కింకిణి.

మాధవీపురం ఊరివాళ్లకిప్పుడు త్రివేణిపట్ల ఎక్కడలేని సానుభూతి పుట్టుకొచ్చింది. సీతమ్మలాంటిదాన్ని ఎటో తగిలేసి తైతక్కలాడితో తిరుగుతున్నాడని మూర్తిని ఆడిపోసుకున్నారు. అది పోతే పోయిందిగాని ఊర్వశి దిగి వచ్చిందే వీడికోసం! అని అసూయపడ్డ వాళ్ళు గింజుకున్నారు.

* * *

త్రివేణి దగ్గిరున్న పైకమంతా అయిపోయింది. పిల్లవాడి పోషణకూ, తనకూ వజ్రాల హారాన్ని అమ్మక తప్పదు. అంతవరకెప్పుడూ బైటకు తీయని హారాన్ని తీసి అమ్మిపెట్టమని బైరాగి తాత చేతుల్లో పెట్టింది. బైరాగి తాత దాన్నిచూసి నిర్ఘాంతపోయాడు ఎక్కడిదని అడిగాడు త్రివేణి ఏదీ దాచకుండా అంతా పూసగుచ్చినట్లు చెప్పింది.

అంతా విన్న బైరాగి తాత కన్నుల్లో నీరు ఊరింది. "అమ్మా! ఒక స్త్రీమాంగల్యంతో తన మగవాడిని మానసికంగా చిత్రహింసకు గురిచేసింది. మరొక త్రివేణి ఏ మాంగల్యం లేకుండానే తన వాడికోసం అన్ని కష్టాలూ భరించి బిడ్డతో సన్యాసిలాగ గడిపింది. ఇది ఎంత చిత్రంగా ఉంది!...... నీ కష్టాలకు కారణమైన ఆ శాసనానికి కర్త అయిన లక్ష్మీపతి సంగతి నాకు తెలుసు. అలాగ ఎందుకు రాశాడో వింటేనేగాని నువ్వు వాణ్ణి క్షమించలేవు...నువ్వు యిచ్చిన వజ్రాలహారం లక్ష్మీపతిపూర్వీకులనుండి

వంశపారంపర్యంగా ఇంటి కోడలు పెట్టుకునేడ..." అంటూ బైరాగి తాత గాద్గదికాన్ని సంబాళించుకొని చప్పడం ప్రారంభించాడు.

...లక్షింపతి ఆగర్భ శ్రీమంతుడు. చిన్నతనంలోనే వరలక్ష్మితో పెళ్ళి జరిగింది. మూర్తీభవించిన మూర్ఖత్వం వరలక్షి. అక్షరజ్ఞానం ఉంది. మూఢా చారాల పట్టింపు చచ్చినంత.

భర్తలవల్ల భార్యలుపడే కష్టాలే చదవడం, వినడం పరిపాటి, కాని భార్యగావల్ల, పెళ్ళి అనే ఘోరకాండవల్ల మంచి మగవాడు ఎంత అన్యాయం పొందగలడో దానికి లక్షింపతి జీవితం తార్కాణం.

భర్త అనే మగవాడు భార్య అనే ఆడదానివల్ల ఏమిటి కోరుకుంటాడో అలాంటివి ఏవీ తెలియవు. మొగుడు సరిగ్గా చూడలేదని నిత్యమూ సాధింపు. పతివ్రతలంటే ఎప్పుడూ ఏడుస్తూ టారని ఆమె ఉద్దేశం అయివుంటుంది. ప్రతి దానికి మొండిపట్టు కూడా తోడు. అస్తమానం పసుపు మెతుకోవడం, కుంకం రూపాయంత పెట్టుకోవడం, భర్తఎంగిలి తినడం, భర్తకు ఆకలిలేకపోయినా, భర్త తినందే తినకూడదన్నందువల్ల తినమని వేధించుకు తినడం మూతి ముడుచుకోవడం యిలాంటివే వరలక్ష్మికి తెలిసిన పతివ్రతా లక్షణాలు.

ఇటువంటి దాంపత్యంకంటే విడిపోవడం మంచిది. కావలసినంత ఆస్తి తీసుకొని నీ యిష్టంవచ్చినచోట, పుట్టింటనో వెళ్ళి ఉండమంటే నోరు నొక్కుకొని, "అవ్వ! ఇదా పెళ్లంటే నీకు తెలిసింది? అగ్నిసాక్షి పెళ్లంటే మజాకా అనుకున్నావా? ఇలాంటి మాట అనటానికా పెళ్లాడింది?" అంటూ ఉగ్రకాళి అయ్యేది. పోనీ నేనే ఎటో పోతానులే అని లక్షింపతి అంటే, ఆ మర్నాడే ఇల్లంతటికి నిప్పుపెట్టి అందులో కాలి బూడిదై పోతానంటూ మంగళసూత్రాలు పట్టి శపథంచేసేది.

ఒకసారి లక్షింపతి పట్నంనించి స్నేహితులను తీసుకువస్తే వాళ్ల వేషభాషలు నచ్చక, కాఫీలో ఏం కలిపిందో వాళ్లు చచ్చే పర్యంతమైంది. అదెలాగో నలుగురి మంచితనంవల్ల కమ్ముకుపోయింది

ఇంట్లో పనిపిల్ల గౌరికీ మొగుడికీ రంకుకట్టి,ఒక ఉదయంయింకా లక్షింపతి నిద్ర లేవకముందు గౌరి గది ఊడ్చుతూంటే బైట గొళ్లెంపెట్టి, దాన్ని పెళ్ళాడబోతున్న రంగడిని పిల్చుకొచ్చింది. వాడుదాన్ని అనుమానించాడు. అది నూతిలోపడి చచ్చింది. రంగడు లక్షింపతిని చంపడానికి చూశాడు లక్షింపతి 'రంగా! చంపి పుణ్యంకట్టుకో' అన్నాడు. రంగడికేదో నిజం తెలిసినట్లయింది. గౌరి అలాంటిది కాదని బాబుగారి నోటితో చెబితే అదే తనకు




చాలన్నాడు. ఆ తర్వాత రంగడు పిచ్చెత్తి తిరిగాడు. మనుషుల్ని కరుస్తాడు.

పిల్లా జెల్లా లేరు, ఉండబోరు తల్లీ దండ్రీ లేని మేనల్లుడిని లక్ష్మింపతిచేరదీసి కొడుకైనా వాడేనని అనుకుంటే వరలక్ష్మి వాణ్ణి నానా పాట్లుపెట్టడమే గాకుండా, తన చెల్లిలి కూతురు ఐదేళ్ళ పిల్లను వాడికి పెళ్ళిచేసి, ఆస్తి అంతా ఆ పిల్లకు వ్రాయమని పోరుపెట్టింది. మేనల్లుడు తనకు పెళ్ళిలేకుండా స్వేచ్ఛగా తిరుగుతూ దేశసేవ చెయ్యాలని ఉందని చీటీ రాసిపెట్టి ఎటో వెళ్ళిపోయాడు, ఆచూకీ లేకుండా.

చివరికి వరలక్ష్మి చేసిన ఘనకార్యం ఏమంటే పునిస్త్రీ చావు చావాలని కిరసనాయిలు పోసుకొని అంటించుకొని చచ్చింది. ఆ బెడదంతాపడి బైటపడ్డాక లక్ష్మింపతి సింహావలోకనం చేసుకుంటే, తానింత నికృష్టజీవితం అనుభవించడానికి కారణం 'వివాహం' అనేదే అని అనిపించింది. అది ఎటువంటి వివాహమైనా ఒకటే. మంత్రాలపెళ్ళి ఇంట్లోనే రగడ, కాగితాలపెళ్ళి కోర్టులదాకా. వివాహంలేకుండా మగవాడు హాయిగా బతకగలడు. రెండు మార్గాలా జీవిత పరమార్థాన్ని చూడగలడు వివాహం వల్ల నిజానికి ఎక్కువ నష్టపడుతున్నది మగవాడే, ఆ సంగతి తెలీకుండానే!

లక్ష్మింపతి సుఖపడే వయసంతా అయిపోయింది. అన్నిటిమీదా విరక్తి, విసుగూ పుట్టింది. తనలాగా కాకుండా, వివాహం అనే గుదిబండకుఆహుతి కాకుండా, చివరి దశలో తనకు తెలిసిన సత్యాన్ని అమలుజరిపే ఒక్కడైనా స్వేచ్ఛగా జీవిత మాధుర్యాన్ని అనుభవించాలి! అదే ఆత్మకు శాంతి అనుకొని వివాహం మీద తన అక్కసుతీరా ఆవిధంగా

శాసించాడు. లక్ష్మీంపతి అంచనా ప్రకారం ఆనందమూర్తి పెళ్ళిచేసుకొని ఉండడనే నమ్మకంతోనే దినపత్రికలకు ప్రకటనలు యిచ్చాడు. నదికి వరద తగ్గిలింది. తెల్లవారు ఝామున ఒడ్డున కట్టుబట్టలు పెట్టి, చనిపోవాలనే ప్రవాహంలో పడ్డాడు. అయితే తన శవం బైట పడడం, యిష్టంలేక ప్రవాహంతో బాటు కొట్టుకుపోయి సముద్రం నది కలిసేచోట ఎక్కడో రూపుమాసిపోవాలని లక్ష్మీంపతి కోరిక. లక్ష్మీంపతి గజ యీతగాడు బారలువేస్తూ ప్రవాహంతో కొంతదూరం కొట్టుకుపోగా, ఆ ప్రవాహంలో ఒక అద్భుతం కనిపించింది, కొద్దిబారల్లో.

ప్రవాహంలో గాజులున్న రెండు చేతులు ఒక బిడ్డను మునిగిపోకుండా పైకెత్తి పట్టుకొని ఉన్నాయి. ఒక ఇంటి పైకప్పు చిందరవందరగా చుట్టూరా తేలుతూ, కొంత మునుగుతూ ఉంది. ఆ కర్రల మధ్య యిరుక్కొని ఆ తల్లి అడుగున చావడానికి దగ్గిరలో ఉన్న దన్నమాట. తనగుండె కొట్టుకుంటున్నంతవరకూ ఆ తల్లి బిడ్డను చావనీయదు. ఎవరు రక్షిస్తారు? అన్న సందేహం లేదు. పట్టు తప్పనంతవరకూ ఆ చేతులు ఆ బిడ్డడిని మునిగిపోనివ్వవు. కాని ఆ చేతులు పట్టుతప్పుతున్నాయి. లోపలకు దిగుతున్నాయి, బిడ్డకూడా మునిగిపోక తప్పదు. అదృశ్యమే లక్ష్మీంపతిని చావకుండా చేసింది.

శక్తినంతా కూడగట్టుకొని లక్ష్మీంపతి బారలువేస్తూ ఆ పిల్లవాణ్ణి అందుకున్నాడు, నిలువీత యీదుతూ ఆ తల్లి చేతులు మరికనిపించలేదు. పిల్లవాణ్ణి భుజంపై ఒకచేత్తో ఎత్తిపట్టి, ఒక వెదురు బొంగు ఆధారం దొరికితే దాంతో ఒడ్డు చేరుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. లక్ష్మీంపతికూడా అలిసిపోయి మునిగిపోడానికి సిద్ధంగా ఉన్న సమయంలో ఎవరో కర్రలతోలాగి, యీదుతూవచ్చి పిల్లవాడితోసహా లక్ష్మీంపతిని రక్షించి ఒడ్డుకు చేర్చారు. వాళ్ళు నదివడ్డున మకాంవేసుకొని ఉన్న ఒక బైరాగులగుంపు. పిల్లవాడు తేరుకున్నాడు. ఆ పిల్లవాడు లక్ష్మీంపతిని చచ్చే తలంపునుండి దూరం చేశాడు. ఆ పిల్లవాడి తల్లి చేతులు లక్ష్మీంపతికి ఒక పాఠంనేర్పాయి. బతికుంటేనే ఎంతమంచి పనులైనా చేయవచ్చునని. ఆ పిల్లవాడే 'మురారి'!

బైరాగులు లక్ష్మీంపతినీ, పిల్లవాణ్ణీ తమతో ప్రయాగలో వాళ్ళు నడుపుతున్న ఆశ్రమానికి తీసుకొచ్చారు. ఆ సన్యాసులు ఆసేతు హిమాచలం తిరుగుతూ, దండుకొని తెచ్చినదాంతో ఆశ్రమంనడుపుతున్నారు. వాళ్లఆశ్రమం లక్ష్మీంపతిని చూస్తూ ఉండమని అప్పజెప్పారు. వాళ్లు వచ్చినపుడు లక్ష్మీంపతి ఆ చుట్టు పక్కల క్షేత్రాలు తిరుగుతూంటాడు. ఆశ్రమాన్ని, మురారినీ



చూసుకుంటూ లక్షింపతి – బైరాగిగా, ఉత్తమోత్తమమైనజీవితాన్నిసంతృప్తిగా అనుభవిస్తున్నాడు – ఆ లక్షింపతి బైరాగినే నేను!" అని బైరాగి తాత తనకథ చెప్పడం ముగించి, త్రివేణివంక దీనంగా వేడుకుంటున్నట్లు చూస్తూ, "తల్లీ! నన్ను క్షమించ గలవా?" అన్నాడు.

త్రివేణి శౌరిని బైరాగితాత చేతులకు అందించింది, అదే తన జవాబుగా. మురారి త్రివేణి ఒడిలో చేరి తమ్ముణ్ణీ తాతనూ చూస్తూన్నాడు.

ఆ రోజే సన్యాసులబృందం పర్యటన ముగించి వచ్చారు. బైరాగి లక్షింపతి మర్నాడే త్రివేణి, శౌరి, మురారిలతో మాధవీపురానికి ప్రయాణం కట్టాడు. సన్యాసులు దబ్బిచ్చారు, ఆశీర్వదించారు.

* * *

మూర్తి నాట్యబృందంతో అలహాబాదు వచ్చాడు. అప్పుడు అక్కడ ఒక స్థానికఫోటో ఎగ్జిబిషన్ జరుగుతున్నది. మూర్తిని ఒకచిత్రం చాలా ఆకర్షించింది. ఒక ముసలి బైరాగి కళ్ళు మూసి ధ్యానంలో ఉండగా ఒక పసిపిల్లవాడు బైరాగి తెల్లటిగడ్డం పీకుతూ ఆడుకొంటున్నాడు. మరొక కొంచెం పెద్దగాఉన్న పిల్లవాడు పక్కనేనిలబడి చూస్తున్నాడు. ఆ పిల్లవాళ్ల తల్లిలాంటి ఒక యువతి రాటకు చేరబడి పరధ్యానంగా ఎటో చూస్తున్నది. ఉదయపుఎండ తమాషాగా పడుతున్నది. వెలుగు నీడలు అద్భుతంగా ఉన్నవి. ఆ చిత్రంలో యువతి త్రివేణిలాగే ఉంది. మూర్తి ఆ ఛాయాచిత్ర గ్రాహకుడిని కలుసుకొని వివరాలు అడిగాడు. ఆ స్నేప్‌షాటు గంగ ఒడ్డున ఉన్న ఆశ్రమంలో తీసిందని తెలుసుకున్నాడు. ఆ చిత్రాన్ని ప్రథమ బహుమతికంటే చాలా ఎక్కువ మొత్తానికి కొనుక్కున్నాడు. ఆశ్ర

మానికి వెళ్లాడు. అక్కడున్న సన్యాసులు ఆ నలుగురూ ఆంధ్రాకు వాళ్ళ ఊరు వెళ్ళారని చెప్పారు. మూర్తి వెంటనే తిరుగుప్రయాణం కట్టాడు. కింకిణికూడా బయల్దేరింది.

* * *

లక్షింపతి బైరాగి మాధవీపురం అంతా తిరిగి చూశాడు. మాలపల్లెలో బావులు, బడి, ఆస్పత్రి, లైబ్రరీ అన్నీ మూర్తి చేయించిన పనులే అనివిని చాలా పొంగిపోయాడు. కాని, మూర్తి ఎవరో అప్సరలాంటి నర్తకితో సంబంధం పెట్టుకొని తిరుగుతున్నాడని విని చాలా కలత పడ్డాడు.

త్రివేణి వేసినతాళం వేసినట్టుగానే ఉంది. తెరిచి పిల్లలతో ఇంట్లోకి వెళ్లిందో లేదో, ఎవరో ఆడవాళ్ళు వచ్చి మూర్తి గురించి ఆ మాటలే చెప్పారు. అది విని త్రివేణి ఏటికో గోతికో పరుగెట్టడమో, శోకాలు పెట్టడమో చేస్తుందనుకున్న వాళ్ళకి ఆశాభంగం అయింది. త్రివేణి వికసించిన ముఖంతో చాలా సంతోషించింది.

బైరాగి వచ్చాక త్రివేణి మనం వెళ్లిపోదాం అంది.

"వీల్లేదు! లక్షింపతి బతికేఉన్నాడు లక్షింపతి శాసనం రద్దవుతుంది!" అన్నాడు లక్షింపతి బైరాగి

* * *

మరుసటిరోజునే మూర్తి, కింకిణి వచ్చారు. ఆనందమహల్ దగ్గిర గతాన్ని నెమరువేస్తునట్టు కూర్చున్న బైరాగిని చూస్తూనే త్రివేణి ఇంటికి పరుగెత్తారు.

కింకిణి ముందుగా లోపలికివెళ్ళింది. త్రివేణి, కింకిణి ఒకర్నొకరు ఎంతో తెలిసున్న వాళ్లలాగ కౌగలించుకున్నారు. "మూర్తిలాంటి పవిత్రమూర్తి హృదయంలో చెక్కు చెదరక నిల్చిన అదృష్టవంతురాలవు!" అని కళ్యాణకింకిణి త్రివేణిని అభినందించింది. ఆడవాళ్లిద్దరూ చాలా మాట్లాడుకున్నారు, అపోహలన్నీ తొలగిపోయినట్లుగా. కళ్యాణకింకిణి శౌరితో యివతలికొచ్చి కొడుకుని మూర్తికి అందించింది. మురారిని తాను ఎత్తుకుంది.

* * *

శౌరితో మూర్తి త్రివేణి ఆనందమహల్ ప్రవేశించారు. మురారినెత్తుకొని కింకిణి, ఆ వెనక బైరాగి వచ్చారు.

ఆ రాత్రి ఆనందమహల్ ఆవరణలో కళ్యాణకింకిణి ఊళ్లో వాళ్లు కనీ వినీ ఎరగని అద్భుత నృత్యప్రదర్శనం యిచ్చింది, ఆనందమహల్‌లోనే మురారి నృత్యకళానికేతనానికి ఆవిష్కరణ కూడా జరిగింది. కళ్యాణకింకిణి మురారిని పెంచుకుని, నృత్యంనేర్పి నటరాజమూర్తిని చేస్తానంది.

"లక్షింపతి శాసనం రద్దయింది రద్దవుతూనే అది అమలుకూడా జరిగింది." అని బైరాగి లక్షింపతి చెప్పి, మర్నాటి ఉదయాన్నే ప్రయాగకు ప్రయాణం కట్టాడు.




"నేను టికెట్ కొని ఆ సినిమా చచ్చినా చూడను. మీ నవల ఆధారంగానే గదా వాళ్లు సినిమా తీసింది. పాస్ ఎందుకివ్వరూ?_ ఏడు పాస్‌లు కావాలి!" అంది సునంద భర్తతో.

"రెండు చాలుగదా" అన్నాడు ప్రవీర్.

"చాలవు మీ అక్క కబురుచేసింది. వాళ్ళు వస్తారట. మొత్తం ఏడుగురికి పాస్‌లు తెప్పించండి."

"తెప్పించడం దేనికి? వాళ్లే వచ్చి ఇచ్చి వెళతారు!"

"పిక్చరు ఎప్పుడు విడుదలవుతుందండీ?"

"త్వరలోనే."

"ఇదుగో! పేపర్లో అడ్వర్టయిజ్‌మెంట్ ఉందండీ!...అరే! మీ పేరు చిన్న అక్షరాలతో ఒకమూల వేశారు.. డైరక్టరూ, మ్యూజిక్ డైరక్టర్ల పేర్లు తాటికాయంత అక్షరాలతో వేశారు. ఏమీ బాగాలేదు.''

"నా నవల పేరు మార్చారు. కథలో కూడా మార్పులూ, చేర్పులూ బోలెడు చేశారట."

"అయితే ఏం? మూలరచయిత మీరే గదా! ఇంత ఉపేక్ష పనికిరాదు."

"అది అంతే సునందా! దుర్గాపూజ సందర్భంలో పందిరికి ఏడువందలూ, విగ్రహానికి తొమ్మిదివందలూ, లైట్లకు ఐదొందలూ ఖర్చుపెట్టి చివరకు పురోహితుడి చేతిలో పది రూపాయలు పెడతాం," అన్నాడు ప్రవీర్ భార్యకు నచ్చజెప్పే ధోరణితో.

"నాకివన్నీ తెలియవు. ఆ సినిమాకు ఏడుపాస్‌లు మాత్రం తెప్పించండి..." అని చెప్పి లోపలికెళ్ళింది సునంద చిరుకోపంతో.

తర్వాత రెండురోజులకు ప్రవీర్ బజార్నుంచి ముఖం వ్రేళ్లాడ వేసుకొచ్చి ఇవాళ ఉదయం ప్రీవ్యూ ఇచ్చారట" అన్నాడు భార్యతో.

"మిమ్మల్ని పిలవలేదేం?"

"ప్రముఖ వ్యక్తుల్ని పిల్చారట. మంత్రులూ, పత్రికా విలేఖర్లూ, సంపాదకులూ, పట్టణంలో ధనవంతులూ మొదలైనవార్ని పిల్చారట."

"ఆ ప్రముఖ వ్యక్తుల కిందకు మీరు రారా? మీ నవల ఆధారంగానే గదా ఆ సినిమా తీసింది. మర్యాదకైనా మిమ్మల్ని పిలవాల్సిందే!''

"నా నవలను పూర్తిగా మార్చివేశారట. నేను గొడవచేస్తానని నాకు ఆహ్వానం పంపలేదేమో! పిక్చరు రిలీజైన రోజున పిలుస్తారేమో! అదీగాక ప్రీవ్యూ రోజున కొంచెం రద్దీగా వుంటుందిలే'' అన్నాడు ప్రవీర్ భార్యను సమాధాన పర్చే తలంపుతో.

సునంద మెత్తబడింది. "అంతే అయివుంటుంది. ఏమైనా ఫస్ట్‌డేన ఫస్ట్‌షోకు ఏడు పాస్‌లు కావాలి" అంది.

ఫిల్మ్ రిలీజైంది ఆ రోజున. మధ్యాహ్నంకూడా అయింది. సాయంత్రం గడిచిపోయింది, కాని ఆ సినిమాకు కథ వ్రాసిన రచయిత దగ్గరకు ఎవరూ రాలేదు. ఫ్రీ పాస్‌లు ఇవ్వలేదు.

"పోనిద్దూ! మనిద్దరం టిక్కెట్లు కొనుక్కొని చూసి వద్దాం," అన్నాడు ప్రవీర్ భార్యతో.

"మీ నవల ఆధారంగా సినిమా తీయడమేమిటి? మనం మామూలు జనం లాగ టిక్కెట్లు కొనుక్కొని చూసిరావడమేమిటి? నలుగురూ నవ్విపోరూ? నేను రాను" అంది సునంద కుండ బద్దలు కొట్టినట్టు.

ఫస్ట్‌షో హౌస్‌ఫుల్ అయింది. టిక్కెట్లు దొరకనివాళ్లు నిరాశతో తిరిగి వెళ్ళిపోతూండటాన్ని దూరంగా ఫుట్‌పాత్‌మీద నిలబడి చూశాడు ప్రవీర్. ఈ పిక్చరు ఫ్లాప్ అయితే బావుండు భగవంతుని దయవల్ల. మూడోరోజుకు డబ్బాలు తిరిగి వెళితే మంచిగా వుంటుంది, అనుకొంటూ ఇంటి మొహం పట్టాడు ప్రవీర్.

కాని ప్రవీర్ అనుకున్నట్టు ఆ



పిక్చరు ఫ్లాప్ కాలేదు. పైపెచ్చు హిట్ అయి కూర్చుంది. నగరంలో జనం విరగబడి చూస్తున్నారు. ప్రొడ్యూసర్ మరో పిక్చర్ తీయబోతున్నట్టుకూడా ప్రకటించాడు.

"మన ఫిల్మ్ మాంచి హిట్ అయింది. కలక్షన్స్ జోరుగా ఉన్నాయట" అన్నాడు ప్రవీర్ భార్యతో ఓరోజు.

"మీరు దానికి కథరాయడ మేమిటి? విజయాన్ని పొందక పోవడమేమిటి?" అంది సునంద సంతోషాతిశయంతో.

"ఒకరోజు ఎవరికీ తెలీకుండా టికెట్టు కొనుక్కొని సెకండ్ షోకు వెళదాం ఇద్దరమూ" అన్నాడు ప్రవీర్.

"మీకు అభిమానమేమీఉన్నట్టులేదు" అంది సునంద కోపంగా—ఇంట్లోకిపోతూ.

"సినిమా రచయితకు అభిమానం కూడానా!" అనుకున్నాడు ప్రవీర్ తనలో తాను.

ఆ రెండోరోజున ప్రవీర్‌కు ఏదో ఉత్తరం అందిస్తూ పోస్టుమాన్ అన్నాడు,

"బాబుగారూ! మీ నవల ఆధారంగా తీసిన సినిమా బ్రహ్మాండంగా పోతూం దని అందరూ చెప్పుకుంటున్నారు. రెండు ఫ్రీ పాస్‌లు ఇప్పిందారంటే నేనూ, నా భార్యా వెళ్లి చూసొస్తాం."

"అవునోయ్, వాళ్ళు నాకు చాల పాస్‌లు పంపించారు. కాని ఎవరెవరో వాటిని తన్నుకెళ్లారు. ఒక్కటీ మిగ ల్లేదు. ఒక పనిచేయ్" అని జేబులోంచి మూడురూపాయలు తీసి పోస్టుమాన్‌కు ఇస్తూ, "ఈ డబ్బుతో మీరిద్దరూ వెళ్లండి. మంచిసినిమా. బాక్సాఫీస్ హిట్ అయింది" అన్నాడు.

ఆ డబ్బును పోస్టుమాన్ జేబులో పెట్టు కుంటూ, "మీరు రాసిన కథ హిట్ కాక పోవడమేమిటి? మీ పుస్తకాలంటే జనం చెవి కోసుకుంటారు. మీకెంతో పేరుంది" అని వెళ్లిపోయాడు.

ఆ వెళ్లిపోతున్న పోస్టుమాన్‌కేసి చూస్తూ నిలబడిపోయాడు సుప్రసిద్ధ నవలారచయిత ప్రవీర్.



నిజమేనయ్యా!... మా సిన్మాక
కొత్త ముఖాలు కావాలనే
ప్రకటన చేశాము :- కానీ..
పెట్టుబడులూ
భాగం పెట్టు
కునేవాళ్లనే
హీరోగా
తీసుకుందామని
అనుకుంటున్నాము.




ఆతనింటి పేరూ
మా యింటి పేరూ
ఒక్కటే!! మరి
ఆతనికి ఉద్యోగం
వేయించకపోతే
ఎలాగ??....